# వివేక చూడామణి

( శ్లోకమూ, తెలుగు పద్యమూ, వ్యాఖ్యా)



శతావధాని: విద్వాన్:

అనుముల వెంకటశేషకవి

# వివేక చూడామణి

(శంకర కృతి-శ్లోకమూ, తెలుగు పద్యమూ, వ్యాఖ్యా.)









శతావధాని, విద్వాన్

అనుముల వెంకటశేషకవి

F. R. E. S. (London)

ప్రథమ ముద్రణ :- 1996 అక్టోబరు

ప్రతులు :- 1000 కాపీలు



వెల రూ. 75-00

"This book is published with the Financial assistance of Tirumala Tirupati Devasthanams under their seheme Aid to Publish Religious Books."

ప్రతులకు :—

అనుముల వెంకట శేషకవి,
28/17ఎ పేట, అనంత సాంబయ్యగేటు
కర్నూలు - 518 001

ముద్రణ :—

విజయ ఆర్టు ప్రెస్
సంతావారివీధి, గాంధీచౌక్
తెనాలి - 522 201

# మనవి

సీ. నరజన్మ దుర్లభ మరయ జంతువులందు;
పురుషుడై నరులలో పుట్టుటరుదు;
పూరుషులందు విప్రుండౌట కడు హెచ్చు;
వేద ధర్మైక ప్రవృత్తి లెస్స;
వైదికులందు విద్వాంసు డౌటయె గొప్ప;
తెలియుటాత్మానాత్మ కలన మెఱుగు;
బ్రహ్మాత్మలో స్వానుభవముతో నుండుట
అన్నిటి కంటె నత్యతి శయంబు;

అన్ని యాత్మలు తన యాత్మయందె; తాను
అన్ని యాత్మల నను జ్ఞానమబ్బెనేని?
ఇట్టి ముక్తి లభించుట కెన్ని నూర్ల
కోట్ల జన్మల పుణ్యంబు కూడవలెనో!

జీవకోటిలో మానవజన్మ మెత్తటమే మిక్కిలి దుర్లభం; అట్టి నర జన్మలోనూ మగవాడై పుట్టటం మరీ దుర్లభం. అందులోనూ విప్రుడు కావటం అదృష్టం. ఇన్నీ లభించినప్పటికీ వైదిక ధర్మమార్గంలో నడవగలగటం మహాభాగ్యం. అలా నడిచే వాళ్లలో విద్వాంసుడై ఉండటం పరమోత్తమం. ఆత్మానాత్మ విచారం చేస్తూ, ఆత్మ దర్శనాన్ని అనుభవంలో ఉంచుకోటం ఇంకెంత గొప్పో? ఎన్నో నూర్లకోట్ల జన్మల పుణ్యపరిపాకం ఉంటేనే కాని, ఇలాంటి ముక్త స్థితి సాధ్యంకాదు. (వివేక చూడామణి-2)

మనుష్యత్వమూ, ముముక్షుత్వమూ, మహాపురుషసంశ్రయమూ ఈ మూడూ దుర్లభాలు; దైవానుగ్రహ ముంటేనేకాని లభించవు.

అంటూ వివేక చూడామణి ప్రారంభమౌతుంది. మానవజన్మకింత ప్రాముఖ్యమెందుకూ ?

మానవుడి కన్ని జంతువులకంటే జ్ఞాన మెక్కువ. అందులో పురుషులైన వారందరూ కోరేది నాలుగు పురుషార్థాలు :— (1) ధర్మమూ, (2) అర్థమూ, (3) కామమూ, (4) మోక్షమూ. ఐతే, జనసమూహమంతా ధర్మార్థకామాలనే భజిస్తున్నారు. కాని, మోక్షం కోసం ప్రాకులాడే వాళ్ళరుదు.

ధర్మార్థకామాలు మూడూ ప్రేయస్సునూ, మోక్షమొక్కటే శ్రేయస్సునూ చేకూరుస్తాయి. ప్రేయస్సు నిచ్చేది ప్రవృత్తిమార్గమూ శ్రేయస్సు నిచ్చేది నివృత్తి మార్గమూ.

ప్రవృత్తి మార్గంలో కర్మలూ, ఉపాసనలూ ఉంటాయి. అందు వల్ల చిత్తశుద్ధీ, ఏకాగ్రతా సిద్ధిస్తాయి. అప్పుడు జ్ఞానసిద్ధి సులభ మౌతుంది. జ్ఞానం వల్లనే మోక్షం లభిస్తుంది. "జ్ఞానా దేవ తు కైవల్యం" – జ్ఞానంచేతనే కైవల్య మనటం అందరికీ తెలిసిందే !

ఇందుకు శరీర శోధన అవసరం. ప్రతి మనిషికీ స్థూల శరీరం, సూక్ష్మశరీరం, కారణశరీరం – అనే మూడు శరీరాలున్నాయి. ఈ మూడు శరీరాలూ దాటితేకాని, ఆత్మదర్శనం సాధ్యంకాదు. ఆత్మయే దేవుడు ! కనుక శరీరాన్ని దేవాలయమని కూడా పెద్దలు పేర్కొన్నారు. ఆత్మ ప్రతి బింబమైన జీవుడే దేవుడన్నారు.

పితామహుడైన బ్రహ్మదేవుడుఆశ్వలాయనుని కిలా చెప్పినాడు. "న కర్మణా న ప్రజయా ధనేన – త్యాగేనై కే అమృతత్వ మానశుః"– కర్మచేతకాని, సంతానంచేతకాని, ధనంచేతకాని, అమృతత్వం (చావు లేకపోవటం) కలుగదు. త్యాగం (వైరాగ్యం) చేతనే అది లభిస్తుంది. (కైవల్యోపనిషత్తు 1–3).

ఇంతకూ వైరాగ్య మవలంబించి మోక్షానికై ప్రయత్నించే వాళ్లెందఱు ? నూటికి కోటికి ఎవడో ఒక డుంటాడు.

లోకంలో చాల మందికి ఈ స్థూల శరీరమొక్కటే తెలుసు. ఇదే తామనుకుంటున్నారు. దీన్ని పోషించుకుంటూ, అలంకరించుకుంటూ అవస్థలు పడుతున్నారు. ఇది నీ శరీరమే కాని, నీవు కాదు – అని చెపితే కూడా అభిమానం పోవటం లేదు. ఇది నిలిచేది కాదు – చస్తుంది. నీకు చావులేదు సుమా ! నీ విలాంటి శరీరాల నెన్నిటినో ధరిస్తున్నావు పుడుతూ, చస్తూ, ఎడతెగక సంసార భ్రాంతిలో సతమత మౌతున్నావు. ఈ చీకటిలో నుంచీ వెలుతురుకు రా ! – అని బోధించేదే వేదాంతం.

ఈ స్థూల శరీరాన్ని అన్నమయకోశం అని కూడా అంటారు. అన్నంతో పెరుగుతుంది. కనుక, దీనికీ పేరు వచ్చింది. ఈ శరీరం మట్టితో చేయబడింది. ఎన్ని సార్లు కడిగి ఎంతగా శుభ్రపఱచినా మళ్లీ మళ్ళీ ముఱికి పడుతూనే ఉంటుంది.

ఈ స్థూల శరీరానికి ఐదు కర్మేంద్రియాలూ (వాక్కూ, పాణీ, పాదమూ, పాయువూ, ఉపస్థా), ఐదు జ్ఞానేంద్రియాలూ (శ్రోత్రమూ, త్వక్కూ, చక్షువూ, జిహ్వా, ఘ్రాణమూ) – ఉన్నాయి. ఈ కర్మేంద్రియ జ్ఞానేంద్రియాలకు పరస్పర మైత్రి కూడా కద్దు !

(1) శ్రోత్రం (చెవి) :– శబ్దాన్ని వింటుంది; వాక్కు (నోరు) శబ్దాన్ని పలుకుతుంది. ఇదొక జత. ఇవి రెండూ ఆకాశ భాగాలు.

(2) త్వక్కు (చర్మం) :– స్పర్శ ననుభవిస్తుంది; పాణి (చెయ్యి) స్పర్శను కలిగిస్తుంది. ఇదొక జత. ఇవి రెండూ వాయుభాగాలు.

(3) చక్షువు (కన్ను) :– రూపాన్ని చూస్తుంది. పాదం–చూచిన చోటికి నడుస్తుంది. ఇదొక జత. ఇవి రెండూ తేజోభాగాలు.

(4) జిహ్వా (నాలుక) :- రసాన్ని రుచి చూస్తుంది. ఉపస్థ (గుహ్యేంద్రియం) రసాన్ని ఊరిస్తుంది. ఇదొక జత. ఈ రెండూ జల భాగాలు.

(5) ఘ్రాణం (ముక్కు) :- గంధాన్ని (వాసన) గ్రహిస్తుంది. పాయువు (గుదం) గంధాన్ని (మలాన్ని విసర్జిస్తుంది. ఇదొక జత. ఈ రెండూ పృథ్వీ భాగాలు.

ఈ పది ఇంద్రియాలూ, స్థూల దేహమూ - జడపదార్థాలు. స్వయంగా ఏపనీ చేయలేవు - సూక్ష్మశరీరం సహాయపడకుంటే.

స్థూల శరీరం మరణించేది. సూక్ష్మ శరీరం మరణానంతరం ఉండి ఇంకో శరీరంలో ప్రవేశించేది. స్థూల శరీరంతో చేసే పుణ్యాపాపాలన్నీ ఈ సూక్ష్మ శరీరం మీాద ముద్రలు పడతాయి. అవి ఇంకో శరీరంలో ప్రవేశించినప్పుడు (పునర్జన్మలో) అనుభవాలుగా మారుతాయి.

సూక్ష్మ శరీరం తేజోమయ శరీరం. లింగ శరీరమని కూడా దీనికే పేరు. ప్రతి మనిషీ కలలో ఈ శరీరాన్నే చూడటం జరుగుతుంది స్థూల శరీరం జాగ్రదవస్థలో పనిచేస్తే, ఈ సూక్ష్మశరీరం స్వప్నావస్థలో పనిచేస్తుంది. ఈ రెండు శరీరాలు చూడటానికొకటిగానే ఉంటాయి. సూక్ష్మశరీరం ఉన్నప్పుడు (స్వప్నావస్థలో) స్థూలశరీరం కానరాదు. స్థూల శరీరం ఉన్నప్పుడు (జాగ్రదవస్థలో) సూక్ష్మశరీరం కానరాదు.

సూక్ష్మ శరీరానికి పదిహేడు తత్వాలు :— (1) పంచ తన్మాత్రల (పంచీకరణం కాని పంచభూతాల) వ్యష్టి సాత్విక భాగాల వల్ల ఏర్పడిన జ్ఞానేంద్రియాలైదూ; (2) రాజసభాగాలవల్ల ఏర్పడిన కర్మేంద్రియాలైదూ; (3) సమష్టి పంచ తన్మాత్రల సాత్వికభాగంతో ఏర్పడిన మనోబుద్ధులు రెండూ; (4) సమష్టి పంచతన్మాత్రల రాజస భాగంతో ఏర్పడిన ప్రాణాలు ఐదూ; వెరశి పదిహేడు తత్వాలు.

ప్రాణం ఒక్కటే అయినా క్రియా భేదంతో ఐదుగా వ్యవహారింపబడుతుంది. (1) హృదయ స్థానంలో ప్రాణమనీ,(2) గుదస్థానంలో అపానమనీ, (3) నాభిస్థానంలో సమానమనీ, (4) కంఠస్థానంలో ఉదానమనీ, (5) శరీరమంతటా వ్యాపించింది వ్యానమనీ, అంటారు. అంతఃకరణలో మనస్సూ, బుద్ధీ, చిత్తమూ, అహంకారమూ ఈ నాలుగూ విడిగా చెప్పక, మనోబుద్ధులు రెండే చెప్పటం జరిగింది.

ఈ అంతఃకరణ సహాయంతోనే, స్థూలదేహమూ, ఇంద్రియాలూ, జాగ్రదవస్థలో పనులు నెఱవేరుస్తాయి. ఈ స్థూల శరీరాన్నే మామూలు మానవులంతా, "నేను - నేను" - అనుకుంటూ మసలుతుంటారు. నేను-కాని యీ శరీరాన్ని నేననుకోవటం వల్లనే, అజ్ఞానం పెరిగిపోయి, ఇన్ని దుఃఖాలేర్పడుతున్నాయి. నిజానికి నేను - అనేది ఆత్మకు చెందవలసింది. దేహాన్నే అజ్ఞాని ఆత్మగా భావిస్తున్నాడన్న మాట !

సుషుప్తి (గాఢనిద్ర)లో కారణ శరీరం మాత్రమే ఉంటుంది. దాన్ని ఆనందమయ కోశమని కూడా అంటారు. ఇది కేవలం అజ్ఞానంతో నిండింది. దీని మీద ఆత్మకాంతి ప్రసరించినందువల్ల, గాఢనిద్రలో ప్రతి మనిషీ ఆనందాన్ని అనుభవిస్తున్నాడు.

పంచకోశాల్లో - (1) ఆనందమయ కోశం కారణశరీరమనీ, 2) అన్నమయకోశం స్థూలశరీరమనీ, తెలుసుకున్నాముకదా ? (3) తక్కిన మూడు కోశాలూ - ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశాలు కలిసి సూక్ష్మశరీరం ఏర్పడిందన్న మాట !

అంతఃకరణలోని ఆత్మ ప్రతిబింబాన్ని జీవుడంటారు. ఆ జీవుడు శరీరాభిమానంతో కర్తృత్వ భోక్తృత్వాలు తన మీద మోపుకుంటున్నందువల్ల సంసార భ్రాంతి ఏర్పడింది. ఆకర్తృత్వ భోక్తృత్వాలు తనవి కావని తెలుసుకుంటే, ఆజీవుడూ-ఆత్మా-ఒకటే !

ఆత్మ, వ్యష్టి రూపంలో ఉండి కూడా సమష్టిలో-పూసల్లో దారం మోస్తరు అంతటా వ్యాపించి ఉంటుంది, దాన్ని బ్రహ్మ మంటారు. ఈ బ్రహ్మంలో ఆభాసగా ప్రతి ఫలించే దృశ్యప్రపంచమంతా మిథ్య-అనీ, బ్రహ్మ మొక్కటే సత్యమనీ, ఆది శంకర భగవత్పాదులవారు సిద్ధాంతీకరించినారు - వివేక చూడామణిలో.

బ్రహ్మం నుంచీ వేఱుకాని పరమేశ్వరశక్తికే అవ్యక్తమనీ, అవిద్యఅనీ, అజ్ఞానమనీ, మాయ - అనీ పేర్లు. బ్రహ్మంవలెనే మాయ కూడా అనాది. ఈ మాయ వల్లనే ప్రపంచమేర్పడింది. మాయకు మూడు గుణాలు :— సత్వగుణమూ, రజోగుణమూ, తమోగుణమూ ఈ మాయనే ప్రకృతి అనికూడా అంటారు.

మాయకొక ఉనికిలేదు; లేకపోవటం అంతకంటే లేదు; రెండు విధాలా లక్షణాలా ? అవీలేవు; ఒకే సమానత లేదు. భిన్నతా లేదు. భిన్నా భిన్నతలు రెండూలేవు, అవయవాలులేవు. అదృశ్యమూ కాదు. ఈ రెంటూ లేవన్నమాటే ! మహాద్భుతం ! మాటలతో చెప్పటం సాధ్యంకాదు. బ్రహ్మన్నెప్పుడు తెలుసుకుంటామో ? -అప్పుడీ మాయ నశిస్తుంది-త్రాడని తెలుసుకోగానే పామనే భ్రాంతి నశించినట్టుగానే !

రజోగుణానికి విక్షేపశక్తీ, తమోగుణానికి ఆవరణ శక్తీ - ఈ రెండు శక్తుల వల్లనే మానవుడు భ్రమిస్తున్నాడు. ఈ రెండు గుణాలనూ వదలి సత్వగుణంలోనే ఉంటే, భ్రాంతి నశిస్తుంది.

కామ క్రోధ లోభ మద మాత్సర్యాదులూ, అహంకారమూ మొదలైన దోషాలన్నీ రజోగుణ ధర్మాలు. కనుక, రజోగుణం బంధ కారణం. దానికి తమోగుణం కూడా దోహదం చేస్తుంది. ఆవరణశక్తి ఉన్నవస్తువుల నింకో విధంగా చూపుతుంది. మనిషి అనేక జన్మలెత్తటానికిదే కారణమౌతుంది.

ఎంతటి ప్రజ్ఞావంతుడైనా, పండితుడైనా, చతురుడైనా తమో గుణం ఆవరించటంవల్ల – సూక్ష్మమైన ఆత్మను దర్శించటంలో – కృతార్థుడు కాలేకపోతున్నాడు.

అజ్ఞానమూ, ఆలస్యమూ, జడత్వమూ, నిద్రా, ప్రమాదమూ, మూఢత్వమూ మొదలైన వన్నీ తమోగుణ ధర్మాలు. ఈ లక్షణా లున్న వాడెవడైనా నిజం తెలుసుకోలేడు. స్తంభంవలె మొద్దుబారి ఉంటాడు.

శుద్ధ సత్వం జలంవలె స్వచ్ఛంగా ఉంటుంది. సత్వగుణం ఎక్కు వగా ఉండి కొద్దిగా రజస్తమాల భాగాలు కలిసిన మిశ్రమ సత్వం ధర్మాలు :— నిరహంకారమూ, యమనియమాలూ, భక్తిశ్రద్ధలూ, మోక్షకాంక్షా, దైవీ సంపత్తీ, అసత్పదార్థాలమీద విరక్తీ మొదలైనవి. శుద్ధ సత్వానికి, సదాచిఋనవ్వూ, ఆత్మానుభవమూ, శాంతీ, తృప్తీ మొదలైనవి ధర్మాలు.

ఈ త్రిగుణ మయమైన ప్రకృతే, అజ్ఞానమే, ఆత్మకు కారణ శరీరం. సుషుప్తిలో జ్ఞాపకమూ, అధ్యాసా, వంటివేవీ ఉండవు. ఏమీ తెలియటం లేదని మేల్కొన్న తర్వాత చెప్పేది, మనస్సే! అది లయించి, బీజప్రాయమై ఉంటుందన్నమాట !

ఇదంతా వివేక చూడామణిలో చక్కగా విశదీకరించబడింది. పంచీకరణంవల్ల మన దేహాన్ని పంచ భూతాత్మికమని మనం బాగా తెలుసుకోవచ్చు ! పంచీకరణంలో ఒకొక్క భూతం రెండుసగాలౌతుంది. ఒక సగం అలాగే ఉండి, తక్కిన సగం మళ్ళీ నాలుగుభాగాలౌతుంది. ఆపరకభాగం ఒకొక్కటీ తానుకాక తక్కిన నాలుగు భూతాల్లో కలుస్తుంది.

ఉదాహరణకు ఆకాశభూతం రెండు సగాలయింది. మొదటి సగం అలాగే ఉండి పోతుంది. రెండవ సగం నాలుగు భాగాలుగాచీలి,

ఒకటి వాయువులోనూ, ఒకటి తేజస్సు (అగ్ని)లోనూ, ఒకటి జలం లోనూ, ఒకటి పృథ్వి (భూమి)లోనూ కలుస్తుంది. ఇలాగే తక్కిన భూతాలు కూడా విడిపోయి, తమలో తాము సమ్మిళితమౌతాయి. అంటే, ప్రతి మహాభూతమూ - ఐదు మహాభూతాల మిశ్రమరూపం. అన్నీ కలిసి ఉండేదాన్నే మహాభూత మంటారు. అపంచీకరణంగా ఉండే పంచ భూతాలను పంచతన్మాత్రలంటారు.

స్థూల శరీరంలోని ఇరవై అయిదు తత్వాలు - ఇప్పుడు మనకు బాగా అర్థమౌతాయి. గమనించండి !

| పంచ భూతాలు | ఆకాశం | వాయువు | తేజస్సు అగ్ని | జలం | పృథ్వి భూమి |
|---|---|---|---|---|---|
| ఆకాశం | శీర్షాకాశం (శోకం) | ప్రసారణం (వ్యాపకం) | నిద్ర | లాల (చొంగ) | రోమం (వెంట్రుక) |
| వాయువు | కంఠాకాశం (కామం) | ధావన నిలకడ లేక పరుగెత్తటం | తృష (దప్పిక) | స్వేదం (చెమట) | త్వక్కు (చర్మం) |
| అగ్ని | హృదయాకాశం (క్రోధం) | వలనం (చుట్టు కోటం) | క్షుధ (ఆకలి) | మూత్రం | నాడి |
| జలం | ఉదరాకాశం (మోహం) | చలనం | కాంతి | శుక్లం (వీర్యం) | మాంసం |
| పృథ్వి | కట్యాకాశం (భయం) | ఆకుంచన (ముడుచుకోటం) | ఆలస్యం | శోణితం (రక్తం) | అస్థి (ఎముక) |

(1) ఆకాశం :- రెండు సగాలు; ఒకసగం (తలలో) శీర్షాకాశం, రెండవ సగం నాలుగు భాగాలు — (1) ప్రసారణ మనే పేరుతో

వాయువులోనూ, (2) నిద్ర అనే పేరుతో తేజస్సులోనూ, (3) లాలా రసమనేపేరుతో జలంలోనూ, (4) రోమం (వెంట్రుకలు) అనే పేరుతో పృథ్విలోనూ, కలిసినాయి.

(2) వాయువు :- రెండు సగాలు; ఒక సగం వాయువు ముఖ్య క్రియ - ధావనం (నిలకడలేక పరుగెత్తటం); రెండో సగం నాలుగు భాగాలు — (1) ఆకాశభాగం కంఠాకాశం; (2) అగ్నిభాగం తృష (దప్పిక); (3) జలభాగం స్వేదం (చెమట); (4) పృథ్వీభాగం నాడులు.

(3) తేజస్సు (అగ్ని) :- రెండు సగాలు. ఒక సగం క్షుధ (ఆకలి) రెండో సగం నాలుగు భాగాలు (1) ఆకాశభాగం హృదయాకాశం. (2) వాయుభాగం వలనం (చుట్టుకోటం). (3) జలభాగం మూత్రం. (4) పృథ్వీభాగం మాంసం.

(4) జలం (నీళ్లు) :- రెండు సగాలు. ఒక సగం శుక్లం(వీర్యం) రెండో సగం నాలుగు భాగాలు — (1) ఆకాశభాగం ఉదరాకాశం; (2) వాయుభాగం చలనం (3) తేజోభాగం కాంతి. (4) పృథ్వీభాగం మాంసం.

(5) పృథ్వి (భూమి) :- రెండు సగాలు. మొదటి సగం అస్థులు (ఎముకలు); రెండో సగం నాలుగు భాగాలు. (1) ఆకాశభాగం కట్యాకాశం; (2) వాయుభాగం ఆకుంచన (ముడుచుకోటం) (3) తేజో భాగం ఆలస్యం; (4) జలభాగం శోణితం (రక్తం).

ఈ పంచభూతాల పంచతత్వాలూ కలిసి ఇరవై అయిదు తత్వాలు, స్థూలదేహానివి. అదినేనుకాను; అని తెలుసుకోటం జ్ఞానం. పేరూ, జాతీ, వర్ణం, ఆశ్రమం, సంబంధం-మార్పూ, జనన మరణాలూ ఇవన్నీ స్థూలదేహ ధర్మాలు, వాటిని నేను కాదని తెలుసుకోటమే జ్ఞానం.

ఆత్మకాని వన్నీ అనాత్మలు - ఆత్మకు జనన మరణాలుండవు. అనాత్మల కుంటాయి. స్థూల దేహం అశాశ్వతం; ఆత్మ శాశ్వతం. ఆద్యంతాలు ఆత్మకులేవు. అలాగే సూక్ష్మదేహం కూడా నేను కాను. కారణ దేహమూ నేను కాను-అనే జ్ఞానబోధ ఈ వివేక చూడామణిలో విపులీకరించబడింది.

ఉపనిషత్తులూ, బ్రహ్మసూత్రాలూ, భగవద్గీతా-ఈమూడింటినీ ప్రస్థానత్రయ మంటారు. ఈ ప్రస్థానత్రయానికి భాష్యాలూ, ఈ వివేక చూడామణి వంటి ప్రకరణ గ్రంథాలూ, మరికొన్ని స్తోత్రాలూ, శంకర భగవత్పాదులవారి వాఙ్మయానికి చెందినవి. వేదాంత విజ్ఞాన మంతా ఈ వివేక చూడామణిలో ఇమిడింది. ఈ వివేక చూడా మణి, ఐదువందల ఎనభై ఒక్క శ్లోకాల్లో విరచిత మయింది. ప్రతి శ్లోకానికీ తెలుగు పద్యమూ, తాత్పర్యమూ, వివరణా, నేను వ్రాసి, ఆంధ్రులోకాని కర్పించుకుంటున్నాను.

ఈ గ్రంథ ప్రశంస ప్రత్యేకంగా గ్రంథాంతంలో వ్రాయబడింది. వివేక చూడామణి, గురుశిష్య సంవాద రూపంలో ఉంది. ఇలాగే శ్రీకృష్ణార్జున సంవాద రూపంలో భగవద్గీతా, వసిష్ఠ రామచంద్ర సంవాద రూపంలో యోగవాసిష్ఠమూ, వెలసినాయి. వాటికీ దీనికీ పోలికలున్నాయి.

"స్వయం బ్రహ్మా, స్వయం విష్ణుః, స్వయ మింద్రః, స్వయం శివః;
స్వయం విశ్వమిదం సర్వం; స్వాత్మా దన్యన్న కించన."
(వివేక చూడామణి-389 శ్లో.)

తే. గీ. ఆత్మయే బ్రహ్మ; ఆత్మయే ఆదివిష్ణు;
వింద్రు డాత్మ; శివుండాత్మ; ఈ సమస్త
విశ్వమంతయు నాత్మయే! వేఱులేదు;
లేదు లేదాత్మ తప్ప ఇంకేది లేదు.

ఆత్మే బ్రహ్మ; ఆత్మే విష్ణువూ; ఆత్మే ఇంద్రుడూ; ఆత్మే శివుడూ; ఆత్మే యీ విశ్వమంతా కూడా; ఆత్మ తప్ప ఇంకేదీ ఎక్కడా లేనేలేదు.

ఇదే అభిప్రాయాన్ని యోగవాశిష్ఠము - ముముక్షు వ్యవహార ప్రకరణంలో 4వ సర్గలో 13-16 శ్లోకాలిలా వెల్లడించినాయి.

"పౌరుషేణ ప్రయత్నేన త్రైలోక్యైశ్వర్య సుందరాం
కశ్చిత్ ప్రాణి విశేషోహి శక్రతాం సముపాగతః."

ఒకానొక జీవుడు ప్రబలమగు పురుషకారం వల్ల త్రిలోకాధిపత్యంతో కూడిన ఇంద్రపదవి నంద గలిగినాడు.

"పౌరుషేణైవ యత్నేన - సహాసాంభోరుహా స్పదం;
కశ్చిదేవ చిదుల్లాసో - బ్రహ్మతా మధి తిష్ఠతి."

ఒకానొక జీవుడు పురుషకారంతో ప్రయత్నించి సాహసంతో పద్మాసనాసీనుడై బ్రహ్మపదవి నందుకో గలిగినాడు.

"సారేణ పురుషార్థేణ - స్వేనైవ గరుడ ధ్వజం;
కశ్చిదేవ పుమానేవ - పురుషోత్తమ తాం గతః."

ఒకానొక పురుషుడు పురుషకార బలంచేత గరుడధ్వజుడైన విష్ణువు కాగలిగినాడు.

"పౌరుషేణైవ యత్నేన లలనా వలితా కృతిః;
శరీరీ కశ్చిదేవైహ గతః చంద్రార్థ చూడతాం."

ఒకానొక శరీరి స్వప్రయత్నంచేత,పురుషకారం వల్లనే అర్థనారీశ్వరుడూ చంద్రశేఖరుడూ ఐన శివుడు కాగలిగినాడు. ఇంకా యోగవాశిష్ఠం - ఉత్పత్తి ప్రకరణం 5వసర్గలోని 9వ శ్లోకం చూడండి!

"యస్మా ద్విష్ణ్వాదయో దేవాః - సూర్యాదివ మరీచయః;
యస్మాజ్జగం త్యనంతాని - బుద్బుదా జలధేరివ."

సూర్యుడి నుంచీ కిరణాలు వెలువడినట్లుగా ఈ యాత్మ నుంచే బ్రహ్మ విష్ణు మహేశ్వరాది దేవతలంతా వెలువడుతున్నారు. సముద్రంలో నుంచీ బుడగలవలె, ఈ యాత్మనుంచే జగత్తులు పుడుతున్నాయి.

ఇలా అధ్యాత్మ తత్వాన్ని సాంగోపాంగంగా కన్నబిడ్డలకుతండ్రివలె వివేక చూడామణి కూడా బోధిస్తుంది. శంకర భగవత్పాదులవారి జీవితాన్ని నేనింతకు ముందే నారచించిన – "భజగోవిందం"–లో వెల్లడించినాను. అంతకంటే విశేషంగా చెప్పవలసిన దేమీా కానరాదు.

దృశ్య విషయాల్లో మునిగి తేలే మనస్సులు గల మానవులకూ, పశువులకూ భేదమే ముంటుందీ? పశువులు ముక్కు త్రాటిచేత లాగబడుతుంటే, మూఢులైన మానవులు మనసుచేత లాగబడుతున్నారు. ఆ మనస్సును నిగ్రహించగలిగిన ప్రాజ్ఞులు ఆత్మ సౌఖ్యాన్ని అనుభవించగలుగు తున్నారు. ఈ సాధనకు పురుషప్రయత్న మొక్కటే అవసరం. మనం అదృష్టం అనుకునేది కూడా, పూర్వజన్మలో చేసిన పురుషకారమే కాని, ఇంకొకటి కాదు.

ప్రతివాడూ తగిన గురువును సేవించి ప్రభూ! నేనెవడను? ఈ సంసారంలో ఎందుకిలా అవస్థలు పడుతున్నాను? ఇది తరించటమెలా? అని ప్రశ్నించి, శ్రవణ మనన నిధి ధ్యాసలతో మోక్షాన్ని సాధించమని ప్రబోధించటమే వివేక చూడామణి సందేశం.

భగవంతుడు (ఆత్మ) నీలోనే ఉన్నాడు. అంతర్దృష్టితో చూడటానికై ప్రయత్నించు! బయటికి కర్తగానూ, లోపల అకర్తగానూ ఉండి విశ్వంలో విహరించు! సంగ రహితుడవై వ్యవహరించు

అనాసక్త కర్మయోగాన్ని అవలంబించు! ఏ కాంతంలో ధ్యానించు! లోకోపకారార్థం జీవించు! ప్రాణ సంరక్షణకై ఆహారం స్వీకరించు! భోగాలు విసర్జించు! తత్త్వజ్ఞానాన్ని సంపాదించు! ఈ జననమరణ చక్రాన్నుంచీ తరించు!

ఇలా వేదాంతసారాన్ని క్షుణ్ణంగా బోధించి, ఎన్నో గ్రంథాలు రచించి, అవతార పురుషుడనిపించుకున్న ఆది శంకరాచార్యుల వారి పాదసరోజాల కనేక ప్రణామాలర్పిస్తూ, ఈ కృతిని మీముందుంచు తున్నాను. చదువసాగితే వదలరని నానమ్మకం.

కర్నూలు
5-11-89

అనుములవెంకటశేషకవి

---

## గ్రంథ ముద్రణకు సహాయపడిన దాతలు

శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానంవారి ఆర్థిక సహాయం రూ. 10,000

1) తెలుగు కళాసమితి, కర్నూలు 2000/-

2) శ్రీ కె. కేశవరెడ్డిగారు, మండలాధ్యక్షులు, ఎమ్మిగనూరు; 500/-
వైస్ చైర్మన్, జిల్లా పరిషత్తు-కర్నూలు.

3) శ్రీ మాచాని సోమప్పశివణ్ణగారు, ఎమ్మిగనూరు, 216/-

4) శ్రీ టి. జి. వెంకటేశ్ గారు, కర్నూలు 216/-

5) స్మార్త బ్రాహ్మణ మండలి, ఆదవాని 216/-
6) శ్రీ రాచోటి వీరణ్ణగారు - ఆదవాని 216/-
7) శ్రీ గెలివి వెంకట సుబ్బయ్యశ్రేష్ఠిగారు - నంద్యాల 216/-
8) శ్రీ డి. మనోహరరావుగారు, ఉజ్జ్వల పబిషర్స్, కర్నూలు 116/-
9) శ్రీ జె. యం. రామచంద్రన్‌గారు 116/-
రామచంద్ర బుక్ డిపో - కర్నూలు.
10) శ్రీ అనంత రామసింగుగారు-కర్నూలు 116/-
11) శ్రీ పి. సి. వెంకట్రాములుగారు - కర్నూలు 116/-
12) కృష్ణా బుక్‌డిపో - కర్నూలు 116/-
13) శ్రీ యం. రాజగోపాల్‌గారు 116/-
రిటైర్డ్ డిప్యూటి కలెక్టరు, కర్నూలు
14) దేశినేని అప్పకొండయ్యగారు - నూనేపల్లి 116/-
15) శ్రీ నంద్యాల నారాయణ భగవాన్‌గారు 116/-
అడ్వకేటు - నంద్యాల
16) శ్రీ పి. సిద్దారెడ్డిగారు, ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్-మహానంది 116/-
17) శ్రీ టి. జి. కృష్ణమూర్తిగారు, ఆదవాని 116/-
18) శ్రీ కశెట్టి చిదంబరయ్యగారి భార్య
పద్మావతమ్మగారు - ఆదవాని 116/-
19) శ్రీమతి భాగ్యలక్ష్మిగారు, శారదా నికేతన్-ఆదవాని 116/-
20) శ్రీ కె. ఆర్. హనుమంతరెడ్డిగారు, ఎమ్మిగనూరు 116/-
21) శ్రీ మాదింటి దైవాధీనంరెడ్డిగారు, వకీలు-ఎమ్మిగనూరు. 116/-
22) శ్రీ ఆర్. పురుషోత్తమరెడ్డిగారు, పార్లపల్లె 116/-
23) శ్రీ కన్నయ్యగారి వెంకయ్యగారి జ్ఞాపకార్థం కుమారుడు
చి॥ సంగయ్య, ముసలాపురం - మెదకుజిల్లా. 116/-
24) శ్రీ బచ్చు పాండురంగంగారు గడివెన్దాపురం, మెదకుజిల్లా 116/-
25) శ్రీ చంద్రశేఖర్ కల్యాకూరా, కల్యాకూరా బ్రదర్స్ 116/-
కర్నూలు

## -: విషయ సూచిక -:



3 )



## గ మ ని క

నేను కర్నూలులో - అచ్చుకావటం తెనాలిలో ఐనందున 297 మొదలు 304 వరకు పేజీల సంఖ్య పొరపాటైనది. కాని శ్లోకాల సంఖ్య సరిగానే ఉన్నది. చిన్నచిన్న అక్షరాల పొరపాట్లు పాఠకులే దిద్దుకోగలరు.

— "గ్రంథకర్త"



# అనవద్య అవధాన ధౌరేయ అనుమల

చిన్నారి పొన్నారి చిరుత కూకటినాడె అవధాన శక్తి అబ్బిన అదృష్టశాలి అనుముల వేంకట శేషకవి. నెల్లూరులో స్కూల్ ఫైనల్ చదువుతుండగానే మొట్ట మొదటి అష్టావధానం అద్భుతంగా చేశారాయన. తరువాత సంస్కృతం చదువుకోవాలని రాజమహేంద్రవరం వెళ్లారు. తిరుపతి కవుల అవధాన విన్యాసాలతో, సాహితీ సమితి కవి కోకిల కావ్యగానంతో సరస్వతీ సంస్థానంగా రాజిల్లుతున్న రాజమహేంద్రవరంలో ఇరవై ఏళ్ళయినా రాని అర్భకుని శతావధాన సాహసానికి అందరూ ఆశ్చర్యపోయారు. ఆ యువకుడు చెళ్ళపిళ్ళ వారినే అధ్యక్షులుగా ఆహ్వానించడానికి వెళ్లాడు. ఆయన కుర్రవాణ్ణి ఎగాదిగా చూసి తిరస్కార పూర్వకంగా 'ఆఁ' అన్నారు.

చెల్లయు పిల్లయున్ గలిసి చేరిన నీదగు ఇంటి పేరులో
పిల్లదనంబు మానుము కవి ప్రభుః ఎవ్వనిగా తలంచితో

అని ఆశువుగా వాగ్బాణం విసిరాడు ఆ బాలకవి, చెళ్ళపిళ్ళవారు అధ్యక్షులుగా రానే వచ్చారు. సాహితీ సమితి ప్రముఖులు శ్రోతలు, మానవల్లి రామకృష్ణకవి, చిలకమర్తి, బాపిరాజు వంటి హేమాహేమీలు పృచ్ఛకులు. అయినా జంకూ గొంకూ లేకుండా శతావధానం చేసి చెళ్ళపిళ్ళ కవి ఆశీస్సులను పొందాడు శేషకవి. పిమ్మట ఆయన మూడుచోట్ల మాత్రమే శతావధానం చేశారు. ఆ తరువాత ఆయన అష్టావధానాలే చేస్తూ వచ్చారు. ఇప్పటికి శతాధికంగా చేశారు. డెబ్బయి దాటిన ఈ వయస్సులో కూడా అష్టావధానాలను అవలీలగా చేయగలుగుతున్నారు.

## సంస్థాన సందర్శనం

ఇరవయ్యో ఏటి నుంచీ సంస్థానాలలో సాహిత్య విహారం చేయడం మొదలు పెట్టాడు. శేషకవి. "సంస్థానాలు పోయిన తరువాత సారస్వతానికి మరీ దీనస్థితి సంభవించింది. ఇప్పటి అకాడమీల కంటె అప్పటి సంస్థానాలూ, జమీందారీలే ఎంతో నయం" అన్నారు ఆయన గతాన్ని నెమరు వేసుకొంటూ. ఆయన తమ అనుభవాలను ఇలా చెప్పుకొంటూ పోయారు. "దైవం దిన్నె సంస్థాన ప్రవేశం నా తొలి అనుభవం గద్వాల సంస్థానాధీశుల వియ్యంకుడు రామిరెడ్డి దైవం దిన్నె ప్రభువు, కవీ, పండితుడూ అయితే మనకేమీ

రాజా వీవు, సుకవి రాజును నేను, నీపైకి దండయాత్ర వచ్చినాము.

సామభేద దండ సదుపాయముల పోను దానముననె సంధి అవును భూపః"

అని బాణం ప్రయోగించాను. అంతే రాజమందిరాతిథ్యం. పండిత గోష్ఠి భాగధేయం కలిగాయి.

"గద్వాల రాణీ గారి దర్శనం దుర్లభం అయింది.

శ్రీ గద్వాల మహారాణీగారికి సరస పద్య నిచయ విరచనో

ద్వేగావతీర్ణ కీర్తి సమాగత బిరుదావళీ శతాధికుడరయన్

వ్రాస్తున్న లేఖ అంటూ పద్యలేఖ పంపించాను. దర్శన మయింది. ఉత్తమ సంభావన లభించింది. "అన్నట్లు వనపర్తి సంస్థానమూ వెళ్లానోయ్. కుర్రకుంకకు ఉత్తమ సంభావనా? అనీ రాజావారు పోటీ ఏర్పాటు చేశారు. పోకూరి కాశీపతి అతి ఆశు కవితా ప్రగల్భుడు ఆయనకూ నాకు ఆశువులో పోటీ. రాజావారి సమక్షంలో! ఉత్తమ సంభావన నేను జారవిడుచు కోలేదు సుమా" అన్నారు సగర్వంగా.

## రచనలూ : అభిమానులూ

శేషకవి తమ పధ్నాలుగవ ఏటనే రెండు నాటకాలు వ్రాసి ప్రచురించారు. మొదటిది 'తారాశశాంక విజయం', రెండవది 'సత్యనారాయణ మహాత్మ్యం' 'చింతాదేవి తొలి పద్యకృతి. 'తెలుగు రాణి' తొలినవల. తమ తొలికథానికశీర్షిక గుర్తులేదన్నారు. నలభై ఏళ్ళ క్రితమో వారపత్రికలలో ప్రచురిత మయింది. 'భజగోవిందం' వ్యాఖ్యతో ప్రచురించారు 'లలితాంజలి' 'వివేకానంద' పద్యకృతులు అముద్రితాలు. 'పోతన' నవల కూడా అముద్రితంగానే ఉండిపోయింది. సంస్కృతాంధ్ర హిందీ కన్నడ భాషలలో నిష్ణాతులైన శేషకవికి సంస్కృతంలో బిల్హణ, కాళిదాసులూ, ఆంగ్లంలో షెల్లీ, కీట్స్, హిందీలో ప్రేమ్‌చంద్, కన్నడంలో అ న. కృష్ణారావు అభిమానులు. "ప్రాచీన కవులలో మీ అభిమానులెవరు?" "సూరన, రామలింగ కవులు. వారి కవిత్వంలోని సహజత్వం, అక్కడక్కడ వక్రోక్తి నామార్గానికి దగ్గర". "మరి సమకాలీనులలో మీ అభిమాని ఎవరు?" యావదాంధ్రమందు అంతవా డింకాక పుట్టలేదు ముందు పుట్టబోడు, నాకు పుట్టపర్తినారాయణాచార్లు నచ్చి మెచ్చు వచ్చు మచ్చుతునక- అని ఆశువుగా చెప్పేశారు.

## నవ యువకులకు....

"కవిత్వానికి ఉపాసన అవసరం. ఆధ్యాత్మిక సాధన కావాలి. సత్యదృష్టి, సమన్వయ దృష్టి మరీ ముఖ్యం. నిత్యవిద్యార్థి అయి నిరంతరంగా పాండిత్యం పెంపొందించుకుంటూ ఉండాలి. నాలుగు వాక్యాలు అడ్డదిడ్డంగా కూర్చితే తెగిన గొలుసు లాగా ఉంటుంది రచన. ఇది కవిత్వం కాదు - అన్నారు.

— (దినకర్)

**(1976 - ఆంధ్రప్రభ-సాహిత్యప్రభ నుండి)**

# వివేక చూడామణి

## 1. గురుదేవాయనమః

శ్లో॥ సర్వవేదాంత సిద్ధాంత గోచరం; తమ గోచరం;
గోవిందం పరమానందం సద్గురుం ప్రణతోస్మ్యహం

తే.గీ. సర్వవేదాంత సిద్ధాంత చక్షువునకె
గోచరుం; డన్యరీతి కగోచరుండు;
సద్గురుడు పరమానంద సత్స్వరూపు
డైన గోవిందు ప్రణుతింతు నాత్మయందు.

ఎవడు పరమానంద స్వరూపుడో? వేదాంత సారమంతా కూడిన లోపలి చూపుకు మాత్రమే కనపడతాడో? మామూలు మాటకూ మనసుకూ అందడో? అట్టి సద్గురుడైన గోవిందుడికి నేను నమస్కరిస్తున్నాను.

విశేషాంశాలు :- వివేక చూడామణి అనే ఈ గ్రంథం గోవింద స్తుతితో ఆరంభమయింది.

శ్రీ శంకరులవారి గురువులు గోవింద యతీంద్రులు. కారికలు రచించిన గౌడపాదాచార్యులవారి శిష్యులు.గురుస్సాక్షాత్ పరబ్రహ్మ- అనే సూక్తి సుప్రసిద్ధమేకదా? గురుదేవోభవ, పితృదేవోభవ, మాతృదేవోభవ- అనేది భారతీయులకు ఉగ్గుపాలతో అలవడింది. అంధకార మయమైన మానవ జీవితానికి వెలుగును ప్రసాదించేవాడు గురువంటారు. ఇంతకుముందు నేను వ్రాసిన భజగోవిందంలోకూడా ఈ సంగతి మనవిచేసే ఉన్నాను.

ఈ గ్రంథంపేరు వివేకచూడామణి. వివేకమంటే తెలివి, లేక, జ్ఞానం. చూడామణి అంటే శిరోభూషణమైన రత్నం. ఆత్మానాత్మ

విచారానికి పనికివచ్చే పుస్తకాలన్నిటిలోనూ సర్వశ్రేష్ఠమైనదని అభిప్రాయం. అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వం, తత్వజ్ఞానార్థ దర్శనం, ఏతత్ జ్ఞానం– అన్యదజ్ఞానం అంటుంది, భగవద్గీత. అంటే ప్రాపంచిక జ్ఞానం అజ్ఞానమేకాని, జ్ఞానం కాదన్నమాట! పారమార్థిక జ్ఞానమొక్కటే జ్ఞానమన్నమాట! అలాంటి జ్ఞానంతో ఆత్మదర్శనానికి దారి తీసేదే ఈ వివేకచూడామణి.

గోవింద శబ్దానికి భగవంతుడనికూడా అర్థముందని అందరికీ తెలిసిందే! 'గాం భూమిం, ధేనుం, స్వర్గం, వేదంవా విందతి గోవిందః' కనుక, భూమినీ ఆవునూ, స్వర్గాన్నీ, వేదాన్నీ పాలించేవాడూ, పొందేవాడూ, గోవిందుడు. అందరిలోనూ ఆత్మస్వరూపంగా ఉండేవాడు భగవంతుడు.

'ఇదం ద్యావా పృథివీ సత్యమస్తు పితర్మాతర్' అని సంధ్యావందన మంత్రం. ఈభూమి తల్లి; ఆకాశం తండ్రి; ఇదే సత్యం. నిజమే కదా? భూమి కేవలం పంటలనేకాక, బంగారాన్నీ, వెండినీ, రత్నాలనూ మనకు ప్రసాదిస్తుంది ఆకాశం సహాయపడితేనే అది జరుగుతుంది. ఆకాశమూ, భూమీ– ఒకటినొకటి కౌగలించుకొని ఉన్నాయి. నేల మీద మనమంతా ఆకాశగర్భంలో తిరుగుతున్నాము. జీవిస్తున్నాము. భూమ్యాకాశాలు ఎడబాయని జంట. ఈజంటనే పార్వతీ పరమేశ్వరులన్నారు. కొండ కూతురు పార్వతీదేవి అని చమత్కారంగా ఋషులన్నారు. భూమిని ధరించేదే కొండ. కనుక భూమే కొండకూతురు. అర్థమయిందా ? ధేనువంటే ఆవు; మానవుల జీవితమంతా పశువుల మీద ఆధారపడింది. అసలు అజ్ఞానులైన మానవులంతా పశువులే! పశుపతి సర్వేశ్వరుడైన భగవంతుడు. అందరికీ ప్రాణదాత. ఆ మహాదేవుడేకదా? గోశబ్దానికి వాక్కు అనికూడా అర్థముంది. మనమాటలకూ, పశుపత్యాదుల అఱపులకూ, వేదమంత్రాలకూ ఆధారం భగవంతుడే! దైవానుగ్రహం లేకపోతే నోటమాటకూడా రాదు, సత్స్వ

రూపుడూ, చిత్స్వరూపుడూ, ఆనందస్వరూపుడూ ఐన ఆ భగవంతుని దయవల్లనే మనకీ భూమి స్వర్గంగా మారుతుంది. ఇక వేదపరంగా చెప్ప వలెనంటే, ఒక్కో-వేదం ఒక్కో-మహావాక్యంతో భగవంతుని నిరూ పిస్తుంది. జీవులంతా పరమాత్మ స్వరూపులేనంటుంది. లోతుకు దిగి చూస్తే ఆత్మతప్ప ఇంకో పదార్థం ఎక్కడాలేదన్నమాట! అక్షరాలన్నీ వశిన్యాది వాగ్దేవతలు. క్షరం కానివి అక్షరాలు. అక్షరపర బ్రహ్మ నుంచే సృష్టి. అందుకే అక్షరాణాం అకారోస్మి- అంటాడు గీతలో భగ వంతుడు. ఇంతేకాదు- పంచభూతాలుకూడా భగవంతుడే! అవి మాయాస్వరూపాలు. మాయా కల్పితమే ప్రపంచం! ఇలా పరమా త్మనూ, గురువునూ కలిపి, గోవిందశబ్దంతో స్తుతించినాడు, ఆది శంకరుడు.

ఇంకో తమాషా చూడండి! గురువు గోవిందుడూ, శిష్యుడు శంకరుడూ! ఇద్దఱూ భగవత్స్వరూపులే! ఆపేర్లుకూడా అలా కుదిరి నాయి. నామరూపాలు అసత్యమైన యీ ప్రపంచంలో సత్యం భగ వంతుడే! అందుకే మనవాళ్లు ఏపేరుపెట్టినా, భగవత్పరంగానే ఉండటం సంప్రదాయం.

జగద్గురులకే జగద్గురువైన శంకరుడు సామాన్య మానవుడా? ఈనాటికీ ఆమహానుభావుడు స్థాపించిన పీఠాలు శృంగేరిలోనూ, జగ న్నాథంలోనూ, ద్వారకలోనూ, బదరిలోనూ, వేనోళ్ళ ఆయన కీర్తిని ఉగ్గడిస్తున్నాయి. ప్రపంచానికే అధ్యాత్మ జ్ఞానభిక్షపెట్టి, అద్వైతప్రతి ష్ఠాపనచేసి, సర్వజ్ఞుడైన ఆయనకు జోహారులు!

## 2. ఉత్తమ జన్మ

శ్లో॥ జంతూనాం నరజన్మ దుర్లభ; మతః పుంస్త్వం; తతో విప్రతా;
తస్మాత్ వైదికధర్మ మార్గపరతా; విద్వత్వ మస్మాత్పరం;
ఆత్మానాత్మ వివేచనం; స్వనుభవో బ్రహ్మాత్మనో సంస్థితిః;
ముక్తిర్నో శతకోటి జన్మసుకృతైః పుణ్యైర్వినా లభ్యతే.

సీ. నరజన్మ దుర్లభమరయ జంతువులందు
పురుషుడై నరులలో పుట్టుటరుదు;
పూరుషులందు విప్రుండౌట కడుహెచ్చు;
వేద ధర్మైక ప్రవృత్తి లెస్స;
వైదికులందు విద్వాంసు డౌటయె గొప్ప;
తెలియు టాత్మానాత్మ కలన మెఱుగు;
బ్రహ్మాత్మలో స్వానుభవముతో నుండుట
అన్నిటి కంటె నత్యతిశయంబు;
అన్ని యాత్మలు తన యాత్మ యందె; తానె
అన్ని యాత్మల ననుజ్ఞాన మబ్బెనేని;
ఇట్టి ముక్తి లభించుట కెన్ని నూర్ల
కోట్ల జన్మల పుణ్యంబు కూడవలెనొ?

జీవకోటిలో మానవజన్మ యెత్తటమే దుర్లభం. అట్టి నరజన్మలోనూ మగవాడై పుట్టడం మఱింత దుర్లభం. అందులోనూ విప్రుడు కావటం అదృష్టం. ఇన్నీ లభించినప్పటికీ వైదికకర్మమార్గంలో నడవటం మహాభాగ్యం. అలానడిచే వాళ్ళలో పండితుడు కాగలిగి ఉండటం పరమోత్తమం. ఆత్మానాత్మ విచారంచేస్తూ, ఆత్మదర్శనాన్ని అనుభవంలో ఉంచుకోవటం ఇంకెంతగొప్పో? ఎన్నో నూర్లకోట్ల జన్మల పుణ్యపరిపాకం ఉంటేనేకాని, ఇలాంటి ముక్తస్థితి సాధ్యంకాదు.

విశేషాంశాలు :- జంతూనాం నరజన్మ దుర్లభం- జంతువులను బాగా పరిశీలిస్తే, అవి పరోపకారంచేస్తూ జీవిస్తాయి. తమజోలికిరాని వాళ్ళనెంతమాత్రం బాధించవు. మచ్చికచేస్తే, ద్రోహం తలపెట్టవు. తమ ప్రాణాల నెదురొడ్డి మానవులను రక్షిస్తాయి. ధైర్యంగా ఎవరైనా భగవన్నామం జపిస్తూ సమీపిస్తే హానిచేయవు. కొన్ని జంతువులు తమ వ్యాధులను తగిన మూలికలు భక్షించి నయం చేసుకుంటాయి. విషం కలిపిన నీళ్లుచూస్తే త్రాగకుండా దూరంగాపోతాయి. అంతేకాని, ఆవిషం కలిపినవాళ్ళెవరా అని పసికట్టి కసితీర్చుకోవు. అం

దుకే వాటికి క్రముముక్తి. మఱి మానవుడో? అన్ని ప్రాణులకంటే ఉత్తమజన్మ పొందికూడా దుర్గుణాలు మానడు. ఐతే, అందులో సజ్జను లుంటారు. ఈజన్మమెలా సార్థకమౌతుందని ఆలోచిస్తారు.

అతః పుంస్త్వం- ఆ మానవుల్లో స్త్రీలూ, పురుషులూ ఉంటారు. స్త్రీలకంటే పురుషులు శ్రేష్ఠులు. వీళ్ళకు కనిపెంచే బాధ్యతలుండవు. అంతమాత్రాన స్త్రీలను కించపరచటంకాదు. ప్రకృతిలోనే ఈవిభేదా లున్నాయి. స్త్రీలకు గ్రహించే శక్తి, పురుషులకు ఇచ్ఛేశక్తి, భగవం తుడే కల్పించినాడు. ఉపనయనం (మూడోకన్ను తెరవటం) పురుషుడికే ఆచారంగా ఉండటాన్నిబట్టి, స్త్రీకి ఆసంస్కారం లేదుకాబట్టి, పురుష త్వం శ్రేష్ఠమన్నారేమో? కర్మకాండలో పురుషుడికే ప్రాధాన్యత. స్త్రీ యెప్పుడూ పురుషుడిని అనుసరించే జీవిస్తుంది. ఐనా స్త్రీలలో మగ రాయుళ్లూ, పురుషుల్లో ఆడంగిచేకులవాళ్లూ లేకపోలేదు.

తతోవిప్రతా- ఆ పురుషుల్లో విప్రులు కావటం శ్రేష్ఠం. జన్మ మాత్రంచేతకాక, వికృతిని ప్రకృతిగా, ప్రకృతిని వికృతిగా మార్చగల వాడు విప్రుడన్నారు. మహాభారతం ఆదిపర్వంలో రురుడనే మునికుమా రుడు ప్రమద్వరను ప్రేమిస్తాడు. ఆమె పాముకఱచి చనిపోతుంది. తన ఆయుస్సులో సగమిచ్చి ఆమె నతడు బ్రదికించుకుంటాడు. తన సతికప కారంచేసిన పాముమీది పగతో, రురుడు పాములన్నిటినీ వెదకి వెదకి చంప సాగుతాడు. సహస్రపాదుడనే ముని, శాపవశాన డుండుభసర్పమై ఉండగా, రురుడు దండమెత్తి కొట్టబోయి, శాపమోక్షం కలిగిస్తాడు. ఆముని ఈముని కుమారునిచూచి అయ్యా! బ్రాహ్మణజన్మమెత్తి యీ దారుణానికొడి గట్టడం భావ్యంకాదని బోధిస్తూ-

ఉ. భూనుతకీర్తి బ్రాహ్మణుడు పుట్టుకతోడనె పుట్టునుత్తమ
జ్ఞానము; సర్వభూతహిత సంహిత బుద్ధియు చిత్తశాంతియున్
మాన మద ప్రహారము శమత్వము సంతతవేద విధ్యను
ష్ఠానము సత్యవాక్యము దృఢవ్రతమున్ కరుణాపర్వతమున్.

అని బ్రాహ్మణ లక్షణాలను వర్ణిస్తాడు. బ్రాహ్మణు లహింసాపరులని చెప్పి, ఆ సర్వభూతాన్ని మాన్పిస్తాడు.

ఆనాటి అలాంటి బ్రాహ్మలను మనసులో ఉంచుకొని ఆదిశంకరు డిలా అన్నాడు కాబోలు! వేమన కాలానికే బ్రాహ్మణ్యం దిగజారి నట్టుంది. తల్లి శూద్రురాలు– తానెట్లు బ్రాహ్మడు? అంటూ బ్రాహ్మ ణ్యాన్ని ఆక్షేపిస్తాడు.

తస్మాత్ వైదిక ధర్మమార్గపరతా– ఆ బ్రాహ్మల్లోనూ వైదిక ధర్మాన్ని అనుసరించే వారెందరు? మన చదువులే యిప్పుడు లేవు. ప్రతి బ్రాహ్మడూ పొట్టకూటికోసం పరవిద్యాభ్యాసాని కెగబ్రాకుతున్నాడు. వేదపఠనమూ, గాయత్రీజపమూ చేసేవాళ్లు కఱవైనారుకదా? అధోగతి పాలైన ఈనాటి బ్రాహ్మలనుచూచి, బ్రాహ్మణ ధర్మాన్ని తక్కువగా అంచనా వేయకుందురుగాక!

విద్వత్త్వ మస్మాత్పరం – పాండిత్యమంటే సమదర్శనం. శునిచైవ శ్వపాకేచ పండితా స్సమదర్శనః– అనే గీతావాక్యాన్ని స్మరించండి! అలాంటి పండితుడికే ఆత్మా నాత్మవిచారంలో ప్రవేశం కలుగుతుంది. ఆత్మదర్శన భాగ్యాని కలాంటివాడే నోచుకోగలుగుతాడు. ఇలాంటి భాగ్యం అనేకజన్మల పుణ్యపరిపాకంతోగాని లభించదు.

ఇక్కడ ఒకదానికంటే ఒకటి గొప్పగా చెప్పినందువల్ల, దీన్ని సారాలంకారమంటారు.

## 3. ఏవి దుర్లభం?

శ్లో. దుర్లభం త్రయమే వైతత్ దైవానుగ్రహ హేతుకం;
మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుష సంశ్రయః.

క. మనుజత్వ ముముక్షుత్వము
లనగ మహా పురుష సంశ్రయంబన; నీమూ

డును దుర్లభములు; దైవం
బనుగ్రహము సేయకున్న నలవడవు కదా?

మనుష్యత్వమూ, మోక్షమందు కోరికా, మహాపురుషులతోడి సాంగత్యమూ- ఈమూడు అదృష్టాలూ దైవానుగ్రహం ఉంటేనేకాని లభించవు.

విశేషాంశాలు :- మనుష్యత్వం- మానవులంతా ఒకటేననే పిడివాదం ఈనాడెక్కువగా ఉంది. ఆస్తికుడూ మనిషే, నాస్తికుడూ మనిషే! గ్రుడ్డివాడూ మనిషే, కుంటివాడూ మనిషే! బిచ్చగాడూ మనిషే, ప్రభువూ మనిషే! పుట్టుకతోనే ఈ భేదాలెందుకేర్పడినాయి?

రాళ్లే తీసుకోండి! సున్నపురాళ్లూ. పలకరాళ్లూ, ఇండ్లు కట్టడానికుపయోగించే రాళ్ళూ, విగ్రహాలకుపయోగించే రాళ్లూ, అన్నీ ఒకటేనా? ఆమాటకొస్తే రత్నాలూ రాళ్లే! ఎందుకిన్ని భేదాలు? చెట్లలో వేపా, రాగీ, మేడీ, బిల్వమూ, నారికేళమూ, చింతా, మఱ్ఱీ, టేకూ, కర్పూరమూ, పోకా, మామిడీ- అన్నీ చెట్లేకావచ్చు. కాని భేదంకానరావటంలేదా?

పశువుల్లో ఆవులూ, గేదెలూ, గుఱ్ఱాలూ, గాడిదలూ, ఏనుగులూ, పిల్లులూ, కుక్కలూ, నక్కలూ, ఒంటెలూ, పులులూ, సింహాలూ- అన్నీ ఒకటేనా?

పక్షుల్లో కాకులూ, హంసలూ, గుడ్లగూబలూ, డేగలూ, చిలుకలూ, కోకిలలూ- అన్నీ ఒకటేనా ?

కొందరు పుట్టుకతో గాయకులు? కొందరు కవులు; కొందరు శిల్పులు; కొందరు వైణికులు; కొందరు మేధావులు; కొందరు మొద్దులు- ఇలాంటి భేదాలెందుకు కలుగుతున్నాయి? రాక్షసులూ, దేవతలూ మానవుల్లోనే ఎందరు లేరు?

ముముక్షుత్వం:- మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే- అనే గీతావాక్యాన్ని స్మరించండి! అందరూ వైరాగ్యవంతులూ,

భక్తులూ, యోగులూ కాగలుగుతున్నారా? ముక్తులు కావలెననే కోరిక యెందరికుంటుంది?

పురుషులందు పుణ్యపురుషులు వేరయా- అనే వేమనసూక్తి కేమర్థం చెపుతారు? శ్రీరాముడూ మనిషే, రావణుడూ మనిషే! భేదం లేదంటారా? కనుక, మైత్రీ, కరుణా మొదలైన మంచిగుణాలు కలవారికే మోక్షాపేక్ష ఉంటుంది.

మహాపురుష సంశ్రయః :- లోకంలో ప్రేయోమార్గమూ, శ్రేయోమార్గమూ అనేవి రెండుమార్గాలున్నాయి. ఈరెండూ ఒకదానికొకటి విరుద్ధం. ఇహలోకంలో ధనకనక వస్తువాహనాలనూ, పుత్రమిత్ర కళత్రాదులనూ, గృహారామ క్షేత్రాదులనూ, తుదకు స్వర్గాన్నికూడా ఇచ్చేది ప్రేయో (సుఖ) మార్గం. ఈమార్గాన్ని అనుసరించే వాళ్ళకు మోక్షంలేదు. పునరావృత్తి రహితంగా శాశ్వత కైవల్యమిచ్చేది శ్రేయోమార్గం. జనన మరణ ప్రవాహాన్ని దాటిన ఇలాంటి శ్రేయోమార్గగాములే మహాపురుషులనిపించుకుంటారు.

దైవానుగ్రహం పూర్వజన్మ కర్మ మంచిదికావడం వల్లనే లభిస్తుంది. అలాంటి పుణ్యాత్ములకే మానవత్వమూ, మోక్షాపేక్షా, సత్సాంగత్యమూ- అనే మూడూ సంభవిస్తాయి.

## 4. ఏది గమ్యం?

శ్లో. లబ్ధ్వా కథంచిత్ నరజన్మ దుర్లభం;
తత్రాపి పుంస్త్వం; శ్రుతిపార దర్శనం;
యస్త్వాత్మ ముక్తౌ నయతేత మూఢధీః
సహ్యాత్మ హాస్వం వినిహంత్య సద్గ్రహాత్

ఉ. పొందగరాని యీ మనిషి పుట్టుక పుట్టియు; పూరుషత్వముం
బొందియు; వేదపారమును పూర్తిగ చూచియు; నాత్మముక్తికై
మందు డెవండు యత్నమును మంచిగ చేయడొ? వాడసత్తుకై
కుంది కృశించి తుట్టతుదకుం జెడి పొల్పడు నాత్మహత్యకున్.

ఏదో ఒకవిధంగా దుర్లభమైన మనిషి పుట్టుక పుట్టినాడు; అందు లోనూ మగవాడు కాగలిగినాడు. శ్రుతులన్నీ చుట్టబెట్టినాడు; ఇన్నీ ఉండికూడా ఏ మూఢుడు ముక్తికై ప్రయత్నించకపోతున్నాడో? వాడు నిజంగా ఆత్మహత్యకు పాల్పడినవాడౌతున్నాడు. ఎందుకంటే అసత్పదార్థాలకోసం అంగలార్చి అఘోరించి చస్తున్నాడు.

విశేషాంశాలు :- మా+నవ- క్రొత్తదికాదు, తనకీ జన్మ ఎన్ని జన్మలో యెత్తి యెత్తి ఎన్నో శరీరాలు విడిచి విడిచి, యీ దశలో ఉన్నాడు. అదే ఆత్మహత్య; నిజానికి ఆత్మకు హత్య అనేది లేదుగా ? ఆత్మహత్య- అంటే తన్ను తాను చంపుకోవటం అనికూడా అర్థం. తానెవరో తెలుసుకోటానికి ప్రయత్నించకపోవటమే. హత్యాసదృశ మన్నమాట! చచ్చేది శరీరమే; కాని, ఆత్మమాత్రంకాదు.

శ్లో. ఇతః కోన్వస్తి మూఢాత్మా, యస్తు స్వార్థే ప్రమాద్యతి ?
దుర్లభం మానుషం దేహం, ప్రాప్య- తత్రాపి పౌరుషం? ౫

తే.గీ. చాల దుర్లభమౌ నరజన్మ మెత్తి
అందులో మగవాడయి అవతరించి
తన్ను తా నుద్ధరించుకో తలచనట్టి
వానికంటెను మూఢు డెవ్వాడు కలడు?

దుర్లభమైన మానవదేహాన్ని పొంది, అందులోనూ మగవాడై పుట్టి, తన్ను తాను తెలుసుకోటంలో అశ్రద్ధ చేసేవాడికంటే ఎక్కువ మూర్ఖుడింకెవడున్నాడు?

శ్లో. వదంతు శాస్త్రాణి; యజంతు దేవాన్
కుర్వంతు కర్మాణి; భజంతు దేవతాః
ఆత్మైక్య బోధేన వినా విముక్తిః
న సిద్ధ్యతి బ్రహ్మ శతాంతరేపి. ౬

చ. పలుకును గాక శాస్త్రములు; బాగుగ యజ్ఞములాచరించి; క
ర్మల నొనరించి; యిష్టసురలం దని యుంచెడిగాక! ఆత్మలో

పఠ తగనైక్యముం గనక, బ్రహ్మశతాంతరకాలమైన నుం
గలుగదు ముక్తి; కావునను కావలె బోధయె సాధకాళికిన్.

శాస్త్రాలెన్నైనా చెప్పనీ!యజ్ఞయాగాలతో దేవతలను సంతోష
పెట్టనీ! కర్మలెన్నిటినైనా చేయనీ! ఇష్ట దేవతలను భజించనీ! నూర్గురు
బ్రహ్మల జీవితపర్యంతమైనా ముక్తిమాత్రం సున్న!

విశేషాంశాలు :- బ్రహ్మ శతాంతరమంటే ఎంతకాలమో ?
లెక్కించటం కష్టం.

| | | |
|---|---|---|
| కలియుగం | 4,32000 | సంవత్సరములు |
| ద్వాపరయుగం (దానికి రెండింతలు) | 8,64000 | ,, |
| త్రేతాయుగం (మూడింతలు) | 12,96000 | ,, |
| కృతయుగం (నాలుగింతలు) | 17,28000 | ,, |
| ఈ నాలుగూ కలిసి ఒకమహాయుగం | 43,20,000 | ,, |

మనకు సంవత్సరమైతే దేవతలకొకరోజు; కాబట్టి మన మహా
యుగం వాళ్ళకొకయుగం. ఇలాంటి దివ్యయుగాలు వెయ్యైతే బ్రహ్మ
కొకపగలు! ఇంకో వెయ్యి దివ్యయుగాలైతే ఒకరాత్రి- ఈరాత్రినే
ప్రళయమంటారు.

కనుక ఈప్రపంచం ఆయుఃప్రమాణం వెయ్యి దివ్యయుగాల
కాలం మాత్రమే! ప్రళయానంతరం మళ్లీ పుట్టుక! ప్రపంచం పుట్టి
నశించేంతకాలం బ్రహ్మకొకరోజైతే, సంవత్సరానికెన్ని ప్రపంచాలు
పుట్టి నశిస్తాయో?

ఇలాంటి నూరేండ్లకొక బ్రహ్మవంతున నూర్గురు బ్రహ్మల
ఆయుఃప్రమాణం అడిగేదేముంది? అంతు లేదన్నమాట!

మానవ శరీరానికింత ప్రాముఖ్యత యెందుకంటే, తన్నుతాను
చూచుకోటానికింకే శరీరమూ ఉపయోగించదు.

శ్లో. అమృతత్వస్య నాశాస్తి విత్తే నేత్యేవహి శ్రుతిః
బ్రవీతి కర్మణో ముక్తే రహేతుత్వం స్ఫుటం యతః.

క. విత్తముచే నమృతత్వం
బుత్తది యని శ్రుతులు చెప్పుచుండుటచేతన్.
బొత్తుగ ముక్తిలభింప; దు
దాత్తపు కర్మములనైన; తథ్యము నమ్మీ!

విత్త మున్నంతమాత్రాన ముక్తి చేకూరదని శ్రుతులంటు న్నాయి. కనుక కర్మలు చేసినందువల్ల ముక్తిలేదని స్ఫుటంగా తేలుతున్నది.

విశేషాంశాలు:- పితామహుడైన బ్రహ్మదేవుడు ఆశ్వలాయనునకు ఇట్లు చెప్పినాడు.

న కర్మణా న ప్రజయా ధనేన; త్యాగేనైకే అమృతత్వ మానశుః.
(కైవల్యోపనిషత్తు)

కర్మచేతకాని, సంతానముచేతకాని, ధనముచేతకాని, అమృతత్వము కలుగదు; త్యాగముచేతనే కలుగును.

## 8-13. ఎలా ఉద్ధరించుకోవటం ?

శ్లో. అతో విముక్త్యై ప్రయతేత విద్వాన్
సన్యస్త బాహ్యార్థ సుఖస్పృహస్సన్
సంతం మహాంతం సముపేత్య దేశికం
తేనోపదిష్టార్థ సమాహితాత్మా.

చ. కనుక ప్రయత్నపూర్వకముగా భవముక్తిని కోరు ధీరుడౌ
య్యన విడనాడి బాహ్యమగు నట్టి పదార్థసుఖంబులెల్ల; చ
య్యన సముదార సద్గురువు నాశ్రయమొంది; యతండు బోధచే
సిన విధి సత్యమంచు తనచిత్తమునుంచి. తరించుటొప్పదే?

కాబట్టి విద్వాంసుడైన సాధకుడు ముక్తికై ప్రయత్నించి, బాహ్యవస్తువులవల్ల కలిగే సుఖాలన్నిటినీ త్యజించి, మంచిశాంతు

మహోదారుడూ ఐన గురువు నాశ్రయించి, ఆయన ఉపదేశానుసారం సత్యమందు తన మనస్సును లగ్నం చేయవలయును.

శ్లో. ఉద్ధరే దాత్మ నాత్మానం మగ్నం సంసార వారిధౌ
యోగారూఢత్వ మాసాద్య సమ్యగ్దర్శన నిష్ఠయా. ౯

తే.గీ. ఆత్మదర్శన నిష్ఠతో ననవరతము
యోగరూఢి వహించి తన్నుద్ధరించు
కొనగవలయును తానుగా మనసునిల్పి;
సాధకుడు వేగ సంసార జలధినుండి.

మంచి విచక్షణ జ్ఞానంతో యోగారూఢత్వాన్ని పొంది, చావు పుట్టుకలనే సంసారసాగరాన్ని గట్టెక్కడానికై ప్రయత్నించి, తన్ను తానుద్ధరించుకోవలయును.

విశేషాంశాలు :- ఇంద్రియాలను జయించటమూ, కర్మలను వదలటమూ, కోరికలు లేకుండా ఉండటమూ, యోగారూఢత్వమని గీత చెపుతుంది. (గీ. 6-5). సమ్యగ్దర్శనమంటే, అహంకార మమకారాలులేక, నిష్పక్షపాతంగా, ఆత్మానాత్మ విచక్షణతో, ప్రపంచాన్ని చూడటం. దర్శనమంటే షడ్దర్శనాల్లో ఒకటి; దర్శనశాస్త్రాల దృష్ట్యా ప్రపంచం చూడమని కూడా అర్థం.

శ్లో. సన్యస్య సర్వకర్మాణి భవబంధ విముక్తయే
యత్యతాం పండితై ర్ధీరై రాత్మాభ్యాస ఉపస్థితైః. ౧౦

తే గీ. సర్వకర్మలు పూర్తిగా సన్యసించి;
బుద్ధిశాలియు ధీరుడౌ బుధవరేణ్యు
డాత్మ నరయుట కభ్యాస మాచరించి;
పడయు గావుత నిజభవ బంధముక్తి.

పాండిత్యమూ పట్టుదలా కలిగిన సాధకుడు, కర్మలన్నిటినీ విసర్జించి, ఆత్మను గుర్తించటానికై యోగాభ్యాసం చేస్తూ చావుపుట్టుకలనే సంసారబంధాలను త్రెంచివేయటానికి ప్రయత్నించుగాక!

శ్లో. చిత్తస్య శుద్ధయే కర్మ-నతు వస్తూపలబ్ధయే:
వస్తు సిద్ధి ర్విచారేణ-నకించత్ కర్మకోటిభిః. ౧౧

తే.గీ. సుకృతకర్మలు చిత్తశుద్ధికయి; కాని
సత్యదర్శనమున కేమి సాయపడవు,
సత్యదర్శన మాత్మ విచారముననె;
కలుగ దది కోటికర్మలవలననైన.

సదాచార సంపత్తితో చేసే మతసంబంధమైన కర్మలన్నీ చిత్తశుద్ధికిమాత్రమే తోడ్పడతాయి. కాని, ఆత్మదర్శనాని కుపయోగించవు. కేవలం ఆత్మవిచారంవల్లమాత్రమే సమ్యగ్ సత్యదర్శనం సిద్ధిస్తుంది. కోటికర్మలైనా ఆసిద్ధిని ప్రసాదించలేవు.

విశేషాంశము :- నిష్కామ కర్మలూ, జపధ్యానాలూ, చిత్తశుద్ధిని కలిగిస్తాయి; ఆమీదట సత్యం గోచరిస్తుంది.

శ్లో. సమ్యగ్ విచారతః సిద్ధా రజ్జు తత్త్వావధారణా
భ్రాంత్యోదిత మహాసర్ప భయదుఃఖ వినాశినీ. ౧౨

తే.గీ. భ్రాంతిచే నుద్భవించిన పాము భయము
దుఃఖమును సత్యమరసిన దూరమగును;
శాంతమతియయి సమ్యగ్విచారణమున
నరయగా త్రాడు ప్రత్యక్షమగుటవలన.

భ్రాంతితో పెద్దపామనుకొని బెదరినప్పుడు కలిగే భయమూ, దుఃఖమూ, సరియైన విచారణచేసి చూడగానే, అది త్రాడని తెలుస్తుంది. అలా నిజం తెలియగానే, భయదుఃఖాలు నశిస్తాయి.

సూచన :- వేదాంతంలో విరివిగా వాడే ఉదాహరణ- రజ్జుసర్పభ్రాంతి- త్రాడునుచూచి పామనుకోటం.

శ్లో. అర్థస్య నిశ్చయోదృష్టో-విచారేణ హితోక్తితః
నస్నానేన నదానేన-ప్రాణాయామ శతేనచ. ౧౩

తే.గీ. స్నాన దాన ప్రాణాయామ శతముచేత
నైన నలవడ దాత్మ విజ్ఞాన మెపుడు;
జ్ఞానులగువారు తెలుపు మార్గమునుబట్టి
తర్క మొనరించుచో సిద్ధి తనరుగాని.

పుణ్యతీర్థాలు తిరిగి స్నానాలు చేసినా, దానాలు చేసినా, నూరు ప్రాణాయామాలు చేసినా, ఆత్మజ్ఞానమనేది లభించదు. వివేకులైన యోగులు స్వానుభవంతో చెప్పిన మంచిసలహాల ప్రకారం విచారణ చేసి చూచినప్పుడే, ఆత్మనిశ్చయం కలుగుతుంది.

## 14-17. అధికారమూ, అర్హతా

శ్లో. అధికారిణ మాశాస్తే ఫలసిద్ధి ర్విశేషతః
ఉపాయా దేశకాలాద్యాః సంత్యస్మిన్ సహకారిణః. ౧౪

తే.గీ. సాధకుని యోగ్యతనుబట్టి చాలవఱకు
ఫలము సిద్ధించు; నధికార బలమె బలము;
దేశకాలాది వసతులెంతేని సహక
రించునవెకాని, ముఖ్యప్రక్రియలు కావు.

కేవలం సాధకుడి అధికారమూ అర్హతమీదనే విజయమనేది పూర్తిగా ఆధారపడి ఉంటుంది. దేశమూ, కాలమూ మొదలైన వసతులన్నీ సహకరించేవేకాని, అంత ప్రాముఖ్యానికిరావు. అవి రెండో స్థానాన్ని ఆక్రమిస్తాయే కాని, అగ్రస్థానం పొందవు.

శ్లో. అతోవిచారః కర్తవ్యో జిజ్ఞాసో రాత్మవస్తునః
సమాసాద్య దయాసింధుం గురుం బ్రహ్మవి దుత్తమం. ౧౫

తే.గీ. అందుచేతను జిజ్ఞాసు వాత్మగూర్చి
సలుప వలసినదొక్క విచారణంబె;
పరమ కరుణా సముద్రుడు బ్రహ్మవేత్త
యైన సద్గురు చరణంబు లాశ్రయించి.

కాబట్టి జిజ్ఞాసువైన సాధకునికి కర్తవ్యం- ఆత్మవిచారమొక్కటే. అందుకై దయాసముద్రుడూ బ్రహ్మజ్ఞానం కలిగినవాడూ ఐన గురువు సన్నిధి చేరవలయును.

శ్లో. మేధావీ పురుషో విద్వాన్ ఊహా పోహ విచక్షణః
అధికార్యాత్మ విద్యాయా ముక్త లక్షణ లక్షితః. ౧౬

మ. జనమాన్యుండగు బుద్ధిమంతుడయి; ప్రజ్ఞంగల్గి బాహ్యాంతరం
బున లోకంబునెఱింగి; వేదముల చొప్పుంగూర్చి తర్కించుచో
ననుకూల ప్రతికూల వాదముల సిద్ధాంతంబు రూపింప నే
ర్చిన వాడే భవముక్తి లక్షణము లక్షింపన్ సమర్థుండగున్.

మంచి చుఱుకైన జ్ఞాపకశక్తితో కూడినవాడై, విద్యా వినయ సంపన్నుడై, తగినంత విజ్ఞానంతో బాహ్యప్రపంచాన్నీ అంతరంగ ప్రపంచాన్నీ అర్థం చేసుకున్నవాడై, వేదాల కనుకూలంగా వాదిస్తూ ప్రతికూలవాదాల నెవడు ఖండింపగలడో? అట్టి సాధకుడే ఆత్మవిద్యను గ్రహించటానికి అధికారి.

శ్లో. వివేకినో విరక్తస్య శమాది గుణశాలినః
ముముక్షో రేవహి బ్రహ్మ జిజ్ఞాసా యోగ్యతామతా. ౧౭

క. ఎవడు వివేకి? విరక్తుం
డెవడు? శమదమాది సుగుణు డెవడు? ముముక్షుం
డెవ? డతడొకడే అర్హుడు
ప్రవిమల జిజ్ఞాస సలుప బ్రహ్మము నెడలన్.

సత్యాసత్య విచక్షణు డెవరో? అశాశ్వతమైనవాటి యందు విరక్తు డెవడో? శమాది గుణాలు కలిగిన వాడెవడో? మోక్షాసక్తి ఎక్కువగా ఉన్న వాడెవడో? అతడు మాత్రమే బ్రహ్మ జిజ్ఞాసకర్హుడు.

## 18-30. సాధన చతుష్టయం

శ్లో. సాధనా న్యత్ర చత్వారి కథితాని మనీషిభిః
యేషు సత్స్వేవ సన్నిష్ఠా యదభావే నసిద్ధ్యతి. ౧౮

తే.గీ. యోగ్యతలు నాల్గు సాధనకుండి తీర
వలయునంచు మనీషులు పలుకుచుంద్రు;
కనుక బ్రహ్మానుభవ మవి కలిగినపుడె
లభ్యమౌగాని, అవిలేక లబ్ధిలేదు.

ఆదిశంకరులు బ్రహ్మోపాసనకు నాలుగు సాధనలుండి తీరవలె నన్నారు. దానికే సాధన చతుష్టయమని పేరు, వేదాంత పరిభాషలో. అవి నాలుగూ ఉంటేనే, సాధనలో జయం కలుగుతుంది. అవే లేక పోతే, సిద్ధి లభించదు.

శ్లో. ఆదౌ నిత్యానిత్య వస్తు వివేకః పరిగణ్యతే;
ఇహాముత్ర ఫలభోగ విరాగ స్తదనంతరం;
శమాది షట్క సంపత్తి ర్ముముక్షుత్వ మితిస్ఫుటం. ౧౯

తే. మొట్టమొదట నిత్యానిత్యముల వివేక
మను; నిహాముత్ర ఫలభోగముల విరక్తి;
ఉత్తమ శమాది షట్క సంపత్తి మూడు;
కడపటిది మోక్షమందలి గాఢకాంక్ష.

నిత్యానిత్య వస్తు వివేకం మొట్టమొదటి యోగ్యత. రెండవది ఇహంలోనూ పరంలోనూ కర్మఫలాలు భోగించుటయందు విరక్తి. మూడోది శమాది షట్కసంపత్తి. కట్టకడపటిది మోక్షమందు తీరని కోరిక.

శ్లో. బ్రహ్మ సత్యం జగన్మిథ్యే త్యేవం రూపో వినిశ్చయః
సోఽయం నిత్యానిత్య వస్తు వివేకః సముదాహృతః. ౨౦

తే.గీ. గట్టిగా నమ్మి బ్రహ్మమొక్కటియె సత్య;
మదియె శాశ్వత మని నిశ్చయం బొనర్పు;
వెల్లడిగ దోచు నీలోకమెల్ల సుళ్ళు!
పేరొ్కను నిజానిజాల వివేకమిదియె.

బ్రహ్మమే సత్యమనీ, దృశ్యప్రపంచమంతా అసత్యమనీ, గట్టిగా మనసులో నిశ్చయించుకోటాన్నే ఆత్మానాత్మ వివేకమంటారు.

అంతటా అన్నివేళలా స్థిరంగా వ్యాపించి ఉండేది బ్రహ్మం; మార్పు చెందుతూ అశాశ్వతమయింది మిథ్యా ప్రపంచం— అని తెలియటమే వివేకం.

శ్లో. తద్వైరాగ్యం జిహాసా యా దర్శన శ్రవణాదిభిః
దేహాది బ్రహ్మపర్యంతే హ్యనిత్యే భోగవస్తుని. ౨౧

తే. గీ. మర్త్య దేహంబు నుండి బ్రహ్మంతమెల్ల
ధ్రువము కానట్టి భోగవస్తువుల మీద
కనుట వినుటయు మొదలగు పనులచేత
రక్తి విడనాడి యుంట వైరాగ్యమంద్రు.

మానవ శరీరం మొదలుకొని బ్రహ్మపదవి వఱకూ ఉండే అశాశ్వతమైన భోగ వస్తువులను చూచుటా, వినుటా మొదలైన ఇంద్రియ కార్యాలవలన కలిగే కోరిక లన్నిటినీ దూరంగా విడిచి పెట్టటమే వైరాగ్యం.

విశేషాంశాలు :— శాశ్వతమైనది బ్రహ్మ మొక్కటే! పై మెట్టున ఉంటుంది. ముక్తుడైనవాడు తన ఆత్మనే ఉనికిగా, జ్ఞానంగా ఆనందంగా అనుభవిస్తాడు. దర్శన శ్రవణాదిభిః— భోగకారణాలైన అన్ని ఇంద్రియాలద్వారా కలిగే సుఖాలను విసర్జింపక తప్పదు.

శ్లో. విరజ్య విషయవ్రాతాద్దోష దృష్ట్యా ముహుర్ముహుః
స్వలక్ష్యే నియతావస్థా మనసః శమ ఉచ్యతే. ౨౨

తే. గీ. ఇంద్రియంబుల దోషంబు లెంచి యెంచి
మాటిమాటికి విరమించి వాటినుండి;
మనసు లక్ష్యము మీద నేమరక యుండ
శాంతి గైకొని యుండుట శమ మటంద్రు.

మాటిమాటికీ విషయాల దోషాలను గమనిస్తూ వాటినుంచీ మనసును విరమించి, ప్రశాంతంగా లక్ష్యంమీదనే దాని నుంచటాన్ని శమ మంటారు.

శ్లో. విషయేభ్యః పరావర్త్య స్థాపనం స్వస్వగోళకే
ఉభయేషా మింద్రియాణాం స దమః పరికీర్తితః
బాహ్యానాలంబనం వృత్తే రేషోపరతి రుత్తమా. ౨౩

తే. గీ. ఉభయమగు నింద్రియంబుల నుజ్జగించి
విషయముల నుండి; తమచోట్ల విడుపు దమము;
మనసు బాహ్యవలంబనమునకు పోక
యునికి ఉపరతి యంద్రదే ఉత్తమంబు.

కర్మేంద్రియాలూ, జ్ఞానేంద్రియాలూ అనే రెండువిధాల యింద్రియాలు విషయాల మీదికి పోకుండా వాటి వాటి స్థానాల్లో వాటి నుంచటమే దమమంటారు. మనసు బాహ్యవస్తువుల మీదికి పోకుండా ఉండటమే ఉత్తమమైన ఉపరతి.

విశేషాంశాలు :- దమమనేది ఇంద్రియ నిగ్రహ మన్నమాట! మరి శమమో ? ప్రాపంచిక విషయాలను పట్టించుకోక కేవలం బ్రహ్మానుభవంలో మునిగి తేలటం- అదేకదా గమ్యం ?

శ్లో. సహనం సర్వ దుఃఖానా మప్రతీకార పూర్వకం:
చింతావిలాప రహితం సా తితిక్షా నిగద్యతే. ౨౪

తే, గీ కినిసి కసిదీర్చుకోవలె ననుట మాని
సర్వ దుఃఖాలు బాధలు సైచి యుంట;
చింతయు విలాప మేమియు చేయకుంట;
ఇది తితిక్షగ నెంచెద రెల్లవారు.

బదులుకు బదులు కసి దీర్చుకోవలె ననే బుద్ధిమాని, ఏ ప్రతీకారమూ చేయక, అన్ని దుఃఖాలనూ బాధలనూ ఓర్చుకొని, చింతా విలాపాలు లేక, ఏమీ జరుగనట్లే ఉండటాన్ని తితిక్షగా పలుకుతారు.

శ్లో. శాస్త్రస్య గురువాక్యస్య సత్యబుద్ధ్యా వధారణం
సా శ్రద్ధా కథితా సద్భిర్యయా వస్తూపలభ్యతే. ౨౫

తే. గీ. శాస్త్రమందు గురూపదేశంబు నందు
సత్యబుద్ధి వహించు నే శ్రద్ధ యండ్రు
సజ్జనులు; దానిచేతనే సాధకుండు
సత్య మారయ నేర్చియు జయముగాంచు.

శాస్త్రంమీాదా గురువు చెప్పిన మాటమీాదా సత్యమనే భావం గట్టిగా ఉంచటమే శ్రద్ధ- లేక, నమ్మక మంటారు. ఆ నమ్మక మున్నప్పుడే సాధకుడు సత్యదర్శనం చేయగలుగుతాడు.

విశేషాంశాలు :- శ్రద్ధ అనేది గ్రుడ్డి నమ్మక మనుకోరాదు. శాస్త్రాని కపార్థం తీసే మహానుభావులున్నారు. జాగ్రత్త! సాధకుడి హృదయం సత్యాసత్యాలు గమనించే స్థితికి ఎదిగే ఉంటుంది. కనుక, హృదయ పూర్వకంగా గురూపదేశాన్ని గౌరవించటం జరుగుతుంది.

శ్లో. సర్వదా స్థాపనం బుద్ధేః శుద్ధే బ్రహ్మణి సర్వదా!
తత్సమాధాన మిత్యుక్తం నను చిత్తస్య లాలనం. ౨౬

క. శుద్ధ బ్రహ్మము నందే
బుద్ధిని కీలించి ధ్యానమున మునుగుటచే
సిద్ధించు సమాధానము;
సిద్ధింపదు భావమాత్ర చిత్తము చేతన్.

పరిశుద్ధ బ్రహ్మము నందే యెల్లప్పుడూ బుద్ధి నిల్పి,ధ్యానంలో మునిగినప్పుడే, ఆ స్థితి సమాధాన మనిపించుకుంటుంది. కేవలం భావనా బలం చేత చిత్త లాలనం కలిగినంత మాత్రాన, దాన్ని సమాధాన మనరు.

విశేషాంశాలు :- వైజ్ఞానికంగానూ వేదాంతపరంగానూ ఆలోచించటంలో తృప్తి కలిగితే- అది సమాధానం అనిపించుకోదు. ఆ విజ్ఞానం, లేక ఉపనిషత్తుల బోధ, ఇక్కడేమీా పనికిరాదు. కేవలం ధ్యాన, వల్లనే సత్యదర్శనంలో పైమెట్టుకు పోయ్యే అనుభవం అవసరం.

శ్లో. అహంకారాది దేహాంతాన్ బంధా నజ్ఞాన కల్పితాన్
స్వ స్వరూపావబోధేన మోక్తు మిచ్ఛా ముముక్షుతా. ౨౭

క. అరసి నిజరూప; మహం
కార శరీరాది బంధకము, లజ్ఞానం
బారోపించిన యవి తెగ
గోర ముముక్షుత్వ మం(డ్రు గుర్తుగ దానిన్.

ముముక్షుత్వ మంటే తీరని మోక్షకాంక్ష. తన నిజస్వరూపాన్ని తెలుసుకొని అహంకార శరీరాదులకు అజ్ఞాన మారోపించిన బంధాలన్నిటినీ తెగతెంపులు చేసుకోవటాని కారాటపడట మన్నమాట! అహంకారమంటే మనశ్శరీరాలతో తాదాత్మ్యం.

శ్లో. మంద మధ్యమ రూపాపి వైరాగ్యేణ శమాదినా
ప్రసాదేన గురోః సేయం ప్రవృద్ధా సూయతే ఫలం. ౨౮

తే.గీ. గురు కటాక్షముచేత సోమరియె యైన
సర్వసాధారణుండైన సంభవించు
ఫలము; ప్రబలిన వైరాగ్య బలముచేత;
శమము మొదలగు సుగుణ సంశయముచేత.

సగం మనస్సుతో పూనినవాడూ, సాధారణుడూ ఐన సాధకుడు కూడా గురుకటాక్షంచేత అభివృద్ధి పొందినవాడై, వైరాగ్యబలం చేతా, శమాది గుణసంపత్తి చేతా అధికఫలాన్ని పొందుతాడు.

శ్లో. వైరాగ్యం చ ముముక్షుత్వం తీవ్రం యస్య తు విదతే
తస్మి న్నేవార్థ వంతః స్యుః ఫలవంతం శమాదయః. ౨౯

ఆ. వె. ప్రబలమైన తీవ్ర వైరాగ్య మెవ్వని
యందు కలదొ? శమదమాదులెల్ల
నతని యందు మిగుల నర్థవంతంబులై
ఫలము లొసగు ననుట పరమ నిజము.

ప్రబలమైన వైరాగ్యంతో తీవ్రమైన మోక్షాపేక్ష ఎవని కుం టుందో? అతడియందు శమాద గుణాలు అర్థవంతాలై ఫలవంతా లౌతాయి.

శ్లో. ఏతయోర్మందతా యత్ర విరక్తత్వ ముముక్షయోః
మరౌ సలిలవత్తత్ర శమాదేర్భావ మాత్రతా. 30

క. ఈ తీవ్ర మోక్షకాంక్షయు
నా తత వైరాగ్య మెవని కల్పము లగునో ?
అతని కెడారి నీరము
రీతి శమాదుల ఫలంబు రిత్తగ దోచున్.

ఎప్పుడు వైరాగ్యమూ, తీవ్రమైన మోక్షాపేక్షా సన్నగిలి పోతాయో? అప్పుడు శమాది గుణాలూ తక్కిన అభ్యాసాలూ, ఎడారి లోని నీళ్ళవలె, దృశ్యమాత్రంగానే నిలుస్తాయి.

విశేషాంశము :- ఏ యాధారమూ గట్టిగాలేని శమాది గుణాలు ఎడారిలో పడిన నీళ్ళవలె క్రమంగా నశిస్తాయన్నమాట.

## 31. ఏది ఉత్తమ భక్తి ?

శ్లో. మోక్షకారణ సామగ్ర్యాం భక్తి రేవ గరీయసీ
స్వస్వరూపానుసంధానం భక్తి రిత్యభిధీయతే. 31

తే గీ. మోక్షమును పొందుటకు హేతుభూతమైన
యట్టి సామగ్రి నగ్రగణ్యంబు భక్తి;
స్వస్వరూపాను సంధాన శక్తి కలిమి
భక్తి యంచును పేర్కొనబడు, నిజంబు.

మోక్షం పొందటానికిగల సాధన సామగ్రిలో భక్తిమాత్రమే మిక్కిలి ముఖ్యమయింది. అగ్రస్థానం భక్తిదే నన్నమాట ? తన నిజ స్వరూపాన్ని తాను ఏకాగ్రంగా చూచుకుంటూ ఉండేదాన్ని భక్తి అంటారు.

విశేషాంశాలు :- స్వస్వరూపాను సంధానమే భక్తి అనిపించుకుంటుందనే నిర్వచనం వేదాంతంలో అద్వైతదృష్టితో చెప్పబడింది. ద్వైతులైనవారు ఆత్మకు బదులు ఈశ్వరు నుపయోగించుకుంటారు. వాళ్లు భక్తినింకోవిధంగా నిర్వచిస్తారు.

ఆత్మానుసంధానమే భక్తి అనే నిర్వచనాన్నిబట్టి ధ్యానాన్ని సమర్థించే శంకరుని ప్రచ్ఛన్న బౌద్ధు డనికూడా నిందిస్తారు. కాని ఆత్మ విచారం బాగా చేసినవాళ్ళకు శంకర నిర్వచనమే సరియైన దనిపిస్తుంది.

ఏది యేమైనా దైవవిగ్రహానికి సాగిలపడి ప్రార్థించి భిక్ష మడిగేది భక్తి అనిపించుకోదు.

పరమప్రేమ రూపమే భక్తిగా నారద సూత్రాలు ప్రకటిస్తాయి. సాపరానురక్తి రీశ్వరే- అని శాండిల్యమతం. ప్రేమ కేవలం ప్రేమ కోసమేకాని, కామాని కక్కడ చోటులేదు.

## 32-40. గురుశిష్య మర్యాదలు

శ్లో. స్వాత్మ తత్త్వాను సంధాన భక్తి రిత్యపరే జగుః,
ఉక్తసాధన సంపన్నః తత్త్వ జిజ్ఞాసు రాత్మనః
ఉపసీదే ద్గురుం ప్రాజ్ఞం యస్మాద్ బంధవిమోక్షణం. 32

తే. గీ. ఆత్మ తత్వాను సంధాన మనియు భక్తి
నితరు లందురు; జిజ్ఞాసు వెల్ల యోగ్య
తలను సాధించి; ఆత్మను తెలియుకొఱకు
ప్రాజ్ఞ గురువును కని ముక్తి పడయవలయు.

ఆత్మ తత్వాన్ని గురించిన సత్యం ఎల్లప్పుడూ విచారిస్తూ ఉండటమే భక్తి అని ఇతరు లంటారు. అలాంటి జిజ్ఞాసువు, ముందుచెప్పిన సాధన సంపత్తిని సాధించి, ప్రాజ్ఞుడైన గురువు నాశ్రయించి, బంధ విమోచనం పొందేది.

విశేషాంశాలు :- బంధమనేది అజ్ఞానంచేత ఆరోపింపబడిందే కాని, నిజానికి లేదు. కాబట్టి, ముందుచెప్పిన శ్లోకాన్నే ఇంకోవిధంగా చెప్పినట్టయింది.

ఉక్తసాధన సంపన్నత :- ఇంతకుముందు 19వ శ్లోకంలోనుంచీ 31వ శ్లోకందాకా చెప్పినవన్నమాట! తాను శరీరాన్ని కానని, ఆత్మ నని తెలిసి వ్యవహరించటం పరమార్థం.

శ్లో. శ్రోత్రియోఽవృజినో కామ హతో యో బ్రహ్మవిత్తమః
బ్రహ్మణ్యు పరతః శాంతో నిరింధన ఇవానలః;
అహేతుక దయాసింధు ర్బంధురా నమతాం సతాం. 33

చ. శ్రుతి విహితుండు; పాపముల జోలికి పోని యతండు; కామనా
హతుడును బ్రహ్మవిత్తముడు, నాత్మరతుండును, శాంతు,డింధన
చ్యుతమగు నగ్నివోలె; కరుణోదధి, కారణమేమి లేకయే;
హితుడు, శరణ్యు డెల్లరకు నెల్లపుడున్, గురువౌటకుం దగున్.

వేదాలు నేర్చినవాడూ; పాపం లేనివాడూ, నిష్కాముడూ, బ్రహ్మానుభవం కలిగినవాడూ, బ్రహ్మమందే లీనమైనవాడూ, కట్టెలు లేని నిప్పువలె శాంతుడూ, అహేతుక దయాసముద్రుడూ, తన్ను శరణు చొచ్చిన వాళ్ళందరికీ సదా మంచి స్నేహితుడూ ఐనవాడే గురువు కాదగినవాడు.

విశేషాంశాలు :- శిష్యుడి లక్షణాలతెలిపి గురువు లక్షణాలను కూడా శంకరుడు వివరిస్తున్నాడు. ఇవన్నీ శ్రుతులు నిర్ణయించినవే!

ఆత్మానుభవ మున్నంతమాత్రాన అందరూ గురువులు కాలేరు. విశాలమైన హృదయమూ, శ్రుతి పాండిత్యమూ, అవసరం. ఈ శ్లోకంలో పెక్కు తుల్యవ్యక్తులను ఒక వాక్యంలో చెప్పినందున దీపకాలంకారం. పోల్చిచెప్పటం వల్ల ఉపమాలంకారమూ.

శ్లో. తమారాధ్య గురుం భక్త్యా ప్రహ్వప్రశ్రయ సేవనైః
ప్రసన్నం తమనుప్రాప్య పృచ్ఛేద్ జ్ఞాతవ్య మాత్మనః. 34

ఆ. అట్టి గురుని భక్తి నారాధన మొనర్చి
చేరి శరణు చొచ్చి సేవచేసి
అతడు సుప్రసన్నుడై యుండినప్పుడే
యడుగ నెంచినట్టి దడుగ వలయు.

అట్టి గురువును భక్తితో సేవిస్తూ, నీ శరణాగతి వల్లా, వినయం వల్లా, విశ్వాసంవల్లా, అతడు ప్రసన్నుడైనపుడు అడుగదలచిన దడిగి తెలిసికోవలయును.

శ్లో. స్వామిన్! నమస్తే నతలోక బంధో!
కారుణ్యసింధో! పతితం భవాబ్ధౌ;
మా ముద్ధరాత్మీయ కటాక్ష దృష్ట్యా
ఋజ్వాతి కారుణ్య సుధాభివృష్ట్యా. 35

క. స్వామీ! ఆశ్రిత బంధూ!
ప్రేమ దయాబంధు! నీకు వే మ్రొక్కెద; నే
నేమో భవాబ్ధి పతితుడ;
నామీద సుధార్ద్ర వీక్షణము నెఱపగదే!

స్వామీ! గురుదేవా! శరణన్నవాళ్ళకు స్నేహితుడైనవాడా! దయా సముద్రా! నీకు నమస్కారం. నే నీ సంసారసాగరంలో మునిగి తేలుతున్నాను. నామీద అమృతం వర్షించే నీ దయగల చూపు రానిచ్చి, నన్నుద్ధరించు!

శ్లో. దుర్వార సంసార దవాగ్ని తప్తం;
దోధూయమానం దురదృష్టవాతైః
భీతం ప్రపన్నం పరిపాహి మృత్యోః
శరణ్య మన్యం యదహం న జానే. 36

ఉ. ఘోర దవానలంబు దరికొన్న మహాటవియైన యట్టి సం
సారములో తపించెద నిజంబుగనే దురదృష్ట వాయువుల్
సారెకు వీచి వేల్పులను స్వాంతము లోపల భీతిగొల్ప; నిం
కేరును లేరు; నాకు శరణీవె! మృతిం దొలగించి కావవే!

(ఈ శ్లోకం పూర్వార్థంలో రూపకాలంకారం; ఉపమేయంపై ఉపమాన మారోపింపబడినది.)

ఈ ప్రపంచ (సంసార) మనేదే పెద్ద అడవి; దీన్ని తృప్తితీరని దవాగ్ని కాల్చివేస్తున్నది. లోపలా వెలుపలా దురదృష్టపు గాలులు వీచి నన్ను పీల్చివేస్తున్నవి. శారీరకంగానూ, మానసికంగానూ నేను మాడిపోతున్నాను. విషయానుభవాలవల్ల మృతిమీద మృతి నన్ను భయపెడుతున్నది ఈ మృత్యువునుంచీ నన్ను కాపాడు! నాకింకెవ్వరూ దిక్కులేరు కనుక, నిన్నే శరణు చొచ్చినాను.

శ్లో. శాంతా మహాంతో నివసంతి సంతో
వసంత వల్లోక హితం చరంతః
తీర్ణాః స్వయం భీమ భవార్ణవం జనా
నహేతు నాన్యానపి తారయంతః. 37

(పూర్వార్థంలో వృత్త్యనుప్రాస. బిందుపూర్వక తకారం ఆ వృత్తి కనుక.)

ఉ. శాంతమతుల్ మహాత్ములగు సాధువు లుంద్రు వసంతమట్లు ల
శ్రాంతము మానవావళికి చాలహితం బొనరించు కోసమై;
సొంతముగా తరించి భయశోక భవాంబుధి; తోడివారి దా
టింతు రహేతుకంబుగ; ఘటింతురు ముక్తి సమాశ్రితాళికిన్.

లోకంలో శాంతులూ,మహాత్ములునైన సాధుపుంగవు లున్నారు. వసంత ఋతువెలా చరాచర ప్రపంచానికి క్రొత్త ఉత్సాహాన్ని పుట్టించి మేలు చేస్తుందో ఆవిధంగానే వాళ్లు లోకానికి మేలు చేస్తారు. భయం

కరమైన భవసాగరాన్ని వాళ్లు దాటిందేకాక, ఇతరులు దాటడానికై అడుగకుండానే సహాయపడతారు.

విశేషాంశము :— వసంతంరాకతో ప్రకృతి పులకించిపోతుంది. మహాత్ముల సన్నిధిలో పవిత్ర వాతావరణం ఏర్పడుతుంది. ఈశ్లోకంలో శంకరుని కవిత్వం ఆహ్లాద జనకం.

శ్లో. అయం స్వభావః స్వత ఏవ యత్పర
శ్రమాప నోద ప్రవణం మహాత్మనా
సుధాంశురేవ స్వయ మర్కకర్కశ
ప్రభాభితప్తా మవతి క్షితిం కిల ! 38

(ఇది దృష్టాంతాలంకారం; రెండు వాక్యాల్లో అంతర్గర్భితంగా ఉపమ ఉంది కనుక).

చ. ఇతరుల కష్టనిష్ఠురము లెల్ల తొలగంగజేసి కాచుటే
సతతము నైజలక్షణము సాధు జనావళి; కర్క కర్కశో
ద్ధత కిరణ ప్రసారముల తాపము తట్టుకొనంగలేని యా
క్షితికి సుధాంశు వెన్నెలలు చెప్పక చల్లదనంబు గూర్పవే?

మహాత్ముల సహజ స్వభావమే, ఇతరుల కష్టనిష్ఠూరాలను స్వయంగా పోగొట్టి వాళ్ళను బాగుపరచటం.ఉదాహరణకు వాడి వాడి సూర్యకిరణాలచేత పగలంతా వేడెక్కి బాధపడే భూమికి, రాత్రిపూట చంద్రుడు తనంతటతానే చల్లని వెన్నెలలు కాసి, చల్లపఱచటం, అందఱికీ తెలిసిందే కదా ?

విశేషాంశము :— శంకరుని మనం అవతార పురుషునిగా మహాయోగిగా చూస్తున్నామేకాని, మహాకవిగా గణించటం లేదు. ఈ శ్లోకాలు పరికిస్తే ఈయన కాళిదాసాదులకంటే ఏం తక్కువ ? అని

శ్లో. బ్రహ్మానంద రసానుభూతి కలితైః పూతైః సుశీతైర్యుతై
ర్యుష్మద్వాక్కల శోఘ్ఘితైః శ్రుతి సుఖై ర్వాక్యామృతైః సేచయ!
సంతప్తం భవతాప దావదహన జ్వాలాభి రేనం, ప్రభో!
ధన్యాస్తే భవదీక్షణ క్షణగతేః పాత్రీకృతాః స్వీకృతాః. ౩౯

(ఇక్కడ పరస్పర పోషకాలైన రెండు రూపకాలంకారాలు; పురుషుడు సంతప్తుడైనప్పుడే శీతల జలసేచనం అవసరం.)

మ. పరిపూతంబయి, చల్లనై, శ్రుతి సుఖంబై, కుండికానీతమై
పరమానంద రసానుభూతి దమునౌ వాగ్ధారతో నార్పవో
గురుదేవా! భవవహ్ని కీలలను నాకున్ వేగ; మర్థింతు; మీ
కరుణాపాంగ కటాక్ష పాత్రులు మఱింకన్ ధన్యులౌట బ్రమే?

ఓ ప్రభూ! బ్రహ్మానంద రసానుభూతితో మిళితమై, పవిత్రమై, చల్లనై, శ్రుతి సౌఖ్యదాయకమై, మీ పెదవు లనే కలశంనుంచీ వెలువడే వాక్యామృతము నామీద చిలికి, ఈ నా భవబంధాలనే దావానల జ్వాలలను ఆర్పివేయండి! మీరు దయతలచి, కటాక్ష వీక్షణాలకు పాత్రులనుచేసి, మీవాళ్ళుగా అంగీకరించినవాళ్ళు ధన్యులు కదా ?

(అంటే, మీరు దయతో నాకీ ప్రపంచ సంబంధమైన బంధాలు తొలగే మార్గాన్ని బోధించండి!— అని సారాంశం.)

శ్లో. కథం తరేయం భవసింధు మేతం ?
కావాగతిర్మే ! కతమోస్త్యుపాయః ?
జానే నకించి త్కృప యావ మాం ప్రభో!
సంసార దుఃఖ క్షతి మాతనుష్వ. ౪౦

ఉ. చావులు పుట్టుకల్ కలుగు సంసృతి సాగర మెట్లు దాటుటో?
నావిధి వ్రాలెటో? నడువ నాకేది మార్గమొ? యే మెఱుంగ; న
గావుము! దృశ్యమానమగు గాఢ భయంకర దుఃఖబాధల
బోవిడువంగ నేర్చుటకు బోధ యొనర్పు! సవిస్తరంబుగన్.

ఈ భవసాగర మెలా దాటేది? నాకేమి గతి? ఏ యే మార్గాన నేను నడిచేది? ఇందులో నాకొక్కటీ తెలియదు. ఓ ప్రభూ! జీవితంలో అంతవంతమైన యీ దుర్గతి నంతరింపజేయుట మెలాగో? సవిస్తరంగా చెప్పి నన్ను కాపాడు!

[శాస్త్రాల్లో అనేక మార్గాలున్నాయి. నేనేది స్వీకరించటం?]

## 41-47. గురూపదేశము

శ్లో. తథా వదంతం శరణాగతం స్వం
సంసార దావానల తాపతప్తం
నిరీక్ష్య కారుణ్య రసార్ద్ర దృష్ట్యా
దద్యా దభీతిం సహసా మహాత్మా. ౪౧

క. ఈ విధముగ వేడిన భవ
దావానల తాప తప్తు; తన శరణార్థిన్;
భావించి యా మహాత్ముడు
పావన కరుణార్ద్ర దృష్టి భయముం దీర్చన్.

సంసారమనే దావానలం మంటలచేత బాధపడినవాడై, శరణాగతుడై; అతడిలా ప్రార్థించగానే, ఆ మహాత్ముడు కరుణా రసార్ద్రమైన చూపులతో అతడివంక చూస్తూ అభయదానం చేస్తున్నాడు.

శ్లో. విద్వాన్ స తస్మా ఉపపత్తి మీ యుషే
ముముక్షవే సాధు యథోక్త కారిణే
ప్రశాంత చిత్తాయ శమాన్వితాయ
తత్త్వోపదేశం కృపయైవ కుర్యాత్. ౪౨

చ. చదివిన వాడు; శాస్త్రములు చక్కగ నేర్చినవాడు, శిష్యుడై
వదలనివాడు, ముక్తికయి పాతర లాడెడివాడు, సాధువై
మెదలెడివాడు, చెప్పినది మీరక చేసెడి వాడు, శాంతి నె
మ్మది కలవాడు నర్హుడు సమంచిత సద్గురు బోధ కెప్పుడున్.

ఎవడు ముక్తికై వెంపరలాడుతూ వచ్చి శరణు చొచ్చినాడో, శాస్త్ర విషయాలు గ్రహించటానికి యోగ్యుడో, సాధువూ, శాంత చిత్తుడూ, బాహ్యాభ్యంతర నిగ్రహం కలవాడో, అటువంటివానికి మిక్కిలి దయతో సద్గురువు సత్యబోధ చేయకతప్పదు.

[ఈ యోగ్యత ఉన్నవాడే వేదాంత బోధ కర్హుడు.]

శ్లో. మాభైష్ట! విద్వం స్తవ నా స్త్యపాయః
సంసార సింధో స్తరణే స్త్యుపాయః
యే నైవ యాతా యతయో న్యపారం
త మేవ మార్గం తవ నిర్దిశామి. ४३

చ. భయపడ బోకుమా! బుధ! అపాయ మొకింతయులేదు నీకు ని
శ్చయముగ చావు పుట్టుకల సంసృతి సింధువు దాటుకోస మె
న్నయిన నుపాయముల్ కలవు; హాయిగ మౌను లదెట్లు దాటిరో ?
రయమున నట్టి మార్గము సరాసరి నీ కుపదేశ మిచ్చెదన్.

భయపడవద్దు! విద్వాంసుడా! నీకు చావు పుట్టుకలవల్ల కలిగే అపాయం ఎంతమాత్రం లేదు. సంసారాన్ని దాటించే ఉపాయాలుండనే ఉన్నాయి. ఏ మార్గంలో పూర్వ ఋషులంతా దాన్ని దాటిపోయి నారో, ఆ మార్గం నేను నీ కుపదేశిస్తాను.

[అని గురువు చెపుతున్నాడు.]

శ్లో. అస్త్యుపాయో మహాన్ కశ్చిత్
సంసార భయ నాశనః
తేన తీర్త్వా భవాం భోధిం
పరమానంద మా ప్స్యసి. ४४

క. ఉత్తమమైన ఉపాయము
బొత్తుగ సంసార భయము పోగొట్టెడి దొం
డిత్తటి కలదు; భవాంబుధి
నుత్తీర్ణుడవై ప్రమోద మొందుము ! వత్సా !

సర్వశ్రేష్ఠమైన ఉపాయ మొకటి కద్దు! అది తప్పక సంసార భయాన్ని పోగొడుతుంది. దానివల్ల నీవు భవసాగరాన్ని దాటి పరమానంద మనుభవింతువు గాక!

(చెప్పిందే మళ్ళీ ఒత్తి చెప్పటంవల్ల సద్గురువుకున్న శిష్య వాత్సల్యం అపారమని తేలుతుంది. ఆయన ప్రేమాధిక్యత ఇలా పలికించిందన్నమాట!)

శ్లో. వేదాంతార్థ విచారేణ జాయతే జ్ఞాన ముత్తమం;
తేనాత్యంతిక సంసార దుఃఖనాశో భవత్యను. ४७

క. వేదాంతార్థ విచారము
కాదా కారణము మంచి జ్ఞానంబునకున్?
ఆదాని చేతనే నీ
కీదృశ్య ప్రపంచ దుఃఖమెల్ల నశించున్.

ఉపనిషత్తుల వాక్యార్థాలను గురించి విచారం చేయటంచేత ఉత్తమ జ్ఞానం లభిస్తుంది. ఆ జ్ఞానంవల్ల ఈ దృశ్యమాన ప్రపంచంలోని దుఃఖాలన్నీ నీకు మూలమట్టంగా నశిస్తాయి. (ఒకదానికొకటి కారణం కనుక; కారణ మాలాలంకారం.)

(ఉత్తమ జ్ఞానమంటే తన్ను తాను తెలుసుకోటం. తాను శరీరం కాదనీ ఆత్మననీ తెలియటమే జ్ఞానం.)

శ్లో. శ్రద్ధా భక్తి ధ్యానయోగా న్ముముక్షోః
ముక్తే హేతూ న్వక్తి సాక్షా చ్ఛ్రుతేర్గీః
యోవా ఏతేష్వేవ తిష్ఠ త్యముష్య
మోక్షోఽవిద్యా కల్పితా ద్దేహ బంధాత్. ४८

శా. శ్రద్ధా భక్తులు ధ్యానయోగము ముముక్ష శ్రేణికిన్ మోక్ష సం
సిద్ధిం గూర్పగ కారణంబు లనుచున్ చెప్పున్ శ్రుతుల్ గట్టిగా;
బద్ధుండై క్రమనిష్ఠతో నడచు నెవ్వాడైన నివ్వానిచే
శుద్ధా జ్ఞానపు దేహ బంధములు త్రెంచున్; సంశయం బేటికిన్?

శ్రద్ధా, భక్తి, ధ్యానయోగమూ– ఇవి మూడూ సాధకునికి ముక్తి హేతువులని శ్రుతులు గీపెడుతున్నాయి. కాబట్టి వీటి నాచరణకు తెచ్చుకున్న వా డెవడైనా, అజ్ఞాన కల్పితాలైన దేహ బంధాలనుంచీ విడుదల పొందగలడు.

శ్లో. అజ్ఞాన యోగా త్పరమాత్మ న స్తవ
హ్యనాత్మ బంధ స్తత ఏవ సంసృతిః
తయో ర్వివేకోదిత బోధ వహ్ని
రజ్ఞాన కార్యం ప్రదహేత్స మూలం. ४८

చ. అల పరమాత్మవౌ తెఱుగ కజ్ఞత చేత ననాత్మ బంధముల్
తలచుట చేతనే కలిగె తావక సంసృతి– చావు పుట్టుకల్ ;
వలయు వివేక యుక్తమగు వాస్తవ బోధ; తదగ్ని కాల్పగా
గలదిక మూలమట్టముగ జ్ఞాన విహీనత నైన కార్యమున్.

పరమాత్మవైన నీవు, అజ్ఞానం ఆవరించటంవల్ల అనాత్మ బంధాలకు లోబడి ఉన్నట్లుగా భ్రమపడుతున్నావు. అలా అనుకోటంవల్లనే చావు పుట్టుకలతో కూడిన యీ సంసారచక్ర మేర్పడింది. ఆత్మానాత్మలను గుఱించిన విచారంవల్ల పుట్టిన జ్ఞానమనే అగ్నిజ్వాల ఈ యజ్ఞానకార్యాన్ని దహించివేస్తుంది.

## 48-49. శిష్యుడి సందేహాలు

శిష్య ఉవాచ – శిష్యు డడుగుతున్నాడు.

శ్లో. కృపయా శ్రూయతాం స్వామిన్! ప్రశ్నోఽయం క్రియతే మయా:
యదుత్తర మహం శ్రుత్వా కృతార్థస్యాం భవన్ముఖాత్. ४౮

క. స్వామీ! దయచేసి వినం
డీ! మిమ్ములు నడుగు ప్రశ్న లివి; మీ నోటన్
ఏమేమొ సమాధానము
లామోదము తోడ విని, కృతార్థుడ నగుదున్.

స్వామీ! నేనడిగే యీ ప్రశ్నలను దయతో వినండి!తమ నోటి నుంచీ వచ్చే సమాధానాలు విని, నేను కృతార్థుడ నౌతాను.

(అతి వినయంగా ఆచార్యుని అనుమతికై శిష్యుడు నిరీక్షించ వలసి ఉంటుందనే మర్యాద ఇక్కడ తెలుపబడింది.)

శ్లో. కోనామ బంధః? కథమేష ఆగతః?
కథం ప్రతిష్ఠాఽస్య? కథం విమోక్షః?
కోఽసా వనాత్మా! పరమః క ఆత్మా?
తయో ర్వివేకః కథఽమేతదు చ్యతాం. ४९

ఉ. ఏయది బంధమందు? రది యెట్టులు వచ్చిన? దెట్టులుండునో
పాయక? యెట్లు దాని నెడబాపుట? యేది యనాత్మ? ఆత్మయిం
కేయది? యెట్లు భేదము గ్రహింతు విచార మొనర్చ నేను ? నా
కీ యవి యెల్ల తెల్లముగా నేర్పడ జెప్పుము! సద్గురు ప్రభూ!

గురుదేవా! బంధమని దేనికి పేరు? అది ఎలా వస్తుంది (జీవాత్మకు)? అలాగే అది ఎంతకాలమైనా ఎలా ఉండగలుగుతుంది ? ఎవరైనా దాన్నెలా పోగొట్టుకుంటారు? అనాత్మ ఏది? పరమాత్మ ఏది ? ఆ రెండింటినీ ఎలా విచారించి తెలుసుకోవటం? అన్నీ వివరంగా నాకు చెప్పండి!

(ఇవి ఏడుప్రశ్నలు. వీటికి సమాధానాలు తెలిస్తే సమస్తమూ తెలిసినట్లే! అన్ని శాస్త్రాలసారమూ అవగతమైనట్లే నన్నమాట!)

## 50. గురువు శిష్యుని మెచ్చుకొనుట

శ్రీగురు ఉవాచ; గురువు పలుకుతున్నాడు.

శ్లో. ధన్యోఽసి కృతకృత్యోఽసి పావనంతే కులం త్వయా;
యదవిద్యా బంధ ముక్త్వా బ్రహ్మీభవతు మిచ్ఛసి. ५०

ఉ. ఔనవు నెంత ధన్యుడవొ? ఔర! కృతార్థుడవైతి; పావనం
బైనది జీవితంబు; కులమంతయుగూడ తరించెనోయి! అ
జ్ఞాన వశంబునం బొదువ గల్గిన బంధము లూడగొట్టి యిం
కైనను బ్రహ్మభావ మెనయంగ దలంచెద వొక్క పెట్టునన్.

నాయనా! నీవు ధన్యుడవూ, కృతకృత్యుడవూ ఐనావు. నీ జీవితగమ్యం చేరుకున్నావు. నీ వంశాన్ని తరింపజేసినావు. అవిద్యా (అజ్ఞాన) బంధాలను తెగ్రతెంపులు చేసుకొని, బ్రహ్మత్వాన్ని పొందటానికై ఉబలాటపడుతున్నావు.

(చిత్తశుద్ధితో వైరాగ్యం పొంది మోక్షాపేక్ష నెక్కువగా చూపుతున్నావు కనుక, నీ జన్మ సార్ధకం కాగలదు. బ్రహ్మానుభవం లభిస్తుంది.)

## 51-55. నిన్ను నీవే ఉద్ధరించుకోవాలి

శ్లో. ఋణమోచన కర్తారః పితుస్సంతి సుతాదయః
బంధమోచన కర్తాతు స్వస్మా దన్యో నకశ్చన. ౫౧

క. తనయులు మున్నగువారలు
జనకుని ఋణ మోక్షమునకు జాలుదు; రైతే
తన బంధమోక్షమునకో ?
జనులెవ్వరు రారు; తానె సాధింపవలెన్.

కొడుకులూ మొదలైనవాళ్లు తండ్రి ఋణాలు తీర్చటంలో కర్తలు కాగలుగుతారు. కాని తన సంసారబంధాలు తెగ్రతెంపులు చేయటాని కింకెవ్వరూ కర్త కాలేరు. తనకు తానే కర్త.

శ్లో. మస్తకన్యస్త భారాదేర్దుఃఖ మన్యై ర్నివార్యతే
క్షుదాదికృత దుఃఖంతు వినాస్వేన నకేన చిత్. ౫౨

క. తల బరువు వంటి వాటిం
గలిగెడి బాధలను తీర్పగలరెవరే; నా
కలివంటి వాటి బాధలు
తొలగింతురె? తనకు తానె తొడరకయున్నన్.

తలమీద బరువూ మొదలైనవాటివల్ల కలిగే బాధ లెవరైనా ఇతరులు తొలగింప గలుగుతారు. కాని కడుపులోని ఆకలీ దప్పికా

మొదలైనవాటివల్ల కలిగే బాధలను తనకు తానే తినీ, త్రాగీ, తీర్చు కోవలసి ఉంటుందికదా? (పై శ్లోకానికిది దృష్టాంతము.)

## 53-55. తనకు తానే గతి.

శ్లో. పథ్యమౌషధ మేవాచ క్రియతే యేన రోగిణా
. ఆరోగ్యసిద్ధి దృష్టాఽన్య నాన్యానుష్ఠిత కర్మణా. ౫౩

తే. గీ. పథ్య మొనరించి మందులు వాడి పడయు
రోగి యగువాడు దైహికారోగ్య గరిమ;
పరులు మందులు సేవించి పథ్య మున్న
మనకు జబ్బులు కుదిరెడి మార్గమున్నె ?

రోగి యైనవాడు స్వయంగా పథ్యముండి ఔషధం సేవించినప్పుడే ఆరోగ్యాన్ని పొందగలుగుతాడు. కాని పరులు సేవించే మందులవల్లా, చేసే పథ్యాలవల్లా కోలుకోలేడు కదా?(51 శ్లోకానికింకో దృష్టాంతము)

శ్లో. వస్తు స్వరూపం స్ఫుటబోధ చక్షుషా
స్వేనైవ వేద్యం న తు పండితేన;
చంద్ర స్వరూపం నిజచక్షుషైవ
జ్ఞాతవ్య మన్యైరవ గమ్యతే కిం ? ౫౪

చ. స్ఫుటమగు జ్ఞానచక్షు పరిశోధన తోడనె వస్తురూప మ
ప్పటముగ తానెఱుంగనగు; పండితవాక్యముచేత సాధ్యమా ?
దిటవుగ చంద్రబింబమును తేఱికనుంగొని తత్స్వరూప మి
ట్టిటులనవచ్చుగాక! పరు లేమయినం దెలుపన్ సమర్థులే ?

స్ఫుటమైన బోధచేత కలిగిన జ్ఞాననేత్రంతో వస్తు స్వరూపాన్ని తెలుసుకోగలుగుతాము. కాని పండితులు ద్వారా విన్నంతమాత్రాన తెలుసుకోవచ్చునా ? చంద్రబింబాన్ని సొంత చూపుతో చూస్తేనే, దాని రూపం తెలుస్తుంది. కాని, ఇతరుల వర్ణనచేత తెలుస్తుందా ? బాగా అర్థమౌతుందా? (ఇదికూడా ఇంకో దృష్టాంతమే!)

శ్లో. అవిద్యా కామకర్మాది పాశబంధం విమోచితుం
కః శక్నుయా ద్వినాత్మానాం కల్పకోటి శతైరపి. ౫౫

క. తాను వినా యింకెవ డ
జ్ఞానముచే గలుగు కామకర్మాదులు పా
శానిక బంధము త్రెంచం
బూనెడి, శతకోటి కల్పములకైన నికన్?

అజ్ఞానవశాన కలిగే కోరికలవల్లా, చేసే కర్మలవల్లా, పాశాలు చుట్టుకొని బంధ మేర్పడుతుంది. నూర్లకోట్ల కల్పాల కాలానికైనా తనకు తానే తెగత్రెంపులు చేసుకోవలసి ఉంటుంది. ఇతరులేమీ చేయ లేరు కదా! (మొదట 51 శ్లో.లో చెప్పినదాన్నే ఇక్కడ భంగ్యంతరంగా చెప్పినాడు.)

## 56-61. మోక్షమెలా లభిస్తుంది ?

శ్లో. న యోగేన న సాంఖ్యేన కర్మణా నో న విద్యయా
బ్రహ్మాత్మైకత్వ బోధేన మోక్షః సిధ్యతి నాన్యథా. ౫౬

క. యోగము, సాంఖ్యము, కర్మం
బాగమ విద్యలను మోక్ష మబ్బునె? జీవుం
డేగతి బ్రహ్మైక్యత గను
నాగతి బోధమునగాక, అన్యవిధాలన్ ?

కఠినమైన యోగసాధనచేత కానీ, కాపిలాది సాంఖ్యంవల్ల కానీ, కర్మానుష్ఠానంద్వారా కానీ, కేవలం చదువులమూలంగా కానీ, మోక్షం లభించదు. జీవ బ్రహ్మైక్యతను గుర్తించిన బోధవల్లనే తప్ప, ఇంకో విధంగా కైవల్యం పొందటం సాధ్యంకాదు.

(హఠయోగాదులు శరీరాన్ని బలపరుస్తాయి; సాంఖ్యంలో ప్రకృతి పురుష సంయోగం ద్వైతాన్నే ఆశ్రయిస్తుంది. మంచి కర్మ స్వర్గకారణం.)

శ్లో. వీణా యా రూప సౌందర్యం తంత్రీవాదన సౌష్ఠవం
ప్రజారంజన మాత్రం తత్ న సామ్రాజ్యాయ కల్పతే. ౫౭

క. అందమగు వీణ రూపము;
సుందర తంత్రీనినాద శోభయు; జనులన్
కొందఱ మెప్పించుటకే
అందున సామ్రాజ్య మబ్బునా, యేమైనన్?

వీణారూప సౌందర్యమేమి, తంత్రీ నినాద సౌష్టవమేమి, ప్రజా రంజన మాత్రానికే పనికిరాగలవు.ఆ మాత్రానికి వైణికునికి సామ్రాజ్య మేమీ కల్పితం కాదుకదా!

శ్లో. వాగ్వైఖరీ శబ్దఝరీ శాస్త్ర వ్యాఖ్యాన కౌశలం
వైదుష్యం విదుషాం తద్వత్ భుక్తయే నతు ముక్తయే. ౫౮

తే. గీ. వాక్చమత్కృతి శబ్దప్రవాహ గరిమ;
శాస్త్ర వ్యాఖ్యానములు సదా సలుపు నేర్పు;
పండితులు చూపు పాండిత్య వైభవములు
భుక్తికే కాని, వానిచే ముక్తి లేదు.

చమత్కారంగా మాట్లాడటమూ, శబ్దాలు ప్రవాహరూపంగా దొర్లించటమూ, శాస్త్రగ్రంథాలకు వ్యాఖ్యానాలు వ్రాసే నైపుణ్యమూ— ఇలాంటి పాండిత్య ప్రదర్శనాలన్నీ— ఎంత గొప్ప పండితుడో అనిపించుకోటానికీ, సొంత భుక్తి గడుపుకోటానికీ ఉపయోగిస్తాయి. అంతేకాని, వాటివల్ల మోక్షం రాదు.

[వాగ్వైఖరీ— అంటే వైఖరీవాక్కు— కాదు: వాక్యపద్ధతి]

శ్లో. అవిజ్ఞాతే పరే తత్త్వే శాస్త్రాధీతిస్తు నిష్ఫలా;
విజ్ఞాతేఽపి పరేతత్త్వే శాస్త్రాధీతిస్తు నిష్ఫలా. ౫౯

క. తెలియనిచో పరతత్త్వము
ఫలమేమీ తనకు శాస్త్రపఠనము వలనన్ ?

తెలిసినచో పరతత్వము
ఫలమేమీ తనకు శాస్త్రపఠనము వలనన్ ?

పరతత్వం తెలియనంతవఱకూ శాస్త్రాధ్యయనమెంతైనా నిష్ఫలమే! పరతత్వం తెలిసినతర్వాత, శాస్త్రాధ్యయనంతో పనేముంటుంది? (నదిని దాటిన పిదప తెప్ప యెందుకూ?)

శ్లో. శబ్దజాలం మహారణ్యం చిత్తభ్రమణ కారణం;
అతః ప్రయత్నాత్ జ్ఞాతవ్యం తత్వజ్ఞాత్తత్వమాత్మనః. ౬౦

ఆ. వె. శాస్త్రములను గలుగు శబ్ద జాలం బెల్ల
చిత్తమును భ్రమింపజేయు నడవి;
కనుక స్వప్రయత్నమున నాత్మతత్వంబు
బ్రహ్మవేత్తనుండి పఠయవలయు.

వివిధ శాస్త్రాల్లోని శబ్దజాలమంతా చిత్తాన్ని భ్రమింపజేయటానికి కారణమైన కీకారణ్యం వంటిది. కనుక బుద్ధిమంతుడైనవాడు మనఃపూర్వకమైన ప్రయత్నంచేసి, బ్రహ్మవేత్తయైన సద్గురువు నాశ్రయించి ఆత్మతత్త్వాన్ని తెలుసుకోవలసింది.

శ్లో. అజ్ఞాన సర్పదష్టస్య బ్రహ్మజ్ఞానౌషధం వినా
కిము వేదైశ్చ శాస్త్రైశ్చ కిము మంత్రైః కిమౌషధైః? ౬౧

తే. గీ. ఘనత రాజ్ఞాన సర్పదష్టునకు మందు
బ్రహ్మమును దెల్పు జ్ఞానమే! పనికిరాని
వేల వేదా? లికేల శాస్త్రాలు? నితర
మందు మంత్రాలు? వానికా మహిమ కలదె ?

అజ్ఞానమనే పాము కాటువేసినవాడికి తగినమందు బ్రహ్మజ్ఞానమొక్కటే! వేదాలూ, శాస్త్రాలూ, మంత్రాలూ, ఇతర మందులూ ఎందుకు పనికివస్తాయి?

## 62-66. అపరోక్షానుభవం ముఖ్యం

శ్లో. న గచ్ఛతి వినాపానం వ్యాధిరౌషధ శబ్దతః;
వినాఽపరోక్షానుభవం బ్రహ్మశబ్దైర్న ముచ్యతే. ౬౨

ఆ. వె. రోగమునకు మందు త్రాగితే నే కాని
మానునెట్లు చెప్ప మందు పేరు?
స్వానుభవము లేక సాక్షాత్తుగా, నహం
బ్రహ్మ మనుచు పలుక ఫలము కలదె ?

ఊరక మందుపేరు చెప్పుకుంటూ కూర్చుంటే ఆరోగ్య మెన్నటికీ నయంకాదు. ఆ మందు తెచ్చుకొని సేవించినప్పుడే అది కుదురుతుంది. అదే ప్రకారంగానే- నేను బ్రహ్మన్ని- అని చెప్పుకుంటూ ఉంటే తాను బ్రహ్మమౌతాడా? అపరోక్షానుభవం కలిగినప్పుడే (ప్రత్యక్షంగా చూచినప్పుడే) బ్రహ్మమనేది బోధపడుతుంది. అప్పుడే కదా మోక్షం లభిస్తుంది?

శ్లో. అకృత్వా దృశ్యవిలయం అజ్ఞాత్వా తత్వ మాత్మనః
బాహ్యశబ్దైః కుతో ముక్తిరుక్తిమాత్ర ఫలైర్నృణాం. ౬౩

తే.గీ. దృశ్యమాన ప్రపంచ మదృశ్యపఱచి
ఆత్మతత్వ మెఱింగిన యపుడె కాక;
నేను బ్రహ్మ మటన్న మాత్రాన నగునె?
ఉక్తిమాత్ర ఫలంబె తానొందు నరుడు.

మనస్సుకు వెలుపల ఉండే ప్రపంచాన్ని లయం చేయకుండా, ఆత్మ తత్వాన్ని (నిజస్వరూపాన్ని) అనుభవించి తెలుసుకోకుండా బ్రహ్మమనే పేరు ఉచ్చరిస్తూ ఉండినంతమాత్రాన మోక్షమెలా లభిస్తుంది? నోటిమాట చెప్పినందువల్ల కలిగే ఫలాన్ని మాత్రమే నరుడు పొందుతాడు.

(తాను బ్రహ్మమనీ, బ్రహ్మం తప్ప రెండోది ఇంకేదీలేదనీ తెలిసికొని అనుభవించటమే సమాధి. తానప్పుడు చిత్స్వరూపంగా

లేక జ్ఞానదీపంగా మారుతాడన్నమాట ! ఈదశ ననుభవించకుండా పోతే, అజ్ఞానం నశించలేదనే అర్థం.)

శ్లో. అకృత్వా శత్రుసంహార మగత్వాఖిల భూశ్రియం
రాజాహమితి శబ్దాన్నో రాజా భవితు మర్హతి. ౬౪

తే. గీ. అరుల నని గూల్చి; సకల రాజ్యాధికార
లక్ష్మి చేపట్టి; భూమిపాలనము సేయ;
నేను రాజు నటన్నమాత్రాన నెవడు
రాజపదమున కర్హుడై తేజరిల్లు ?

సేనలు సిద్ధపఱచుకొని శత్రువులను యుద్ధంలో సంహరించకుండానే, చుట్టుపట్ల రాజ్యాధికారం చెలాయించకుండానే భూమిలో గల సకల వైభవాలూ పొందకుండానే నేను రాజునని చెప్పుకోగానే, ఎవడైనా రాజనిపించుకుంటాడా ?

శ్లో. ఆప్తోక్తిం, ఖననం, తథోపరిశిలా ద్యుత్కర్షణం, స్వీకృతిం
నిక్షేపః సమపేక్షతే; నహి బహిః శబ్దైస్తు నిర్గచ్ఛతి;
తద్వత్ బ్రహ్మవిదోపదేశ మనన ధ్యానాది భిర్లభ్యతే;
మాయాకార్య తిరోహితం స్వమమలం తత్వం, న దుర్యుక్తిభిః.
౬౫

చ. హితవచనంబు, త్రవ్వకము, నెల్ల శిలాదుల నెత్తివేత, స్వీ
కృతి- ఇవి కోరుచుండు నిధి; కేవల శబ్దముచే లభింప; దా
వితముగ మాయగప్పి కనుపించని బ్రహ్మము, సద్గురూపదే
శత మననంబు ధ్యానమును సల్పక, కన్పడునే దురుక్తులన్ ?

భూగర్భాన దాచబడి ఉండే నిక్షేపం లభించవలెనంటే, ఆప్త వచనమూ, త్రవ్వకమూ, తాళ్ళూ మొదలైన వెత్తివేయటమూ, పొందటమూ- ఇన్ని పనులు అవసరం. ఊరక నిక్షేపమా ! ఇక్కడ రమ్మని పిలిస్తే వస్తుందా? అదేప్రకారంగానే, మాయచేత కప్పబడి

కానరాకున్న బ్రహ్మంకూడా, బ్రహ్మవేత్తయైన గురువు దగ్గఱ ఉప దేశాన్నిపొంది మననమూ ధ్యానమూ మొదలైనవి సక్రమంగా చేస్తేనే లభిస్తుంది. విపరీతతర్కంచేత లభించదు.

శ్లో. తస్మాత్ సర్వప్రయత్నేన భవబంధ విముక్తయే
స్వైరేవ యత్నః కర్తవ్యో రోగాదా వివ పండితైః. ౬౬

తే. గీ. అందుకన్నివిధాల ప్రయత్నములను
బుద్ధిమంతుడు సొంత మెప్పుడును, రోగ
ములును మొదలైనవానికి పోవె, చేసి;
బంధముక్తిని సాధింపవలయు, వత్స!

కాబట్టి బుద్ధిమంతుడైనవాడు స్వప్రయత్నంతో, రోగాదులదుం వలెనే, సామర్థ్యమంతా వినియోగించి, ఎడతెగని చావుపుట్టుకల సంసార బంధంనుంచీ విముక్తుడు కావలెను.

## 67-71. ప్రశ్నలకు సమాధానం

శ్లో. యస్త్వయాద్య కృతః ప్రశ్నో వరీయాన్ శాస్త్ర విన్మతః
సూత్రప్రాయో నిగూఢార్థో జ్ఞాతవ్యశ్చ ముముక్షుభిః. ౬౭

తే. గీ. అడిగినది మంచి ప్రశ్న శాస్త్రానుమతము;
సారవంతము గూఢార్థ సంయుతమును;
ముఖ్యసూత్రము సుమ్ము, ముముక్షువులకు
తెలిసికొని తీరవలసిన విలువగలది.

నీ విప్పుడడిగిన ప్రశ్న (ఏడుప్రశ్నలూ ఒకప్రశ్నగానే భావించి) చాల విలువైనది. శాస్త్రప్రమాణమైనది. సూత్రప్రాయమైనది. (సంగ్రహముగా నున్నది) రహస్యార్థంతో కూడినది. మోక్షాన్ని అపేక్షించేవాళ్ళంతా తెలుసుకొని తీరవలసింది సుమా!

[అడుగవలసినవే అడిగినావని గురువు శిష్యుని ప్రశంసిస్తున్నాడు.]

శ్లో. శృణుష్వా వహితో విద్వన్! యన్మయా సముదీర్యతే;
తదేత చ్ఛ్రవణాత్ సద్యో- భవబంధా ద్విమోక్ష్యసే. ౭౮

క. అవధానముతో చేయుము
శ్రవణము, నాచెప్పబోవు సంగతులెల్లన్;
శ్రవణముచేతనె సద్యః
భవబంధ విమోచనంబు పడయుదువు సుమీ!

భవబంధ విమోచనంబు పడయుదువు సుమీ! శ్రద్ధతో నేను చెప్పబొయ్యేది విను! విద్వాంసుడా! నీవా శ్రవణంవల్లనే ఇప్పటికిప్పుడు సంసారబంధాలనుంచీ విముక్తుడ వౌతావు సుమా!

శ్లో. మోక్షస్య హేతుః ప్రథమో నిగద్యతే
వైరాగ్య మత్యంత మనిత్య వస్తుషు;
తతః శమశ్చాపి దమ స్తితిక్షా
న్యాసః ప్రసక్తాఖిల కర్మణాం భృశం. ౭౯

ఆ. వె. మోక్షమునకు మొట్టమొదలు వైరాగ్యమే
కత మనిత్య వస్తుతతి గుఱించి;
దానిపై శమంబు దమము తితిక్షయు
కలిగి; విడువవలయు కర్మకాండ.

మోక్షానికి మొట్టమొదట లుండవలసింది వైరాగ్యం; అనిత్యమైన ఐహిక వస్తువులన్నిటినీ విడిచిపెట్టడం- భోగించకపోవటమన్న మాట! వైరాగ్యం వెంటా శమమూ, దమమూ, తితిక్షా- అవే కలుగుతాయి. సర్వకర్మ పరిత్యాగం అదే జరుగుతుంది.

[వైరాగ్యాది నాలుగింటినీ గుఱించి 20-24 శ్లోకాలు చూడు!]

శ్లో. తతః శ్రుతి స్తన్మననం స తత్త్వ
ధ్యానం చిరం నిత్య నిరంతరం మునేః
తతో వికల్పం పరమేత్య విద్వా
నిహైవ నిర్వాణ సుఖం సమృచ్ఛతి. ౮౦

క. అంతట శ్రవణము మననము
సంతతమగు ధ్యాననిష్ఠ సళ్ళక చిరమున్; !
శాంతు వవికల్ప సంస్థితి;
సొంతము నిర్వాణమిందె సమకూరు, మునీ

ఆ పిమ్మట శ్రవణమూ,మననమూ, నిరంతరధ్యానమూ- చిర కాలం చేయగా చేయగా నిర్వికల్ప సమాధి సిద్ధిస్తుంది. దానివల్ల నిర్వాణసుఖాన్ని ఇహంలో ఈ జీవితంలోనే పొందుతావు, మునీ!

(విన్నదానిని నెమరువేసుకోవటం మననం. నిశ్చలంగా ధ్యానంలో పడటం నిది ధ్యాస మంటారు. సవికల్ప సమాధికూడా ఇదే! అహం కారం అదృశ్యమైనపుడు నిర్వికల్ప సమాధి.)

శ్లో. యద్ బోద్ధవ్యం తవేదానీ మాత్మానాత్మ వివేచనం
తదుచ్యతే మయా సమ్యక్ శ్రుత్వాత్మ న్యవధారయ॥ ౭౧

తే. గీ. ఏది బోద్ధవ్య మది యిపు డేవచింతు
నాత్మకు ననాత్మకుం గల యంతరంబు;
సక్రమంబుగ విని దాని సంగతెల్ల
నీ మనస్సున గట్టిగా నిలుపుకొనుము!

ఇప్పుడు నీవు తప్పక తెలుసుకోవలసిందేదో దాన్ని వివరిస్తాను. శ్రద్ధగా ఆలకించు! ఈ శరీరమనే క్షేత్రంలోనే ఆత్మా-అనాత్మా ఈ రెండూ కలసిమెలసి ఉంటున్నాయి. ఈ దేహమే అనాత్మ-ఇది స్థూల మనీ, సూక్ష్మమనీ, కారణమనీ- మూడు విధాలు! ఇందులో స్థూలశరీ రాన్నే అందఱూ ఆత్మగా భావించి దాన్ని అలంకరించుకుంటున్నారు. అభిమానిస్తున్నారు- దాని సంగతి మొదట విను!



## 72-75 స్థూలశరీరము

శ్లో॥ మజ్జాస్థిమేదః పల రక్త చర్మ
త్వగాహ్వయై ర్ధాతుభి రేభి రన్వితం
పాదోరు వక్షో భుజ పృష్ఠ మస్తకై
రంగై రుపాంగై రుపయుక్తమేతత్. ౭౨

ఆ. వె. మజ్జ, యెముక, క్రొవ్వు, మాంసంబు, రక్తంబు
పైని క్రింద తోలు, పాళులేడు;
పదము, లూరువులును, వక్షంబు, చేతులు
వీపు, మస్తకంబు వెలయు దీన.

ఈ స్థూల శరీరంలో సప్తధాతువులున్నాయి. 1. మజ్జ 2, అస్థి (ఎముక) 3. మేదస్సు (మెదడు) 4. పలము (మాంసము) 5. రక్తము (నెత్తురు) చర్మము (తోలు) 7. త్వక్కు (లోపలి ధాతువులను ఆవరించేది,) ఈ శరీరానికి కాళ్లూ, చేతులూ, తొడలూ, రొమ్మూ, వీపూ, తలా– అనేవి అంగాలు; చీలమండతా, పిక్కలూ, మోకాళ్లూ, వ్రేళ్లూ మొదలైనవి ఉపాంగాలు. [అన్ని వ్యవహారాలూ దీనితోనే (స్థూల శరీరంతోనే) జరుగుతాయి. ఆత్మ సుఖదుఃఖాలను అనుభవించేది కనుక, ఇది ఆత్మ కాదనే సంగతి బాగా తెలియవలసింది.]

శ్లో॥ అహం మమేతి ప్రథితం శరీరం
మోహాస్పదం స్థూల మితీర్యతే బుధైః
న భో న భస్వ ద్దహ నాంబు భూమయః
సూక్ష్మాణి భూతాని భవంతి తాని. ౭3

ఆ. వె. నాది–నే–నటన్న నాటకానికి మూల
మీ శరీరమని మునీంద్రు లంద్రు;
స్థూలమనుచు; నభము, గాలి, నిప్పును నీరు
భూమి; సూక్ష్మ పంచభూత చయము.

నేనూ, నాదీ– అనే అధ్యాస కంతటికీ నివాసస్థాన మీ శరీరం. దీన్ని స్థూల శరీరమంటారు. ఆకాశమూ, గాలీ, నిప్పూ, నీరూ, భూమి– అనే పంచభూతాలు ఈ శరీరంలో సూక్ష్మ రూపాలతో ఉంటాయి. ఈ శరీరం ఈ పంచభూతాలవల్లనే పుట్టింది.

శ్లో॥ పరస్పరాంశై ర్మిళితాని భూత్వా
స్థూలానిచ స్థూలశరీర హేతవః;
మాత్రా స్తదీయా విషయా భవంతి
శబ్దాదయః పంచసుఖాయ భోక్తుః. ౭౪

తే. గీ. అవి పరస్పర మిళితంబులైన యపుడు
స్థూలముగ మారి నిర్మించు స్థూలతనువు;
సూక్ష్మసారాలు విషయాల చొప్పుగాంచి
శబ్దమాదిగ నైదయి సౌఖ్యమిచ్చు.

ఒక దాని భాగాలతో ఒకటి కలిసిమెలసి సూక్ష్మ భూతాలు కాస్తా స్థూలంగామారి, స్థూల శరీరాన్ని నిర్మిస్తాయి. సూక్ష్మసారాలు పంచతన్మాత్రలనే పేరుతో ప్రత్యేకంగా ఉండి అంత రింద్రియాలకు శబ్ద స్పర్శ రూప రస గంధాలనే విషయాలను కల్పించి, జీవాత్మకు సుఖకారణాలౌతాయి. అంటే; దుఃఖాలను కూడా అవే తెస్తాయన్న మాట.

[పంచతన్మాత్రలు విడిపోయి అణువులై ఒకటితో ఒకటి కలిసి పోవటాన్ని మన వేదాంతులు పంచీకరణ మంటారు. ఒక్కొక్క తన్మాత్ర మొదట రెండు భాగాలౌతుంది. ఒక సగం అలాగే ఉండిపోతుంది. రెండవ సగం మళ్లీ నాలుగు భాగాలౌతుంది. ఆకాశభూతం సగం, తక్కిన నాలుగు భూతాల ఎనిమిదో భాగాలు నాలుగూ, కలిసినప్పు డది మహాభూత మౌతుంది. అట్లనే తక్కిన నాలుగు మహా భూతాలుకూడా.]

విశేషాంశాలు :- పంచప్రాణాలూ, మనస్సూ, బుద్ధీ, పది ఇంద్రియాలూ – కలిసి పదియేడు తత్త్వాలతో కూడిన సూక్ష్మశరీరం జీవునికి సుఖసాధన మాతున్నది. ఇటువై అయిదు తత్త్వాలతోడి (పంచీకృత మహాభూతాలవల్ల ఏర్పడి, కర్మసంచితమైన సుఖదుఃఖాలనుభవించే స్థూలశరీరం జీవుడికి భోగాయతనం.

శ్లో. యఏషు మూఢా విషయేషు బద్ధా
రాగోరు పాశేన సుదుర్దమేన
అయాంతి నిర్యాంత్యధ ఊర్ధ్వముచ్చైః
స్వకర్మ దూతేన జవేన నీతాః. ౭౫

చ. అతిశయమూఢులైన జనులా విషయానుభవంబులందు బం
ధితులయి; గట్టి గట్టివయి త్రెంపగజాలని రాగపాశ సం
తతుల కతంబునన్ పయికి, దబ్బున క్రిందికి, పోయివత్తు రు
ద్ధతి మెయి కర్మదూతలు ప్రతాపముతో తమునీడ్చుచుండగన్.

ఈ విషయాలకు, గట్టిగా తెగకుండా ఉండే రాగ పాశాలతో కట్టువడిన మూఢులు, తమ తమ పూర్వజన్మ కర్మలనే దూతలచేత బలవంతంగా లాగబడి, వస్తూ పోతూ, పైకీ క్రిందికీ, తిరుగుతుంటారు.

[వస్తూ పోతూ – అంటే, జనన మరణాలు పొందుతుంటారు. వాళ్ళ వాళ్ళ కర్మలనుబట్టి దేవత్వం మొదలు మూఢత్వంవఱకూ, వేటే వేటే శరీరాలను ధరిస్తూ ఉంటారు. జీవుడు తన నిజస్వరూపాన్ని మఱచి, రాగపాశాల మూలంగా, కర్మలనుబట్టి శిక్ష లనుభవిస్తుంటారు.]

## 76-82. విషయాశలే పాశాలు

శ్లో. శబ్దాది భిః పంచభి రేవ పంచ
పంచత్వ మాపుః స్వగుణేన బద్ధాః

కురంగ మాతంగ పతంగ మీన
భృంగాః, నరః పంచభి రంచితః కిం? ౭౭

సీ. వేటకా డూదెడి వేణువు నాదంబు
విని జింక చిక్కి వెంటనే నశించు;
మాతంగమో? స్పర్శ మఱగి ఆడేనుగు
వెంట నే మఱి పడు గుంటలోన;
మిడుత రూపమును భ్రమించి మంటల కాంతి
యాకర్షణము సేయ నగ్నిదూకు;
నెప్పుడాకలిగొని యెఱ చప్పరించుచు
గాలాన పడి చేప గ్లానిపొందు:
పూల వాసన చూడగా బోయి తేనె
టీగ మధువాని తెట్టెతోనే నశించు;
ఒక్కటొకటికె యిటులగుచుండ నింక
నైదుగల నరుసంగతి నడుగనేల ?

శబ్ద స్పర్శ రూప రస గంధాలనే ఐదు విషయాల్లోనూ ఒకొ్కక దాని నాశించి కురంగమూ, మాతంగమూ, పతంగమూ, మీనమూ, భృంగమూ బానిసత్వాన్నీ మరణాన్నీ తెచ్చుకుంటున్నాయి, ఐదు విషయాల యందూ ఆసక్తుడైన నరుడే గతి పొందనున్నాడో? ఎవరి కెఱుక ? (ఈ పద్యంలో అర్థాపత్తి అలంకారం)

[స్వగుణేనబద్ధాః – గుణమంటే త్రాడూకావచ్చు; ముక్కూవా కావచ్చు ఇవన్నీ ఏకేంద్రియ పాటవంగలవి. తక్కిన యింద్రియాలున్నా అంత సూక్ష్మ గ్రాహులు కావని విజ్ఞులంటారు. లేడికి చెవి బలెచురుకు, ఏనుగు చర్మస్పర్శ కెక్కువ లొంగుతుంది, మిడుతకు కంటిచూపు బలంగా ఉంటుంది, చేపకు జిహ్వాచాపల్యమధికం, తుమ్మెదకు ముక్కు చురుకు. ఇవి వాటి స్వగుణాలు.]

శ్లో. దోషేణ తీవ్రో విషయః కృష్ణ సర్ప విషాదపి
విషం నిహంతి భోక్తారం ద్రష్టారం చక్షుషా ప్యయం ౭౭

ఆ. వె. పాము విషముకంటె బహు భయంకరము లీ
విషయ దోషములు వివేకి యెడల;
విషము త్రాగినపుడె; విషయాలు కన్నార
చూచినంత చంపజాలు నరుని.

విషయాలు నల్లత్రాచు పామువిషం కంటే తీవ్ర విపత్కరమైనవి. విషం తీసుకొని త్రాగినవాళ్ళనే చంపుతుంది. విషయాలో ? కండ్లారా చూస్తేనే చంపుతాయి.

[చూపు మాత్రంతోనే కండ్లకు విషమెక్కుతుందన్న మాట! తక్కిన విషయాలన్నీ అలాంటివే! బాహ్యప్రపంచం కండ్లకే కనపడేది కనుక 'చక్షుషా అపి' అనటం శ్లోకంలో సాధకుడికి ప్రత్యేకతను సూచిస్తుంది. విషయాలు చూస్తేనూ, వింటేనూ, దూరంగా ఉండి స్మరిస్తేనూ అపాయం కలిగిస్తాయి.]

శ్లో. విషయాశా మహాపాశా-ద్యోవిముక్తః సుదుస్త్యజాత్
సఏవ కల్పతే ముక్త్యై-నాన్యః షట్‌శాస్త్ర వేద్యపి. ౭౮

ఆ. వె. విడువకష్టమైన విషయాశలను మహా
పాశములను త్రెంచు వాడింకంటె
అర్హుడౌను ముక్తి; కన్యులు షట్‌శాస్త్ర
వేత్తలయ్యు ముక్తి వీలుపడదు.

విషయాలనే మహాపాశాలనుంచీ విముక్తి పొందటం మిక్కిలి కష్టసాధ్యమైనపని. అలాంటిదాన్ని సాధించినవాడు మాత్రమే ముక్తి కర్హుడు. ఇతరులు అణుశాస్త్రాలూ చదివి తెలుసుకున్నప్పటికీ వాళ్ళ ముక్తి సాధ్యంకాదు.

[హృదయ పూర్వకంగా మోక్షంకోసం ఆవేదనపడక, కేవలం పుస్తకాలు చదివి ఆనందించే వాళ్ళకు మోక్షం లభించదు. బ్రహ్మచర్యం తప్పనిసరిగా ఉండి తీరాలి.]

శ్లో. ఆపాత వైరాగ్యవతో ముముక్షూన్
భవాబ్ధిపారం ప్రతియాతు ముద్యతాన్
ఆశాగ్రహో మజ్జయ తేంతరాళే
నిగృహ్యకంఠే వినివర్త్యవేగాత్. ౭౯

క. వైరాగ్యము పరిపూర్ణము
గారాక భవాబ్ధిదాట గడగిన; నాశా
ఘోరగ్రాహం బతనిని
నేరుగ గొంతుకను బట్టి నీరధిముంచున్.

నామకార్థపు వైరాగ్యంతో సంసార సాగరాన్ని దాటడానికి ప్రయత్నించే వానిని ఆశఅనే భయంకరమైన మొసలిగొంతు పట్టుకొని అదే సముద్రంలో ముంచుతుంది. (రూపకాలంకారం ఇంగ్లీషులో దీన్ని Metaphor మెటఫర్ అంటారు.) ఆపాత వైరాగ్యం - అంటే అంతంత మాత్రపు వైరాగ్యం. కొందరు భార్యమీదికోపంతోనో కష్టాల్ను భరించ లేకనో, అప్పులబాధ అధికమైతేనో, ఇల్లు విడిచి పరుగెత్తుతారు. సన్యాసంకూడ పుచ్చుకుంటారు. మరి కొందరు పేరు ప్రతిష్టలకోసం హరి ద్వారంలో తపస్సు చేస్తామని వెళ్ళి కొన్నాళ్ళుండి తిరిగివస్తారు. ఇలాంటి తాత్కాలిక వైరాగ్యంవల్ల పుట్టి మునుగుతుంది. తలలు బోడులైన తలపులుబోడులా? అనే వేమనసూక్తి తెలిసిందేగా?

శ్లో. విషయాఖ్య గ్రహోయేన-సువిరక్త్యసి నా హతః
సగచ్ఛతి భవాంభోధేః-పారం ప్రత్యూహ వర్జితః. ౮౦

క. వైరాగ్య మనెడి ఖడ్గము
చేరూఢిగ నెవడు హతముసేయునొ, విషయా
కార గ్రాహము? నతడే
ఊరక భవజలధి విఘ్నమొందక దాటున్.

విషయాలనే పేరిటిపెద్ద మొసలిని పరిపూర్ణ వైరాగ్యమనే ఖడ్గంతో ఎవడు ఛేదించి నాశనం చేస్తాడో? వాడెటువంటి విఘ్నాలూ లేకుండా సంసార సాగరాన్ని దాటుతాడు.

శ్లో. విషమ విషయమార్గే గచ్ఛతోఽనచ్ఛబుద్ధేః
ప్రతిపద మభిఘాతో మృత్యురప్యేష సిద్ధః
హిత సుజన గురూక్త్యా గచ్ఛతః స్వస్య యుక్త్యా
ప్రభవతి ఫలసిద్ధిః సత్య మిత్యేవ విద్ధి. ౮౧

తే. గీ విషమ విషయ భయంకర వీథులందు
తిరుగు మూఢుని మృతిపొంచి తిరుగునెపుడు;
సుజన గురుజన సూక్తుల సొంతతెలివి
కలిపి యోచించి నడచిన గలుగుసిద్ధి.

రజస్తమోగుణాల చేత మలినచిత్తుడై విషయ మార్గంలో సంచరించే మూఢుని వెంటా మృత్యువు పొంచిపొంచి తిరుగుతూనే ఉంటుంది. అడుగడుగునా వారికి మృత్యుభయమే! అలాకాక పూర్వ పుణ్య విశేషంతో కలిగిన వైరాగ్యాన్ని సుజనులూ గురువులూ ఐన వారి సలహాలతో సొంతం ఆలోచించి అంతకంతకు పెంచుకుంటూ దృఢవిశ్వాసంతో రహదారి వెంటనడచే వాడు తప్పక ఫలసిద్ధిపొంది తీరుతాడని గుర్తించు! ఇది నిజంసుమూ!

[ముముక్షువైన సాధకుడికి వర్జింపదగినదీ (హేయమూ), అవలం బించదగినదీ (ఉపాదేయమూ), గురువు బోధిస్తున్నాడు].

శ్లో. మోక్షస్య కాంక్షా యదివై తవాస్తి
త్యజాతి దూరా ద్విషయాన్ విషంయథా;
పీయూష వత్తోష దయాక్షమార్జవ
ప్రశాంతి దాంతిర్భజ నిత్యమాదరాత్. ౮౨

తే. గీ. మోక్షకాంక్షయె నీకంత ముఖ్యమేని
విషయముల వీడనాడుము విషము వోలె;
అమృతవతు తృప్తి కరుణా క్షమార్జవ ప్ర
శాంతదాంతుల భజయింపు శ్రద్ధనెపుడు.

నిజంగా నీకు మోక్షంకావలెననే ఆవేదనే ఉంటే, విషయాలన్నిటినీ విషంవలె మిక్కిలి దూరంగా ఉంచు! ఎల్లప్పుడూ అమృతంతో సమానమైన మంచిగుణాలు —తృప్తీ, ఓర్పూ, దయా, ఆర్జవమూ (ఋజుభావం). శాంతీ, ఇంద్రియనిగ్రహమూ—అవలంబించి వాటినే భజించు!

## 83-86. శరీరాభిమానమే అడ్డుగోడ.

శ్లో. అనుక్షణం యత్పరి హృత్య కృత్య
మనాద్యవిద్యాకృత బంధమోక్షణం
దేహః పరార్థోయ మముష్యపోషణే
యః సజ్జతే స స్వమనేన హంతి ౮౩

చ. ఇది పరమాత్మ కన్గొనుట కేర్పడినట్టి శరీర; మిప్పుడీ
బ్రదుకు నవిద్య మూలమగు బంధములూడ్చి తరింపజేయు; కా
పదలకు హేతువౌ విషయ వర్తనకోసము దేహపోషణన్
వదలమి, ఆత్మహత్యయని బాగుగ నీ మదిలో నెఱుంగుమా!

ఈ శరీరం జీవుడనే దేవుడికి దేవాలయంవంటిదై, ఆ జీవుడి సుఖదుఃఖాను భవాల కుపయోగించుచున్నది. కనుక ఇది పరార్థమేకాని, నీవుకావని తేలిపోయింది. అలాంటి జీవుడవైన నీకు, శరీరమే నేననుకునే అజ్ఞానంవల్ల పుట్టిన బానిసత్వాన్ని-అంటే, బంధాలను తెగ్రెంపులు చేసుకోటం ధర్మం. అందుకు వ్యతిరేకంగా నీకు వాహన మాత్రమైన శరీరాన్ని అభిమానిస్తూ ఇంద్రియ భోగాలకోసం పోషించి అలంకరించుకుంటూ ఉండటమనేది ఆత్మ హత్యా సదృశం కాదా?

[అసలీ శరీరం తల్లిదండ్రుల శుక్ల శోణితాల మూలంగా పిండమై పెరిగి, పెద్దది కాసాగితే, ఆఱవనెలలో బ్రహ్మరంధ్రంనుంచి జీవుడు లోపల ప్రవేశిస్తున్నాడు. కనుక; శరీరానికీ జీవుడికీ సంబంధమేర్పడింది. ఇలా ఈ జీవుడికెన్ని శరీరాలు మారినాయో? ఇదంతా తెలుసుకుంటే, శరీరం మీది మమకారం పోతుంది.]

శ్లో. శరీర పోషణార్థీ సన్-య ఆత్మానం దిదృక్షతే
   గ్రాహం దారుధియా ధృత్వా-నదీంతర్తుం స ఇచ్ఛతి. ౮౪

ఆ. వె. దేహపోషణంబు మోహించి చేయుచు
   నాత్మ దర్శనమున కాశపడుట
   మొసలి నొక్క కొయ్యమొద్దుగా భావించి
   యెక్కి నదిని దాట నెంచినట్లు.

దేహాన్ని శ్రద్ధగా పోషించుకోవటంలోనే నిమగ్నుడైనవాడు, ఆత్మదర్శనానికి ప్రయత్నించటం ఎలా ఉంటుందంటే, మొసలి నొక కొయ్య మొద్దుగా భ్రమించి దానినెక్కి నదిని దాటటానికై బయలు దేరటం లాగా ఉంటుంది.

[జీవుడీ దేహమనే పంజరంలో చిక్కి అనిత్యమైన ఆదేహమే తానని భ్రమిస్తూ దానిపోషణలోనే కాలంగడుపుతున్నాడు. ఆత్మ తత్వవిచారం లేనందువల్ల దేహభ్రాంతినే ఎక్కువ చేసుకుంటున్నాడు. అజ్ఞానంలో మునిగి తేలుతూ మోక్షం కోరితే, అయ్యేపనేనా?]

శ్లో. మోహఏవ మహామృత్యుః- ముముక్షోర్వపురాదిషు
   మోహో వినిర్జితో ఏన- సముక్తి పద మర్హతి. ౮౫

ఆ. వె. మోహముండెనేని దేహాదులందున
   చావువంటి దదియె సాధకునకు;
   మోహమనెడి దానిపూర్తిగా నిర్జించి
   నపుడె మోక్షపదవి కర్హుడగుట.

మోహాపేక్షతో ఉండే సాధకుడికి, దేహాదులందూ, పుత్రమిత్ర కళత్రాదులందూ, నేనూ-నాదీ-అనేమోహామున్నట్లైతే, అదే మహా మృత్యువన్నమాట! చచ్చినవాడింక సాధించేదేమీ లేనట్లే, దేహాదుల మీద మోహంపెట్టుకున్నవాడు, మోక్షాన్ని పొందలేడు. ఏమాత్రం మోహమనేది లేకుండా ఎవడు జయిస్తాడో, అతడే మోక్షపదవి నందుకో గలుగుతాడు.

శ్లో. మోహం జహి మహామృత్యుం-దేహదార సుతాదిషు
యం జిత్వామునయో యాంతి-తద్విష్ణోః పరమం పదం. ౮౬

తే. గీ. దేహ దార సుతాదుల మోహమనెడి
ఘోర మృత్యువు నెదిరించి కూల్పవలయు;
మోహము జయించి యేకదా ముక్తిపదము
నందుకొందురు మునులు దివ్యత్వమొంది?

శరీరంమీదా భార్యమీదా బిడ్డలమీదా బంధువులమీదా ఉండే వ్యామోహమే మహామృత్యువు - తత్వవిచారం చేసి, దాన్ని చంపుకో! ఈవ్యామోహాలన్నిటినీ జయించినందు వల్లనేకదా మునులు పరమోత్కృష్టమైన విష్ణుపదాన్ని అందుకున్నారు ? (Allusian - అల్యూషన్ - అంటారు.)

[పుత్ర మిత్ర కళత్రాదులమీది మిక్కుటమైన ప్రేమవల్లనే సంసారకాంక్ష పెరుగుతుంది అదే మృత్యువు. ఆప్రేమనే పరమాత్మ మీాది త్రిప్పితే, తరిస్తున్నారుకదా ?]

## 87-91 స్థూలశరీర మెలాంటిది?

శ్లో. త్వఙ్మాంస రుధిర స్నాయు-మేదోమజ్జాస్థి సంకులం
పూర్ణం మూత్ర పురీషాభ్యాం స్థూలం నింద్యమిదం వపుః. ౮౭

క. తోలును మాంసము నెత్తురు
నాళంబులు; క్రొవ్వు, మజ్జ, నానాస్థుల స
మ్మేళన; మూత్ర పురీషాత్;
స్థూల శరీరంబు చాల తుచ్ఛంబు కదా?

చర్మమూ, మాంసమూ, నెత్తురూ, రక్తనాళాలూ, క్రొవ్వూ, మజ్జా, ఎముకలూ- కలిసిమెలసి ఉంటాయి; మూత్ర పురీషాదులతో అసహ్యంగా ఉండే ఈస్థూల శరీరం చాల తుచ్ఛమయింద కదా ?

[ఇదేనేను - అనుకుంటూ మురిసిపోతావెందుకు ? అహంకరిస్తావెందుకు?]

శ్లో. పంచీ కృతేభ్యో భూతేభ్యః-స్థూలేభ్యః పూర్వకర్మణా
సముత్పన్నమిదం స్థూలం-భోగాయతన మాత్మనః;
అవస్థా జాగర స్తస్య-స్థూలార్థానుభవో యతః. ౮౮

ఉ. చేకొని పూర్వకర్మములచేత శరీరము, సూక్ష్మభూత పం
చీకరణంబు, స్థూలములు చేయగ నేర్పడె; నాత్మ భోగ ప్ర
త్యేక నివాసమియ్యదియె; ఈయది జాగ్రదవస్థలో బహి
ర్లోకపు స్థూలవస్తువుల రూపము లారయుచుండు వేడ్కగన్.

పూర్వజన్మ కర్మలు శాసింపగా, పంచతన్మాత్రల పంచీకరణంతో, స్థూల భూతాలుగా మారి. ఈ స్థూలశరీరాన్ని నిర్మించినాయి. ఇది ఆత్మకు భోగాయతనమయింది. జాగ్రదవస్థలో మాత్రమే ఇది స్థూల వస్తువులను చూస్తుంది.

[పూర్వకర్మలనుబట్టి ప్రారబ్ధానుగుణంగా ఉత్తమ మధ్యమాధమరూపాలుగల శరీరాలేర్పడతాయి: ఈవ్యత్యాసానికి వారివారి పుణ్యపాపమిశ్రమ కర్మలే కారణంకాని, పరమేశ్వరుడికేమీ పక్షపాతం లేదని తెలుస్తుంది.]

శ్లో. బాహ్యేంద్రియైః స్థూలపదార్థ సేవాం
స్రక్చందన స్త్ర్యాది విచిత్ర రూపాం
కరోతి జీవః స్వయమే తదాత్మనా
తస్మాత్ ప్రశ స్తి ర్వపుషోఽస్య జాగరే. ౮౯

ఉ. తానని స్థూల దేహమును తప్పదలంచిన జీవు డట్టె బా
హ్యానగలట్టి యింద్రియము లన్నిటితోడను హార చందన
స్త్రీ నిచయాది స్థూల సువిచిత్ర పదార్థములన్ రమించు; నెం
తైనను దేహమెన్ని వెడయాటల నాడును జాగరంబునన్.

జీవుడీ స్థూలశరీరంతో తాదాత్మ్యాన్ని పొంది, బాహ్యేంద్రియాలతో పూలదండలూ, మణిహారాలూ, మంచిగంధమూ, అత్తరూ పన్నీరూ, స్త్రీలూ మొదలైన స్థూలపదార్థాలను చిత్రవిచిత్ర రూపా

లతో అనుభవిస్తాడు. కాబట్టి, ఈ దేహానికి జాగ్రదవస్థలో సంపూర్ణంగా ఆటలాడుకునే స్థితి లభిస్తుంది.

శ్లో. సర్వోఽపి బాహ్య సంసారః-పురుషస్య యదాశ్రయః
విద్ధి దేహమిదం స్థూలం-గృహవద్ గృహమేధినః. ౯౦

క. నిజగృహము వంటిదనుకో !
యజమానికి స్థూలదేహ మన్నివిధాలన్;
భజనీయ బాహ్యలోక
ప్రజతో సంబంధమునకు పరికర మిదె కా ?

ఈ స్థూలదేహమే ఆత్మకు బాహ్యసంసారం నిర్వహించటాని కాధారం. బాహ్యమూ, అంతరమని సంసారం రెండువిధాలన్నమాట ! బాహ్యంలో జన్మజరావ్యాధి భయాదులన్నీ అనుభవంలో ఉంటాయి; బాల్యయౌవన కౌమార వృద్ధాప్యాలు అబ్బుతాయి, మరణం సంభవిస్తుంది. అంతరంలో కామక్రోధాదులూ, సుఖదుఃఖాలూ, కర్తృత్వ భోక్తృత్వాలూ, ఉంటాయి. కాబట్టి జీవుడికీ స్థూలదేహం యజమానికిల్లువంటిదన్నారు. ఇల్లుతనదేకాని, తానిల్లుకాదుకదా ? మామూలుగా నాశరీర మంటున్నాము. నేనువేఱూ; శరీరంవేఱూ – అని స్ఫురిస్తూనే ఉందికదా?

[బాహ్యసంసారాన్ని విపులీకరిస్తున్నారు.]

శ్లో. స్థూలస్య సంభవ జరామరణాది ధర్మాః
స్థౌల్యాద యో బహువిధా శ్శిశుతాద్యవస్థాః;
వర్ణాశ్రమాది నియమా బహుధామయాస్యుః
పూజావమాన బహుమాన ముఖావిశేషాః. ౯౧

చ. కలిగి, కృశించి, చచ్చుటలు -గట్టిగ స్థూలశరీర ధర్మముల్;
బలుపు-బహుప్రకారముల బాల్యదశాదులు లక్షణంబులున్;
కుల వివిధాశ్రమాచరణకు న్నియమాదు; లనేకరోగముల్;
మలిమలిపూజలింక నవమానములున్ బహుమాన సంతతుల్.

పుట్టుకా, పెరుగుదలా, ముసలితనమూ, చావూ- స్థూల శరీర ధర్మాలు, బలుపూ, సన్నదనమూ, పొట్టీ, పొడుగూ, ఎఱుపూ, నలుపూ, బహుప్రకారాల బాల్యాదిదశలూ, దాని లక్షణాలు కులమూ, నాలుగా శ్రమాలూ, దానికట్టుబాట్లు ఎన్నెన్నిరోగాలకో అది నిలయం. పూజలూ, అవమానాలూ, బహుమానాలూ మొదలైనవి అనుభవాలు ఇవేవీ దానికి తప్పవు.

## 92. దశేంద్రియాలు

శ్లో. బుద్ధీంద్రియాణి శ్రవణం త్వగక్షి
ఘ్రాణంచ జిహ్వా విషయావ బోధనాత్;
వాక్పాణి పాదా గుద మప్యుపస్థః
కర్మేంద్రియాణి ప్రవణేన కర్మసు. ౯౨

తే. గీ. కనులు, చర్మము, చెవులు, నాల్కయును, ముక్కు
నెఱుగు విషయాలు, కనుక, జ్ఞానేంద్రియాలు;
పదములును, చేతులును, వాక్కు గుద, ముపస్థ-
మొనగు కర్మల, కనుక, కర్మేంద్రియాలు.

చెవులూ, చర్మమూ, కనులూ, ముక్కూ, నాలుకా - శబ్ద, స్పర్శ, రూప, గంధ, రసాలనే విషయాలను వరుసగా గ్రహిస్తాయి; కనుక, ఇవి జ్ఞానేంద్రియాలు. వాక్కూ, చేతులూ, కాళ్లూ, మలమూత్రాలు విసర్జించే రెండు అవయవాలూ - భాషణా (మాట్లాడుటా), దానాదానాలూ (ఇచ్చుటా, తీసుకొనుటా), గమనమూ (నడకా), మలవిసర్జనా, మూత్రవిసర్జనా, విషయసుఖానందమూ అనే కర్మలు చేస్తాయి కనుక, ఇవి కర్మేంద్రియాలు.

## 93-94 అంతఃకరణం.

శ్లో. నిగద్యతేంతః కరణం మనోధీ
రహంకృతి శ్చిత్తమితి స్వవృత్తిభిః;

మనస్తు సంకల్ప వికల్ప నాదిభిర్
బుద్ధిః పదార్థా ధ్యవసాయ ధర్మతః. ౯౩

శ్లో. అత్రాభిమానా దహమిత్యహం కృతిః
స్వార్థాను సంధాన గుణేన చిత్తం. ౯౪

క. మనసును, బుద్ధి, యహంకృతి
యును, చిత్తము; నాల్గువృత్తులొక పేరున బి
ల్చిన నంతః కరణంబగు;
మనసనుకొని సంశయించు మాటికి నెపుడున్.

తే. గీ. వస్తుసత్యము నిశ్చయపఱచు బుద్ధి
మఱి యహంకృతి దేహాభిమానముననుం-
"నాది-నే"- నను; చిత్తమో? యేది తనకు
ముఖ్యమో? దాని జ్ఞాపకమునకు తెచ్చు.

అంతఃకరణ మనే అంతరింద్రియ మొకటే! ఐతే, దానినాలుగు వృత్తులకూ నాలుగుపేర్లు :— మనసూ, బుద్ధీ, అహంకారమూ, చిత్తమూ, ఈ నాలుగింటినీ అంతఃకరణ చతుష్టయమని కూడా అంటారు. 1) సంకల్ప వికల్పాలు (అనుకోనటమూ, సందేహించటమూ) చేసేది మనస్సు. 2) వస్తుసత్యాన్ని నిశ్చయించేది బుద్ధి, 3) దేహామే తాననుకొని, నేనూ-నాదీ-అని అభిమానపడేది, అహంకారం. 4) తనకు ముఖ్యంగా ఇష్టమైనదానిని గుర్తుకు తెచ్చేది చిత్తం. మనశరీరంలోని ఇంద్రియాలన్నిటిచేతా పనులు చేయించేది ఈ అంతఃకరణమే ! ఇది వెలుపలికి ప్రసరిస్తేనే కండ్లుచూడ గలుగుతాయి, చెవులు వినగలుగుతాయి, ఇదిలేకపోతే ఏపనీ జరుగదు. చైతన్యం మనోబుద్ధి అహంకారాలమీద కాంతులు విరజిమ్మితే చిత్తం అవుతుంది. ఈమూడింటిచేతా పరిమితంకాకపోతే, అదే శుద్ధచైతన్యం- అదే ఆత్మ.



## 95. పంచ ప్రాణాలు

శ్లో. ప్రాణాపాన వ్యానోదాన-సమానా భవిత్య సౌప్రాణః
స్వయమేవ వృత్తిభేదాత్ వికృతి భేదాత్సువర్ణ సలిలాదివత్. ౯౫

క. ప్రాణాపాన వ్యానో
దాన సమానాలు-వృత్తి తద్వికృతుల భే
దానం బ్రాణమ్మొక్కటి కగు;
మానక బంగారు, నీరు, మారెడు రీతిన్.

ఒకటే ఒక ప్రాణం - వృత్తిభేదాలను బట్టీ, వికృతి భేదాలను బట్టీ, ప్రాణమనీ, అపానమనీ వ్యానమనీ, ఉదానమనీ, సమానమనీ, ఐదురకాలై ఐదుపేర్లతో వ్యవహరింపబడుతుంది.

1) నోటినుండీ ముక్కులనుండీ లోపలికి ప్రవేశించేది ప్రాణం.
2) మలాదులను క్రిందికి నెట్టేది అపానం.
3) అన్నపానాదులను సూక్ష్మరూపంతో నాడుల ద్వారా శరీరానికి వ్యాపింపజేసేది వ్యానం.
4) వాంతులూ మొదలైనవి కలిగించి తిన్నపదార్థాలను కక్కించేది ఉదానం.
5) అన్నపానాలను పచనం కావటానికి జఠరాగ్ని చేర్చేది సమానం.

బంగారు అనేకాభరణాలుగా మారుతుంది; నీళ్ళుకూడా అలలనీ ఆవిరియనీ, నురుగనీ, అనేక ప్రకారాలుగా మారుతుంది. అదేవిధంగానే ఒక్క ప్రాణం ఐదు విధాలౌతుంది.

## 96-101 సూక్ష్మ శరీరం

శ్లో. వాగాది పంచ శ్రవణాది పంచ
ప్రాణాది పంచాభ్రముఖాని పంచ
బుద్ధ్యాద్య విద్యాపి చ కామకర్మణీ
పుర్యష్టకం సూక్ష్మశరీర మాహుః. ౯౬

తే. గీ. ఐదు వాగాదులును, శ్రవణాదులైదు;
నైదు ప్రాణాదు; లభ్రాదులైదు; బుద్ధి
గణము, నజ్ఞానమును, కామకర్మ—లివ్వె!
అష్టపురములు—సూక్ష్మదేహంబటండ్రు.

1) వాగింద్రియాది కర్మేంద్రియాలైదూ 2) శ్రవణాది జ్ఞానేంద్రియాలైదూ 3) ప్రాణాలైదూ 4) ఆకాశాది సూక్ష్మభూతాలైదూ 5) బుద్ధి మొదలైన వాటితో కూడి అంతఃకరణమూ 6) అజ్ఞానమూ 7) కామమూ 8) కర్మా—అనే ఎనిమిది పురాలు కలిసి సూక్ష్మ శరీర మేర్పడింది.

శ్లో. ఇదం శరీరం శ్రుణు! సూక్ష్మసంజ్ఞితం
లింగం త్వపంచీకృత భూత సంభవం
సవాసనం కర్మఫలాను భావకం
స్వాజ్ఞానతోఽనాది రూపాధిరాత్మనః ౯౭

ఉ. వాకొన సూక్ష్మదేహమును వచ్చును లింగశరీరమం; చ పం
చీకృత భూత సంభవము; చెచ్చెర వాసనలన్ ధరించి, క
ర్మైక ఫలానుభూతిని బరాబరి జీవునకబ్బజేయు; నీ
వీక నుపాధిజీవున కవిద్య కతంబున తాననాదిగన్.

శ్రద్ధగావిను! ఈ సూక్ష్మ శరీరానికే లింగశరీరమని కూడా ఇంకో పేరు. పంచీకరణం కాకముందూ, అవి కలుసుకోకముందూ, పంచ భూతాలనుంచీ పుట్టింది. వాసనలతో కూడి జీవుడికి ఉపాధియై పూర్వజన్మ కర్మఫలాలను అనుభవించేట్టు చేయిస్తుంది. ఇది అనాదిగా జీవుడి సొంత అజ్ఞానంవల్ల ఏర్పడింది. అంటే, ఆత్మను ఆచ్ఛాదించి ఉంటుంది.

శ్లో. స్వప్నో భవత్యస్య విభక్త్యవస్థా
స్వమాత్రశేషేణ విభాతియత్ర
స్వప్నేతుబుద్ధిః స్వయమేవ జాగ్రత్
కాలీన నానావిధ వాసనాభిః ౯౮

కర్త్రాది భావం ప్రతిపద్య రాజతే
యత్ర స్వయంజ్యోతి రయం పరాత్మా
ధీమాత్ర కోపాధి రశేషసాక్షీ
నలిప్యతే తత్కృత కర్మ లేశైః
యస్మాదసంగ స్తత ఏవ కర్మ భి
ర్నలిప్యతే కించి దుపాధినా కృతైః ౧౧౧

సీ. అగుపట్టు సూక్ష్మదేహంబు స్వప్నంబులో
ప్రత్యేకమైన రూపము ధరించి;
స్వప్నములో బుద్ధిప్రతినిధిగా నుండు
జాగ్రదవస్థ వాసనల చేత;
బుద్ధి ఉపాధిగా పురుషుండు వెలుగొందు
సాక్షియై దాని సంచారములకు;
బుద్ధి కర్తృత్వంబు పూని కావించెడి
పనులందు తానంటు పడడుగాని,

ఆత్మకాంతి ప్రసారమే అప్పుచేసి
బుద్ధి తన కార్యములు చేయబూనుగాక;
కర్మసాంగత్య మాత్మకు కలుగబోదు
లేశమైనను, లిప్యత లేనిదగుట.

స్వప్నమే సూక్ష్మశరీరానికి ఐభక్త్యవస్థ. అప్పుడది జాగా విడిపోయి స్ఫుటంగా స్పష్టంగా కనపడుతుంది. ఆ స్వప్నంలో బుద్ధి మాత్రం ప్రతినిధిగామారి, అన్ని అనుభవాలూ కలిగిస్తుంది. జాగ్రదవస్థలోని నానావిధ వాసనలన్నీ ఆబుద్ధిమీద ముద్రలుపడి ఉంటాయిగా! బుద్ధే ఉపాధిగా ఆత్మతానన్నిటికీ సాక్షీభూతంగా ఉంటుందేకాని, ఆ బుద్ధి కర్తృత్వమూని చేసే కర్మలతో కొంచెమైనా సంబంధం పెట్టుకోదు. ఆత్మ అసంగత్వానికి మారుపేరుకదా! అందువల్ల ఉపాధులు చేసే పనుల్లో ఆత్మకెంతమాత్రం జోక్యమే ఉండదు. అందుకే ఆత్మ సర్వసాక్షి—ఏదీ దాని కంటదు.

శ్లో. సర్వ వ్యాపృతి కరణం
లింగమిదం స్యాచ్చిదాత్మనః పుంసః
వాస్యాదిక మివతక్ష్ణ
స్తేనై వాత్మా భవత్య సంగోఽయం. ౧౦౦

ఆ. వె. పరికరములు వోలె వడ్రంగి కీలింగ
వపువు నాత్మకొక్క పరికరంబు;
సర్వవ్యాపృతులకు జ్ఞానస్వరూపమౌ
నాత్మ కించుకైన నంటులేదు.

వడ్రంగి తన పరికరాల నుపయోగించుకునే విధంగానే, జ్ఞాన సర్వస్వమైన ఆత్మ, అన్ని పనులకూ ఈ లింగశరీరాన్ని ఒక పరికరంగా ఉపయోగించుకుంటుంది. అంటే, జీవుడీ సూక్ష్మ శరీరంలో ప్రవేశించి రకరకాల స్వప్న వ్యవహారాలను చేస్తున్నాడు. ఐనప్పటికీ వడ్రంగి తన పరికరాలకంటే భిన్నుడైనట్లుగా, ఈ ప్రత్యగాత్మ సూక్ష్మ శరీరంకంటే వేఱుగా ఉంటున్నది. కాబట్టి ఆత్మ అసంగి.. కేవల జ్ఞానస్వరూపమే.!

శ్లో అంధత్వ మందత్వ పటుత్వ ధర్మాః
సౌగుణ్య వైగుణ్య వశాద్ధి చక్షుః
బాధిర్య మూకత్వ ముఖాస్తథైవ
శ్రోత్రాది ధర్మా నతువేదురాత్మనః ౧౦౧

ఆ. వె. గ్రుడ్డి తనము మంద గుణము పటుత్వము
కంటి విగుణ సుగుణ కారణమున,
నట్లె చెవుడు మూగియగుటయు చెవిమొదలైన వానిబట్టి; అంటదాత్మ.

గ్రుడ్డితనమూ, మందగుణమూ, పటుత్వమూ—కంటి లోపాలను బట్టీ గుణాలను బట్టీ, కలుగుతాయి. అదే విధంగా చెవుడూ, మూగితనమూ, చెవీ మొదలైన అవయవాలను బట్టి ఉంటాయి. అంతేకాని సర్వసాక్షియైన ఆత్మకు వీటితో సంబంధమేలేదు. అంటే, స్థూలసూక్ష్మ శరీరాలకు సంబంధించినవేవీ ఆత్మవైన నీకంటవన్నమాట!

## 102 ప్రాణాంపనులు

శ్లో॥ ఉచ్ఛ్వాస నిశ్వాస విజృంభణ క్షుత్
ప్రశ్యంద నాద్యుత్క్రమణాదికాః క్రియాః
ప్రాణాది కర్మాణి వదంతి తజ్ఞాః
ప్రాణాది ధర్మా వశనా పిపాసే. ౧౦౨

తే. గీ. శ్వాస పీల్చుట, విడుచుట, సారెకావు
లింత, తుమ్ముట, తనువు చాలించుటయును;
ప్రాణముల ధర్మములటంచు ప్రాజ్ఞులంద్రు
ప్రాణలక్షణములె క్షుత్పిపాసలైన

ఊపిరి పీల్చటమూ వదలటమూ ఆవులించటమూ తుమ్మటమూ చెమట పట్టటా, లేచుటా, కూర్చుండుట మొదలైన పనులన్నీ ప్రాణాది వాయువుల వ్యాపారమని పెద్దలంటున్నారు. ఆకలి దప్పికలు ప్రాణ ధర్మాలని చెపుతున్నారు.

## 103-105 అహంకారము

శ్లో. అంతఃకరణ మేతేషు-చక్షురాదిషు వర్ష్మణి
అహమిత్యభిమానేన-తిష్ఠత్యాభాస తేజసా. ౧౦౩

తే. గీ. ఆత్మచైతన్య ప్రతిబింబమనెడి ముసుగు
నంతరంగము తాల్చి దేహాభిమాన
మనసు, కనులాది యింద్రియములను-నేన
టంచు తాదాత్మ్యమొంది జీవించుచుండు.

అంతఃకరణం (మనస్సు), కండ్లూ మొదలైన యింద్రియాలన్నీ చేసే పనులను, నేను-నేనని అభిమానపడి దేహానికి అధ్యక్షస్థానం వహిస్తుంది. అహాంతో ఇంద్రియాలతో తాదాత్మ్యం పొంది ఉంటుంది. ఆత్మచైతన్య ప్రతిబింబమైన జీవాత్మ (అహంకారం) అంతఃకరణానికి లొంగిపోయి-నేను-గ్రుడ్డిని-నేను చెవిటిని-అంటూ వ్యవహరించటం అజ్ఞానంవల్లనే!

[ఆత్మ-మనసు ద్వారా వ్యక్తమౌతూ ఇంద్రియాలను ప్రకాశింపజేసి, వాటిచేత కర్మలుచేయిస్తూ జీవుడుగా గుర్తింపబడుతున్నది.]

శ్లో. అహంకారః స విజ్ఞేయః కర్తా భోక్తాభిమాన్యయం
సత్వాది గుణ యోగేన-చావస్థాత్రయ ముచ్యతే. ౧౦౪

తే. గీ. అదె యహంకార మగును; దేహాభిమాన
కారణమునను కర్త భోక్తయును నగుచు;
మూడు సత్వాది గుణములతోడ కూడి
మూడవస్థల వరుసగా పొందుచుండు.

అదే అహంకారం అదే జీవుడు! శరీరంతో తాదాత్మ్యంపొంది తానే కర్తగా, భోక్తగా భావించుకుంటుంది. సత్వరజస్తమో గుణాలతో మిళితమై జాగ్రత్ స్వప్న-సుషుప్తులనే మూడవస్థలను వరుసగా పొందుతూ ఉంది.

[అంతఃకరణ స్వయంగా జడమైనప్పటికీ ఆత్మచైతన్య ప్రతిబింబం చేత జీవుడై, వ్యవహరిస్తున్నది అదే అహంకారమనిపించుకుంటున్నది. ఈ యహంకారమే సత్వగుణ సంపర్కంచేత జాగ్రదవస్థనూ రజోగుణ సంబంధంచేత స్వప్నావస్థనూ తమోగుణ సంబంధంచేత గాఢ నిద్రావస్థనూ పొందుతూ ఉంది. ఇవేవీ ఆత్మకంటవు]

శ్లో. విషయాణా మానుకూల్యే-సుఖీ దుఃఖీ విపర్యయే
సుఖందుఃఖంచ తద్ధర్మః-సదానందస్య నాత్మనః ౧౦౫

క. అనుకూలించిన విషయము?
లనుభవమగు సుఖము; దుఃఖమగు బెడిసినచో;
కనుక సుఖదుఃఖములు జీ
వునకే! ఆత్మకవి లేవుపో! యెప్పటికిన్.

శబ్ద స్పర్శ రూపరసగంధాలనే భోగ్య విషయాలు తన యిష్టానుకూలంగా లభిస్తే అహంకారమనే అంతఃకరణ తాను సుఖపడుతున్నా

ననుకుంటుంది. బెడిసికొడితే దుఃఖపడుతుంది. సుఖదుఃఖాలు రెండూ అహంకార ధర్మాలే! నిత్యానందంగా ఉండే ఆత్మకవి అంటవు.

[ఆత్మ-మనస్సు ద్వారా వ్యక్తమైనప్పుడు అహంకారం ఆత్మ ప్రతి బింబమే].

## 106-107 ఆత్మ-ప్రేమస్వరూపం

శ్లో. ఆత్మార్థత్వేన హి ప్రేయాన్-విషయో న స్వతః ప్రియః
స్వతఏవహి సర్వేషా-మాత్మాప్రియ తమోయతః
తత ఆత్మా సదానందో-నాస్య దుఃఖం కదాచన. ౧౦౬

ఉ. ఈ విషయంబు లాత్మకొఱకింత ప్రియంబులగున్; స్వతంత్రముల్
కావు; సమస్త జీవుల కఖండ ప్రియంబగు నాత్మ యెప్పుడా
యా విషయాల మూలమున నన్నిపనుల్ జరిపించు; దుఃఖముల్
లేవల యాత్మకెప్పటి కలేఖ్య మహత్ప్రమదంబు కావునన్.

విషయాలాత్మమీద ఆధారపడి, ఆత్మ వాటిద్వారా ప్రకాశిస్తుంది కనుక, ప్రియంగా ఉంటాయి. అంతేకాని విషయాలు స్వతః ప్రియాలుకావు. ఆత్మచైతన్యం ప్రకాశించకపోతే విషయాలకు ఏశక్తి లేదు. ఆత్మ నిత్యానంద స్వరూపం కనుక, ఏ విధమైన దుఃఖాలూ అంటవు.

శ్లో. య త్సుషుప్తౌ నిర్విషయ-ఆత్మానందోఽను భూయతే
శ్రుతిః ప్రత్యక్షమైతిహ్య-మనుమానంచ జాగ్రతి. ౧౦౭

ఆ. వె. గాఢ నిద్రలోన కలుగు నాత్మానంద
మపుడు విషయ రహితమై వెలుంగు!
పలుకు శ్రుతియు; కలవు ప్రత్యక్ష దర్శన
సంప్రదాయములును సాక్ష్యములును.

గాఢనిద్రలో విషయాలేవీ లేకపోయి స్వస్వరూపానందం అనుభవానికి వస్తున్నది. అప్పుడు మనస్సుతో సంబంధం ఉండటం లేదు.

దీనికి శ్రుతి ప్రమాణమూ, ప్రత్యక్ష ప్రమాణమూ, గురుపరంపరా ప్రమాణమూ అనుమాన ప్రమాణమూ – నాలుగు ప్రమాణాలూ ఉన్నాయి.

1) వేద ప్రమాణము–ఏషోఽస్య పరమ ఆనందః బృహదారణ్యకం.
2) ప్రత్యక్ష ప్రమాణము–గాఢ నిద్రనుండి లేచినవాడు నాకు హాయిగా నిద్ర పట్టింది– అని తన అనుభవాన్ని చెప్పుకుంటున్నాడు.
3) ఐతిహ్యం–నిద్రలో ఆత్మ ఆనందాన్ని అనుభవించటం అందరికీ తెలిసిందే కదా? అని పెద్దలు పరంపరగా బోధిస్తూనే ఉన్నారు.
4) అనుమాన ప్రమాణము–యుక్తిగా ఆత్మ నిత్యానంద రూపం గాఢనిద్రలో అజ్ఞానావరణలో అనుభవానికి వస్తున్నదని తర్కిస్తాను.

## 108-110 మాయా నిరూపణ

శ్లో. అవ్యక్తనామ్నీ పరమేశ శక్తిః
అనాద్యవిద్యా త్రిగుణాత్మికా పరా
కార్యానుమేయా సుధియైవ మాయా
యయా జగత్సర్వ మిదం ప్రసూయతే. ౧౦౮

తే. గీ. ఏది యవ్యక్తమను పరమేశ శక్తి?
ఆయవిద్య అనాది; గుణాత్మికంబు;
కార్యములచేత గుర్తు కాగలుగుమాయ;
ఆమె కారణముగ గల్గె నఖిల జగము.

పరమేశ్వరుడినుంచీ వేరుకాని పరమేశ్వర శక్తికే అవ్యక్తమనీ, అవిద్యయనీ, మాయఅనీ, పేర్లు. ఆదిలేనిది కనుక, ఇది అనాది. మూడు గుణాలతో కూడినది–కార్యాలన్నిటికీ కారణమై వాటికతీతమయింది. ఆమె కార్యాలవల్లనే ఆమెను అనుమాన ప్రమాణంతో, గుర్తించగలుగుతాము. ఆమెయే యీ విశ్వమంతటినీ కలిగించింది. దీనికే కారణ శరీరమని కూడా పేరు. ఇది అజ్ఞాన ఘనమే!

వ్యక్తిలోని (పిండాండంలోని) వాసనలే అవిద్య. ఈ వ్యష్టి సమష్టిగా బ్రహ్మాండం అని పిలువబడేటప్పుడు, మాయ అనిపించుకుంటుంది. పరమాత్మ ఈశ్వరుడైనప్పుడు ఈ మాయే ఆయన ఉపాధి. వ్యక్తిలోని అవిద్య జీవుడికి ఉపాధి. అంటే అన్ని జీవుల సమూహామే, ఈశ్వరుడన్న మాట!

ప్రతివ్యక్తి తనలోని అవిద్యతో అంతఃకరణ ద్వారా తానొక ప్రత్యేక ప్రపంచాన్ని సృష్టించుకుంటున్నాడు. సమష్టి ప్రపంచాన్ని మనం జగత్తు అంటున్నాము. సమిష్టి మనస్సునే బ్రహ్మ అంటున్నాము.

[ఈ మాయనే సాంఖ్యులు ప్రకృతి అంటారు. ఒకోసారి స్వతంత్రంగానూ, ఇంకోసారి అస్వంత్రతంగానూ ఉంటుందంటారు].

శ్లో. సన్నా ప్యసన్నా ప్యుభయాత్మికా నో
భిన్నాప్యభిన్నా ప్యుభయాత్మికా నో
సాంగా ప్యనంగా ప్యుభయాత్మికా నో
మహాద్భుతా ౽ నిర్వచనీయరూపా. ౧౦౯

ఉ. ఈయమకున్కిలే; దునికిహీనతలే; దుభయంబులేవు; భి
న్నాయతనంబు వేదిక అభిన్నతలే; దుభయంబులేవు; భా
గాయుతకా, దనంగయునుకా, దుభయంబునుకాదు; బాపురే!
మాయమహాద్భుతంబు! మహిమంబులు తెల్పగ మాటలున్నవే?

మాయ సత్తూకాదు; అసత్తూకాదు; రెండూకాదు; భిన్నమూ కాదు, అభిన్నమూకాదు; రెండూ కాదు, అవయవాలుండేదికాదు. లేక సంపూర్ణమూకాదు; రెండూకాదు దీని రూపం మహాద్భుతం! అనిర్వచనీయం!

అన్ని కాలాల్లో ఉండేది సద్వస్తువు బ్రహ్మజ్ఞానంతో నశిస్తుంది కనుక సత్తుకాదు. జ్ఞానోదయం కాకముందు జగద్రూపంగా కనబడుతుంది కాబట్టి అసత్తూకాదు. సదసత్తులు రెండూ విరుద్ధ ధర్మాలు–ఒకచోట ఉండలేవు–కనుక ఉభయాత్మక కాదు.

బ్రహ్మాంకంటే భిన్నంకాదు. ఉండేది బ్రహ్మ మొక్కటేననా్న రుగా? కనుక రెండుగా ఉండటానికాస్పదంలేదు. అద్వైతానికి అంతరాయం కలుగుతుంది. అభిన్నమందామా? బ్రహ్మంవలె త్రికాలాబాధ్యంకాదు. బ్రహ్మజ్ఞానంతో ఉండకపోతుందిగా? కనుక, అభిన్నంకాదు. భిన్నాభిన్నాలు రెండూ పరస్పర విరుద్ధాలు. ఒకచోట ఉండటానికి వీలులేదు. ఉభయాత్మిక కాదు. అవయవాలున్నాయంటే పుట్టుక తప్పదు. మాయకు పుట్టుక లేదుగా? ఇది అనాది అవయవాలులేవందామా? అవయవాలులేనప్పుడు మార్పులుండవు-మాయజగద్రూపంగా మారుతున్నది కదా? కనుక అనంగకాదు; సాంగానంగాలు రెండూ పరస్పర విరుద్ధాలు ఒకచోట ఉండటానికి వీలులేదు. కనుక ఉభయాత్మికకాదు. ఇదేదో ఇంద్రజాలం! గారడీ! ఏదోకల? ఏమి చెప్పటానికీ వీలులేనిదీమాయ!

శ్లో. శుద్ధా ద్వయ బ్రహ్మ విబోధనాశ్యా
సర్పభ్రమో రజ్జు వివేకతో యథా
రజస్తమరి సత్వమితి ప్రసిద్ధా
గుణాస్తదీయాః ప్రథితైః స్వకార్యైః ౧౧౦

తే. గీ. అద్వితీయ విశుద్ధ బ్రహ్మము నెఱింగి
నపుడే మాయనశించు; త్రాడనుచు తెలియ
సర్ప విభ్రాంతివలె; కార్యసరణి బట్టి
మాయయు రజస్తమో సత్వమయి యటంద్రు.

తెలివితో త్రాడును త్రాడుగానే గుర్తిస్తే, పామనే భ్రాంతి నశిస్తుంది. అదే ప్రకారంగా శుద్ధమైన అద్వయమైన బ్రహ్మాన్ని బాగా తెలుసుకుంటే మాయ నశిస్తుంది. మాయాగుణాలైన రజస్తమో సత్వాలు చేసే కార్యాలను బట్టి మాత్రమే వెల్లడౌతాయి. నేను దేహాన్ని నేను మనస్సును; నేను పలానా - అని అజ్ఞానంతో చెప్పుకుంటున్న భ్రాంతులన్నీ వదలి సత్యమైన బ్రహ్మాన్ని అనుభవించగానే

మాయ తొలగిపోతుంది. ఈ మాయ మూడు రంగుల పాము—ఎఱుపూ, నలుపూ, తెలుపూ! ఆవే రజస్సూ, తపస్సూ, సత్వమూ ఈ గుణాలే త్రిమూర్తులైనాయి.

## 111-112 రజోగుణం-విక్షేపశక్తి

శ్లో. విక్షేపశక్తీ రజసః క్రియాత్మికా
యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీః
రాగాదయోఽస్యాం ప్రభవంతి నిత్యం
దుఃఖాదయో యే మనసా వికారాన్. ౧౧౧

తే. గీ. చెలగును రజస్సునకును విక్షేపశక్తి;
అది క్రియాత్మకమగు; మార్పులందజేయు;
నందుచేరాగ దుఃఖాదు లనెడి మాన
సిక వికారము లెన్నెన్నో సిద్ధమగును.

రజోగుణానికి విక్షేపశక్తి సహజం. ఎప్పుడూ క్రియాత్మకమే కాబట్టి ప్రవాహరూపంగా మార్పులు కలిగిస్తుంటుంది. నిత్యమూ రాగాది లక్షణాలు పుట్టుకువస్తాయి. దుఃఖాదులైన మానసిక వికారాలు చుట్టు కుంటాయి.

[విక్షేపమంటే అలజడి మనసులో ఉద్రేకాలు పుట్టించేదదే. రజోగుణం వల్లనే ప్రపంచంలోని అన్ని పనులూ కొనసాగుతున్నాయి]

శ్లో. కామఃక్రోధో లోభ దంభా ద్యసూయా
హంకారేర్ష్యా మత్సరా ద్యాస్తు ఘోరాః
ధర్మా ఏతే రాజసాః పుం ప్రవృత్తిః
అస్మా దేషా తద్రజో బంధహేతుః. ౧౧౨

ఉ. కోరిక, లోభ దంభములు కోపమసూయయు, నెక్కుడౌనహం
కారము నీర్ష్యమత్సరము గాఢరజోగుణ నైజ ధర్మముల్;
పూరుషుడిందుచే విషయపూర్ణ ప్రవృత్తి వహించు; ఘోరసం
సారపు బంధబద్ధుడగు; జన్మలకయ్యది కారణంబగున్.

కామమూ క్రోధమూ లోభమూ దంభమూ అసూయా అహం కారమూ ద్వేషమూ మత్సరమూ మొదలైన దోషాలన్నీ రజోగుణ ధర్మాలు. అవి మానవుని ప్రాపంచిక ప్రవృత్తుల్లోకి దించుతాయి. కాబట్టి రజోగుణమే బంధాలన్నిటికీ కారణం.

## 113-116 తమోగుణం-ఆవరణశక్తి

శ్లో. ఏషావృతిర్నామ తమోగుణస్య
శక్తిర్యయా వస్త్వవభాసతేఽ న్యథా;
సైషా నిదానం పురుషస్య సంసృతే
ర్విక్షేప శక్తేః ప్రవణస్య హేతుః. 3

ఉ. ఆవరణం బనే మహత్తర శక్తి తమోగుణానిదై
కేవల మేర్పడున్ ముసుగు-గీటున బుచ్చి నిజస్వరూప-మిం
కోవిధి జూపు వస్తువుల; నూరక నెన్నియొ జన్మలెత్త నీ
యావరణంబె మూలమగునట్టి పునాది యనంగ నొప్పెడిన్,

విక్షేప శక్తికంటే ఘోరమయింది ఆవరణశక్తి. ఇది తమోగుణానిది. ఈ యావరణ శక్తి వల్లనే విక్షేప శక్తి విజృంబిస్తుందేమో! ఈ యావృత్తి వస్తువు నిజస్వరూపాన్ని మరుగుపఱచి ఇంకో విధంగా చూపించి భ్రాంతి పరుస్తుంది. అభావనా, విపరీత భావనా సంశయభావనా పుట్టిస్తుంది.

1) కనపడే దేహాదులుతప్ప, ఆత్మకానీ, పుణ్యాపాపాలుగానీ, స్వర్గనరకాలు కానీ లేవని పించేది-అభావన. ఇది నాస్తికత్వం:

2) అనృతజడ దుఃఖాత్మకాలైన శరీరాలందు ఆత్మ అనే భావం-విపరీత భావన.

3) నేను కించిజ్జుడనూ, పరిచ్ఛిన్నుడనూ, ఎలా సర్వవ్యాపకుడూ సర్వజ్ఞుడూ ఐన బ్రహ్మనౌతాను? ప్రత్యక్షంగా కనపడే ఈ ప్రపంచం మిథ్య ఎలా అవుతుంది?-అని సంశయించేది సంశయభావన.

ఇలాంటి భావనలున్నందువల్ల విక్షేపశక్తి విజృంభించి మానవుడిలో లెక్కలేనన్ని విక్షేపాలు (అలజడులు) కలిగిస్తుంది. శ్రవణంతో అభావనా, మననంతో, సంశయ భావనా, నిదిధ్యాసనతో విపరీత భావనా పోగొట్టుకోవచ్చు. ఆత్మసాక్షాత్కారమైతే ఈ శక్తులన్నీ నశిస్తాయి.

శ్లో. ప్రజ్ఞావానపి పండితోపి చతురో ప్యంత్యంత సూక్ష్మాత్మదృగ్
వ్యాలీఢస్తమసా నవేత్తి బహుధా సంబోధితోపి స్ఫుటం
భ్రాంత్యారోపితమేవ సాధుకల యత్యాలంబతే తద్గుణాన్
హంతాసౌ ప్రబలా దురంత తమసః శక్తిర్మహత్యావృతిః ౧౧౪

మ. చతురుండైనను పండితుండయిన ప్రజ్ఞావంతుడైనన్ కనం
దతి సూక్ష్మంబగునాత్మ తామస గుణైకా వృత్తిలో మున్గి; స
న్మతి నర్థంబు గ్రహింపడెవ్వడెటు లే మార్గాన బోధించినన్;
సతమా భాసను సత్యమంచను; తమశ్శక్తెంత వింతైనదో?

ఎంతటి ప్రజ్ఞావంతుడైనా, పండితుడైనా, చతురుడైనా, తమోగుణం ఆవరించినందువల్ల సూక్ష్మమైన ఆత్మను చూడటంలో కృతార్థులు కాలేరు. ఎన్ని విధాల విశదీకరించి చెప్పినా, అర్థం చేసుకోలేరు. అధ్యాసలో మునిగి, ఆభాసనే నిజమనుకుంటారు. ఆసక్తితో దాని కార్యాలనూ ఫలితాలనూ పొందుతారు. ఆహా భయంకరమైన తమస్సుకుగల ఆవరణశక్తిమాహాత్మ్యమేమని చెప్పను?

శ్లో. అభావనా వా విపరీత భావనా
సంభావనా విప్రతిపత్తి రస్యాః
సంసర్గయుక్తం న విముంచతి ధ్రువం
విక్షేపశక్తిః క్షపయ త్యజస్రం. ౧౧౫

తే. గీ. తీర్పులేకుంట తప్పుడు తీర్పు సేత
నమ్మకుండుటయును సంశయమ్ము గనుట;
ఆవరణశక్తి కగ్గమౌ నతని వదల;
వపుడు విక్షేపశక్తియు నధికమగును.

అసలు తీర్పే లేకపోవటమూ, లేక, వ్యతిరేకంగా తీర్మానించటమూ, గట్టిగా నమ్మకపోవటమూ, అనుమానించటమూ—ఇవి ఆవరణ శక్తితో ఏలాటి సంబంధమున్నవాడినైనా విడిచిపెట్టవనేది నిశ్చయం. అప్పుడు విక్షేపశక్తి తన ప్రతాపం చూపించి ఎంతైనా బాధిస్తుంది. అతడు వస్తువుల ఉనికిని గుఱించినమ్మి నిజం తెలుసుకోడన్నమాట!

శ్లో. అజ్ఞాన మాలస్య జడత్వనిద్రా
ప్రమాద మూఢత్వ ముఖా స్తమోగుణః
ఏతై ర్ప్రయుక్తో నహివేత్తి కించిత్
నిద్రాళువత్ స్తంభవదేవ తిష్ఠతి. ౧౧౬

తే. గీ. అజ్ఞత జడత్వ మాలస్యమమిత నిద్ర
మున్పు మూఢత్వ మాది తమోగుణాలు
తగిలినపుడే మెఱుంగక స్తబ్ధుడగుచు
వరలు నిద్రితుపోల్కి స్తంభంబు మాడ్కి.

అజ్ఞానమూ, ఆలస్యమూ, జడత్వమూ, నిద్రా ప్రమాదమూ మూఢత్వమూ మొదలైనవన్నీ తమోగుణ లక్షణాలు. ఈ లక్షణాలున్నవాడెవడైనా ఏమీ తెలుసుకోలేడు. బాగా నిద్రపోయినవానివలె, లేదా, స్తంభంవలె మొద్దుపారి ఉంటాడు. వ్యర్థజీవితం ఈడుస్తుంటాడు.

## 117-119 సత్వగుణం

శ్లో. సత్వంవిశుద్ధం జలవత్తదాపి
తాభ్యాం మిళిత్వా శరణాయకల్పతే
యత్రాత్మ బింబః ప్రతిబింబ తస్సన్
ప్రకాశయత్యర్క ఇవాఖిలం జడం. ౧౧౭

ఆ. వె. జలము వోలె శుద్ధ సత్వంబు; జననంబు
మరణమిడు రజస్తమాల గలిసి;

అప్పటముగ నున్న నాత్మ బింబించు; ప్ర
కాశపఱచు నినుని కరణి జడము.

శుద్ధసత్వం నిర్మలమైన నీళ్ళ వంటిది. కాని, రజస్తమోగుణా లతో కలిసినప్పుడు జనన మరణాది సంసారానికి కారణమౌతుంది. అప్ప టంగా ఉండి అందులో ఆత్మ ప్రతిబింబించినప్పుడు, జడ ప్రకృతినంతా సూర్యునివలె ప్రకాశింపజేస్తుంది.

[శుద్ధసత్వం మాత్రమే ఉంటే, బుద్ధీ ఏకాగ్రంగా నిశ్చలంగా నిలుస్తుంది. ఆవరణదోషం ఉండదు కనుక, ధ్యానం చక్కగా కొన సాగుతుంది].

శ్లో. మిశ్రస్య సత్వస్య భవంతి ధర్మా
స్త్వమానితాద్యా నియమా యమాద్యాః;
శ్రద్ధాచ భక్తిశ్చ ముముక్షుతాచ
దైవీచ సంపత్తి రసన్నివృత్తిః ౧౧౮

ఆ. వె. మిశ్ర సత్వమునకు మేలిమి ధర్మాలు
నిరభిమానము యమ నియమములును;
శ్రద్ధ, భక్తి, ముక్తిసాధన, దైవిక
సంపదయు విరక్తి జగతిమీద.

మిశ్రసత్వానికి (అంటే, సత్వం అధికమై కొద్దిగా రజస్తమా లున్నప్పుడు) దాని ధర్మాలు–నిగర్వంగా ఉండటమూ, యమనియ మాలు పాటించటమూ, శ్రద్ధాభక్తులూ, మోక్షాపేక్షా, దైవీసంపత్తీ అసత్పదార్థాలమీద విరక్తీ.

[యమమంటే, అహింసా సత్యమూ మొదలైనవి; నియమ మంటే, తృప్తీ, నిర్మలత్వమూ, మొదలైనవి].

శ్లో. విశుద్ధ సత్వస్య గుణాః ప్రసాదః
స్వాత్మానుభూతిః పరమా ప్రశాంతిః

తృప్తిః ప్రహర్షః పరమాత్మ నిష్ఠా
యయా సదానంద రసం సమృచ్ఛతి. ౧౧౯

ఆ. వె. శుద్ధ సత్వమునకు సుగుణాలు చిఱునవ్వు
స్వాత్మ దర్శనమును పరమ శాంతి
తృప్తి హర్షమాత్మ దృష్టి—ఈయవిసదా
నంద రసములోన నరునితేల్చు.

## 120-121 కారణ శరీరం

శ్లో. అవ్యక్త మేతత్ త్రిగుణై ర్నిరుక్తం
తత్కారణం నామ శరీరమాత్మనః;
సుషుప్తిః రేతస్య విభక్త్యవస్థా
ప్రలీన సర్వేంద్రియ బుద్ధి వృత్తిః. ౧౨౦

తే. గీ. త్రిగుణ మయమైన యవ్యక్తమగును సుమ్ము
కారణ శరీర మాత్మకు; గాఢనిద్ర
యను నవస్థను సర్వేంద్రియములు, బుద్ధి
వృత్తులును కూడ లయమొంది వేఱుపడును.

అవ్యక్తమనియే త్రిగుణాత్మికశక్తి నింతకు ముందు నిర్ణయించి నామా? అదే జీవాత్మకు కారణం శరీరం. సుషుప్తి (గాఢనిద్ర) ఈ కారణ శరీరానికి ప్రత్యేకావస్థ. ఆగాఢనిద్రలోనే కారణశరీరం స్పష్టంగా గుర్తింపబడుతుంది. స్థూల సూక్ష్మశరీరాలు పనిచేయ టాని కిది కారణం కనుక, దీన్ని కారణశరీరమన్నారు. గాఢనిద్రలో సకలేంద్రియాలూ, మనస్సూ—తాముచేసే పనులన్నిటినీ మానుకొని లయమై ఉంటాయి.

[అవ్యక్తమే ప్రకృతి—అదే కారణ శరీరం, త్రిగుణాత్మకమైన యీ మాయవల్ల జీవుడజ్ఞానంలో మునిగి హాయిగా సుషుప్తిదశలో నిద్రిస్తాడు. కాని, సమాధిలోవలె సంపూర్ణ జ్ఞానంలో ఉండడు.]

శ్లో. సర్వప్రకార ప్రమితి ప్రశాంతిః
బీజాత్మనా వస్థితి రేవబుద్ధేః
సుషుప్తి రేతస్య కిల ప్రతీతిః
కించిన్నవేద్మీతి జగత్ప్రసిద్ధేః. ౧౨౧

క. ఏ పరి హాయిగ నుండుట
యే మిగులు; మనస్సు బీజమెట్లటులుండున్;
ప్రామాణ్య మీ సుషుప్తిని-
ఏమెఱుగ-నటంట; జగతి నెల్లర కెఱుకే!

మనస్సు గాఢనిద్రలో సూక్ష్మమైన ఒక విత్తనం మోస్తరు కించించుకుపోయి ఉంటుంది. కనుక, అన్ని పనులూ మఱచి హాయిగా జీవుడు నిద్రిస్తాడు. దీనికి ప్రమాణమేమిటంటే ప్రతి మనిషీ-అప్పుడు నాకేమీ తెలియలేదు-అని చెప్పటం జగత్ప్రసిద్ధమే కదా?

[జ్ఞాపకమూ, అధ్యాసా-వంటివేవీ ఉండవా గాఢనిద్రలో. ఏమీ తెలియలేదని మేల్కొన్న తర్వాత చెప్పేది మనస్సే! కనుక అది బీజప్రాయంగా ఉండనే ఉంటుందన్నమాట!]

## 122-123 అనాత్మ నిరూపణ

శ్లో. దేహేంద్రియ ప్రాణ మనోఽహమాదయః
సర్వే వికారా విషయాః సుఖాదయః
వ్యోమాది భూతాన్యఖిలంచ విశ్వ
మవ్యక్త పర్యంత మిదం హ్యనాత్మా. ౧౨౨

ఆ. వె. వపువు నింద్రియములు ప్రాణాలు మన సహం
బును వికార విషయములు సుఖాలు;
నైదు భూతములును నవ్యక్త పర్యంత
మఖిల విశ్వమిది యనాత్మ సుమ్ము!

దేహమూ, ఇంద్రియాలూ, ప్రాణాలూ, మనస్సూ, అహం కారమూ, అన్ని వికారాలూ, విషయాలూ, సుఖాలూ, ఆకాశాది పంచభూతాలూ, నిజానికి అవ్యక్తందాకా ఉండే ఈ చరాచర ప్రపంచ మంతా అనాత్మయే!

శ్లో. మాయా మాయా కార్యం
సర్వ మహదాది దేహ పర్యంతం
అస దిద మనాత్మ తత్వం
విద్ధిత్వం మరుమరీచికా కల్పం. ౧౨౩

క. మాయయు మాయాకార్యం
బాయెను మహదాది దేహ మందాక ననా
త్మా! యసదీయది సర్వము;
మాయురె! మరుభూమి నెండమావుల కరణిన్.

మాయా, మాయాకార్యమంతా, మహదాది దేహపర్యంతం అనాత్మగానూ అసత్తుగానూ తెలుసుకో! ఎడారిలోని ఎండమావులవలె ఇదంతా మిథ్యసుమా!

[ఎండమావులు దూరంనుంచీ చూస్తే నీళ్ళవలె కనపడతాయి. దగ్గఱకుపోయి చూస్తే ఏమీ ఉండవు; కంటికి కానరావు అంటే ఉన్నట్టూకాదు–లేనట్టూకాదు. అదే ప్రకారంగా యీ జగత్తు కూడా భ్రాంతి కాలంలో ఉన్నట్టూ, భ్రాంతి పోయిన తర్వాత లేనట్టూ కనపడుతుంది. అందుకే బ్రహ్మసత్యం జగన్మిథ్యా–అన్నారు శంకరుల వారు.]

## 114-135 పరమాత్మ స్వరూపం

శ్లో. అథతే సంప్రవక్ష్యామి–స్వరూపం పరమాత్మనః
యద్విజ్ఞాయ నరోబంధాన్–ముక్తః కైవల్యమశ్నుతే. ౧౧౪

క. అప్పరమాత్మ స్వరూపం
   బిప్పుడు నీకేను చెప్ప నెంచితి; వినినన్
   తప్పక బంధ విమోచన
   చొప్పడు; కైవల్యమబ్బు సుమి! మనుజునకున్.

ఇప్పుడు నీకు నేను పరమాత్మ స్వరూపాన్ని చెప్పబోతున్నాను. ఇది తెలుసుకున్న మానవుడు బంధాలనుంచీ విడుదలపొంది, కైవల్య పదవి నందుకుంటాడు.

[అనాత్మ స్వరూపం తెలుసుకున్న తర్వాత ఆత్మ స్వరూపం తెలుసుకోవలసి ఉంది. అప్పుడు దేహ మనోబుద్ధులు-అహంకారాది అనాత్మ బంధాలన్నీ తెగిపోతాయిసుమా!-అంటున్నాడు.]

శ్లో. అస్తి కశ్చిత్ స్వయం నిత్య-మహం ప్రత్యయ లంబనః
   అవస్థాత్రయ సాక్షీసన్-పంచకోశ విలక్షణః ౧౨౫

క. వరలు నొక స్వయం నిత్యము
   పరమాధారం బహైక ప్రత్యయమునకున్;
   నెరసాక్షి మూడవస్థల;
   కరయుగ కోశముల కంటె నవ్వల వెలుగున్.

ఒకానొకటి-ఇటువంటిదీ అటువంటిదీ అని నిరూపించరానిది-ఇతరంమీద ఆధారపడనిది-త్రికాలాబాధ్యమైనది-నేను నేననే అహం ప్రత్యయాని కాధారమైనది-సత్యం కద్దు! అవస్థలు మూడింటికీ అది సాక్షిగా ఉంటుంది. ఐదుకోశాలకంటే ప్రత్యేకమైనది.

[ఐదు కోశాలు:- 1) అన్నమయ కోశమూ (స్థూలశరీరం); 2) ప్రాణమయకోశమూ 3) మనోమయకోశమూ 4) విజ్ఞానమయ కోశమూ [ఈ మూడు కోశాలూ కలిసి సూక్ష్మశరీరం] 5) ఆనంద మయ కోశమూ-ఇదే కారణ శరీరం. ఈ కోశాలన్నిటికీ ఆత్మ అతీతంగా ఉంటుంది.]

శ్లో. యో విజానాతి సకలం జాగ్రత్ స్వప్న సుషుప్తిషు
బుద్ధి త ద్వృత్తి సద్భావ మభావ మహమిత్యయం ౧౨౬

తే. గీ. సతము జాగ్రదవస్థలో స్వప్నమందు
గాఢనిద్రను సకలంబు గమనముంచు;
మానసిక వృత్తులుండుట, మాను టెఱుగు!
అహమున కదేపునాది–అయ్యది అదేను!

ఏది జాగ్రదవస్థలోనూ, స్వప్నావస్థలోనూ, గాఢ నిద్రావస్థలోనూ జరిగే సమస్తాన్నీ గుర్తిస్తుందో? మనసు హోజరు కావటమూ లేకపోవటమూ గమనిస్తుందో? మనోవృత్తులన్నీ చూస్తుంటుందో? అహమనే దానికేది ఆధారమో? అదే అది! పుట్టింది మొదలుకొని గిట్టేదాకా మనిషిలో ఎన్నో మార్పులు! కాని శరీరం ఎంతగామారినా మొదటినుంచీ నేను–నేననేది మాత్రం మారటం లేదు. స్త్రీ–పురుష–నపుంసకాదులందఱూ నేను–నేననే అంటున్నారు. అన్ని జాతులవారూ అన్ని కులాలవారూ–నేను–నేననే అంటారు. ఈ నేనే అహం ప్రత్యయం జాగ్రదవస్థలో–నేనే! స్వప్నావస్థలో–నేనే! సుషుప్తిలోనూ నేనే!– ఈ నేనింత స్థిరంగా ఉండటానికి ఆధారంగా ఒక స్థిరమైన చైతన్యం దాని వెనుక ఉంది. అది నిరాకారం. దాన్నే కూటస్థుడు (మార్పులేనివాడు) అంటారు.

శ్లో. యః పశ్యతి స్వయం సర్వం–యం నపశ్యతి కశ్చన
యశ్చేతయతి బుద్ధ్యాది నతద్యం చేత యత్యయం ౧౨౭

తే. గీ. సొంతముగనేది సకలంబు చూచుచుండు?
నితరములు చూడలేవు తన్నెప్పటికిని;
వెలుగు బుద్ధ్యాదు లెద్దాని వలన? దేని
నన్యములు వెలిగింపవే? వది అదేను!

ఏది స్వాంతంగా అన్నిటినీ చూస్తుందో? దేన్ని ఇతరమేదీ చూడ లేదో? ఏది బుద్ధ్యాదులను వెలిగిస్తుందో? ఇతరమేదీ తన్ను వెలిగించ లేదో? అదే అది!

ఇంద్రియాలూ మనస్సూ మొదలైనవన్నీ జడపదార్థాలు. ఈ ఉపాధులన్నిటినీ తన ప్రకాశంతో ఏది పనులు చేయిస్తున్నదో, దేనిని ఉపాధులేవీ తెలుసుకోలేవో, అదే చైతన్యం-ఆత్మ!

"యః చక్షుషా నపశ్యతి-యేన చక్షూంషిపశ్యతి-తదేవబ్రహ్మ" అంటుంది కేనోపనిషత్తు. 1-6. (ఏది కంటితో, చూడదో దేనిమూలాన కండ్ల నుపయోగించి జీవుడు చూస్తున్నాడో అదే బ్రహ్మ.)

ఏసాధనం లేకయే ఆత్మ అన్నీ తెలుసుకుంటుంది. ఉపాధులకు స్వయం ప్రకాశ శక్తిలేదు, కనుక అవేవీ ఆత్మను ప్రకాశింపజేయులేవు సర్వ సృష్టికీ ఆత్మే ఆధారం.

శ్లో. యేన విశ్వమిదం వ్యాప్తం-యం నవాప్నోతి కించన
ఆభా రూప మిదం సర్వం-యంభాంత మనుభాత్యయం. ౧౨౭

తే. గీ. విశ్వమంతయు నేది వ్యాపించియుండు?
దేని వ్యాపింప దన్యమేదియును? దేని
వెలుగు రూపంబునకు ప్రతిబింబమగుచు
నఖిల విశ్వము వెలుగు? నయ్యది అదేను!

ఏది ఈ విశ్వమంతా వ్యాపించి ఉందో? దేని నింకేదీ వ్యాపించ లేదో? దేని వెలుగు రూపానికి ప్రతిబింబమై ఈ విశ్వం వెలుగొందు తున్నదో?-అదే ఇది!

ఆత్మే సర్వప్రకాశకం. "నతద్భాసయతే సూర్యో, నశశాంకో నపావకః"-అంటుంది గీత (15-6) సూర్యచంద్రాగ్నులేవీ పరమాత్మను

ప్రకాశింపజేయలేవు. ఆ పరమాత్మవల్లనే అవి ప్రకాశవంతాలౌతున్నాయి. కనుక, ఈ ప్రపంచం పరమాత్మకంటే వేఱుకాదని భావం.

శ్లో. యస్య సన్నిధి మాత్రేణ-దేహేంద్రియ మనోధియః
విషయేషు స్వకీయేషు-వర్తంతే ప్రేరితా ఇవ. ౧౨౯

తే. గీ. దేని సన్నిధిమాత్ర నీ దేహమింద్రి
యములు, మనసును, బుద్ధియు, తమదు విషయ
కార్యముల ప్రేరణము జెంద గలిగి నడచు?
సేవకశ్రేణివలె; నదే చూవె. యాత్మ.

యజమాని యెదుట ఉంటే, సేవకులంతా ఎలా ఉత్సాహంగా పనులు చేసుకుపోతారో, ఆప్రకారంగానే, దేని సన్నిధిలో దేహమూ ఇంద్రియాలూ, మనస్సూ, బుద్ధీ, తమ తమ విషయాలనూ కార్యాలనూ ప్రేరేపణ కలిగి నెరవేర్చుకుంటాయో, అదే ఆత్మ.

శ్లో. అహంకారాది దేహాంతా విషయాశ్చ సుఖాదయః
వేద్యంతే ఘటవద్యేన-నిత్యబోధ స్వరూపిణా. ౧౩౦

తే. గీ. ఎది తెలుపు నహంకార మాది దేహ
మంతదాకను విషయ సౌఖ్యాదులెల్ల
పగిలిపోయెడు నొక కుండవంటి వనుచు;
సారమయ్యది శాశ్వత జ్ఞానమునకు.

అహంకారం మొదలుకొని దేహందాకా ఉండే ప్రతిదీ; విషయాలూ సుఖాలూ మొదలైనవన్నీ కూడా; పగిలిపొయ్యే స్వభావం గల ఒక కుండవంటివని దేనివల్ల బోధపడుతుందో?-అదే నిత్యమైన జ్ఞానసారం.

శ్లో. ఏషోంతరాత్మా పురుషః పురాణో
నిరంతరాఖండ సుఖానుభూతిః
సదైక రూపః ప్రతిబోధమాత్రో
యేనేషితా వాగసవ శ్చరంతి. ౧౩౧

ఉ. అన్నిటికంటె లోపలనె ఆత్మవెలుంగు; పురాణ పూరుషుం
డున్న తెఱంగెఱింగినని యుండు నఖండ సుఖానుభూతి; ఇ
ట్లెన్నటి కొక్క రీతినిది యిన్నిట కాంతులు చిమ్మి యానతి
య న్నిఖిలేంద్రియాసువులునట్లె స్వకార్యము లాచరించెడిన్.

అంతరాంతరాల్లో అంతర్గతంగా ఆత్మ ఉంటుంది. అదే పురాణ పురుషుడు! ప్రత్యగాత్మ! అంతటా నిండి ఉంటుంది. స్థూల శరీరంలో విశ్వుడుగా, సూక్ష్మశరీరంలో తైజసుడుగా, కారణశరీరంలో ప్రాజ్ఞుడుగా వ్యక్తమౌతుంది. అదే శాశ్వత జ్ఞానానందం. దీని ప్రభావం వల్లనే ఇంద్రియాలూ ప్రాణవాయువులూ దేహంలో తమతమ వ్యాపారాలు నియతంగా కొనసాగిస్తున్నాయి.

శ్లో. అత్రైవ సత్వాత్మని ధీ గుహాయా
మవ్యాకృతాకాశ ఉరు ప్రకాశః
ఆకాశ ఉచ్చైః రవి వత్ప్రకాశతే
స్వతేజసా విశ్వమిదం ప్రకాశయన్. ౧౩౭

చ. తనువున యందె; సత్వగుణ తత్పరమైన మనస్సునందె; బు
ద్ధినతి రహస్యమైన గుహదిక్కున; వ్యాకృతికాని యాకసం
బున; వెలుగొందు నాత్మయు నపూర్వ మహత్తర సుప్రకాశమై;
దినకరునట్టులొంటి; తన ధీధితి విశ్వము వెల్గజేయుచున్.

ఇదే శరీరంలోనే సత్వగుణంతో నిండిన మనస్సులో, బుద్ధియందలి రహస్యమైన గుహలో (సూక్ష్మశరీరంతో), అవ్యాకృతమైన ఆకాశంలో (కారణ శరీరంలో), ఆత్మ అద్భుతమైన కాంతితో ఒంటరి సూర్యుడివలె ప్రకాశిస్తున్నది. స్వయం ప్రకాశంద్వారా ఈ సమస్త విశ్వాన్నీ ప్రకాశింపజేస్తున్నది.

[ఈ శ్లోకం ఆత్మనెక్కడ చూడవలెనో సూచిస్తున్నది. అన్నిటికంటే మొదటిది స్థూలశరీరం; దీనిలో మనస్సు అంతఃకరణ రూపమై

ఉంటుంది. అందులో నిశ్చయాత్మకమైన బుద్ధి-అభివృద్ధి చెందిన రూపం. ఆ బుద్ధిలో బాగా వ్యాపించి, కారణ శరీరం అవ్యాకృతంగా ఉంటుంది. అందులో మనం ఆత్మను పరిశీలించుకోవలె. ఆత్మ యీ మూడు శరీరాలనూ వ్యాపించే ఉంటుదన్నమాట! ఆకాశం అనే మాటకు వేదాంత పరిభాషలో ఆత్మఅనీ, బ్రహ్మమనీ, అర్థం].

శ్లో. జ్ఞాతా మనోఽహంకృతి విక్రియాణాం
దేహేంద్రియ ప్రాణ కృత క్రియాణాం
అయోగ్ని వత్తా ననువర్తమానో
న చేష్టతే నో వికరోతి కించన. ౧౩౩

చ. మనసున యందహంకృతిని మార్పుకు; దేహము నింద్రియంబులున్
పనివడి ప్రాణముల్ సలుపు వర్తన కెల్లను జ్ఞాత; అగ్నియె
ట్లినుమున? నట్టె యాకృతుల నెల్ల ధరించును; కాని, కొంచెమై
నను పనిచేయు, దెట్టి పరిణామము పొందదు నిశ్చయంబుగన్.

మనసూ అహంకారమూ పొందే మార్పులకూ, దేహమూ ఇంద్రియాలూ, ప్రాణాలూ చేసే పనులకూ జ్ఞాతగా ఉంటుంది. ఆత్మ-ఇనుప సామానులో అగ్నివలె ఆయా రూపాలతో ఏకీభవిస్తుంది. కాని ఆత్మ ఏపనీ చేయదు. ఏ మార్పులనూ కొంచెమైనా అంటదు. అగ్నికి సొంతరూపం లేదు. కాని ఇనుపసామాను కాలినప్పుడు ఆయా రూపాలతో కనబడుతుంది. ఇనుమప్పుడెఱ్ఱబడి పోతుందికదా? అదే విధంగానే ఆత్మకూడా స్వయం రూపంలేనిదైనా, బుద్ధి మొదలైనవాటివలె కనబడుతుంది.

శ్లో. నజాయతే నోమ్రియతే నవర్ధతే
నక్షీయతే నో వికరోతి నిత్యః
విలీయ మానేఽపి వపుత్య ముష్మిన్
న లీయతే కుంభ ఇవాంబరం స్వయం. ౧౩౪

క. పుట్టదు, గిట్టదు, పెరుగదు;
నట్టె కృశింపదును, మార, దది నిత్యము కా
బట్టి; శరీరము పోయిన
గట్టిగ తానుండు కుంభగత గగనమటుల్.

ఆత్మ పుట్టేదీకాదు; గిట్టేదీకాదు; పెరిగేదీకాదు; తగ్గేదీకాదు: నిత్యం కాబట్టి, మార్పులేవీ ఉండవు. ఈ శరీరం నశించినా అదిలేక పోదు ఎలాగంటే, పగిలిపోయిన కుండలో ఆకాశమలాగే ఉన్నట్లే! అదెప్పుడూ స్వతంత్రంగానే ఉంటుంది. పుట్టుకా, బ్రదుకూ, అభివృద్ధీ, పరిపక్వతా క్షీణించుటా, చచ్చుటా—అనే ఆఱుదశలూ ప్రతిజీవికీ ఉంటాయి. ఆత్మ వీటి కతీతం నిర్వికారం.

శ్లో. ప్రకృతి వికృతి భిన్నః శుద్ధ బోధ స్వరూపః
సదసదిద మశేషం భాసయన్నిర్విశేషః
విలసతి పరమాత్మా జాగ్రదాది ష్వవస్థా
స్వహమహమితి సాక్షాత్ సాక్షి రూపేణబుద్ధేః ౧౩౫

చ. ప్రకృతి వికార భిన్నమయి; స్వచ్ఛముగా పరిపూర్ణ జ్ఞానమై
ప్రకటిత స్థూల సూక్ష్మపు ప్రపంచము సర్వము వెల్గజేయు; మే
లుకొను దశాదులందున; వెలుంగు నహంకృతికిం బునాది, బు
ద్ధికి, పరమాత్మ, సాక్షివలె; ధీవలనంగద చేతలన్నియున్?

ప్రకృతి–అంటే, జగత్తుకు మూలకారణమైన అవిద్య; వికృతు లంటే, ప్రకృతి కార్యాలైన ఆకాశాదులు. ఈ కార్యకారణాలు రెండింటికీ పరమాత్మ వేఱైనది. నిర్మల జ్ఞానానికి సారమైనది, పరిపూర్ణమైనది. జాగ్రత్ స్వప్న సుషుప్తులనే మూడవస్థల్లోనూ నేను–నేననే అహంకారానికంతా ఆధారమై ఉంది. స్థూల సూక్ష్మ ప్రపంచాన్ని ప్రకాశింపజేస్తుంది. బుద్ధికీ దాని వృత్తులకూ సాక్షిగా ఉంటున్నది. ప్రకృతి భాసమాన ప్రపంచానికే తల్లి; స్థూలమంటే జడం; సూక్ష్మ మంటే భావన.

## 136 నిన్ను నీవు గుర్తించు!

శ్లో. నియమిత మనసా ముం త్వం స్వమాత్మాన మాత్మ
న్యయ మహమితి సాక్షా ద్విద్ధి బుద్ధి ప్రసాదాత్
జని మరణ తరంగాపార సంసార సింధుం
ప్రతర భవ కృతార్థో బ్రహ్మరూపేణ సంస్థః. ౧౩౬

చ. నియమిత మానసుండవయి నిర్మల బుద్ధిని స్వాత్మజూడుమా!
స్వయముగ నీ శరీరమున; బాగుగ నాత్మయె నీవటంచు ని
శ్చయ మొనరించుకో! మరణజన్మ తరంగ భవాబ్ధి దాటుమీ
క్రియమతి; బ్రహ్మమందున స్వకీయ స్థిరత్వ సుఖంబు నందుమా,

శిష్యా! నీవీ శరీరంలో ఉండగానే నీ మనస్సును క్రమశిక్షణలో ఉంచుకొని, నిర్మలమైన బుద్ధితో స్వస్వరూపమైన ఆత్మను దర్శించు! ఆత్మే నీవుగా భావించు! జనన మరణాలనే అలలతో అంతులేని యీ సంసార సాగరాన్ని దాటు! నిజస్వరూపమైన బ్రహ్మంలో స్థిరపడిపోయి నిరంతరానందాన్ని అనుభవించు! ధన్యుడవుకా!

## 137-142 బంధమంటే?

శ్లో. అత్రానాత్మ న్యహమితి మతేర్బంధ ఏవాస్య పుంసః
ప్రాప్తోఽజ్ఞానా జ్జనన మరణ క్లేశ సంపాత హేతుః
యేనైవాయం వపురిద మసత్ సత్యమిత్యాత్మ బుద్ధ్యా
పుష్య త్యుక్షత్య వతివిషయై స్తంతుభిః కోశకృద్వత్. ౧౩౭

సీ. ఆత్మ యంచు ననాత్మ ననుకొనుచుండు న
జ్ఞాన వశంబున మానవుండు;
బంధంబు దాన నేర్పడిపోయి జననంబు
మరణంబునను పరంపరకు జిక్కు;
దానిచేత నశించు తనువే నిజంబుగా
ననుకొని దానితో నైక్యమొందు;
నంతట పోషించి అది భద్రముగ జూచి
కాపాడు నింద్రియ ప్రాపకమున;

దాన పట్టుపురుగు తన దారములతోడ
సిద్ధమైన కాయ జిక్కినట్లు;
మానవుండు లేనిపోని బంధాలను
తనకుతానె తెచ్చుకొనుచునుండు.

తానుకాని దేహాన్నీ, మనసునూ, అహంకారాన్నీ మానవుడు అజ్ఞానంవల్ల తాననుకోటమే బంధం. ఈ భ్రాంతి అనాదిగా ప్రాప్త మయింది. ఇందువల్ల జనన మరణాది సమస్త కష్టాలూ వరుసగా కలుగుతున్నాయి. ఈ సంసారాన్ని మఱిగినవాడు నశించిపొయ్యే దేహాన్ని నిజమనుకుంటున్నాడు. దాన్ని పోషించుకోటమూ, అలంక రించుకోటమూ, వనితాగృహాదులను సంపాదించి, వాధ్యి బాధలు పోగొట్టుకుందామని తాపత్రయపడుతున్నాడు. యింద్రియ సుఖాలవల్ల దేహం బాగుంటుందని భావించి దానివల్ల సంసార దుఃఖాలనే బంధాల్లో తానే మఱింత చిక్కుకుంటున్నాడు. పట్టుపురుగు తానల్లుకున్న దారాల తోనే సిద్ధమైన కాయలో తానే బంధింపబడినట్లు, తానుకొని తెచ్చుకున్న బంధాల్లో తానే బయటపడలేక అల్లాడుతున్నాడు.

శ్లో. అతస్మింస్తద్బుద్ధిః ప్రభవతి విమూఢస్య తమసా
వివేకాభావాద్వై స్ఫురతి భుజగే రజ్జు ధిషణా
తతోఽనర్థవ్రాతో నిపతతి సమాదాతు రధికః
తతోయోఽసద్గ్రాహః సహిభవతి బంధః శృణు సఖే. ౧౩౮

ఉ. మోసమెఱుంగజాలని విమూఢుడు పామును త్రాడుగాగన
ధ్యాస వహించి పట్టుకొని యాపదపాలగు; జ్ఞానహీనుడు
ల్లాసముతో ననాత్మను బలంబుగనాత్మ యటంచు నమ్మి యా
యాస పడున్; శరీర తగులాటమె బంధము తెచ్చుకోలగున్.

అజ్ఞానం ముమ్మరమైనప్పుడు మానవుడు, కానివస్తువు నౌనని భ్రాంతి పడతాడు. పామును చూచి త్రాడవి భ్రమించి పట్టుకుంటాడు.

ఆపదలు తెచ్చుకుంటాడు. కాబట్టి, మిత్రమా! విను! అనాత్మయైన శరీరాన్ని సత్యమైన ఆత్మగా అపార్థం చేసుకున్నందువల్ల బంధాలు కొని తెచ్చుకుంటున్నాడు. దీన్నే అధ్యాస అంటారు.

శ్లో. అఖండ నిత్యాద్వయ బోధ శక్త్యా
స్ఫురంత మాత్మాన మనంత వైభవం
సమావృణో త్యావృతి శక్తి రేషా
తమోమయీ రాహురివార్క బింబం. ౧౩౯

ఆ. వె. నిత్య మద్వయంబు నిర్భేద్యము ననంత
శోభనీయమాత్మ వైభవంబు;
కాననీక ముసుగు గప్పు నావృత్తి శక్తి
రవిని గ్రహణమందు రాహువట్లు.

అఖండమూ నిత్యమూ అద్వితీయమూ అనంత వైభవమూ కేవలం జ్ఞానంచేత స్ఫురించేదీ-ఐన ఆత్మను, తమోమయమైన ఆవరణ శక్తి కానరానీయకుండా ముసుగు కప్పుతుంది-రాహువు రవిబింబాన్ని గ్రహణకాలంలో కప్పినట్లుగా రాహురివార్క-బింబం-భారతీయ పురాణ వాఙ్మయంలో సూర్యగ్రహణంనాడు రాహువు సూర్యుడిని మ్రింగు తాడని-కథ. ఆ రాహువుకు తల మాత్రమే ఉంటుంది. శరీరం లేదు. అందువల్ల మ్రింగగానే సూర్యుడు బయటికి వెళ్ళిపోతాడు. ఐతే, విజ్ఞానశాస్త్ర ప్రకారం సూర్యుడికీ భూమికీ నడుమ చంద్రుడు వస్తాడు. భూమిమీద ఉండే మన కది గ్రహణంగా కనపడుతుంది.

మన శరీరంలో కూడా కోటిసూర్య ప్రకాశవంతమైన ఆత్మను వేదాంతులు సూర్యుడితో పోలుస్తారు. మనస్సును చంద్రుడంటారు మనస్సే అవిద్య-తపస్సుచేత ఆత్మను కప్పి కానరాకుండా చేస్తుంది ఆ మనస్సు లయమైతే-ధ్యానంలో-ఆత్మ ప్రత్యక్షమౌతుంది. అప్పుడు దుఃఖాలన్నీ నశిస్తాయి.

శ్లో. తిరోభూతే స్వాత్మన్యమల తర తేజోవతి పుమా
నవాత్మానం మోహాదహమితి శరీరం కలయతి:
తతః కామక్రోధ ప్రభృతి భిరముం బంధన గుణైః
పరం విక్షేపాఖ్యా రజస ఉరుశక్తి ర్వ్యథయతి. ౧౪౦

చ. అతిశయ శుద్ధతేజమగు నాత్మ తిరోహితమైన యప్పు, డ
జ్ఞతను ననాత్మయౌ తనువె సత్యమటంచును నైక్యమొందు; న
క్క తన రజోగుణంబు కడగండ్లను పెట్టును కట్లతెక్కల
ట్లతికెడి కామకోప ముఖరైక గుణంబుల కట్టి వైచుచున్.

మానవుడికి దివ్యశుద్ధ తేజోమయమైన ఆత్మ మఱుగయ్యేసరికి కానరాని ఆత్మకంటే కనపడే శరీరాన్నే తాననుకొని అజ్ఞానంతో అంటుకోపోతాడు. ఆ శరీరం అనాత్మ-తాను కాననుకోడు. అలాంటి సమయంలో విక్షేపశక్తివంతమైన రజోగుణం; బంధన రూపాలైన కామక్రోధ లోభ మోహ మదమాత్సర్యాలతో వాడిని బాధిస్తుంది.

[శరీరమంటే ఇక్కడ స్థూల-సూక్ష్మ-కారణ శరీరాలు మొత్తం]

శ్లో. మహామోహగ్రాహ గ్రసనగళి తాత్మావ గమనో
ధియో నానావస్థాం స్వయమభినయం స్త ద్గుణతయా
అపారే సంసారే విషయ విషపూరే జలనిధౌ
నిమజ్జ్యోన్మ జ్జ్యాయం భ్రమతి కుమతిః కుత్సితగతిః. ౧౪౧

మ. విపరీతంబగు తెల్వితో నరుడు; తెల్విన్ మ్రింగ నజ్ఞానపున్
నిపుణ గ్రాహము, బుద్ధి వెంటబడి దానిన్ తానుగా నెంచి; యె
ల్లపు డెన్నెన్ని యవస్థలో? విషయ సౌఖ్యాలన్న హాలాహలం
బెపుడుండే భవవార్ధిలో మునుగు; పైకేగున్ పడున్ క్రిందికై

విపరీతమైన తెలివి గలిగిన వ్యక్తి (జీవుడు) తన జ్ఞానాన్ని అజ్ఞానమనే మొసలి కబళింపగా, బుద్ధి వృత్తులు కల్పించే నానావస్థలనే

ఆత్మ లక్షణాలని నమ్మి భ్రమించి విషయసౌఖ్యాలనే విషంతో నిండిన అంతులేని సంసార సముద్రంలో మునుగుతూ తేలుతూ పడుతూ లేస్తూ ఉంటాడు. ఆహా! ఏమాకుత్సితగతి? ఎంత దురదృష్టం?

[జీవుడు బుద్ధిరూపమైన ఉపాధికి లోబడి అజ్ఞానం పులుముకుంటాడు.]

శ్లో. భానుప్రభా సంజనితాభ్ర పంక్తిః
భానుంతిరోధాయ విజృంభతే యథా
ఆత్మోదితాహంకృతి రాత్మతత్త్వం
తథా తిరోధాయ విజృంభతే స్వయం. ౧౪౨

ఆ. వె. భాను కిరణములనె ప్రభవించు మేఘాలు
భానునెట్లు మఱుగు పఱచి నిలుచు?
నట్లె ఆత్మ నుదితమైన యహంకృతి
ఆత్మ మఱుగు పఱచి ఆవరించు.

సూర్య కిరణాల వేడిమి లేకపోతే మేఘాలే ఉండవు. అలా సూర్య ప్రభావంతో పుట్టిన మేఘాలే ఆకాశంలో సూర్య బింబాని కడ్డంగా ఉండి, కానరాకుండా చేస్తాయి. అదే విధంగా ఆత్మవల్లనే కలిగిన (దేహాదులందలి అహం ప్రత్యయరూపమైన) అహంకారంకూడా ఆత్మ సత్యస్వరూపాన్ని మఱుగు పఱచి, గోచరించకుండా చేస్తుంది. తాను మాత్రమే చెలరేగుతుంది.

## 143-144 ఆవరణ విక్షేపాలు

శ్లో. కబళిత దిననాథే దుర్దినే సాంద్రమేఘైః
వ్యథయతి హిమ ఝంఝా వాయురుగ్రో యథైతాన్
అవిరత తమసాఽఽత్మ న్యావృతే మూఢ బుద్ధిం
క్షిపయతి బహుదుఃఖైః తీవ్ర విక్షేపశక్తిః. ౧౪౩

చ. దినకరు గప్పి మబ్బులరుదెంచిన దుర్దినమందు చాలచ
ల్లని పెనుగాలివీచి నరులన్ వణకించుచు బాధపెట్టు; న
ట్లనె తమమాత్మ గ్రమ్మునెడలన్ చెలరేగి రజోగుణంబు మూ
ఢుని బహుజన్మ మృత్యుభయ రోగములం గలిగించు నక్కటా!

మబ్బులుపట్టి దిననాథుడైన సూర్యబింబాన్ని జొత్తుగా కాన రాకుండా చేసిన దినం, నిజంగా దుర్దినమే! ఆనాడు చలిగాలులు ఝుంఝూమారుతాలై వీస్తాయి. నరులు తట్టుకోలేక గడగడలాడి బాధపడుతుంటారు. అదే ప్రకారంగానే గాఢమైన అజ్ఞానం తన ఆవ రణ శక్తి చేత ఆత్మ స్వరూపాన్ని జొత్తుగా గోచరింపకుండా చేసినప్పుడు రజోగుణ కార్యమైన విక్షేపశక్తి చెలరేగి అవివేకియైన మానవుని జన్మ మృత్యు జరాదుఃఖాలపాలు చేస్తున్నది.

శ్లో. ఏతాభ్యామేవ శక్తిభ్యాం బంధః పుంసః సమాగతః
యాభ్యాం విమోహితోదేహం మత్వాత్మానం భ్రమత్యయం. ౧౪౪

క. ఈ రెండు శక్తులేమటి
కారణములు బంధమునకు; కాబట్టికదా?
పూరుషుడు భ్రాంతి నొంది, శ
రీరమె తాననుచు బహు శరీరస్థుడగున్.

మానవుడికి బంధమంతా ఈ రెండు శక్తుల వల్లనే (ఆవరణ విక్షేపశక్తులవల్లనే) ఏర్పడింది. వీటిచేత నరుడు మోహితుడై శరీరమే తానుగా (ఆత్మగా) అపార్థం చేసుకుంటున్నాడు. అందువల్ల అనేక జన్మలెత్తి శరీరాలు మారవలసి వస్తున్నది.

ఎందఱో స్థూల శరీరమే తాననుకుంటారు. ఎక్కువమంది ఇలాంటి వాళ్లే! కొంతమంది ఉద్రేకపూరితులైనవాళ్లు ఆవేశపడి సూక్ష్మ శరీరం మనసే—తాననుకుంటారు. మఱికొందఱు హేతు వాదులో? తమకంటే తెలివిగలవాళ్లు మరెవ్వరూ లేరనుకుంటారు.

మొదలైన విషయాలన్నీ పూలు; వివిధ కర్మల ఫలితమైన దుఃఖాలు పండ్లు; క్షణిక సుఖాలన్నీ దుఃఖ పర్యవసానాలే కనుక, దుఃఖమేఫలంగా చెప్పబడింది. ఈ దుఃఖాల ననుభవించే జీవుడు, పక్షివలె యీ సంసార వృక్షాన్ని ఆశ్రయించుకొని ఉంటాడు.

"ఊర్ధ్వమూలో౽వాక్శాఖ ఏషో౽శ్వత్థః సనాతనః"-అని కఠోపనిషత్తు. ఇందుకు శ్రీశంకర భాష్యమిలా ఉంది'

వేదాంత నిర్ధారిత పరబ్రహ్మమూలసారః, అవిద్యా కామకర్మా వ్యక్త బీజప్రభవః, అపర బ్రహ్మ విజ్ఞాన క్రియా శక్తి ద్వయాత్మక హిరణ్యగర్భాంకురః, సర్వప్రాణి లింగభేదస్కంధః, తృష్ణా జలావ సేకోద్భూత దర్పః, బుద్ధీంద్రియ విషయ ప్రవాళాంకురః. శ్రుతిస్మృతి న్యాయవిద్యోపదేశ పలాశః, యజ్ఞదానతప ఆద్యనేక క్రియాసు పుష్పం సుఖదుఃఖ వేదనానేక రసః, ప్రాణ్యుపజీవ్యానంత ఫలః, తత్తృష్ణాసలిలావసేవ ప్రరూఢ జటీకృత దృఢబద్ధమూలః, సత్యనామాది సప్తలోక బ్రహ్మాదిభూత పక్షికృతనీడః, ప్రాణి సుఖదుఃఖోద్భూత హర్షశోకజాత నృత్యగీత వాదిత్ర క్ష్వేళితాస్ఫోటిత హసితాకృష్టరుదిత హాహాముంచ ముంచేత్యాది అనేక శబ్దకృత తుములీభూత మహారవః, వేదాంత విహిత బ్రహ్మాత్మదర్శనా సంగ శస్త్రకృతోచ్ఛేద ఏషసంసార వృక్షో౽శ్వత్థః, అశ్వత్థవత్, కామకర్మ వాతేరిత నిత్య ప్రచలిత స్వభావః, స్వర్గనరక తిర్యక్ ప్రేతాదిభిః శాఖాభిః అవాక్ శాఖః, సనాతనః, అనాదిత్వాచ్చిరం ప్రవృత్తః.

ఉపనిషత్తులో నిర్ధారణ చేసిన పరబ్రహ్మమే మూలంగానూ, సారంగానూ ఉండేదీ, అవిద్య కామకర్మ అవ్యక్తమనే విత్తనం నుంచీ పుట్టిందీ, విజ్ఞానశక్తి క్రియాశక్తి ద్వయస్వరూపమైన అపరబ్రహ్మ రూపుడైన హిరణ్యగర్భుడే మొలకగా కలదీ, సకల ప్రాణుల లింగశరీరమే ప్రకాండంగా ఉండేదీ, తృష్ణ అనే నీళ్ళచే తడుపబడిన దర్పం కలదీ, జ్ఞానేంద్రియ విషయాలు చిగుళ్ళూ, శ్రుతి స్మృతి న్యాయాల జ్ఞానోప

దేశమే ఆకులూ. యజ్ఞదాన తపస్సులాది క్రియలే మంచిపూలూ, సుఖ దుఃఖాలు తెలుసుకోటమే రసమూ, ప్రాణుల జీవనమే అనంత ఫలమూ వాటి ననుభవించవలెననే ఆశారూపమైన జలంతో తడిసి గట్టిగా నాటు కున్నదీ, శ్రద్ధయై దృఢమైన మూలం కలదీ, (చిన్నచిన్న వ్రేళ్ళు) బ్రహ్మ విష్ణులనే పక్షులచేత కట్టబడిన సత్యాది లోకములనే గూళ్లుకలదీ, ప్రాణుల సుఖదుఃఖాలవల్ల కలిగిన హర్ష శోకాలతో కూడిన నృత్య గాన వాదిత్ర క్రీడా-ఆస్ఫోటనా (చిటికవేయుటం) ఆక్రందనా, రోదనా హాహాకార శబ్దాలూ, వదలు వదలుమనే పలుకులూ, సంకుల మహా రవాలూ కలిగినదీ, బ్రహ్మాత్మదర్శన రూపమైన అసంగమనే శస్త్రంతో నరకటానికి వీలైనదీ, ఐన సంసారవృక్షం; రాగిచెట్టువలె కామ్యకర్మలనే పెనుగాలిచే ఊగే స్వభావంకలదీ, స్వర్గ నరక ప్రేతాదిలోకాలే అడ్డంగా వ్యాపించే కొమ్మలున్నదీ, అనాది కావటంవల్ల సనాతనమని చెప్పబడింది.

ఊర్ధ్వమూలమంటే పైకివ్రేళ్లుకలదనే అర్థంకాదు; గౌరవించ దగినదనే అర్థంలో ఉపయోగించబడింది. మూలం విష్ణుపదం కనుక తద్విష్ణోః పరమంపదం-అన్నారుగా! అశ్వత్థం-అంటే రేపుటేనిది- రేపటి కిలాగే ఉండదన్నమాట! వృక్షమంటే-నటికివేయ వీలైనదని అర్థం.

వ్యాసభగవానుడు ఇదే అశ్వత్థ వృక్షాన్ని గీతలో 15వ అధ్యా యంలో మూడు శ్లోకాలతో వర్ణించినాడని చెప్పటం మంచిదేమో? పాఠకులు బాగా అర్థంచేసుకుందురుగాక! సత్యంనుంచీ విశ్వం వెలువడిం దని బోధించటమే ఇందలి పరమార్థం.

శ్లో. అజ్ఞాన మూలోఽయ మనాత్మ బంధో
నైసర్గికోఽనాది రనంత ఈరితః
జన్మా వ్యయ వ్యాధి జరాది దుఃఖ
ప్రవాహపాతం జనయత్యముష్య. ౧౪౬

ఆ. వె. ఈయనాత్మ బంధమెల్ల నజ్ఞానంబు
నసె; స్వయంకృతం; బనాది యంత
రహితమంద్రు; జని జరావ్యాధి దుఃఖ ప్ర
వాహ మందువలన ప్రభవమొందు.

అనాత్మ బంధానికంతా అజ్ఞానమే మూలం. అది తనంతటతానే తెచ్చుకున్నది. ఇది ఆదీ అంతము లేనిదని అంటారు. ఎప్పుడే కాలంలో ఏర్పడిందో? 'నాంతో నచాదిర్నచ సంప్రతిష్ఠా'- (గీ. 15-3) అనే వాక్యమే ప్రమాణం. ఈ బంధంవల్లనే జన్మమూ, మరణమూ, వ్యాధీ ముసలితనమూ మొదలైన దుఃఖాలు ప్రవాహరూపంగా మనిషిని చుట్టుకుంటున్నాయి.

## 147-153 ఆత్మానాత్మ వివేకం

శ్లో. నాస్త్రై ర్నశస్త్రై రనిలేనవహ్నినా
చేత్తుం నశక్యో నచ కర్మకోటిభిః;
వివేక విజ్ఞాన మహాసినా వినా
ధాతుః ప్రసాదేన సితేన మంజునా 147

తే. గీ. అస్త్ర, శస్త్రాలు, వాయువు, నగ్ని, కర్మ
కోటియుంగూడ బంధంబు గూల్పలేవు;
సదమలంబైన ధాతుప్రసాద మహిమ
పదునుమీఱిన జ్ఞానాసి చిదుమగలదు.

ఈ యనాత్మ బంధాన్ని ఆగ్నేయాదులైన అస్త్రాలచేతకానీ ఖడ్గాది శస్త్రాల చేతకానీ, తెగవేయటం సాధ్యంకాదు. గాలిచేత దూరం చేయటం కుదరదు. అగ్ని చేత కాల్చటం వీలుపడదు. కోట్ల కొలది కర్మలు చేసినా పోగొట్టడం అసంభవం. పరమేశ్వరానుగ్రహం చేత మనోహరమైన వివేక విజ్ఞాన మహాఖడ్గం చేతనే ఖండించటం సాధ్యమౌతుంది.

[ధాతు ప్రసాదమనే మాటకు రెండర్థాలు-(1) భగవత్ప్రసాదం 2) నిర్మలమైన మనస్సూ, ఇంద్రియాలూ].

శ్లో. శ్రుతి ప్రమాణైక మతేః స్వధర్మ
నిష్ఠాత యైవాత్మ విశుద్ధి రస్య
విశుద్ధ బుద్ధేః పరమాత్మ వేదనం
తేనైవ సంసార సమూల నాశః. ౧౪౮

చ. సతతము శ్రద్ధగా నుపనిషత్తుల సారము సంగ్రహించి, స్వా
ర్థత నెడబాసి, నిష్టగ స్వధర్మము నందె చరించెనేని, శు
ద్ధత గను బుద్ధి; యట్లగు నతండె సదా పరమాత్మ తత్త్వవి
జ్ఞతగను; నట్టి జ్ఞానమున సంస్మృతి మూలముతో నశించెడిన్.

ఉపనిషత్తులను బాగా గాలించి సత్యం తెలుసుకున్నవాడూ, స్వార్థం విడిచి స్వధర్మం పాటించేవాడూ, ఐనప్పుడే మనసు పవిత్ర మౌతుంది. అలా మనసు నిర్మలమైతేనే అతడు పరమాత్మను తెలుసుకోగలుగుతాడు. అభివృద్ధిచెందిన తత్త్వజ్ఞానంవల్లనే సంసారబంధం సమూలంగా తెగిపోయి, ఆత్మ సాక్షాత్కారం లభిస్తుంది.

శ్లో. కోశైరన్నమ యాద్యైః పంచభిరాత్మన సంవృతోభాతి;
నిజశక్తి సముత్పన్నైః శైవల పటలై రివాంబు వాపీస్థం. ౧౪౯

ఉ. ఎన్నగనాత్మ శక్తి సృజియించినవే! ఇవుడాత్మకడ్డమై
అన్నమయాది కోశములు వ్యాప్తి వహించిన కారణంబునన్,
చిన్నియ చిక్కకాత్మ పరిశీలన కందకయుండు; తాఁ మగా
పన్నిన ప్రాచి కప్పుకొన బావి జలంబులు కానరానటుల్.

బావిలోని నీళ్ళు స్వయంగా పేరబెట్టుకున్న ప్రాచి (నాచు) కప్పడంవల్ల బాగా కనిపించటం లేదు. అలాగే స్వయంప్రకాశమైన ఆత్మ, తన మాయతో కల్పించుకున్న అన్నమయ-ప్రాణమయ-మనోమయ-విజ్ఞానమయ-ఆనందమయాలనే ఐదుకోశాలూ అడ్డుపడి ఉన్నందున కానరావటం లేదు, స్ఫుటంగా.

శ్లో. తద్వైచ్ఛైవాలాపనయే సమ్యక్ సలిలం ప్రతీయతే శుద్ధం
తృష్ణా సంతాపహరం సద్యః సౌఖ్యప్రదం పరం పుంసః. ౧౫౦

క. ప్రాచిని బాగుగ తొలగం
ద్రోచినచో స్వచ్ఛమైన తోయము లబ్బున్.
లోచన పర్వములై యపు
డేచిన దప్పికను దీర్చి యింపొనరించున్.

అలా కప్పుకొని ఉండే ప్రాచిని ప్రక్కలకు నెట్టి తొలగిస్తే బావిలోని నీళ్లు నిర్మలంగా స్పష్టంగా కనపడతాయి. త్రాగి దప్పి తీర్చుకోనూవచ్చు, స్నానంచేసి హాయిని పొందనూవచ్చు.

శ్లో. పంచానామపి కోశానా మపవాదే విభాత్యయం శుద్ధః
నిత్యానందైక రసః ప్రత్యగ్రూపః పరః స్వయంజ్యోతిః. ౧౫౧

తే. గీ. పంచకోశంబులను వివేచించి విడిచి
నపుడు పరిశుద్ధమగు ప్రత్యగాత్మ, చూపు
కందు; హృదయంబులో సదానంద రసము
నుత్తమోత్తమమగు స్వయంజ్యోతి యగుచు.

అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ ఆనందమయాలనే ఐదు కోశాలనూ-ఇదికాదు, ఇదికాదని శాస్త్రీయమైన యుక్తులచేత నిషేధిస్తూ విడిచినప్పుడు, శుద్ధమై ప్రత్యగాత్మ ప్రత్యక్షమౌతుంది.

శ్లో. ఆత్మానాత్మ వివేకః కర్తవ్యో బంధముక్తయే విదుషా
తేనైవానందీ భవతి స్వం విజ్ఞాయ సచ్చిదానందం. ౧౫౨

క. చేకొని ఆత్మానాత్మ వి
వేకము సల్పవలె బంధ విచ్ఛేదనకై;
చేకురు నాత్మాలోకన
మాకర్షించునది సచ్చిదానందంబై.

సంసారబంధ విమోచనాన్ని కోరేవాడు, శాస్త్రీయంగా పరోక్ష

జ్ఞానాన్ని పొంది, ఆత్మానాత్మ విచారం చేయవలసింది కర్తవ్యం. ఇందువల్ల సచ్చిదానందమయమైన తన స్వరూపాన్ని ప్రత్యక్షం చేసుకొని, ఆనందం నిత్యంగా అనుభవించ గలుగుతాడు.

[సత్-చిత్-ఆనందం-ఉన్నదీ, ప్రకాశించేదీ నిరంతర సంతోషాన్ని కలిగించేదీ, ఆత్మ.]

శ్లో. ముంజాదిషీకామివ దృశ్య వర్గా
ప్రత్యంచమాత్మాన మసంగమ క్రియం
వివిచ్య తత్ర ప్రవిలాప్య సర్వం
తదాత్మనా తిష్ఠతి యః సముక్తః ౧౫౩

చ. అనువుగ ముంజగడ్డి పొరలన్నియు నూడ్చి ఇషీకముం గనుం
గొనెడి విధాన, చూడనొడ గూడిన యింద్రియపాళి, నక్రియం
బనయ మసంగమై తనరు నాత్మను వేలొనరించి, ఆత్మలో
మునిగినవాడె నిక్కముగ ముక్తుడు, సర్వస్వతంత్రు డయ్యెడున్.

పది రకాలైన దర్భలలో ముంజగడ్డి ఒకటి. దీన్ని బోదగడ్డి అనికూడా అంటారు. ఇది పొరలు పొరలుగా ఉంటుంది. ఆ పొరలన్నీ జాగ్రత్తగా తొలగిస్తూపోతే ఆ ముంజదర్భ నడుమ తామరతూడు దారంవలె సూక్ష్మాంశమైన ఇషీకం ఉంటుంది. అది తెగిపోకుండా తీయటానికై ఎక్కువ శ్రద్ధ చూపవలసి ఉంటుంది. అదే ప్రకారం దృశ్యంగా ఉండే అనాత్మలనుండి అసంగమూ అక్రియమూఐన ఆత్మను వేఱుపఱచగలగటంలో కూడా, ఏకాగ్రతా, నేర్పూ అవసరం. అనృత-జడ-దుఃఖాత్మకాలైన పంచకోశాల వెనుక విలక్షణంగా ఉండే సచ్చిదానందమైన ప్రత్యగాత్మను వేఱుపఱచి. చూచి, అందులో మగ్నం కావటం సామాన్యమా? దృశ్య ప్రపంచంలోని నామరూపాలన్నిటినీ స్మృతి లేకుండా ఉండి, ప్రత్యగాత్మ తప్ప ఇంకేదీలేదనే దృఢ నిశ్చయంతో అందు లీనమై పోవాలి. అలాంటి మొనగాడే ముక్తుడు.

అంటే సాంసారిక బంధాలను త్రెంచుకున్నవాడు. ఇంక మళ్ళీ ఈ ప్రపంచంలోకి అతడు కర్తగానూ, భోక్తగానూ రాడన్నమాట!

## 154-164 అన్నమయ కోశం

(పంచకోశాలు నీవుకావు)

శ్లో. దేహో౽యమన్నభవనో౽న్నమయస్తు కోశో
హ్యన్నేన జీవతి వినశ్యతి తద్విహీనః
త్వక్చర్మ మాంస రుధిరాస్థి పురీషరాశిః
నాయం స్వయం భవితు మర్హతి నిత్యశుద్ధః. ౧౫౪

ఉ. అన్న భవంబు దేహమిది, అన్నము తోడనె జీవనంబు, లే
కున్న నశించు; నన్నమయ కోశమటందురు దీని, చర్మ సం
పన్నము, మాంస మస్థులును పారెడి నెత్రు; పురీష రాశి, యిం
దున్నవి; దీని నాత్మయన నొప్పునె? ఇయ్యది నిత్య శుద్ధమే?

ఈ స్థూల శరీరం అన్నంవల్ల పుడుతుంది. అన్నంతో పెరుగుతుంది. అన్నం లేకపోతే నశిస్తుంది. ఇదే అన్నమయకోశం. ఇందులో చర్మమూ, ఎముకలూ, మాంసమూ, నెత్తురూ మలమూ–నిండుకొని ఉన్నాయి. ఇటువంటి అపరిశుద్ధమైనకోశం, నిత్య నిర్మలమైన ఆత్మ ఎన్నటికీ కాజాలదు.

శ్లో. పూర్వం జనేరపి మృతే రపి నాయమస్తి
జాతక్షణః క్షణ గుణో నియత ప్రభావః
నైకో జడశ్చ ఘటవత్ పరి దృశ్యమానః
స్వాత్మాకథం భవతి భావవికారవేత్తా. ౧౫౫

ఉ. పుట్టక ముందు లేదు; చనిపోయిన పిమ్మట లేదు; మధ్యలో
మట్టుకె స్వల్పకాల; మొకమాదిరి నుండదు; మార్పులెన్నో చూ
పట్టు; జడంబు, మృద్ఘటము వంటిదిగా కనుపట్టుచుండు; నిం
కిట్టిది సర్వసాక్షి యగుటెట్టులో? ఆత్మయనంగ నొప్పునే?

పుట్టకముందీ స్థూలశరీరం లేదు; మరణానంతరం లేనట్టే! నడుమ ఉన్నట్టు కనిపిస్తున్నది. ఎప్పుడూ మారుతూ ఉండేదీ దీని స్వభావం. సహజంగానే ఇది జడం. ఘటపటాదులవలె దృశ్యమయింది. (చూపబడేది). యద్దృశ్యం తన్నశ్యం-కనపడేదంతా నశించేదేగా? ఇలాంటి ఈ అన్నమయకోశం (స్థూలశరీరం), అన్ని మార్పులకూ అన్ని యింద్రియాల విషయాలకూ సాక్షీభూతమైన ఆత్మ ఎలాగా గలుగుతుంది?

శ్లో. పాణి పాదాదిమాన్ దేహో-నాత్మా వ్యంగోఽపి జీవనాత్
తత్తచ్ఛక్తే రనాశాచ్చ-ననియమ్యో నియామకః ౧౫౮

తే. గీ. కాళ్లు చేతులు సకలాంగకమగుకాయ
మాత్మయె? ట్లంగలోపమై యది శ్రమించు;
నిరవయవమాత్మ; నియమింపనేర్చు దీని;
నన్య పాలన కొగ్గిన దాత్మకాదు.

అన్నమయకోశమైన దేహం ఆత్మకాదని చెప్పటానికింకో కారణం. చేతులూ కాళ్ళూ మొదలైన అవయవాలన్నీ దీనికున్నాయి ఆత్మ కవయవాలు లేవు. ఒకానొక అవయవం లోపించినా శరీరం తన పనులు తాను చేసుకోగలుగుతుంది. కుంటీ, గ్రుడ్డీ, చెవిటీ, మూగా ఇలాంటి వికలాంగులను చూస్తూనే ఉన్నాముగా? ఆత్మ నియమించేదీ, దేహం నియమింపబడేదీ. ఆత్మ దేహ విలక్షణం కదా? దేహంలోని ప్రాణాలు ఆత్మమీద ఆధారపడి ఉన్నాయి. దేహమింతకూ జడం; ఆత్మ చైతన్య స్వరూపం. కనుక శరీరం ఆత్మకాజాలదు.

శ్లో. దేహ తద్ధర్మ తత్కర్మ-తదవస్థాది సాక్షిణః
స్వతఏవ స్వతస్సిద్ధం-తద్వైలక్షణ్య మాత్మనః. ౧౫౯

ఆ. దేహ ధర్మములకు దేహ కర్మములకు
బాల్యమాదిగా నవస్థలకును
సాక్షిభూతమాత్మ శాశ్వత సత్యంబు
తద్విలక్షణముగ తనరుగాదె?

బలుపూ, చిక్కిపోవటం, పొట్టి, పొడుగూ, నలుపూ, ఎఱుపూ, మొదలైనవన్నీ దేహధర్మాలు—మంచి చెడ్డలైన పనులూ గమనా గమనాలూ, వినటమూ, త్రాగటమూ, కూర్చుండటమూ, పడుకోటం ఇవన్నీ శరీర కర్మలు—బాల్యమూ, యౌవనమూ, వృద్ధాప్యమూ, మొదలైనవన్నీ దాని అవస్థలు—ఇవన్నిటినీ ఆత్మ పరాపేక్ష లేకుండా సాక్షియై చూస్తుంటుంది. ఆత్మ శాశ్వత సత్యం; ఏ మార్పులూ లేనిది; ఆత్మకూ దేహానికీ ఎంతో భేదం కదా! అది ద్రష్టా—ఇది దృశ్యమూ! కాబట్టి, దేహం ఆత్మా కాదు; ఆత్మ దేహమూ కాదు.

శ్లో. శల్యరాశి ర్మాంసలిప్తో—మలపూర్ణోఽతి కశ్మలః
కథం భవే దయంవేత్తా—స్వయమే తద్విలక్షణః? ౧౫౮

క. పలలము పూసిన యెముకల
వలయము; మలమూత్రముల నివాసము మిగులన్
కలుషితమైన శరీరము;
విలక్షణము, వేత్త, ఆత్మ-వేర్వేఱు కదా?

మాంసం పూసిన ఎముకల గూడైన యీ దేహం, మల మూత్రాలతో ఎప్పుడూ అపరిశుద్ధంగానే ఉంటుంది. తనకు తానై విలక్షణంగా, నిర్మలంగా, వెలుగుతూ ఉండి అన్నిటినీ తెలుసుకుంటుండే ఆత్మ, శరీరానికంటే వేఱు కదా! అది శరీరమెలా అవుతుంది?

శ్లో. త్వఙ్మాంస మేదోఽస్థి పురీషరాశా
వహం మతిం మూఢ జనః కరోతి
విలక్షణం వేత్తి విచారశీలో
నిజస్వరూపం పరమార్థ భూతం. ౧౫౯

ఉ. తోలును మాంస మస్థులును తుచ్ఛపు క్రొవ్వు పురీషరాశి కా
పోలును తానటం చరయు మూఢ జనుండు; విచార శీలుడా
తెలిసి మోసపోక నువలింగ దేహముకంటె వేఱుగా
మేలిమి సత్యమై వెలుగు మేటియె తానని గుర్తుపట్టెడిన్.

ఆత్మానాత్మ వివేకంలేని మూఢ మానవుడు, చర్మమూ, మాంసమూ, క్రొవ్వూ, ఎముకలూ, పురీషమూ కలిగిన ఈ శరీరమే తానని మురిసిపోతుంటాడు. అద్దంలో చూచి అలంకరించు కుంటాడు. బాగున్నానా? అని అడుగుతాడు. వివేచనచేసిన ప్రాజ్ఞుడో? తాను దేహంకంటే విలక్షణుడననీ, ఆత్మస్వరూపుడననీ, సచ్చిదానందుడననీ, తెలుసుకుంటాడు.

శ్లో. దేహోఽహ మిత్యేవ జడస్య బుద్ధిః;
దేహేచ జీవే విదుషస్త్వహం ధీః;
వివేక విజ్ఞావతో మహాత్మనో
బ్రహ్మోఽహమిత్యేవ మతిః సదాత్మని. ౧౬౦

ఉ. నేను శరీరమే ననుచు నిక్కను మూఢుడు; జీవునిన్ శరీ
రానిని కల్పి నేనను ప్రాజ్ఞబుధుండు మహాత్ముడో? మహా
జ్ఞానముచే వివేచనము సల్పి; నిరంతర ధ్యాన మగ్నుడై;
తానల బ్రహ్మమే ననుచు తప్పక గుర్తిడి సంతసించెడిన్.

సాధారణంగా మనుష్యుల్లో ఎక్కువమంది మూఢులే! వాళ్లు— నేను శరీరాన్ని—అనే దృష్టితోనే మాట్లాడుతుంటారు—కొద్దిమంది చదువుకున్నవాళ్లుంటారు. అందులో పండితులైనవాళ్లు—నేను జీవుడూ, శరీరమూ—రెండూ కలిసిన వ్యక్తిని—అనుకుంటాడు. జీవుడే దేవుడు— దేహమే దేవాలయం—అనికూడా ప్రచారం చేస్తారు. ఈ రెండు రకాల వాళ్ళకంటే మహాత్ములూ, జ్ఞానులైనవాళ్ళ సంఖ్య వేళ్ళమీద లెక్కింపదగింది. ఎక్కడో ఒకడుంటాడు. అలాంటి యోగులు—ఆత్మ దర్శనం చేసినవాళ్లు కనుక, నేను బ్రహ్మాన్ని—అనుకుంటారు. పైకిచెప్పరు.

నేను వేఱూ దేవుడు వేఱూ—అనేవాళ్లు ద్వైతులు; నేను పరిపూర్ణుడైన – సుందర రూపుడైన – భగవంతుడిలో ఒక భాగాన్ని— అవయవాన్ని—అనేవాళ్లు విశిష్టాద్వైతులు. నేను బ్రహ్మాన్నే—ఇంకేమీ కాదు—అనేవాళ్లు అద్వైతులు. ఈ మూడు మతాల వాళ్ళనూ శ్లోకంలో మూఢు రకాల మనుష్యులుగా చెప్పినట్టయింది.

ఐతే ఈ మూడు మతాలను బోధించే ఆచార్యులు ముగ్గురూ మహాత్ములే! అందఱూ ప్రస్థానత్రయం (ఉపనిషత్తులూ, బ్రహ్మ సూత్రాలూ, భగవద్గీతా) ఆధారంగా తీసుకున్నవాళ్ళే! దేశకాల పరిస్థితులనుబట్టి, శిష్యుల అధికారాన్నిబట్టి, అలా బోధించినారేమో!

శ్లో. అత్రాత్మ బుద్ధిం త్యజ మూఢ బుద్ధే
త్వం జ్మాంస మేదోస్థి పురీషరాశౌ
సర్వాత్మని బ్రహ్మణి నిర్వికల్పే
కురుష్వ శాంతిం పరమాం భజస్వ !.

ఉ. ఈయవె చర్మమాంసములు నెమ్ములు క్రొవ్వు పురీషరాశి; నే
నే యని దేహమాత్మగ గణించుట మానుము! మూఢమానవా!
ఏయతి బ్రహ్మమో? మఱియు నే దఖిలాత్మయొ? దాని ధ్యానముం
జేయుము! నిర్వికల్పముగ; చేకొను శాంతిని శాశ్వతంబుగన్.

ఓయీ తెలివి తక్కువవాడా! ఇలా చర్మాన్నీ మాంసాన్నీ ఎముకలనూ క్రొవ్వునూ, పురీషాన్నీ కలిగిన ఈ శరీరమే నేను-అనే భావన మానుకో! అందఱిలోనూ ఆత్మగా ఉండే పరిపూర్ణ బ్రహ్మన్నే నేను-అనే భావన కలిగి, భజించి, ధ్యానించి, పరమ శాంతిని అనుభవించు!

శ్లో. దేహేంద్రియాదా వసతి భ్రమోదితాం
విద్వానహంతాం నజహాతి యావత్
తావన్నతస్యాస్తి విముక్తి వార్తా
వ్యస్త్వేష వేదాంత నయాంత దర్శీ. ౧౬౨

శా. నే నీ దేహము నింద్రియంబులును కానే కాను పొమ్మన్న యా
జ్ఞానం బబ్బెడి దాక భ్రాంతి తొలగంగాబోదు; వేదాంత గ్రం
థానీకంబు పఠించి పండితుడు తానైనంత మాత్రాన; బం
ధానే కాప్తి నశించి ముక్తుడగునా? అధ్యాస రక్షించునా?

ఈ దేహేంద్రియాలు నేననే నమ్మకం తొలగిపొయ్యేదాకా, నీవెన్ని వేదాంత ప్రతిపాదకాలైన పుస్తకాలు చదివినా వ్యర్థమే ! ముక్తుడవు కాలేవు. దేహేంద్రియాల మీద మమకారం ఉన్నంత వఱకూ బ్రహ్మానుభవం సాధ్యంకాదు.

గ్రంథపఠనంవల్ల, వట్టిమాటల్లో నేర్పు కలుగుతుందేకాని, ఆత్మానుభవం లభించదు. దేహాభిమానికి మోక్షాసక్తి కూడా ఉండదు సుమా ! ఇంక మోక్షం లభించే దేమిటి ?

శ్లో. ఛాయా శరీరే ప్రతిబింబగాత్రే
యత్ స్వప్న దేహే హృది కల్పితాంగే
య యాత్మ బుద్ధి స్తవ నాస్తికా చి
జ్జీవ చ్ఛరీరే చ తథైవ మాస్తు. ౧౬౩

ఉ. నీ వెనువెన్కనే వెలయు నీడ శరీరము జూచి; నీళ్లలో
దేవిదితోదితంబు ప్రతిబింబ శరీరము జూచి; స్వప్నసం
భావిత భావకల్పిత విభాసుర దేహము జూచి; అట్టులే
జీవశరీరమంచు పరిశీలన సల్పుము ! భ్రాంతి చెందకన్.

నీ నీడలోనే నీ శరీరం వంటి శరీర మొకటి వెంబడిస్తుంటే, దాన్ని నీవు పట్టించుకోటంలేదుగా ? నీళ్లలోనూ, అద్దంలోనూ, కనపడే నీ ప్రతిబింబ శరీరాన్ని చూచి, అదే నీవని భ్రమించటంలేదుగా? కలలో నీకు బాగా ప్రత్యక్షమయ్యే కాంతిశరీరాన్ని కల్పిత మనుకుంటున్నావు కాని, నిజమనుకుంటున్నావా? లేదే! అదే ప్రకారంగా ఈ జీవన శరీరాన్ని కూడా అహం బుద్ధి లేకుండా చూడు !

శ్లో. దేహాత్మ ధీరేవ నృణా మసద్ధియాం
జన్మాది దుఃఖ ప్రభవస్య బీజం
యత స్తత స్త్వం జహితాం ప్రయత్నాత్
త్యక్తేతు చిత్తే నపునర్భవాశా. ౧౬౪

తే. గీ. అసదులను గొల్చునరుడు దేహాత్మబుద్ధి
జన్మమాదిగ దుఃఖ బీజమును పెంచు;
దానితెగద్రెంచి సప్రయత్నముగ విడుచు
వానికింక పునర్జన్మ లేనెలేదు.

అసదులంటే సత్తు (ఆత్మ) కాని దేహేంద్రియాదులు. పుట్టి నప్పటి నుంచీ వాటి మీాది అపేక్ష పెరుగుతూ వచ్చింది. ఈ యనాత్మ వస్తువులే సుఖదాయకాలనే భ్రమతో వాటి యందే మనం మనస్సును లగ్నం చేస్తున్నాము. ఒక్కసారిగా ఈ దేహాన్ని నేనుకాను - అను కోటం కష్టమే! కనుక ప్రయత్నపూర్వకంగా గట్టిపట్టుదలతో దాన్ని సాధించి తీరమని ఆచార్యులవారి బోధ. అలా సాధించగలిగితే - నేను ద్రష్టనే కాని దృశ్యాన్ని కాననే భావం స్థిరపడితే, కోరకున్నా మోక్షం లభిస్తుంది.

## 165-166 ప్రాణమయ కోశం

శ్లో. కర్మేంద్రియైః పంచభి రంచితో యం
ప్రాణో భవే త్ప్రాణమయస్తు కోశః;
యేనాత్మవా నన్నమయో న్న పూర్ణః
ప్రవర్తతేఽసౌ సకల క్రియాసు. ౧౬౫

తే. గీ. ఐదు కర్మేంద్రియములతో నమరి ప్రాణ
ములు సదాప్రాణమయ కోశమును రచించు;
నన్నమయ కోశమున నిండి యద్భుతముగ
నన్నిపనులను చేయించు నాత్మవోలె.

మన కందరికీ బాగా పరిచయమున్న ప్రాణం, కర్మేంద్రియా దిటితోనూ చేరి కలిసిమెలసి ప్రాణమయకోశ మవుతుంది. అన్నమయ కోశమైన యీ స్థూలశరీరం ప్రాణమయకోశం చేతనే వ్యాప్తివంతమై అన్ని పనులూ చేయగలుగుతున్నది. ప్రాణమయకోశాన్ని ఆశ్రయించక

పోతే స్థూలశరీరం పనిచేయలేదు. జీవించి ఉండలేదు కూడా. అందు వల్ల ప్రాణమే ఆత్మ అనికూడా కొందఱునమ్మినారు. వాళ్లది హైరణ్య గర్భ మతమని వేదాంత పంచదశి తెలుపుతుంది. చక్షురాదీంద్రియాలు లేకపోయినా ప్రాణ ముంటుంది కనుక. వాళ్లు దాన్నే ఆత్మ అన్నారు. కాని, అదిసరికాదు.

శ్లో. నైవాత్మాపి ప్రాణమయో వాయువికారో
గంతాఽఽగంతా వాయువదంత ర్బహిరేషః;
యస్మాత్ కించిత్ క్వాపి నవేత్తిష్టమనిష్టం
స్వంవాన్యంవా కించన నిత్యం పరతంత్రః. ౧౬౬

ఉ. వాయు వికారమై పరగుప్రాణమయం బనుకోశ మాత్మయె
ట్లాయెను? కాదు; గాలివలె నయ్యదివచ్చుచుపోవుచుండు; తా
నేయెడ సొంతమే నితరమేని యెఱుంగదు దుఃఖ సౌఖ్యముల్;
ఖాయముగాగ నాత్మకును కట్టువడున్; పరతంత్ర మెప్పుడున్.

ప్రాణమయకోశమైనా ఆత్మమాత్రంకాదు. ఎందుకంటే, అది వట్టివాయు వికారం. లోపలికివస్తూ వెలుపలికిపోతూ ఉంటుంది. అదే బయట ఉంటేగాలీ, లోపలఉంటే ప్రాణమూ. దానికి తన సొంత సుఖ దుఃఖాలే తెలియవు. పరుల సుఖదుఃఖాలెలా తెలుస్తాయి? ఎప్పుడూ ఆత్మమీద ఆధారపడి ఉంటుంది. పరతంత్రమే కాని, స్వతంత్రం కాదు. ఆత్మ సర్వజ్ఞం, మార్పులుండవు కదలికలూ లేవు.

ప్రాణం జీవనశక్తి. అది లేకపోతే శరీరం పనిచేయదు. చచ్చి పోతుంది. ప్రాణం జడం కనుక కష్టసుఖాలు తెలుసుకోదు. కనుక, ప్రాణం ఆత్మకాదు. ఆత్మకు అడ్డుపడి ఉండేది.

కర్మేంద్రియాలు — వాక్పాణి పాదపాయూపస్థలు వరుసగా మాట్లాడటం, దానంచెయ్యటం, నడవటం, విసర్జించటం, ఆనందించటం— అనేకకర్మలు చేస్తాయి — ప్రాణం ఉంటేనే ! ఇవన్నీ రజోగుణం వల్ల పుట్టినాయి. ప్రాణాలూ రజోగుణకార్యాలే ! కాబట్టి, వీటిని కలిపి ప్రాణమయకోశమన్నారు. ఆకలి దప్పికలు కూడా యీ కోశగుణాలే !

## 167-183 మనోమయ కోశము

శ్లో. జ్ఞానేంద్రియాణిచ మనశ్చ మనోమయస్స్యాత్
కోశో మమాహమితి వస్తువికల్పహేతుః
సంజ్ఞాది భేదకలనా కలితో బలీయాం
స్తత్పూర్వకోశ మభిపూర్య విజృంభతే యః. ౧౬౭

సీ. జ్ఞానేంద్రియాలైదు మానసంబును జత
గూడి మనోమయ కోశమగును;
జ్ఞానకేంద్రములెల్ల మానసంబున నుండు
నందుచే మనసింద్రియముల నడుపు;
నాది-నే-నన్న భిన్నతకెల్ల మనసొండె
గట్టిగా నేకైక కారణంబు;
నామ రూప గుణాది నానాప్రపంచ బా
హుళ్యంబు సృజియించుచుండుశక్తి
మనసు కున్నది; మనసులేదనినచోట
నింద్రియంబులు పనిచేయ వించుకైన;
ప్రాణమయ కోశమందు వ్యాపకముచెంది
యీ మనోమయకోశమే యెల్ల జరుపు.

జ్ఞానేంద్రియాలైదూ - త్వక్చక్షుః శ్రోత్ర జిహ్వాఘ్రాణాలు - మనస్సుతో కలిసి, మనోమయకోశ మేర్పడింది. ఈమనోమయకోశమే, నేనూ - నాదీ-అనే భేదాన్ని వస్తుసముదాయంలో కలిగిస్తుంది. అన్న మయకోశాన్ని పూర్తిగా వ్యాపించి ఉండే ప్రాణమయ కోశాన్ని ఈ మనోమయ కోశం సంపూర్ణంగా వ్యాపించి ఉంటుంది. ఆ రెండుకోశా లకూ లేని జ్ఞానశక్తి దీనికి కద్దు! నామరూప జాత్యాది భేదాలను కల్పించటానికీ మనస్సే కారణం. "సంకల్ప వికల్పాత్మక వృత్తిమత్ అంతఃకరణం సుఖదుఃఖా ద్యాధారః"-సంకల్ప వికల్పాలు వృత్తిగా కలదై సుఖదుఃఖాల కాధారమయిందీ మనస్సు 'మన్యతే అనే నేతి మనః'- సమస్తమూ తలచేది కనుక మనస్సు, కామమూ,సంకల్పమూ,

సందేహమూ, శ్రద్ధా శ్రద్ధలూ, ధైర్యాధైర్యాలూ, లజ్జాభయాలూ - అన్నీ మనస్సువల్లనే ! స్వప్నంలో తక్కిన యింద్రియాలేవీ లేక పోయినా, మనస్సే అన్ని వ్యాపారాలూ జరిపిస్తుంది. శబ్దార్థాలు (నామరూపాలు) లేని ప్రపంచమే లేదు కదా ? ఆ శబ్దార్థాలు రెండూ మనసు నాశ్రయించే ఉన్నందున ప్రపంచమంతా మనసులో ఉన్నట్లే ! అందుకే జీవుడి బంధమోక్షాలు రెండిటికీ మనసే కారణ మన్నారు. ఈ మనోమయకోశం ద్వారానే అన్నమయ - ప్రాణమయ కోశాలకు ఆత్మ సంబంధమేర్పడుతుంది. ఇది బలిష్ఠమయింది - విజ్ఞాన మయకోశంచేత పూర్తిగా వ్యాపితం. జ్ఞానేంద్రియాలూ, మనస్సూ - సత్వగుణంతో ఏర్పడినాయి. కనుక, ఒకే కోశంగా చెప్పినారు కాబోలు !

శ్లో. పంచేంద్రియైః పంచభిరేవ హోతృభిః
ప్రచీయమానో విషయాజ్య ధారయా
జాజ్వల్యమానో బహువాస నేంధనైః
మనోమయాగ్ని ర్దహతి ప్రపంచం. ౧౭౨

తే. గీ. ఇంద్రియములైదు హోతలై యీమనోమ
యాగ్ని విషయాజ్యధారల నట్టె వేల్వ;
వాసనేంధనములను జాజ్వల్యమాన
మై ప్రపంచమునెల్ల నీ యగ్ని కాల్చు.

మనోమయకోశమే ఒక అగ్నికుండం; చెవీ, త్వక్కూ, కన్నూ, నాలుకా, ముక్కూ - అనే జ్ఞానేంద్రియాలైదూ, ఐదుగురు హోతలు. (అగ్నికుండంలో మంత్రాలతో హోమం చేసేవాళ్ళు); శబ్ద స్పర్శరూప రస గంధాలనే ఐదువిషయాలే నెయ్యి, అనేక జన్మల వాసనలే ఇంధ నాలు (ఎండుకట్టెలు); మనస్సనే అగ్ని మజింతగా భగ్గుభగ్గున మండి ప్రపంచాన్ని కాల్చివేస్తున్నది.

ఇంతకూ ఈ అగ్నిగుండం ఎక్కడుందీ? మన దేహంలోనే ఉంది. కనుక, మనిషిని పరమపురుషార్థానికి అయోగ్యునిగా చేస్తున్నదన్న మాట! అన్ని విషయవాసనలకూ లొంగదీసి ఉడికిస్తున్నదన్న మాట! వాసనలకంటే మనస్సు వేఱా? అన్ని వృత్తుల సముదాయమేకదా!

సులభంగా అర్థం కావటానికై యీ రూపకాలం కారం, నెయ్యి పోసేకొద్దీ, కట్టెలు వేసేకొద్దీ, అగ్ని భగ్గున మండుతూనే ఉంటుంది. కనుక విషయవాసనలను తగ్గించుకొంటే – ఆ మనస్సును భగవంతుని యందు లగ్నం చేసి–తరణోపాయం దొరుకుతుందని సూచన, మున్ముందు రాబోతుంది.



శ్లో॥ నహ్యస్త్య విద్యా మనసోఽతిరిక్తా
మనోహ్య విద్యా భవబంధ హేతుః;
తస్మిన్ వినష్టే సకలం వినష్టం
విజృంభతే స్మిన్ సకలం విజృంభతే. ౧౬౯



తే. గీ. మనసునకు మించిన అవిద్య మఱియులేదు;
మనసె భవబంధకారణమును, నవిద్య;
నష్టమైన మనస్సు వినష్టమెల్ల;
విక్రమించిన నన్నియు విక్రమించు.

మనస్సును మించిన అజ్ఞాన మింకొకటిలేదు. మనసే అవిద్యా భవబంధకారణమూ మనసు నశిస్తే అన్నీ నశిస్తాయి. అది విజృంభిస్తే అన్నీ విజృంభిస్తాయి.

వ్యష్టి మనస్సే అవిద్య, సమష్టి మనస్సే మాయ; ఆమాయ త్రిగుణాత్మకమై మనసులోనే పనిచేస్తుంది. కనుక, మనసు కంటే వేఱైన అవిద్య లేదన్నమాట!

శ్లో॥ స్వప్నేఽర్థ శూన్యే సృజతి స్వశక్త్యా
భోక్త్రాది విశ్వం మనఏవ సర్వం;

తథైవ జాగ్రత్యపి నోవిశేష
స్తత్సర్వ మేతన్మనసో విజృంభణం. ౧౭౦

మ. కలలో బైటిప్రపంచమేమి యను సంకాశింప కున్నప్పుడే
కలిగించున్ మనసొక్కటే కలలలో కంబొండు, భోక్తాదులన్
వెలయించున్; మఱిమేలు కొన్నదశలో విశ్వంబు గల్పించునా
కలలో మాదిరిగానె; కావున మనఃకార్యంబె సర్వంబగున్.

కలలో మనసొక్కటే ఉంటుంది. బయటి ప్రపంచ మింకేమీ ఉండదు. ఐనా, ఆమనస్సొక క్రొత్త ప్రపంచాన్ని సృజించి చూపుతుంది. స్వప్నదశలో మనస్సు సూక్ష్మాతి సూక్ష్మమైన నాడుల్లో ప్రసరిస్తుందని వేదప్రమాణం. మానవశరీరంలోని బహిరింద్రియాలన్నీ నిద్రపోతూ ఉంటాయి. మనసు వెలుపలికి వచ్చేదారే ఉండదు. అలాంటప్పుడు సముద్రాలూ, కొండలూ, నగరాలూ, దేవాలయాలూ, గుఱ్ఱాలూ, ఏనుగులూ, విమానాలూ ఎలా కలలో కనపడతాయి? మనస్సేవాసనా రూపమైన స్వశక్తితోనూ, ఆత్మతనలో ప్రతిఫలించినందున కలిగే సామర్థ్యం వల్లనూ, ఏమీలేనిచోట భోక్త - భోగోపకరణాలన్నిటినీ సృజించి చూపగలుగుతూంది. కాబట్టి, జాగ్రదవస్థలోనూ మనస్సే నీచుట్టూ ప్రపంచాన్ని సృజించి చూపు తున్నదని తెలుసుకో! దృశ్య ప్రపంచమంతా మనోవిజృంభణమే సుమా! అంటే, స్వప్నజగత్తువలెనే యీ జగత్తుకూడా అబద్ధమేనన్నమాట!

శ్లో. సుషుప్తికాలే మనసిప్రలీనే
నైవాస్తి కించిత్ సకలప్రసిద్ధేః
అతోమనః కల్పిత ఏవ పుంసః
సంసార ఏతస్య నవస్తుతోఽస్తి.

ఆ. వె. మనసు లీనమగుట మఱి గాఢనిద్రలో
నేమి లేమి తెల్ల మెల్లరకును;

సంశయం బికేల? సంసారమే మనః
కల్పితంబు; వస్తుగతము కాదు.

గాఢ నిద్రావస్థలో మనసు బీజప్రాయంగా కుంచించుకుపోయి ఉంటుంది కనుక, అప్పుడే ప్రపంచమూ కానరాకున్నదనే సంగతి సర్వులకూ అనుభవమే ! మనస్సుంటేనే ప్రపంచకల్పన మన్నది తేలిపోయింది-కదా! కాబట్టి మనస్సుంటేనే సంసారం, లేకపోతే లేదు. ఐనప్పుడు ప్రపంచం మనో కల్పనమేనని సిద్ధాంతం. మనస్సు కతీతంగా నీవుచూడనే లేవు కదా !

శ్లో. వాయునాఽఽనీయతే మేఘః - పునస్తేనైవ నీయతే
మనసా కల్ప్యతే బందో-మోక్షస్తేనైవ కల్ప్యతే. ౧౭౨

తే. గీ. వాయువశమున మేఘాలు వచ్చుచుండు
దానిచేతనే దూరము తఱుమబడును;
మనసు కల్పించు బంధాలు మనిషికట్లె
బంధ మోక్షాల నదియె కల్పనమొనర్చు.

మేఘాలను గాలి ఒకచోటికి చేరుస్తుంది. ఆ గాలే వాటిని దూరానికి తఱుముతుంది. అట్లనే మనసుకూడా బంధాలు కల్పిస్తుంది. ఆ బంధమోక్షాన్ని కూడా ఆమనసే కలిగిస్తుంది. "మన ఏవమనుష్యాణాం. కారణం బంధమోక్షయోః"- అంటుంది వేదాంత పంచదశి.

కామాసక్తి చూపించినప్పుడు బంధమూ, అంతర్ముఖమై విషయ రహితమైతే మోక్షమూ.

శ్లో. దేహాది సర్వవిషయే పరికల్ప్యరాగం
బధ్నాతి తేన పురుషం పశువద్గుణేన
వైరస్య మత్ర విషవత్సువిధాయ పశ్చా
దేనం విమోచయతి తన్మన ఏవ బంధాత్. ౧౭౩

మ. కలిగించున్ మనసే మనుష్యునకు నీశాయంబుపై నింద్రియం
బులపై రాగము; తద్గుణాళి పశువుంబోలెన్ నిబంధించు; నా
వల తానే విషమట్లు వానిపయినన్ వైరస్యముం గొల్పిని
ష్ఠుల వైరాగ్యముచేత బంధములు త్రెంచున్ స్వేచ్ఛ కల్పించుచున్.

మానవునికి మొదట దేహంమీదా ఇంద్రియాలమీదా వాటికి కావలసిన భోగపదార్థాలమీదా అనురాగం పెంచి, తన గుణాలచేత పశువును బంధించినట్లు బంధిస్తుంది. ఆ తరువాత అదే మనస్సు ఆ వ్యక్తిలో విషయభోగాలంటే విషమునిపించేటట్లు విరక్తిని కలిగించి బంధాలు త్రెంపుతుంది. అప్పుడు మనస్సే మోక్షానికి కూడా కారణ మాతుంది.

[గుణాలంటే మనోలక్షణాలనీ, త్రాళ్ళనీ రెండర్థాలు; పశువులను త్రాళ్ళతో కట్టినట్టుగా మనిషిని బంధిస్తుందని భావం.]

శ్లో. తస్మా న్మనః కారణ మస్య జంతో
ర్బంధస్య మోక్షస్యచ వా విధానే;
బంధస్య హేతుర్మలినం రజోగుణై
ర్మోక్షస్య శుద్ధం విరజస్తమస్కం. ౧౭౪

ఆ. వె. కనుక బంధ-మోక్ష కారణంబు మనస్సె!
మలినమగు రజస్సు వలన బంధ
మును; రజస్తమాలు పూర్తిగా విడిచిన
పూత మనసువలన మోక్షసిద్ధి.

కాబట్టి, మనిషికి (జీవుడికి) బంధం వేయటానికీ, బంధమోక్షం కలిగించటానికీ, కారణం మనస్సొక్కటే! ఆమనస్సు మలినమైన రజో గుణంతో కలిసి ఉంటే అనురాగం పెరిగి బంధమేర్పడుతుంది. అదే మనస్సు రజస్తమాలు విడిచి కేవల సత్వగుణంలో శుద్ధం కాగలిగితే మోక్షమార్గం లభిస్తుంది. అందుకే పతంజలియోగ సూత్రం—"యోగః

చిత్తవృత్తి నిరోధః"- అంటుంది. చిత్తవృత్తులంటే రాజస తామస వృత్తులు- నిరోధిస్తే అదే యోగం!

శ్లో. వివేక వైరాగ్య గుణాతిరేకాత్
శుద్ధత్వ మాసాద్య మనోవిముక్త్యై
భవత్యతో బుద్ధిమతో ముముక్షో
స్తాభ్యాం దృఢాభ్యాం భవితవ్య మగ్రే. ౧౭౫

క. మనసు, వివేకవిరక్తుల
పునీతమయి మోక్షమార్గమున నడిపించున్
మనుజుని; కనుక, ముముక్షువు
పనిగా దృఢపఱచుకొనగవలె నీరెండున్.

వివేకమూ, వైరాగ్యమూ ఎంత ఎక్కువగా ఉంటే, అంత ఎక్కువగా మనస్సును పవిత్రం చేస్తాయి. అప్పుడా శుద్ధమైన మనస్సు మనుష్యుని మోక్షమార్గానికి త్రిప్పుతుంది. అందువల్ల బుద్ధిమంతుడైన ముముక్షువు, ఈ రెండూ బలపఱచుకుంటూ రావాలి. వివేకంవల్ల ఆత్మకూ అనాత్మకూ భేదం అవగతమౌతుంది. వైరాగ్యంవల్ల అనాత్మలమీద అసహ్యం కలుగుతుంది. బ్రదుకుమీద మమకారం తగ్గుతుంది. ధ్యానంలో ప్రగతి సాధిస్తే, అడిగేదేముందీ?

శ్లో. మనోనామ మహావ్యాఘ్రో - విషయారణ్యభూమిషు
చరత్యత్ర నగచ్ఛంతు - సాధవో యే ముముక్షవః. ౧౭౬

క. పెద్దపులి యైన మనసే
ప్రొద్దును విషయసుఖ విపిన భూమి చరించున్;
బుద్ధున మోక్షము కోరెడి
పెద్దలు సాధువులు నటకు వెళ్లకు డెపుడున్.

విషయభోగాలనే మహారణ్య భూమిలో, మనస్సనే (మనుష్యులను తినే) పెద్దపులి తిరుగుతూ ఉంటుంది. శీలవంతులైన సాధువులూ, మోక్షంమీద అపేక్షపడే సజ్జనులూ, ఆ ప్రక్కకు పోవద్దు!

మనసుకు సహజంగానే విషయాల మీదికి పరుగెత్తే గుణంకద్దు! నిగ్రహమనే కవచాన్ని కెక్కడైనా చిల్లిపడిందో? ఆ పులి మనిషి నీడ్చుకుపోతుంది. జాగ్రత్త!

శ్లో. మనః ప్రసూతే విషయానశేషాన్
స్థూలాత్మనా సూక్ష్మతయాచ భోక్తుః
శరీర వర్ణాశ్రమ జాతిభేదాత్
గుణక్రియా హేతు ఫలాని నిత్యం. ౧౭౭

చ. అనుభవశాలి కన్నివిషయాలను, స్థూలము సూక్ష్మమైన దా
నిని, విడనాడ కెవ్వనిని, నించును; భేదమిడున్ శరీర సం
జనిత కులాశ్రమాదులను; జాతి గుణాలను; కర్మ కారణా
లను మనసే సృజించును ఫలంబులతోడ నిరంతరంబుగన్.

అనుభవశాలియైన జీవుడికి జాగ్రదవస్థలో స్థూలరూపంగానూ, కలలో సూక్ష్మరూపంగానూ మనస్సు, సమస్తవిషయాలనూ ఎప్పటి కప్పుడు సృజించి అందిస్తూ ఉంటుంది. అన్ని శరీరాలూ, వర్ణాశ్రమాలూ, స్త్రీ పుం నపుంసక జాతులూ, శబ్ద స్పర్శాది గుణాలూ, ఉపాదాన నిమిత్తాది కారణాలూ, ఫలాలూ, మొదలైన విభాగాలన్నీ మనసే సృజిస్తుంది. సుషుప్తిదశలోనూ, సమాధిలోనూ మనసే ఉండదు. అందువల్ల ఏవీ ఉండవు. జాగ్రత్స్వప్నాల్లో మనసుంటుంది. అన్నీ ఉంటాయి. అంతా మనసుసృష్టే! ఇది నమ్మటం కొంచెం కష్టంగానే ఉండవచ్చు. ఐతే మనసుతోనే మనసును లయింపజేసినప్పుడు, అనుభవం వల్ల నమ్మకం కుదురుతుంది.

శ్లో. అసంగ చిద్రూప మముం విమోహ్య
దేహేంద్రియ ప్రాణగుణై ర్నిబధ్య

అహం మమేతి భ్రమయ త్యజస్రం
మనః స్వకృత్యేషు ఫలోపభుక్తిషు. ౧౭౮

తే. గీ. చిత్స్వరూపు డసంగుడౌ జీవు మురువు
గొల్పి; దేహేంద్రియప్రాణ గుణ నిబద్ధు
సలిపి; నేనను-నాది-భ్రాంతులు ఘటించు
మనసు; తనకార్యఫలముల ననుభవింప.

ఏ సంబంధమూ లేనివాడూ, నిర్మలజ్ఞాన స్వరూపుడూ, ఐన జీవుడిని మనస్సు దేహేంద్రియ ప్రాణాలచేతనూ, ఆయాధర్మాల చేతనూ, మోహపెట్టి, బంధిస్తున్నది. స్వస్వరూపజ్ఞానం లేకుండా చేసి, దేహేంద్రియ ప్రాణాల మీద అహం (నేను) అనే అభిమానాన్ని, మదు-నాది అనే మమకారాన్ని పుట్టించి, పాశాలతో కట్టి వేస్తున్నది. బహువిధాలైన కర్మల్లోకి దింపి, చేసుకున్న వాటి ఫలితాలు అనుభవించేట్టు చూస్తున్నది.

శ్లో. అధ్యాస దోషాత్ పురషస్య సంసృతిః
అధ్యాస బంధస్త్వము నైవ కల్పితః
రజస్తమో దోషవతోఽవివేకినో
జన్మాది దుఃఖస్య నిదానమేతత్. ౧౭౯

మ. అవిరామంబుగ జన్మలెత్తెడి యమేయంబైన సంసారపున్
వ్యవహారంబు ఘటిల్లు చుండు నిటులే అధ్యాస దోషంబుచే;
అవు! నధ్యాసకు కారణంబు మనసే! ఆవృత్తి విక్షేపముల్
కలియంగా నవివేకి యౌనరునకుంగల్గున్ పునర్జన్మముల్.

నిజాన్ని భ్రాంతిగానూ, భ్రాంతిని నిజంగానూ నిర్ణయించేది, అధ్యాస. ఈ యధ్యాసవల్లనే జీవుడు జ్ఞానహీనుడౌతున్నాడు. అధ్యాస వల్ల ఆత్మానాత్మ వివేచన లేక, దేహాదులైన అనాత్మ వస్తువులను ఆత్మగా భావిస్తున్నాడు. అందుచేత సంసారబంధం కలుగుతున్నది.

అనేక జన్మలెత్తవలసి వస్తున్నది. ఈ యధ్యాస కంతా కారణం మనస్సే ! అందువల్ల జనన మరణ జరావ్యాధి దుఃఖాలన్నిటికీ మనస్సే మొదటి కారణం.

అధ్యాసకెక్కువ ప్రాముఖ్యముంది వేదాంతంలో. ఇదంతా ఆవరణ విక్షేపశక్తులతో మనసుచేసే మోసమేనన్నమాట ! నిరంతరం మార్పులుండే దృశ్యప్రపంచం-లోపలా, వెలుపలా-సుఖదుఃఖాలతో నిండి ఉండటమేసంసారం అనిపించుకుంటుంది. ప్రతి మార్పుకూ మనలో ఒక ఉద్రేకం -ఆవేదన-తప్పదు. అదే దుఃఖాన్ని తెస్తుంది. దీని కంతా కారణం అధ్యాస; అధ్యాసకు మనసు కారణం.

శ్లో. అతః ప్రాహు ర్మనోఽవిద్యాం పండితా స్తత్వ దర్శినః;
యేనైవ భ్రామ్యతే విశ్వం వాయునే వాభ్రమండలం. ౧౮౦

ఆ. వె. అందుకే అవిద్య యని మనస్సును తేల్చి
రా రహస్య మెఱిగి నట్టి మునులు;
విశ్వమెల్ల దానవిభ్రమించుచు నుండు
గాలిచేత నభ్రగణము వోలె !

కాబట్టే, ఆ రహస్యం బాగా తెలిసిన మహర్షులు, మనసే అవిద్య అని తేల్చి పలికినారు. ఆ మనసువల్లనే యీవిశ్వమంతా పనిలేనిపనిగా విభ్రమిస్తున్నది. గాలికి మేఘమండలం మోస్తరుగా. పండితులూ తత్వ దర్శనులూ ఐనవాళ్లు మనసును అవిద్య-అన్నారు. మనస్సు అవిద్యా కార్యమే కాబట్టి, అది సకల సంసారానికీ మూలం కాబట్టి, అలా అన్నారు. కాని, అవిద్యకు నిజంగా సంసార బంధ హేతుత్వంలేదు. ప్రాహుః-బాగుగా పలుకుచున్నారు-అనటాన్ని బట్టి అది తగియున్నది. ఏ ప్రయోజనం లేకుండానే ప్రపంచంలో మనసువల్ల ఈ మార్పులన్నీ జరుగుతున్నాయి. ఈ భ్రమవల్లదుఃఖాలు కలుగుతున్నాయి, మనిషికి.

శ్లో. తన్మనః శోధనం కార్యం - ప్రయత్నేన ముముక్షుణా
విశుద్ధే సతి చైతస్మిన్ - ముక్తిః కరఫలాయతే. ౧౮౧

క. కనుక మనశ్శోధనమే
ఘనకర్తవ్యంబు మోక్ష కాంక్షాత్మునకున్;
మనసు పరిశుద్ధమైనం
తన, ముక్తియు కరతలాన తనరినఫలమౌ.

కనుక మోక్షకాముడైన వానికి (మనసే ప్రపంచం కాబట్టి) మనసును శోధించుకోటమే కర్తవ్యం. మనశ్శుద్ధి జరిగితే మోక్షం కరతలామలకమే! అనాయాసంగా లభిస్తుంది. మనమై కైవల్యానికి ప్రాకులాడవలసిన పనేలేదు. గీతకూడా ఇదే చెపుతుంది.

ఉద్ధరే దాత్మ నాఽఽత్మానం-నాత్మాన మవసాదయేత్.
ఆత్మైవ హ్యాత్మనో బంధు - రాత్మైవ రిపురాత్మనః (గీ.6-5)

మలినమైన మనస్సును శుద్ధమనస్సుచేత ఉద్ధరించుకోవలసింది. ఏలననగా శుద్ధమైన మనస్సే తనకు బంధువు (మేలు కలిగిస్తుంది;) మలినమైన మనస్సే తనకు శత్రువు (కీడు కలిగిస్తుంది). మానవుడు తన్ను తాను కించపఱచుకోరాదు.

శ్లో. మోక్షైక సక్త్యా విషయేషురాగం
నిర్మూల్య సన్యస్యచ సర్వకర్మ
సచ్ఛ్రద్ధయాయః శ్రవణాదినిష్ఠో
రజస్స్వభావం సధునోతి బుద్ధేః. ౧౮౨

శా. ఏకాగ్రంబుగ మోక్షమేదలయునంచిచ్ఛించువా; డాత్మనా
నాకాంక్షల్ విషయేంద్రియంబులను సన్యాసించి, కర్మంబులన్
సాకల్యంబుగ వీడియున్, శ్రవణమున్ సాధించి, జీవుండె ఏ
కైక బ్రహ్మమటంచునమ్మిన; రజోవ్యాసంగ మంతంబగున్.

ఒక మోక్షం మీదనే అపేక్షపడేవాడు, విషయాల మీది అనురాగాన్ని మూలమట్టంగా నిర్మూలించి, అన్ని కర్మల ఫలాలనూ సన్న్యసించి, మిక్కిలి శ్రద్ధతో శ్రవణ మనన నిదిధ్యాసనలందు నిష్ఠతో మెలగవలెను. అటువంటి నిష్ఠవల్ల రజోగుణ సంబంధమైన విక్షేపం తొలగిపోతుంది. అంటే, మనశ్చాంచల్యం పూర్తిగా పోగొట్టుకుంటాడు. నేను కర్తను – నేను భోక్తననే అహంకారం కూడా అణగిపోతుంది. పరబ్రహ్మమందే అనురాగం పెరుగుతుంది.

శ్లో. మనోమయోనాపి భవేత్పరాత్మా
హ్యాద్యంతవత్వాత్ పరిణామిభావాత్
దుఃఖాత్మకత్వాత్ విషయత్వ హేతోః
ద్రష్టా హి దృశ్యాత్మతయా నద్రష్టః. ౧౮౩

ఉ. ఆదియు నంతమున్ కలిగి నట్టిది కావున; నెప్పుడొక్క టే
మాదిరికాక మార్పులను మాటికి పొందును గాన; బాధలున్
భేదము లుండుటన్, విషయకీలక మౌటను; వస్తుదృశ్యతన్,
కాదు మనోమయంబదియికన్ పరమాత్మ; జడంబె కావునన్.

మనోమయకోశం కూడా పరమాత్మకాదు. ఎందుకంటే, దీనికి ఆదీ అంతమూ ఉన్నాయి– (జాగ్రత్స్వప్నాల్లో ఉండటమూ, సుషుప్తిలో లేక పోవటం); మార్పులు క్షణక్షణమూ ఉంటున్నాయి–అధ్యాస వల్ల దుఃఖాలూ, బాధలూ కలిగిస్తున్నది– అవిద్యాని లక్షణాలు. అన్ని విషయేంద్రియాలకూ అదే కీలకం. మనసు జడం – దృశ్యం కూడా. ఆత్మకా? ఆద్యంతాలు లేవు; మార్పులుండవు; నిత్యానందం; దేనికీ కారణంకాదు. అన్నిటికీ ఆధారం వస్తువులతో ఐక్యంకాదు–సాక్షిగా ఉంటుంది. ఈ యీకారణాలవల్ల మనోమయకోశం ఆత్మ ఎలా కాగలుగుతుందీ? దృశ్య మెప్పటికైనా ద్రష్టకాగలుగుతుందా?

## 184-188 విజ్ఞానమయ కోశం

శ్లో. బుద్ధి ర్బుద్ధీంద్రియైః సార్ధం - సవృత్తిః కర్తృ లక్షణః;
విజ్ఞానమయకోశః స్యాత్ - పుంసః సంసార కారణం. ౧౮౪

తే. గీ. బుద్ధి, బుద్ధీంద్రియములును, బుద్ధి వృత్తు
లలమి విజ్ఞానమయకోశమగును; ప్రతిని
ధిత్వ లక్షణములు కల్గు దీనివలన
జీవునకు గల్గు సంసార జీవనంబు.

అంతఃకరణలోని నిశ్చయాత్మకమైన బుద్ధీ, జ్ఞానేంద్రియాలూ, కూడి విజ్ఞానమయకోశ మేర్పడుతుంది. మనసుచంచలమూ, బుద్ధి నిశ్చయాత్మకమూ - తెలిసిందే కదా! మనోమయకోశానికిది కారణం. అన్ని వృత్తులకూ నేను కర్తననే భావం దీనిలక్షణం. అహంవృత్తి బుద్ధిదీ, ఇందు వృత్తి మనస్సుదీ - అంతఃకరణమొకటే అయినప్పటికీ వృత్తి భేదంతో కోశభేదమేర్పడింది. మనసుకు కరణత్వమూ (సాధనా) బుద్ధికి కర్తృత్వమూ-భేదలక్షణాలు, జీవుడికి బుద్ధి ఉపాధి; బుద్ధి లేక జీవుడు నేను-నాది-అనుకోలేడు; కనుక బుద్ధియుక్తమైన విజ్ఞానమయ కోశమే జీవుడని కూడా అంటున్నారు. ఈ విజ్ఞానమయకోశం పంచ భూతాల సమష్టిసత్వగుణంతో ఏర్పడింది కనుక, ఆత్మచైతన్యమిందులో తప్పని సరిగా ప్రతిబింబిస్తున్నది. అలా చిచ్ఛక్తితో కూడింది కనుకనే విజ్ఞానమనేపేరు దీనికి సార్థకం.

శ్లో. అనువ్రజ చ్చిత్ప్రతి బింబ శక్తిః
విజ్ఞాన సంజ్ఞః ప్రకృతే ర్వికారం;
జ్ఞానక్రియావా నహమి త్యజస్రం
దేహేంద్రియాదిష్వభిమన్యతే భృశం. ౧౮౫

తే. గీ. విస్తరించిన చిత్ప్రతిబింబశక్తి
వలన విజ్ఞానమయ మొక ప్రకృతి రూపె;

క్రియల జ్ఞానంబు కలిగి, ఇంద్రియములందు
దేహ మందును నైక్యమై తేజరిల్లు.

స్వయంగా జడమైకూడా, చిత్ప్రతి బింబకాంతితో నిరంతరం వెలిగే విజ్ఞానమయకోశం, ప్రకృతిరూపమేనన్నమాట! కూటస్థుని ప్రతిబింబశక్తితో కూడుకున్నది కనుకనే దేహేంద్రియాదులు నావని అభిమానపడుతున్నది. ఆ యింద్రియాల జ్ఞానమూ వ్యాపారమూ కలిగినందున కర్తరూపంగా వ్యవహరిస్తున్నది.

శ్లో. అనాది కాలోఽయ మహం స్వభావో
జీవః సమస్త వ్యవహార వోఢా
కరోతి కర్మాణ్యపి పూర్వవాసనః
పుణ్యా న్య పుణ్యాని చ తత్ఫలాని. ౧౮౬

శ్లో. భుంక్తే విచిత్రా స్వపి యోనిషు వ్రజ
న్నాయాతి నిర్యాత్యధ ఊర్ధ్వమేషః
అస్యైవ విజ్ఞాన మయస్య జాగ్రత్
స్వప్నాద్యవస్థాః సుఖదుఃఖభోగః. ౧౮౭

సీ. మొదలు లేదిద్దాని, కిది యహంకార స్వ
భావంబు కలదౌట జీవుడండ్రు;
ప్రాపంచికంబైన వ్యవహారములనెల్ల
నీ జీవుడే నిర్వహించుచుండు;
పూర్వవాసనలచే పుణ్యంబు పాపంబు
నొనరించి తత్ఫలం బనుభవించు;
పలువిధాలైన యోనులలోన జన్మించి
పైకి క్రిందికి పరిభ్రమణ సేయు;
స్వప్న జాగ్రత్తలనెడి యవస్థలేమి ?
ఆయవస్థల సౌఖ్య దుఃఖాదులేమి ?
అనుభవములేమి ? పొందించునట్టి శక్తి
యనుని విజ్ఞానమయకోశమునకె కలదు.

దీనికి మొదలనేది లేదు. అహంవృత్తి దీని స్వభావం కాబట్టి, దీన్నే జీవుడంటారు. ఈజీవుడేకదా ప్రపంచ వ్యవహారా లన్నిటినీ నేను-నేనని చేసుకుపోతాడు? పుణ్యకార్యాలుకానీ, పాపకార్యాలుకానీ, ఇతర కార్యాలుకానీ, పూర్వజన్మవాసనలు ముందుగా నిర్ణయించినట్లే నిర్వహించి, ఆయాకర్మఫలాల నీజీవుడనుభవిస్తాడు. అందుకై వివిధ యోనుల్లో జన్మలెత్తి, పై లోకాలకూ క్రింది లోకాలకూ తిరుగుతూ ఉంటాడు. అంటే, ఉత్తమ జన్మలూ, నీచ జన్మలూ పొందుతుంటాడు. లేదా, స్వర్గానికీ నరకానికీ ప్రయాణం చేస్తాడు. జాగ్రదాద్యవస్థలూ, సుఖదుఃఖాదులైన అనుభవాలూ, ఈ విజ్ఞానమయకోశానికి సంబంధించినవే! అవస్థలు మూడిటికీ అతీతుడై ఉండేవాడు ఈశ్వరుడనీ, కూడుకొని ఉండేవాడు జీవుడనీ, పెద్దల నిర్ణయం.

శ్లో. దేహాది నిష్ఠాశ్రమ ధర్మకర్మ
గుణాభిమానం సతతం మమేతి
విజ్ఞానకోశోఽయ మతి ప్రకాశః
ప్రకృష్టసాన్నిధ్యవశా త్పరాత్మనః
అతో భవత్యేష ఉపాధిరస్య
యదాత్మ ధీః సంసరతి భ్రమేణ. ౧౮౮

ఉ. దానివె యంచునెప్పుడును తప్పదలంచు, గుణాభిమాన వి
జ్ఞానమయంపుకోశమది; కాయపుటాశ్రమ ధర్మకర్మముల్;
తానల యాత్మకెంతయిన దగ్గఱ యౌట నతి ప్రకాశమౌ:
నైన నుపాధి, భ్రాంతిపడినందున, జీవుడు జన్మ లెత్తెడిన్.

దేహానికి సంబంధించిన ఆశ్రమాలూ, ధర్మాలూ, కర్మలూ, తనవేనని గుణాభిమానంతో తప్పదలచి ప్రవర్తిస్తుంది. విజ్ఞానమయ కోశమనే జీవుడు. ఇది ఆత్మకు చాల దగ్గఱలో ఉన్నందున, అన్ని కోశాలకంటే అధిక ప్రకాశం కలిగి ఉంటుంది. ఉపాధియైన తానే ఆత్మనని అహంకరించి భ్రాంతిచేత సంసారాన్ని కల్పిస్తుంది.

[ఆత్మధీః - అంటే, జీవుడు (అహం); శరీరంలోని ఆత్మబుద్ధిలో ప్రతిఫలించి ప్రకాశిస్తూ, వ్యక్తిగత జీవుడనిపించుకుంటుంది. దీన్ని ప్రతిబింబవాద మంటారు.]

# 189-191 ఆత్మ - ఉపాధితో అసంగం

శ్లో. యోఽయం విజ్ఞానమయః
ప్రాణేషు హృదిస్ఫురత్యయం జ్యోతి
కూటస్థః సన్నాత్మా
కర్తా భోక్తా భవత్యుపాధిస్థః. ౧౮౯

తే. గీ. చక్షురాదీంద్రియంబుల సరస; హృదయ
పుండరీకమునందలి బుద్ధియందు;
నాత్మ కూటస్థుడై బుద్ధియను నుపాధి
కర్తగా భోక్తగా మారి కానుపించు.

విజ్ఞానమయకోశమే జీవుడనీ, జీవుడే విజ్ఞానమయకోశమనీ, తాదాత్మ్య సంబంధంతో వ్యవహరించటం జరిగింది. ఇక్కడ ప్రాణాలంటే చక్షురాదీంద్రియాలనక తప్పదు. పరమాత్మ యీ చక్షురాదీంద్రియ సమీపంలో-హృదయ పద్మంలో-బుద్ధిలో స్వయంజ్యోతియై వెలుగుతూ, దేహేంద్రియాలన్నిటినీ వెలిగిస్తున్నాడు. కూటస్థుడైనప్పటికీ, ఉపాధిలో ఉన్నందువల్ల తాదాత్మ్యం చెంది కర్తగాభోక్తగా భావించబడుతున్నాడు.

విజ్ఞానమయకోశం జడం; దాని స్థానం హృదయ కుహరమని వేదాంతుల నిర్ణయం. 'కతమ ఆత్మేతి, యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు హృదంతర్ జ్యోతిః పురుషః'- (బృహదారణ్యకోపనిషత్తు ౪-3-౭)ఈ యాత్మ ఎవరు? అని అడిగితే (జనకునికి యాజ్ఞవల్క్యుడు) ఆత్మ స్వరూపం విజ్ఞానమయం. జాగ్రదవస్థలో నతడు బహిర్ జ్యోతి-తదుపరి అంతర్ జ్యోతి. స్వప్నావస్థలో అతని ప్రకాశం హృదయంలో, సుషుప్తిలో ప్రాణాలందు అని చెప్పబడింది.

శ్లో. ఈశ్వర స్సర్వభూతానాం - హృద్దేశేఽర్జున తిష్ఠతి;
భ్రామయన్ సర్వభూతాని - యంత్రారూఢాని మాయయా.
(గీత. 18-61)

అర్జునా! అన్ని ప్రాణుల్లో హృదయస్థానాన ఈశ్వరుడున్నాడు; అతడు తనమాయాశక్తితో అన్ని భూతాలనూ కీలు బొమ్మలవలె ఆడిస్తున్నాడు. ఇక్కడ హృదయం అనే పదానికి వాచ్యార్థంకాక, లక్షణార్థమే ఉద్దేశింపబడిందన్నారు. ఒక వ్యక్తిని సహృదయుడనీ, విశాలహృదయుడనీ అన్నప్పుడు అతనిలోని ప్రేమా, దయా, ఓర్పూ, సంతోషమూ, క్షమా మొదలైన దేవీగుణాలు సూచింపబడతాయి. సమష్టికారణ శరీరాభిమానియే ఈశ్వరుడని చెప్పుకున్నాముకదా?

శ్లో. స్వయం పరిచ్ఛేద ముపేత్య బుద్ధేః
తాదాత్మ్య దోషేణ పరం మృషాత్మనః
సర్వాత్మక స్సన్నపి వీక్షతే స్వయం
స్వతః పృథ_క్త్వేన మృదోఘటానివ. ౧౯౦

తే. గీ. ఆత్మ సర్వాత్మకంబయ్యు నాత్మకాని
బుద్ధితోడను తాదాత్మ్యమును వహించి;
దానివలె పరిమితంబయి, తానువేఱు
గా భ్రమించును మట్టిని కడవవోలె!

ఆత్మ, యీ ప్రపంచంలోని అన్నిటికీ ఆత్మయైనకూడా, బుద్ధి పరిమాద్దులనే తాను పొంది, అనాత్మయైన ఆబుద్ధితో తప్పుగా తాదాత్మ్యాన్ని వహించి, తానింకేదో వేఱన్నట్లుగా (జీవాత్మగా) అనుకుంటుంది-మట్టితో చేయబడిన కుండ తానుమట్టికంటే వేఱని అనుకున్నట్లుగానే!

[బుద్ధి-అంటే, ఇక్కడ విజ్ఞానమయకోశమే!]

శ్లో. ఉపాధి సంబంధవశాత్ పరాత్మా
హ్యుపాధి ధర్మాననుభాతి తద్గుణః
అయోవికారా నవికారి వహ్నివత్
సదైక రూపోపి పరః స్వభావాత్. ౧౯౧

ఆ. వె. ఆత్మతానుపాధి యందుండియు, నుపాధి
ధర్మములను తాల్చు; తద్గుణముగ
పనులు చేయుచున్న పగిది కనంబడు;
నగ్ని యినుము రూప మందినట్లు.

స్వభావసిద్ధంగానే పరమాత్మ పరిపూర్ణమూ, అవికారమూ. ఐతే అధ్యాసవల్ల ఉపాధి సంబంధం కల్పించుకొని, ఉపాధుల లక్షణాలనే పొంది, వాటి పనులన్నీ తానే చేస్తున్నట్టు కనపడుతుంది-ఏ వికారమూ లేని అగ్ని, ఇనుపముక్కలను కాల్చినప్పుడు, వాటిరూపాల నెట్టగా వేడిగామార్చి ఆమార్పులన్నీ తనవేనన్నట్టు కనపడుతుందికదా ?

## 192-193 ముక్తి ఎలా సిద్ధిస్తుంది ?

శిష్య ఉవాచ :—

శ్లో. భ్రమేణా ప్యన్యధా వస్తు - జీవభావః పరాత్మనః
తదుపాధే రనాదిత్వా - న్నానాదేర్నాశ ఇష్యతే. ౧౯౨

శ్లో. అతోఽస్య జీవభావోపి - నిత్యాభవతి సంసృతిః
ననివర్తేత తన్మోక్షః - కథంమే? శ్రీగురో! వద ! ౧౯౩

శిష్యుడడుగుచున్నాడు :—

మ. భ్రమతోనో? పరమాత్మ వేఱొకటనో? భాసించు జీవుండుగా;
భ్రమయా? ఇంతకనాది; అంతమిక సంప్రాప్తించనట్లేకదా ?
భ్రమయుంబోలె ననాది జీవుడు, పునర్జన్మంబులింకన్ గురూ
త్తమ! ఎట్లేగును? మోక్షమేకరణి సాధ్యంబౌను? విన్పింపవే!

గురుదేవా ! పరమాత్మ యింతకూ భ్రమచేతనో, మతిదేవి చేతనో, జీవుడనిపించుకుంటున్నాడు. ఆ భ్రాంతి అనాదియెప్పుడయిందో, అంతంకూడా లేనట్లేనని అర్థమయింది. అందువల్ల పరమాత్మ జీవత్వం కూడా ఆద్యంతాలు లేనిదే కావలసివస్తుంది. కనుక, అనేక జన్మలు జీవుడెత్తుతూనే ఉంటాడని తేలిపోయింది. ఇంకనాకు మోక్షమెలా సాధ్యం ? అనుగ్రహించిచెప్పరూ ?

## 194-206 ముక్తికారణం ఆత్మజ్ఞానమే.

శ్రీ గురు ఉవాచ :—

శ్లో. సమ్యక్ పృష్టం త్వయావిద్వన్! సావధానేన తత్ శ్రణు!
ప్రామాణికీ నభవతి - భ్రాంత్యా మోహిత కల్పనా. ౧౯౪

గురువు జవాబిస్తున్నాడు :—

క. నికరమగు ప్రశ్నవేసితి
వికశ్రద్ధగ వినుము ! భ్రాంతి నెఱుగక ఊహా
త్మక మగు కల్పన; ప్రామా
ణికమా? యెంచకుము దాని నిజమని, వత్సా !

ఓయీ, బుద్ధిమంతుడా ! తెలివిగలవాడవే ! మంచి ప్రశ్నే వేసినావు. చెప్పింది బాగా అర్థంచేసుకున్నావని నాకు చాల సంతోషంగా ఉంది. సమాధానం శ్రద్ధగా విను ! అజ్ఞానంతో ఊహాలు కదులుతుంటాయి. అలాంటి భ్రాంతిలో ఊహించిన కల్పనలన్నీ నిజమనుకున్నావా ? అవెన్నటికీ ప్రామాణికాలు కావని తెలుసుకో !

ఉపాధి జీవత్వమూ, సంసారమూ –ఇవి భ్రాంతిచేత కల్పితాలు. ఈ భ్రాంత చిత్తుల మాటలు నమ్మదగినవేకావు. పరమాత్మకేమి ? జీవత్వమేమి? ఇది మఱీ అవివేకమైన కల్పన. ముత్తెపుచిప్పను చూచి వెండిగా భ్రమించినట్లూ, త్రాటిని చూచి పామని భ్రమించినట్లూ,

స్తంభాన్ని చూచి భూతమనుకున్నట్లూ, ఆత్మవస్తువునందు జీవత్వం పెద్దభ్రాంతి. ఈ భ్రాంతి ఐదు విధాలుగా ఉంటుందని అన్నపూర్ణోప నిషత్తు. (1) జీవేశ్వరులు వేఱనుకోటం మొదటి భ్రాంతి. (2) ఆత్మకు కర్తృత్వం ఉన్నదా ? లేదా? అనేది రెండవ భ్రాంతి. (3) మూడు శరీరాలతో కూడుకున్న జీవుడు సంగి, అనుకోటం మూడవ భ్రాంతి. (4) జగత్కారణుడైన పరమాత్మకు వికారత్వం నాలుగో భ్రాంతి. (5) కారణం కంటే వేఱైన జగత్తుకు సత్యత్వం ఐదవ భ్రాంతి. (బ్రహ్మ భిన్నమూ జగత్తు సత్యమూ అనుకోటం)- వీటికి నివృత్త్యుపాయాలు న్నాయి. చూడు !

(1) బింబ ప్రతిబింబదర్శనంతో భేదభ్రమ నశిస్తుంది. (2) స్ఫటి కంలోనూ అద్దంలోనూ దాసాని పువ్వుఃవల్లకలిగే ఎఱ్ఱదనాన్నిచూస్తే పారమార్థిక కర్తృత్వ భ్రాంతి తొలగుతుంది. (3) ఘటాకాశ, మఠా కాశ దర్శనంచేత సంగి అనే భ్రాంతి తొలగిపోతుంది. (4) బంగారు ఆభరణాలు చూస్తే వికారిత్వ భ్రమపోతుంది. (5) రజ్జు సర్ప దర్శనం వల్ల కారణభిన్నమైన జగత్తు సత్యమనే భ్రాంతి నశిస్తుంది. కాబట్టి, అప్రమత్తుడవై మనోనిశ్చయంతో ఉండు, బాబూ!విలుకాడులక్ష్యాన్ని గుఱిచూచి ఏకాగ్రంగా ఎలా ఉంటాడో, అలా యోగి కూడా బ్రహ్మ లక్ష్యాన్నుంచీ చలనంలేనివాడై మోక్షమందు కుంటాడంటుంది, యోగవాశిష్ఠం.

శ్లో. భ్రాంతిం వినాత్వసంగస్య నిష్క్రియస్య నిరాకృతేః
నఘటేతార్థ సంబంధో నభసో నీలతాదివత్. ౧౯౫॥

తే. ఆత్మ నిస్సంగమును నిష్క్రియంబు రూప
రహితముంగాన దానికి భ్రాంతితోడ
తప్ప నితర ప్రపంచ సందర్భములను
లేదు సంబంధ; మభ్రనీలిమయువోలె.

ఆత్మ దేన్నీ అంటదు. అన్ని క్రియలకూ అతీతం. ఆకార మనేది అసలే లేదు. కాబట్టి, ఆత్మకొక భ్రాంతితో తప్ప, ఇతర ప్రపంచ వస్తువులతో ఏలాటి సంబంధమూ లేదు - ఆకాశానికీ నీలపురంగుకూ ఉండే సంబంధం సూ స్తరుగానే !

నభసో నీలతాదివత్ - ఆకాశానికి ఏరంగూ లేదు. కాని, మనం నీలంగా ఉందనుకుంటున్నాము. కనుక, ఆనీలపురంగు మన మనసులోనే ఉంది. అదే విధంగా ఆత్మకు పరిమితులు లేవు అవి మన మనసులో ఉన్నాయి. అది మన భ్రాంతి మాత్రమే !

పరమాత్మ నిష్క్రియుడు - అంటే క్రియలు లేనివాడు. ఈ క్రియలు నాలుగువిధాలు :- (1) ఉత్పాద్యము (ఘటాదికం) (2) ప్రాప్యము (పొందదగిన గ్రామాదికము) (3) సంస్కార్యము (మంత్రంతో శుద్ధి పరచటం పురోడాశాదికం) (4) వికార్యము (అవస్థాంతరం పొందటం - పాలు పెరుగైనట్లుగా) ఇవేవీ ఆత్మకు లేవు. (1) నిత్యం కాబట్టి ఉత్పాద్యంకాదు. (2) సర్వవ్యాపి కనుక ప్రాప్యంకాదు. (3) నిత్య శుద్ధం కనుక సంస్కార్యం కాదు. (4) నిర్వికారం కాబట్టి వికార్యం కాదు.

శ్లో. స్వస్య ద్రష్టు ర్నిర్గుణ స్యాక్రియస్య
ప్రత్యగ్బోధా నందరూపస్య బుద్ధేః
భ్రాంత్యా ప్రాప్తో జీవభావో నసత్యో
మోహాపాయే నా స్త్యవస్తు స్వభావాత్. ౧౯౬

ఉ. ఏయది సర్వసాక్షి? మఱియే యది నిర్గుణ? మేదినిష్క్రియం?
బేయది జ్ఞానదీపమును? నేయది నిత్యసుఖంబు? దానికె
ట్లాయెను జీవభావ? మిదియెల్ల నసత్యము; భ్రాంతి బుద్ధిచే
నాయెనుగాక! భ్రాంతి విడనాడిన జీవుడు మాయమయ్యెడిన్.

ఆత్మసాక్షి మాత్రంగా ఉండేది. అన్ని గుణాలకూ క్రియలకూ అతీతం జ్ఞానంగానూ ఆనందంగానూ అనుభవించి తెలుసుకోదగింది. బుద్ధి కలిగించిన భ్రాంతివల్ల జీవభావం ఏర్పడింది. కాని, అది నిజం కాదు. సహజంగానే ఆ భ్రాంతి తొలగిన వెంటనే, జీవభావం లేకుండా పోతుంది.

ఆత్మ సర్వవ్యాప్తం కనుక, దాని కాకార మంటూ ఏదీ లేదు. ఆకారమే లేనప్పుడు గుణాలూ క్రియలూ ఎక్కడుంటాయి ? పరిపూర్ణ జ్ఞానానందాలు దానిసారం. బుద్ధిలో ప్రతిబింబించినప్పుడు జీవుడను కుంటున్నాము. మెలకువ రాగానే కల మాయమైనట్లుగా, భ్రాంతితొలగ గానే జీవుడు లేకుండా పోతున్నాడు.

శ్లో. యావద్ భ్రాంతి స్తావదే వాస్యసత్తా
మిథ్యాజ్ఞానో జ్జృంభితస్య ప్రమాదాత్
రజ్జ్వాం సర్పోభ్రాంతి కాలేన ఏవ
భ్రాంతి ర్నాశే నైవ సర్పోపి తద్వత్. ౧౯౭

తే. గీ. భ్రాంతి కలదాక త్రాటిలో పాము కాని
భ్రాంతి తొలగిన పా మేది? భ్రాంతిచేత
కల్పితంబైన జీవుడు కలుగు నెల్ల
భ్రాంతి తొలగెడిదాకనే ! పైనలేదు.

అజ్ఞానంతో మిథ్యాజ్ఞానం చెలరేగి నందువల్ల విజ్ఞానమయ కోశంలో కల్పితమైన జీవుడు, బ్రహ్మ సాక్షాత్కారం కలిగి అజ్ఞానం నశించిందాకానే ఉంటాడు. ఆమీదట ఉండడు, మాయమౌతాడు. త్రాటిలో మనకు భ్రాంతివల్ల తోచినపాము, సత్యం తెలిసి భ్రాంతి తొలగగానే, ఉండదుకదా ?

శ్లో. అనాదిత్వ మవిద్యాయాః - కార్యస్యాపి తథేష్యతే
ఉత్పన్నాయాంతు విద్యాయా - మావిద్యక మనాద్యపి. ౧౯౮

శ్లో. ప్రబోధే స్వప్నవత్సర్వం - సహమూలం వినశ్యతి
అనాద్యపీదం నోనిత్యం - ప్రాగభావ ఇవస్ఫుటం. ౧౮౫

ఆ. వె. మాయ యను నవిద్య మఱిదాని కార్యా ల
నాది యనుచు చెప్పలేదె? యిట్లె
విద్య పొడమగానె వీడిపోవును కదా?
ఆయవిద్య తా ననాది యయ్యు.

ఆ. వె. కలలు కూడ మేలు కాంచిన యంతనే
విరిసిపోవు కాదె వ్రేళ్లతోడ?
నట్లె యిది యనాది యయ్యు నిత్యముకాదు
ప్రాగభావ మగు ప్రపంచమట్లె.

అవిద్యా లేక, మాయా, దానికార్యమైన విజ్ఞానమయకోశమూ అనాదులనటం నిజమే! అవిద్యకు ఒకే రూపం; దాని కార్యాలకో? అనేక రూపాలు సృష్టి వైచిత్ర్యం నానాత్మకం; ఉపాధి నానాత్వ మూలకం. పరమేశ్వరుడికి సృష్టిలో విచిత్ర కర్మవాసనల కాశ్రయమైన బుద్ధి రూపోపాధి ఉండక తప్పదు. కనుక ఆబుద్ధికి కూడా అనాదిత్వం (ఇష్టమున్నా లేకున్నా) చెప్పకోక తప్పదు, ఇవి అనాదులైనా అనం తత్వం లేనివి. బ్రహ్మజ్ఞానంతో విద్యోదయం కాగానే అవిద్యనశిస్తున్నది. విద్యకూ అవిద్యకూ, రాత్రికీ పగటికీ, స్వప్నానికీ జాగ్రదవస్థకూ - ప్రత్యక్ష విరోధంకదా? అవిద్య నశిస్తే అవిద్యాకార్యమైన విజ్ఞాన మయకోశం కూడా నశిస్తుంది. మెలకువరాగానే స్వప్నమేకాక, దాని కారణమైన నిద్రకూడా నశిస్తున్నదిగా? అనాది - అనే మాటకు, నిత్యంగా ఉండటం, అనే అర్థంలేదు. ప్రాగభావం (ప్రాక్+అభావం) పుట్టక ముందు ఉండకపోవటం - కూడా అనాదే! వస్తువు పుట్టగానే నశిస్తున్నది కదా? నిత్యంగా ఉండటం లేదుకదా?

[ఈ ప్రాగభావమనే దానికి తర్కంలో ప్రాముఖ్యమెక్కువ.]

శ్లో. అనాదేరపి విధ్వంసః - ప్రాగభావస్య వీక్షితః
యద్బుద్ధ్యుపాధి సంబంధాత్ - పరికల్పితమాత్మని. ౨౦౦

శ్లో. జీవత్వం నతతోఽన్యత్తు - స్వరూపేణ విలక్షణః
సంబంధస్త్వాత్మనో బుద్ధ్యా - మిథ్యాజ్ఞానపురస్సరః. ౨౦౧

తే. గీ ప్రాగభావ మనాదియై పరగుచున్న
నంతరించును కాదె? జీవాత్మ కూడ
బుద్ధి యనెడి ఉపాధి నిబద్ధమైన
ఆత్మ బింబమె కనుక నిత్యంబు కాదు.

తే. గీ. ఆత్మ-జీవాత్మకంటె తా నన్యమును, వి
లక్షణంబును; జీవాత్మ లక్షణములు
పరిమితంబులు; బుద్ధి సంబంధమాత్మ
పట్ల మిథ్యావివేక సంపాదితంబు.

ప్రాగభావమనేది అనాదియైనా, అంతరిస్తున్నదని చెప్పబడింది. మట్టిలో కుండ బీజప్రాయంగా ఉండనే ఉంది. ఐతే, అది వ్యక్తం కాలేదు. ఇంకా పుట్టలేదన్నమాట! పుట్టకముందు ప్రాగభావం; పుట్టగానే నశిస్తున్నది. అదే ప్రకారం విజ్ఞానమయకోశం పరిధుల్లో ఆత్మ మీద ఆరోపింపబడిన జీవభావం కూడా సత్యమయిందికాదు. ఎందుకంటే, ఆత్మ ప్రతిబింబం బుద్ధిలో ప్రతిఫలించి జీవుడయింది; ఆత్మదాని కంటె వేఱుగానే ఉంది. కనుక, ఆత్మకూ విజ్ఞానమయకోశానికీ ఏదైనా సంబంధం కల్పించబడితే, అది మిథ్యాజ్ఞానమే! బుద్ధి బాహ్యానికి ప్రసరిస్తే మిథ్యాజ్ఞానంతో జీవభావన ఏర్పడుతున్నది. అదే బుద్ధి అంతర్ముఖమైతే - ఆత్మవంకకు ప్రసరిస్తే, భ్రాంతి తొలగి జీవభావం నశిస్తున్నది.

శ్లో. వినివృత్తి ర్భవేత్తస్య సమ్యక్ జ్ఞానేన నాన్యథా
బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానం సమ్యక్ జ్ఞానం శ్రుతేర్మతం. ౨౦౨

క. విరుగును మిథ్యాజ్ఞానము
పరిపూర్ణ జ్ఞానముననె; వదలదు వేఱే
సరణిని; బ్రహ్మాత్మైక్యం
బరయగ సమ్యగ్వివేక మను శ్రుతులెల్లన్.

సమ్యక్ జ్ఞానం కలిగితేనే అధ్యాస అంతరిస్తుంది. బ్రహ్మాత్మైక త్వమే సమ్యక్ జ్ఞానమని శ్రుతులు ఘోషిస్తున్నాయి.

ఆత్మకు అవయవాలు లేవు - ఇంకో వస్తువుతో సంబంధం కుదరదు. అవయవాలున్న వస్తువులకే సంయోగాది సంబంధాలుం టాయి. ఈజ్ఞానం లేకపోవటమే మిథ్యాజ్ఞానం. ఈ మిథ్యాజ్ఞానమే అసంగమైన ఆత్మకు బుద్ధితో సంబంధం కల్పించింది. ఇది నిజంకాదు. వివేచనచేసి అత్మను సమ్యక్ దర్శనంచేస్తే, బుద్ధ్యాత్మల పరస్పరా ధ్యాస నశిస్తుంది. అహం బ్రహ్మాస్మి - ఇత్యాది ఉపనిషద్వాక్యాలు మననంచేసి, జీవబ్రహ్మలు రెండూ (బింబ ప్రతిబింబాలు కనుక) ఒకటే నని అనుభవపూర్వకంగా తెలుసుకోటమే సమ్యక్ జ్ఞానమని శ్రుతుల మతం.

శ్లో. తదాత్మా నాత్మనోః సమ్య - గ్వివేకేనైవ సిద్ధ్యతి
తతో వివేకః కర్తవ్యః - ప్రత్యగాత్మ సదాత్మనోః. ౨౦౩

తే. గీ. ఆత్మకు ననాత్మకును భేద మరయుశక్తి
వీలుపడుటది సమ్యగ్వివేకముననె;
కనుక, కర్తవ్య మావివేకంబు; ప్రత్య
గాత్మ అసదాత్మలకు భేదమరయవలయు.

ఆత్మయేదో, అనాత్మవస్తువులేవో ? చక్కగా వివేచించి, పాలనూ నీళ్లనూ వేఱుచేసినట్లు చేసి గుర్తించటం, సమ్యగ్వివేకం వల్లనే సిద్ధిస్తుంది. కాబట్టి, శ్రుతి సమ్మతమైన యుక్తులతోనూ, ఆచార్యప్రోక్తమైన ఉపాయాలతోనూ, ఈ వివేచన చేయటం ముము క్షువు కర్తవ్యం, అప్పుడే ఉపాధుల మీది మమకారం నశిస్తుంది.

శ్లో. జలం పంకవ దత్యంతం పంకాపాయే జలం స్ఫుటం
యధాభాతి తదాత్మాపి దోషాభావే స్ఫుటప్రభః. ౨౦౪

ఆ. వె. బురదనీళ్లు బురద పోగొట్టినంతనే
శుభ్రమైన నీళ్లు స్ఫుటములగును;
అప్రకారముగనె ఆత్మయు దోషాలు
లేని యపుడు ప్రజ్వలించి వెలుగు !

బురదతోడి నీళ్లు బాగాకానరావు. చిల్లగింజలతోనో, వడియ గట్టడంవల్లనో, ఆ బురదను పూర్తిగా తొలగించి చూస్తే నీళ్లు నిర్మలమై స్ఫుటంగా కనబడతాయి. అదే ప్రకారంగా అనాత్మవస్తువుల తాదాత్మ్యం వంటి దోషాలను తొలగించి అంతర్ముఖుడైనప్పుడు, అఖండ చైతన్యం ప్రకాశిస్తుంది.

శ్లో. అసన్నివృత్తేతు సదాత్మనా సతం
ప్రతీతిరేతస్య భవేత్ప్రతీచః
తతో నిరాసః కరణీయ ఏవ
సదాత్మనః సాధ్వహ మాది వస్తునః. ౨౦౫

ఆ. వె. ప్రత్యగాత్మ నీకు పరమాత్మగా తోచు
నిజముకానివెల్ల నిలిపివేయ;
కనుక, నీవు నిజముకాని అహంకార
ప్రభృతి వస్తువులను వదలవలయు.

ఆత్మ, నీ స్వస్వరూపం; దేహమంతట వ్యాపించి ఉంది. పంచ కోశాలకంటే విలక్షణమై నిరంతరం ప్రకాశిస్తుంది. అనాత్మవస్తువులైన అహంకారమూ మొదలైన దేహాంతర పదార్థాలను—కాదు, కాదని త్రోసివేస్తూ రావాలి. అనాత్మ యెప్పుడంతరిస్తుందో, అప్పుడాత్మ దర్శనం స్ఫుటంగా జరుగుతుంది. కనుక నిరంతర ధ్యానం చేయటం మేలు !

శ్లో. అతోనాయం పరాత్మాస్యా - ద్విజ్ఞానమయ శబ్దభాక్
వికారిత్వాజ్జడత్వాచ్చ - పరిచ్ఛిన్నత్వ హేతుతః
దృశ్యత్వాత్ వ్యభిచారిత్వాత్ - నానిత్యో నిత్యఇష్యతే. ౨౦౬

సీ. విను ! మింతవఱకును విజ్ఞాన మయకోశ
మని చెప్పుకున్నది ఆత్మ కాదు;
కారణ మేమనగా? మాటిమాటికి
మారునీయది, ఆత్మ మారబోదు;
ఇంక రెండవ హేతు, విదిజడం; బాత్మబిం
బించి నందున తాను వెలుగుచుండు;
నాపై పరిచ్ఛిన్న; మాత్మసంపూర్ణ; మీ
యది విషయాదుల కగ్గమగును;

కనపడేదిది కర్మయే - కర్తకాదు;
నిలకడగ నుండనేర; దనిత్యమైన -
దంతవంత, మసత్య; మెట్లగు ననంత
మద్వితీయము నిత్యమైనట్టి యాత్మ ?

ఇంతవఱకూ మనం చెప్పుకుంటూ ఉండిన విజ్ఞానమయకోశం కూడా ఆత్మకాదు. ఎందుకంటే, ఇది మార్పులకు లోబడింది; జడ మయింది; పరిమితమయింది. విషయాలకు దృశ్యమయింది. నిలకడ లేనిది. అనిత్యమైనది. ఇలాంటి అసత్తు నెలా సత్యమైన ఆత్మ అను కోటం ! ఆత్మకు మార్పే లేదు; చైతన్యమయం; శాశ్వతమైనకర్త విశ్వానికంతా ఆధారం; అఖండం, సర్వజ్ఞం.

## 207-210 ఆనందమయకోశం

శ్లో. ఆనంద ప్రతిబింబచుంబిత తనుర్వృత్తి స్తమో జృంభితా
స్యాదానందమయః ప్రియాది గుణకః స్వేష్టార్థలాభోదయాః
పుణ్యస్యానుభవే విభాతి కృతినా మానందరూపః స్వయం
సర్వోనందతియత్రసాధుతను భృన్మాత్రః ప్రయత్నం వినా. ౨౦౭

17 )

మ. పరమాత్మ ప్రతిబింబమే ప్రకృతిలో భాసించి నంతన్, మనో
హర మానందమయంపు కోశము తయారాయెన్; ప్రియాదుల్ గుణా
లరయం దానికి; నిష్టవస్తు సముఖంబందే విజృంభించు; నె
ల్లర కానందమొసంగు- యత్నమువినా- లాలించు పుణ్యాత్ములన్.

ఆనందమయ కోశం ప్రకృతి లక్షణమే! ఆ ప్రకృతిని ఆత్మ ప్రతిబింబం ముద్దాడి నందువల్ల (వెలిగించి నందువల్ల) ఈ యనాత్మ అవిద్యా పరిణామ రూపమైన అంతర్ముఖ బుద్ధివృత్తి – ఆనందమయ కోశంగా తయారయింది. ప్రియమూ (ఇష్టవస్తు సందర్శనంవల్ల కలిగే సంతోషం), మోదమూ, (ఇష్టవస్తు ప్రాప్తిచేత కలిగే సంతోషం), ప్రమోదమూ (ఆవస్తువు ననుభవించటం వల్లకలిగే ఆనందం) – ఈ కోశానికి మూడంగాలు. తమోగుణంచేత విజృంభిస్తుంది. పుణ్యాత్ములు తమ పుణ్యం పండినప్పుడు దీన్ని అనుభవిస్తారు. ఏ ప్రయత్నమూ లేకుండానే ఇది అందటినీ సంతోషపరుస్తుంది. విచారించి చూడగా జీవుడు సుషుప్తిలో ఈ ఆనందమయ కోశంతో కూడి ఉంటాడు. దీన్నే కారణ శరీరమంటారు. జాగ్రత్స్వప్నదశల్లో సైతం దీని ఉనికి కద్దు! జాగ్రద్దశలో అనుభవించే ఆనందం కూడా ఈ కోశప్రభావమే! సుషుప్తిని గురించి ముందు శ్లోకం తెలుపుతుంది.

శ్లో. ఆనందమయకోశస్య-సుషుప్తౌ స్ఫూర్తిరుత్కటా
స్వప్న జాగరయోరీష-దిష్ట సందర్శనాదినా. ౨౧౮

ఆ. వె. అల సుషుప్తిలోన నానందమయకోశ
ముత్కటముగ వెలుగు చుండి: వెలయు
స్వప్నమందు కొంత జాగ్రత్తలో నించు
కంత యిష్టవస్తు వరసినపుడు.

ఆనందమయకోశం సుషుప్తి (గాఢనిద్ర)లో తన ప్రతాపం బాగా చూపిస్తుంది. స్వస్వరూపానందం జీవుడనుభవిస్తాడు. ఇది

మూడవస్థల్లోనూ ఉంటుంది. దీని స్ఫూర్తి సుషుప్తిలో అధికంగానూ, తక్కిన అవస్థల్లో కొంచెం కొంచెంగానూ తెలియవస్తుంది. ఐతే ఆసుఖమూ, ఆనందమూ, స్థిరంకాదు.

[జాగ్రదవస్థలో విషయాలకై చూస్తుంది – స్వప్నంలో అను భవాల జ్ఞాపకాలు నెమరువేస్తుంది.]

శ్లో. నైవాయ మానందమయః పరాత్మా
సోపాధి కత్వాత్ ప్రకృతే ర్వికారాత్
కార్యత్వ హేతోః సుకృత క్రియాయా
వికార సంఘాత సమాహితత్వాత్. ౨౧౯

శా. ఈ యానందమయంబు కూడ పరమాత్మే మాత్రముంగా; దుపా
ధీయంబై యునికిన్, సదా ప్రకృతి నిర్దేశంబులం బట్టి కా
ర్యాయత్తంబయి యుంట; పూర్వసుకృత ప్రాంచత్ఫలాకారతన్;
అయాకోశములన్నిటన్ విరివిగా వ్యాపించి తానుండుటన్.

ఈ యానందమయకోశం కూడా పరమాత్మ కానేరదు. ఏలన నగా, దీనికి ఉపాధిలో ఉండి మారే లక్షణాలున్నాయి. ప్రకృతి వికారాలున్నాయి. పూర్వజన్మ సుకృత ఫలాకారంలో కార్యాయత్తమై ఉండే లక్షణాలున్నాయి. ఇతరకోశాలన్నిటిలోనూ వ్యాప్తమౌతుంది.

ఐదుకోశాలూ ఒకదానిలో ఒకటి అణిగి మణిగి ఉంటాయి. స్థూల శరీరమనే అన్నమయకోశం అన్నిటి కంటే వెలుపలా, ఆనంద మయకోశం అన్నిటి కంటే లోపలా ఉన్నాయి.

శ్లో. పంచానామపి కోశానాం–నిషేధేయుక్తితః కృతే
తన్నిషేధావధి స్సాక్షీ–బోధరూపోఽవ శిష్యతే. ౨౨౦

తే. గీ. ఐదు కోశాలు శ్రుతి యుక్తు లాశ్రయించి
కాదటంచు నిషేధింప గలిగినపుడు;

తుది నిషేధాని కందక తోచునదియె
సాక్షియదె, జ్ఞానదీప, మచ్చుమగునాత్మ !

ఐదుకోశాల్లో ఒక్కొ-కదాన్ని శ్రుతుల యుక్తులతో – ఇదికాదు – ఇదికాదు–అని నిషేధిస్తూ పోతే, తుట్టతుదకు హేతువాదాని కందక ఏదిమిగులుతుందో? అదేసాక్షి ! అదే పరిపూర్ణ జ్ఞానం ! అదే ఆత్మ!

ఇంతవఱకూ అన్నమయ – ప్రాణమయ – మనోమయ – విజ్ఞానమయ – ఆనందమయ కోశాలైదింటినీ పరిశీలించి, అవేవీ ఆత్మకాదని తెలుసుకొని, నిరాకరించినాము. ఇలా నిషేధించే నేను – కర్తను. నా స్వరూపమే ఆత్మ ! అదే గమ్యమని సమాధిలోనే తెలుసుకోగలుగుతాము. దాన్నే అపరోక్షానుభూతి అంటారు.

## 211 పంచకోశాల కతీతం - ఆత్మ.

శ్లో. యోఽయ మాత్మాస్వయం జ్యోతిః–పంచకోశ విలక్షణః
అవస్థాత్రయ సాక్షీసన్ – నిర్వికారో నిరంజనః
సదానందః స విజ్ఞేయః–స్వాత్మత్వేన విపశ్చితా. ౨౧౧

తే. గీ. ఆత్మ యెపుడు స్వయంజ్యోతి; ఐదుకోశ
ములకు ప్రత్యేకమును; సాక్షి మూడవస్థ
లకును; నిత్యంబు, నిర్వికారక నిరంజ
నము; సదానంద; మదె స్వరూపమును నీకు.

ఆత్మ స్వయంజ్యోతి; పంచకోశాలకంటే ప్రత్యేకం; మూడవస్థలకూ (జాగ్రత్ స్వప్నసుషుప్తులకు) సాక్షి. ఏ వికారాలూ లేనిది; నిరంజనం; నిత్యానందరూపం; స్వస్వరూపమని తెలివిగలవారు తెలుసుకో దగింది.

[నిర్వికారమంటే ప్రకృతివలె మార్పులు లేనిది; ప్రకృతికంటనిది.]

# 212 ఆత్మ ఏదీ? - శిష్యుడి ప్రశ్న.

శిష్య ఉవాచ :—

శ్లో. మిథ్యాత్వేన నిషిద్ధేషు - కోశేష్వేతేషు పంచసు
సర్వాభావం వినాకించి-న్న పశ్యా మ్యత్ర హే గురో!
విజ్ఞేయం కిముప స్త్వస్తి - స్వాత్మనాత్ర విపశ్చితా. ౨౧౨

శిష్యుడడుగుచున్నాడు :—

తే. గీ. పంచకోశాలు ప్రత్యేక పఱచి-కాదు-
కా దటంచు నిషేధించి కనుగొనంగ;-
నేమియును లేదు; శూన్యమేనే, మహాత్మ!
ఆత్మతో నైక్యమగు టెట్టు లగునొ? చెపుమ!

శిష్యుడడిగినాడు :—

ఓ సద్గురూ! పంచకోశాలనూ శోధించి - ఇదికాదు - ఇది కాదని నిషేధిస్తూ పోయిన తరువాత, కడపట నాకేమీ కానరావటం లేదు. అంతా శూన్యంగానే ఉంది. విద్వాంసుడైనా స్వాత్మగా దేన్ని తెలుసుకోటం? ఇంకే విధంగా నేను ఆత్మతో ఐక్యం చెంద గలుగుతాను? దయచేసి వివరించండి!

ఇది శూన్యవాదులైన బౌద్ధులనే మాట! ఆబౌద్ధుల శూన్యవాదాన్ని శంకరు డిక్కడ శిష్యుడి ప్రశ్నగా ఉటంకించి సమాధానం చెప్పబోతున్నాడు.

# 213-225 ఆత్మ స్వరూప నిరూపణ

శ్రీ గురు ఉవాచ :—

శ్లో. సత్యముక్తం త్వయావిద్వన్-నిపుణోఽసి విచారణే
అహమాది వికారాస్తే-తద భావోఽయమప్యను. ౨౧౩

# 212 ఆత్మ ఏది? - శిష్యుడి ప్రశ్న.

శిష్య ఉవాచ :—

శ్లో. మిథ్యాత్వేన నిషిద్ధేషు - కోశేష్వేతేషు పంచసు
సర్వాభావం వినాకించి-న్న పశ్యా మ్యత్ర హే గురో!
విజ్ఞేయం కిముమ స్త్వస్తి - స్వాత్మనాత్ర విపశ్చితా. ౨౧౨

శిష్యుడడుగుచున్నాడు :—

తే. గీ. పంచకోశాలు ప్రత్యేక పఱచి-కాదు-
కా దటంచు నిషేధించి కనుగొనంగ;-
నేమియును లేదు; శూన్యమేనే, మహాత్మ!
ఆత్మతో నైక్యమగు టెట్టు లగునో? చెపుమ!

శిష్యుడడిగినాడు :—

ఓ సద్గురూ ! పంచకోశాలనూ శోధించి - ఇదికాదు - ఇది కాదని నిషేధిస్తూ పోయిన తరువాత, కడపట నాకేమీ కానరావటం లేదు. అంతా శూన్యంగానే ఉంది. విద్వాంసుడైనా స్వాత్మగా దేన్ని తెలుసుకోటం ? ఇంకే విధంగా నేను ఆత్మతో ఐక్యం చెంద గలుగుతాను ? దయచేసి వివరించండి !

ఇది శూన్యవాదులైన బౌద్ధులనే మాట ! ఆబౌద్ధుల శూన్య వాదాన్ని శంకరు డిక్కడ శిష్యుడి ప్రశ్నగా ఉటంకించి సమాధానం చెప్పబోతున్నాడు.

# 213-225 ఆత్మ స్వరూప నిరూపణ

శ్రీ గురు ఉవాచ :—

శ్లో. సత్యముక్తం త్వయావిద్వన్-నిపుణోఽసి విచారణే
అహమాది వికారాస్తే-తద భావోఽయమప్యను. ౨౧౩

ఆ. వె. అనుభవించు దాని నరయున దొకటున్న
సాక్షి రెండవదిగ సంభవంబు;
అనుభవంబె లేని యప్పుడు తనముందు
సాక్షి యగుట యెట్లు సంభవంబు?

అనుభవించే దాన్ని చూచేదొకటుంటే, ఆ రెండవది సాక్షిగా ఉంటుంది. అనుభవమే లేకపోతే, అనుభవానికి సాక్షిభావం ఎలా కలుగుతుందీ ? కర్తృత్వ భోక్తృత్వా లేవీలేకుండా ఊరకచూస్తుండే వాడుసాక్షి. నీవు 'సర్వాభావం వినాకించిన్న పశ్యామి'– అంటున్నావు. నీవు సర్వ శూన్యత్వాన్ని చూచిన సాక్షివన్నమాట! నీ యెదుట జగత్తంతా అదృశ్యమై పోయిందిగా? జగన్మిథ్యాత్వం ఋజువయిందన్న మాట! నీవులేకపోతే, ఆసర్వాభావం ఋజువుకాదుకదా ?

శ్లో. అసౌ స్వసాక్షికో భావో – యతః స్వేనాను భూయతే
అతఃపరం స్వయం సాక్షాత్ – ప్రత్యగాత్మా న చేతరః. ౨౧౬

ఆ. వె. ఆత్మ తనకుతానె యగు సాక్షి; తన్నుదా
తెలిసికొనెడి శక్తి కలిగి యుంట;
నందువలన ప్రత్యగాత్మయే పరమాత్మ
ఇతరమేమి లేదు: ఇది నిజంబు.

ఈ యాత్మ స్వయం (తనకు తానే) సాక్షి. ఎందుకంటే తన్ను తానే తెలుసుకోగలదు. కనుక, ప్రత్యగాత్మయే పరబ్రహ్మం; ఇతరం కాదు. శరీరంలోనూ, మనసులోనూ బుద్ధిలోనూ ఏమేమి జరుగు తున్నాయో, అన్నిటికీ ఆత్మేసాక్షి; – ఆపరికరాలన్నీ తమతమ పనులు మానుకుంటే, లోపలా వెలుపలా ఏఅనుభవాలూ ఉండవు. అప్పుడు ప్రత్యగాత్మ దేనికిసాక్షి? కనుక, స్వయంసాక్షి అనవలసివస్తుంది.

శ్లో. జాగ్రత్స్వప్న సుషుప్తిషు స్ఫుటతరం యోఽసౌ సముజ్జృంభతే
పత్యగ్రూపతయా సదాహమహమిత్యంతః స్ఫురన్నైక కధా

నానాకార వికారభాగిన ఇమాన్ పశ్యన్నహం ధీముఖాన్
నిత్యానంద చిదాత్మనా స్ఫురతి తం విద్ధిస్వమేతం హృది. ౨౧౭

శా. జాగ్రత్స్వప్న సుషుప్తులన్ స్ఫుటముగా సందర్శితంబేది? ప్ర
త్యగ్రూపంబున నేను-నేనని సదా అన్పించి, నానావికా
రగ్రస్తంబయి ధీముఖాన పలుముద్రల్ కొట్టు సోఽహంబు; నా
యగ్రానంద చిదాత్మ నాత్మ హృది నేనంచెప్పు గుర్తింపుమా!

జాగ్రత్స్వప్న సుషుప్తులనే మూడవస్థల్లోనూ ఏది స్ఫుటంగా స్ఫురించి విజృంభిస్తుందో, ఏది ప్రత్యగాత్మ రూపంలో నేను - నేనని - అనేక విధాల సదా స్ఫురిస్తున్నదో, ఈ నానాకార వికార సంబంధం- రకరకాలైన ఆకారాల జన్మస్థితి వృద్ధ్యాది వికారాలు పొందే అహం కారాది దేహాంతం - చూపుకంటే సర్వమూ-సాక్షిగా చూస్తున్నదో, అదే నిత్యానంద చిదాత్మయే నీ స్వస్వరూపంగా గుర్తించు!

జాగ్రదవస్థలో ఈ జీవాత్మ వెలుపలి ప్రపంచంలోని వస్తువులను ప్రకాశింపజేస్తున్నది; స్వప్నావస్థలో, లోపలి ప్రపంచాన్ని సృష్టించి చూపిస్తున్నది. సుషుప్తిలో ఏమీ లేకపోవటాన్ని చూపిస్తున్నది. నేనూ నాదీ-అనే అహంకార మమకారాలను విడవటం సమాధిలోనే సంభవిస్తుంది. అప్పుడు జీవాత్మ పరబ్రహ్మమై నిత్యానందాన్ని అనుభవింప జేస్తుంది.

శ్లో. ఘటోదకే బింబిత మర్క బింబం
ఆలోక్య మూఢోరవిమేవ మన్యతే;
తదాచిదాభాస ముపాధి సంస్థం
భ్రాంత్యాహ మిత్యేవ జడోఽభిమన్యతే. ౨౧౮

ఆ. వె. కుండనీటిలోన నుండెడి రవిబింబ
మరసి మూఢు డరుకుడని భ్రమించు;
నట్లుపాధిలో చిదాభాసు భ్రాంతితో
నేనటంచు బుద్ధిహీనుడెంచు.

కుండ నీటిలో ప్రతిఫలించిన సూర్యబింబాన్ని చూచి, మూఢు డైనవాడు సూర్యుడేనని భ్రమిస్తాడు. అదే ప్రకారంగా బుద్ధి అనే ఉపాధిలోని చిదాభాసుని (జీవుని) భ్రాంతిచేత మూఢుడైనవాడు నేనే (ఆత్మ) ననుకుంటాడు.

శ్లో. ఘటం జలం తద్గత మర్కబింబం
విహాయసర్వం వినిరీక్ష్యతేఽర్కః
తటస్థ ఏతత్త్రిత యావభాసకః
స్వయంప్రకాశో విదుషా యథాతథా. ౨౧౯

క. తెలివిగలవాడు, కుండను,
జలమును, ప్రతిబింబమును విసర్జించియు, ని
ర్మలుడయి యీ మూడింటిని
వెలిగించు స్వయంప్రకాశు వీక్షించుకదా ?

తెలివిగలవాడెవడైనా, యీ కుండనూ, నీటినీ, ప్రతిబింబాన్నీ విడిచిపెట్టి, తటస్థుడై యీ మూడిటినీ ప్రకాశింపజేసే సూర్యుని - ఆకాశంలో స్వయంప్రకాశుడై ఉండేవాడిని - ఉన్నదున్నట్టుగా చూస్తాడు.

ఆ ప్రకారంగానేవిద్వాంసుడైనవాడు, శరీరాన్నీ, బుద్ధినీ, చిదాభాసునీ విడిచిపెట్టి, ఈ మూటినీ వెలిగించే ఆత్మను చూస్తాడు.

శ్లో. దేహం ధియం చిత్ప్రతి బింబమేవం
విసృజ్య బుద్ధౌ నిహితం గుహాయాం
ద్రష్టారమాత్మాన మఖండ బోధం
సర్వప్రకాశం సదస ద్వి లక్షణం. ౨౨౦

శ్లో. నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం
అంత ర్బహిఃశూన్య మనన్య మాత్మనః
విజ్ఞాయ సమ్యగ్ నిజరూపమేతత్
పుమాన్ విపాప్మా విరజో విమృత్యుః. ౨౨౧

శ్లో. విశోక ఆనంద ఘనో విపశ్చిత్
స్వయం కృత శ్చిన్న బిభేతి కశ్చిత్
నాన్యోఽస్తి పంథా భవబంధముక్తేః
వినాస్వతత్త్వావగమం ముముక్షోః. ౨౨౨

సీ: తనువును, బుద్ధి చిత్ప్రతి బింబమును వీడి
బుద్ధి గుహాంతరంబునను చూచి;
ఆత్మ, సాక్షి, నఖండమైన జ్ఞానంబును
సర్వప్రకాశంబు, సర్వగతము;
నంతర్బహి శ్శూన్య, మన్యంబుకానిది;
నిజరూపమైన దానిని గ్రహించి;
పురుషుండు పాపనిర్ముక్తుడై, విరజుడై
అమరుడై, శోకంబు నవలద్రోచి;

దేనికిని భయమొందక దీప్తి నొందు;
నిర్భరానందమూర్తియై నెగడుచుండు;
అన్యమార్గంబులేదు బంధాళి ద్రెంప;
స్వస్వరూపాను సంధాన సరణి యొకటె!

ఆ ప్రకారంగా దేహాన్నీ – బుద్ధినీ – చిదాభాసునీ – ప్రక్కకు నెట్టి, నిర్మలమైన బుద్ధిగుహాలో సాక్షీగా ఉండే ఆత్మను, పరిపూర్ణ జ్ఞానాన్ని, సర్వాకారణాన్ని, చూచి తెలుసుకునేది. దానికి లోపలా ఏమీలేదు; వెలుపలా ఏమీలేదు. నిత్యమూ, సుసూక్ష్మమూ, నిజ స్వరూపమూఐన ఆత్మ దర్శనం చేయవలసింది. అలా చేసిన పురుషు డికి, పాపాలన్నీ తొలగిపోతాయి. రజోగుణ మృత్యుభయం లేదు. దుఃఖాలన్నీ మటుమాయమై, అతడు నిర్భరానంద మూర్తియై. తనకు తానే వెలుగుతాడు. ముముక్షువైన సాధకుని కింతకంటే, భవబంధాలు త్రెంచటాని కింకోమార్గం లేదు. అలాంటి వాడికింక పునర్జన్మ అనేది ఉండదు. బుద్ధౌ నిహితం గుహాయాం – బుద్ధి గుహాలో ఉండేదంటే,

బుద్ధి కాదన్నమాట ! బుద్ధిలోని జ్ఞానసారం. ఏమిటి నీవక్కడచూచేది? ద్రష్టారం - చూచేవాడిని. అన్నిటినీ ఆత్మచూస్తుంది - ఎక్కడ ? ఆత్మానం - నీలోనే! దాని స్వభావమో? అఖండ బోధం.

విభజించటానికి వీలుకాని పరిపూర్ణ జ్ఞానం. అన్ని జ్ఞానాలకూ అదే మూలం. ఇంకా? సర్వప్రకాశం - అన్నిటినీ వెలిగించి చూపేది. ఏమీలేక పోవటాన్ని కూడా చూపిస్తుంది. ఎప్పుడూ ఉంటుంది. లేక పోవటమనేదే దానికిలేదు. ఇంకా సదసద్విలక్షణం - రూపంలేదు - రూపరహితమూ కాదు - స్థూలమూ కాదు, సూక్ష్మమూకాదు. స్థూలానికీ సూక్ష్మానికీ అతీతమై వాటిని గుర్తించేది. జ్ఞాత - జ్ఞేయం కాదు కదా? ఇంకా? నిత్యం - దేశకాల పాత్రల కతీతం. సర్వగతం - అన్నిటా, అంతటా, వ్యాపిస్తుంది. ఏదీ దీన్ని వ్యాపించదు. సుసూక్ష్మం సూక్ష్మంకంటే సూక్ష్మం-సర్వవ్యాపకం. అంతర్బహి శ్శూన్యం-లోపలా వెలుపలా ఏమీలేనిది. రెండవ పదార్థమే లేదుగా ? అద్వితీయం. అనన్యమాత్మనః - నీకంటే వేఱుకానిది. నీవే! విమృత్యుః - చావు లేనిది. శరీరమూ, మనసూ, బుద్ధీ - ద్వారా ఏమార్పులూ పొందనిది. మార్పే చావన్నమాట ! అర్థమయిందా ?

"దేని యందాకాశ మోతప్రోతమై ఉన్నదో బ్రహ్మ విదులు దానిని అక్షరమంటారు - అది అవినాశితత్వము.

("బృహదారణ్యకం - 111-8-8")

శ్లో. బ్రహ్మ భిన్నత్వ విజ్ఞానం - భవమోక్షస్య కారణం;
యేనా ద్వితీయ మానందం - బ్రహ్మ సంపద్యతే బుధైః. 223

తే. గీ. నేను బ్రహ్మముననెడి బ్రహ్మను భవము
కండె భవమోక్షమునకును కారణంబు;
దీనివలనను బుధు డద్వితీయమైన
ఘనతరానంద బ్రహ్మత్వమును వహించు.

బ్రహ్మం కంటే నేను వేఱు కానసే విజ్ఞానమే భవమోక్షానికి కారణం. దీనివల్ల తెలివైన సాధకుడు అద్వితీయమూ ఆనందమూ ఐన బ్రహ్మత్వాన్ని పొందుతాడు.

అనుభవజ్ఞానాన్నే విజ్ఞానమంటారు. ఈ స్వరూపజ్ఞానం సులభంగా అందఱికీ లభించేదికాదు. ఎన్నికోట్ల సాధకులలోనో, ఏ ఒక్కడో, అపరోక్షానుభూతి నందగలుగుతాడు.

శ్లో. బ్రహ్మ భూతస్తు సంసృత్యై - విద్వాన్నావర్తతే పునః
విజ్ఞాతవ్య మతః సమ్యగ్ - బ్రహ్మాభిన్నత్వమాత్మనః. ౨౨౪

తే. గీ. బ్రహ్మ భూతస్తుడైన విద్వాంసు డింక
తిరిగి జన్మింప భూమికి తిరిగి రాడు;
కనుక, సంపూర్ణముగ బ్రహ్మమునను కలిసి
పోవుటకు జీవుడెప్పుడు పూనవలయు.

అనుభవ పూర్వకంగా జీవుడిని బ్రహ్మంతో ఐక్యం చేసినవాడింకెప్పటికీ జనన మరణ రూపమైన యీ సంసారానికి తిరిగిరాడు. కనుక జీవ - బ్రహ్మైక్య సంధానానికై గట్టిగా ప్రయత్నించవలసింది.

శ్లో. సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ - విశుద్ధం పరంస్వతః సిద్ధం
నిత్యానందైక రసం ప్రత్య - గభిన్నం నిరంతరం జయతి. ౨౨౫

క. సత్యము, జ్ఞాన, మనంతము
నిత్యానందైక రసము, నిర్మలము, స్వయం
జాత్యము, బ్రహ్మము, పరమును
ప్రత్యగభిన్నంబు; నది, నిరంతర జయమౌ!

సత్యమూ, జ్ఞానమూ, అనంతమూ, నిత్యానందైకరసమూ. ప్రత్యగభిన్నమూ, పరిపూర్ణమూ, స్వతస్సిద్ధమూ ఐన పరబ్రహ్మ నిరంతరం సర్వోత్కృష్టంగా ఉంది.

బ్రహ్మం కంటే నేను వేఱు కానసే విజ్ఞానమే భవమోక్షానికి కారణం. దీనివల్ల తెలివైన సాధకుడు అద్వితీయమూ ఆనందమూ ఐన బ్రహ్మత్వాన్ని పొందుతాడు.

అనుభవజ్ఞానాన్నే విజ్ఞానమంటారు. ఈ స్వరూపజ్ఞానం సులభంగా అందఱికీ లభించేదికాదు. ఎన్నికోట్ల సాధకులలోనో, ఏ ఒక్కడో, అపరోక్షానుభూతి నందగలుగుతాడు.

శ్లో. బ్రహ్మ భూతస్తు సంసృత్యై - విద్వాన్నావర్తతే పునః
విజ్ఞాతవ్య మతః సమ్యగ్ - బ్రహ్మాభిన్నత్వమాత్మనః. ౨౨౪

తే. గీ. బ్రహ్మ భూతస్తుడైన విద్వాంసు డింక
తిరిగి జన్మింప భూమికి తిరిగి రాడు;
కనుక, సంపూర్ణముగ బ్రహ్మమునను కలిసి
పోవుటకు జీవుడెప్పుడు పూనవలయు.

అనుభవ పూర్వకంగా జీవుడిని బ్రహ్మంతో ఐక్యం చేసిన వాడింకెప్పటికీ జనన మరణ రూపమైన యీ సంసారానికి తిరిగిరాడు. కనుక జీవ - బ్రహ్మైక్య సంధానానికై గట్టిగా ప్రయత్నించవలసింది.

శ్లో. సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ - విశుద్ధం పరంస్వతః సిద్ధం
నిత్యానందైక రసం ప్రత్య - గభిన్నం నిరంతరం జయతి. ౨౨౫

క. సత్యము, జ్ఞాన, మనంతము
నిత్యానందైక రసము, నిర్మలము, స్వయం
జాత్యము, బ్రహ్మము, పరమును
ప్రత్యగభిన్నంబు; నది, నిరంతర జయమౌ!

సత్యమూ, జ్ఞానమూ, అనంతమూ, నిత్యానందైకరసమూ. ప్రత్యగభిన్నమూ, పరిపూర్ణమూ, స్వతస్సిద్ధమూ ఐన పరబ్రహ్మ నిరంతరం సర్వోత్కృష్టంగా ఉంది.

బ్రహ్మం కంటే నేను వేఱు కాననే విజ్ఞానమే భవమోక్షానికి కారణం. దీనివల్ల తెలివైన సాధకుడు అద్వితీయమూ ఆనందమూ ఐన బ్రహ్మత్వాన్ని పొందుతాడు.

అనుభవజ్ఞానాన్నే విజ్ఞానమంటారు. ఈ స్వరూపజ్ఞానం సులభంగా అందఱికీ లభించేదికాదు. ఎన్నికోట్ల సాధకులలోనో, ఏ ఒక్కడో, అపరోక్షానుభూతి నందగలుగుతాడు.

శ్లో. బ్రహ్మ భూతస్తు సంసృత్యై - విద్వాన్నావర్తతే పునః
విజ్ఞాతవ్య మతః సమ్యగ్ - బ్రహ్మాభిన్నత్వమాత్మనః. ౨౨౪

తే. గీ. బ్రహ్మ భూతస్తుడైన విద్వాంసు డింక
తిరిగి జన్మింప భూమికి తిరిగి రాడు;
కనుక, సంపూర్ణముగ బ్రహ్మమునను కలిసి
పోవుటకు జీవుడెప్పుడు పూనవలయు.

అనుభవ పూర్వకంగా జీవుడిని బ్రహ్మంతో ఐక్యం చేసిన వాడింకెప్పటికీ జనన మరణ రూపమైన యీ సంసారానికి తిరిగిరాడు. కనుక జీవ - బ్రహ్మైక్య సంధానానికై గట్టిగా ప్రయత్నించవలసింది.

శ్లో. సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ - విశుద్ధం పరంస్వతః సిద్ధం
నిత్యానందైక రసం ప్రత్య - గభిన్నం నిరంతరం జయతి. ౨౨౫

క. సత్యము, జ్ఞాన, మనంతము
నిత్యానందైక రసము, నిర్మలము, స్వయం
జాత్యము, బ్రహ్మము, పరమును
ప్రత్యగభిన్నంబు; నది, నిరంతర జయమౌ!

సత్యమూ, జ్ఞానమూ, అనంతమూ, నిత్యానందైకరసమూ. ప్రత్యగభిన్నమూ, పరిపూర్ణమూ, స్వతస్సిద్ధమూ ఐన పరబ్రహ్మ నిరంతరం సర్వోత్కృష్టంగా ఉంది.

మట్టితో చేయబడిన కుండ మట్టికంటే వేరుగా మారటంలేదు. ఎక్కడ చూచినా కుండా; మట్టీ ఒకటే! సమానమే! ఐతే, ఆమట్టికి పేరు కల్పించి దాన్ని కుండ అనటమెందుకూ? అలా అన్నంతమాత్రాన అది మట్టి కాకుండా పోతుందా?

శ్లో. కేనాపి మృద్భిన్నతయా స్వరూపం
ఘటస్య సందర్శయితుం నశక్యతే;
అతో ఘటః కల్పిత ఏవ మోహాత్
మృదేవ సత్యం పరమార్థ భూతం. 229

తే. గీ. మట్టికాక మఱొక్కట మట్టికుండ
వేర్పడె ననంగ శక్యమే యెవరికైన ?
కనుక మోహంబుచే పేరు కల్పితంబు;
మట్టియే సత్యమును పరమార్థ మదియె.

కుండను మట్టితో కాక, ఇంకో పదార్థంతో చేసినారని నిరూపించటం – ఋజువుచేసి చూపటం – ఎవరికైనా సాధ్యమా? కనుక, కుండ అనేపేరు, భ్రాంతి కల్పితమే. మట్టి మాత్రమే సత్యమూ, పరమార్థమూ. కుండ ఉత్పత్తికి పూర్వమూ మట్టే, పగులగొట్టబడిన పిమ్మటా మట్టే!

శ్లో. సద్బ్రహ్మ కార్యం సకలం సదైవ
తన్మాత్ర మేత న్నతతోన్య దస్తి;
అస్తీతి యోవక్తినతస్య మోహో
వినిర్గతో నిద్రితవత్ ప్రజల్పః. 230

ఉ. ఈ నిఖిల ప్రపంచమటులే మఱి బ్రహ్మముచే ప్రభావితం
బైనది; బ్రహ్మమున్ విడిచి యన్యముకానిది; బ్రహ్మసారమై
దానిని వీడియుండనిది. తద్వ్యతిరేకము పల్కువాడు, మో
హానను నిద్రలో వదరునట్టి యభాసుని వంటివాడగున్.

అదే ప్రకారంగా ఈ విశ్వమంతా బ్రహ్మం ప్రభావంచేత ఏర్పడింది. బ్రహ్మంకాక మరేమీకాదు. దాని సారమే ఇది; అది లేక దీనికి ఉనికేలేదు. ఉన్నదని ఎవడైనా వాగితే, వాడింకా భ్రాంతిలోనే ఉన్నాడన్నమాట ! నిద్రించినవాడు ఒళ్లు తెలియక కలవరించినట్టుగా ఉంటాయి వాడి మాటలు.

శ్లో. బ్రహ్మైవేదం విశ్వ మిత్యేవవాణీ
శ్రౌతీబ్రూతేఽథర్వ నిష్ఠావరిష్ఠా
తస్మాదేత ద్బ్రహ్మ మాత్రం హి విశ్వం
నాధిష్ఠానా ద్భిన్నతాఽఽరోపితస్య. ౨౩౧

తే. గీ. బ్రహ్మమే యీసమస్త విశ్వంబటంచు
వెల్లడించు న థర్వణ వేదవాణి;
కాన బ్రహ్మమె జగ మధిష్ఠాన రహిత
మైన యారోపణకు నునికి యగునె, విడిగ ?

"బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠం" అనేదిఅథర్వణ వేదసూక్తి. ఈ దృశ్య ప్రపంచమంతా శ్రేష్ఠమైన బ్రహ్మమాత్రమేనని ఆ వాక్యార్థం. కాబట్టి ఈ విశ్వం బ్రహ్మమే! ఎందుకంటే, దాని అధిష్ఠానంకంటే వేరైన ఉనికి ఆరోపణ కెప్పుడూ ఉండదు.

[బ్రహ్మమనే అధిష్ఠానం మీద విశ్వమంతా నామరూపాలతో ఆరోపితమయింది – (ముండకోపనిషత్తు అథర్వణవేదానికి సంబంధించింది.) బ్రహ్మ–ఏవ–ఇదం–విశ్వం–అనే ప్రకటన అందులోదే !]

శ్లో. సత్యం యది స్యా జ్జగమే త దాత్మనోఽ
నంతత్వ హాని, ర్నిగమా ప్రమాణతా
అసత్య వాదిత్వ మపీ శితుః స్యా
న్నై తత్త్రయం సాధుహితం మహాత్మనాం. ౨౩౨

ఉ. ఈ జగమెల్ల సత్యమగునేనియు? నాత్మనదా అనంతమై
రాజిలుటే పొసంగదు, సరాసరి వేదముల ప్రమాణతన్
బూజులు పట్టినట్లగు: ప్రభుండగు నప్పుడసత్యవాది; యే
యోజను ధీజనంబులకు నొప్పదమౌనివిమూడు, చూడగన్?

ఉన్నదున్నట్టుగా ఈ విశ్వమే సత్యమైతే, ఆత్మ కనంతత్వం భంగమౌతుంది; వేదాలు అప్రమాణాలౌతాయి. భగవంతుడే అసత్యవాది కావలసివస్తుంది. ఈ మూడూ సాధుజనులు మంచిదని ఒప్పుకోరు.

మనం చూస్తున్నట్టుగా ఈ ప్రపంచమే సత్యమైతే అందుకు మూడిబ్బందులేర్పడతాయి :— (1) ఆది మధ్యాంత రహితమైన ఆత్మ – అంతవంతమూ, పరిమితమూ కావలసి వస్తుంది.

(2) ఉపనిషత్తులన్నీ అద్వైతాన్నే సమర్థిస్తాయి. షడ్దర్శనాల్లోనూ ఏదీ ఇందుకు విరుద్ధంగా సమర్థించదు. అధర్వణ వేదాన్ని అన్ని వేదాలూ సమర్థిస్తాయి. నిగమాలన్నీ బ్రహ్మ సత్యమనీ జగత్తు మిథ్య అనీ ఒప్పుకుంటున్నాయి – ఇప్పుడు జగత్తు సత్యమంటే, అవన్నీ అప్రమాణాలౌతాయి.

(3) భగవంతుడైన శ్రీకృష్ణుడు భగవద్గీతలో చెప్పినదంతా అసత్యమనవలసి వస్తుంది. అధిష్ఠానమైన ఆత్మ, పరిపూర్ణమనీ, దాని మీదనే ప్రపంచం ఆరోపితమనీ, గీత సమర్థిస్తుంది.

కాబట్టి జ్ఞానులైన సాధువులు ఈ మూడిటినీ అంగీకరించరు. ఇంత ఘోరాన్ని ఎవరామోదిస్తారు?

కనుక బ్రహ్మసత్యం – జగన్మిథ్యా – అనే వాదాన్నే మనం ప్రమాణంగా ఒప్పుకుంటున్నాము.

శ్లో. ఈశ్వరో వస్తుతత్వజ్ఞో – నచాహంతేష్వవస్థితః
నచమత్స్థాని భూతానీ త్యేవమేవ వ్యచీక్లుపత్. 233

ఆ. వస్తుతత్వమెల్ల బాగుగా నెఱిగిన
ఈశ్వరుడు వచించె నిట్లు; కాని,
నేను వానిలోన లేను జీవించి; నా
యందు భూతములును పొందుపడవు.

అన్ని రహస్య తత్వాలూ చక్కగా గావించిన భగవంతుడు ఈ సంగతినే సమర్థిస్తూ ఇలా ప్రకటిస్తున్నాడు :- ఐతే, నేను ప్రాణి కోటిలో లేను: నాలో భూతాలూ ఉనికి కలిగి ఉండవు.

[నచాహం తే వ్యవస్థితః (గీత 9-4) నచమత్స్థాని భూతాని (గీత 9-5)

శ్లో. యది సత్యం భవేద్విశ్వం - సుషుప్తా ఉపలభ్యతాం
యన్నోపలభ్యతే కించి - దతోఽసత్ స్వప్నవన్మృషా. ౨౩౪

ఆ. వె. జగము సత్యమైన నగుపట్టవలెకదా
గాఢనిద్రనైన రూఢిగాను ?
కొంచెమైన కానుపించదు కావున
కల్ల - నిజముకాదు - కలనువోలె.

ఈ విశ్వమే సత్యమైతే, సుషుప్తిలో కూడా కనపడి తీరవలె కదా ? అలా ఎంత మాత్రం కానరావటంలేదు. కాబట్టి, అది కల్లకాక తప్పదు. కలవలెనే అది అబద్ధం. మూడవస్థల్లోనూ ఒకటిగా కనపడేదే సత్యం; ఒక్క జాగ్రదవస్థలోనే దాని ఉనికి. కనుక విశ్వం సత్యం కాదన్నమాట !

శ్లో. అతః పృథఙ్నాస్తి జగత్పరాత్మనః
పృథక్ ప్రతీతిస్తు మృషాగుణాదివత్
ఆరోపితస్యాస్తి కిమర్థవత్తాఽ
ధిష్ఠాన మాభాతి తథా భ్రమేణ. ౨౩౫

ఉ. కాన, స్వతంత్రమెప్పటికి కాదు జగంబు పరాత్మకంటె; వే
తై నటులుండుటే మృష - గుణావళి పోలిక; లేని దాయధి

ష్ఠానము మీద మోపినది సత్యముకాని తమాష; ఆ యధి
ష్ఠానమె యట్లు దర్శన మొసంగును భ్రాంతియె కారణంబుగన్.

కాబట్టి (జగత్తు బ్రహ్మమని చెప్పినందువల్ల), ఈ ప్రపంచం పరమాత్మ కంటే వేఱుగాలేదు. వేఱుగా ఉన్నట్టు తోచడమైతే ఆకాశం మీద ఆరోపితాలైన నీలిరంగు మొదలైన గుణాలవలె అబద్ధం. భ్రమలో కల్పింపబడిన దానికేమైనా అర్థక్రియా కారిత్వం (ప్రయోజనం) ఉంటుందాయేమి? అధిష్ఠానమే ఆరోపిత వస్తువుగా భ్రాంతిచేత కనపడుతూ ఉంది. వ్యవహార జ్ఞానంలో ప్రపంచం ఉన్నట్టుతోస్తే, అది అజ్ఞానదృష్టి మాత్రమే!

శ్లో. భ్రాంతస్య యద్యత్ భ్రమతః ప్రతీతం
బ్రహ్మైవ; తత్త ద్రజతం హి శుక్తిః;
ఇదంతయా బ్రహ్మ సదైవ రూప్యతే
త్వారోపితం బ్రహ్మణి నామ మాత్రం. ౨౩౮

ఆ వె. భ్రాంతునకును భ్రాంతి వలన ప్రతీతంబు
బ్రహ్మ మొకటె! శుక్తి రజిత మట్లు;
బ్రహ్మ విశ్వమగుట ప్రత్యక్ష; మారోప
ణంబు నామమాత్రకంబె కాదె ?

భ్రాంతుడైనవాడు భ్రమించి చూచేదంతా బ్రహ్మమే! బ్రహ్మం తప్ప మఱేమీ కాదు. వెండిగా భ్రమించి చూచేది ముత్యపుచిప్పే! మఱేమీ కాదు. ఇదీ-ఇదీ-అనిపించుకునే యీ విశ్వమంతా బ్రహ్మమేనని ఎంచబడుతుంది. బ్రహ్మమందారోపిత మయిందీ విశ్వమనటం, వట్టి నామ మాత్రమే!

నామరూపాలు రెండూ తొలగించి చూస్తే విశ్వంలో ఉండే దేమిటి? అంతా ఉనికి అనే బ్రహ్మమే!

వ్యవహారదశలో ఇది యిల్లు – ఇది పొలం – ఇది శరీరం – అన్నప్పుడల్లా ఇది – అనే ఇదం శబ్దం, త్రికాలసత్యమైన బ్రహ్మాన్నే తెలుపుతుంది.

## 237-240 బ్రహ్మము - స్వభావం

శ్లో. అతః పరం బ్రహ్మ స దద్వితీయం
విశుద్ధ విజ్ఞాన ఘనం నిరంజనం
ప్రశాంత మాద్యంత విహీన మక్రియం
నిరంతరానంద రస స్వరూపం. ౨౩౭

శ్లో. నిరస్త మాయాకృత సర్వభేదం
నిత్యం ధ్రువం నిష్కల మప్రమేయం
అరూప మవ్యక్త మనాఖ్య మవ్యయం
జ్యోతి స్స్వయం కించి దిదంచకాస్తి. ౨౩౮

సీ. కాబట్టి, యేదేది కనబడుచున్నదో ?
అది పరబ్రహ్మమే ! – అఖిల జగము;
తను మనోబుద్ధుల దాటి యాబ్రహ్మంబు
నిజ, మద్వితీయంబు, నిర్మలంబు;
జ్ఞానసారము, నిరంజనము, ప్రశాంత, మా
ద్యంత విహీనంబు, నక్రియంబు;
ఆనంద రసమయం, బఖిల మాయాకృత
భేదహీనం, బనిర్వేద సుఖము;

నిష్కలం బప్రమేయమై నిత్యమగుచు
నద్వయంబయి యవ్యక్తమై యరూప
మై యనాఖ్యము నగుచు స్వయంప్రకాశ
మైన జ్యోతిస్వరూప, మనూన మార !

బ్రహ్మమందు ఆరోపిత జగత్తు నామమాత్రమే కనుక, దృశ్య ప్రపంచమంతా బ్రహ్మమే! పరబ్రహ్మ తప్ప వేఱే పదార్థంలేనేలేదు. ఆ బ్రహ్మము త్రికాలములందును అద్వితీయం – రెండవ పదార్థంలేని దన్న మాట! విశుద్ధమైన విజ్ఞానసారం; నిరంజనం – అంటే, అంటూ సొంటూ లేనిది; ప్రశాంతం – అఖండ శాంతిమయం; ఆదీ అంతూ లేనిది (చావు పుట్టుకలు లేనిది); అక్రియం – అంతటా వ్యాపించి ఉండినందున ఏపనీ చేయనిది; నిరంతరానంద రస స్వరూపం – మామూలు సంతోషాన్ని మించినది; మాయవల్ల కలిగే మార్పుల కతీతం; – మాయ వల్లనే మనకిన్ని భేదాలు కనపడేది – అవేవీ లేనిదన్నమాట! దేశ కాలాల కతీతం; ఏ నొప్పీ లేని సుఖం; విభజనకు వీలుకానిది; అప్రమేయం – కొలతలేనిది; రూపంలేనిది; అవ్యక్తం – ఇంద్రియాల కందనిది; అవ్యయం – ఏ మార్పులూ (వృద్ధి క్షయాలు) చెందనిది; స్వయం జ్యోతి; ఇదే మనందఱిలోనూ వెలిగే ఆత్మ.

శ్లో. జ్ఞాతృ జ్ఞానజ్ఞేయ శూన్య – మనంతం నిర్వికల్పకం
కేవలాఖండ చిన్మాత్రం – పరంతత్వం విదుర్బుధాః. ౨౩౯

తే. గీ. జ్ఞాని – జ్ఞేయంబు – జ్ఞానంబు లేనిదే? ద
నంతమును నిర్వికల్పంబునైన దేది?
కేవలాఖండ చిన్మాత్రమై వెలుంగు
నట్టి పరతత్వ; మది బుధులరయగలరు.

జ్ఞానీ–లేక, జ్ఞాత (తెలుసుకునేవాడూ), జ్ఞేయమూ (తెలియదగిందీ). జ్ఞానమూ (తెలివీ) – అనే త్రిపుటి దేనియందు లేదో? ఏది అనంతమో! (అంతులేనిదో) ఏది నిర్వికల్పమో? ఏది పరిపూర్ణ జ్ఞాన సారమో? ఆపరతత్వాన్ని (పరబ్రహ్మన్ని) పండితులైన మునులు తెలుసుకోగలుగుతారు.

సత్యమనేది త్రిపుటి కతీతం. అహం - అనేదెప్పుడు నశిస్తుందో, అప్పుడింక త్రిపుటికాధారమేదీ ? కలలు కంటున్నంత వఱకూ - కలలు కనేవాడూ, కలలోని వస్తువులూ, వాటి అనుభవమూ - అనే త్రిపుటి ఉండనే ఉంటుంది. మెలకువరాగానే ఏదీ ఉండదు. అలాగే ప్రపంచానుభవం కూడా, పెద్దకల! ఆత్మ దర్శనంతో అంతమౌతుంది.

శ్లో. అహేయ మనుపాదేయం - మనోవాచా మగోచరం
అప్రమేయ మనాద్యంతం - బ్రహ్మాపూర్ణ మహం మహః. ౨౪౦

తే. గీ. విడుటకు తీసికొనుటకు వీలుకాని;
మనసునకు వాక్కునకందని; మఱియు కొలత
లేని; మొదలును తుదియును కానరాని;
బ్రహ్మపూర్ణ మహంబు; స్వభావ. మాత్మ.

అహేయం - అంటే, విడిచి పెట్టడానికి వీలుపడనిది. పంచకోశాలను విడువవచ్చు - అందు కాధారమైన ఆత్మనెలా విడవటం ? అదేమైనా ఒక వస్తువుకాదుగా? అనుపాదేయం - తీసుకునేదీకాదు. నీలో లేకపోతే, తెచ్చుకోవచ్చు; కాని, స్వభావసిద్ధమైన ఆత్మనెలా తెచ్చుకోటం ? అది తప్ప ఇంకొకటి లేనేలేదాయెను. మనో వాచా మగోచరం-మనసుకూ మాటకూ అతీతం; మొదలూ తుదీ లేనిది; పరిపూర్ణమై ప్రకాశించేది - ఆత్మ.

## 241_249 అదే నీవు (తత్త్వమసి) వ్యాఖ్యానం

శ్లో. తత్ త్వం పదాభ్యా మభిధీయ మానయోః
బ్రహ్మాత్మనోః శోధితయోర్యదీత్థం;
శ్రుత్యా తయో స్తత్త్వ మసీతి సమ్య
గేకత్వమేవ ప్రతిపాద్యతే ముహుః. ౨౪౧

శ్లో. ఐక్యం తయోర్లక్షిత యోర్నవాచ్యయో
ర్నిగద్యతేఽన్యోన్య విరుద్ధధర్మిణోః
ఖద్యోత భాన్వోరివ; రాజభృత్యయోః
కూపాంబురాశ్యోః, పరమాణు మేర్వోః. ౨౪౨

సీ. శ్రుతి మహావాక్య పద్ధతి – తత్త్వమసి – యంచు
ప్రతిపాదనము సేత; బ్రహ్మజీవు
లకు వెంట వెంట పోలిక నిశ్చయించుట
తత్-త్వం-పదాల యర్థంబుచేత;
అది-యన నీశ్వరుండగు, నీ-వనంగను
జీవుండు; వరుసగా చెప్పినట్టి
పదములు వాని సంబంధంబు తొలగించి
వాచ్యార్థమును వీడి వాస్తవముగ
నైక్యత గ్రహింపవలయు లక్ష్యార్థముననె;
ధర్మములు రెండిటికి విరుద్ధంబు లగుట;
రవియు మిణుగుర్పురువట్లు; రాజు-భృత్యు
డట్లు; నంబుధి-బావి; మేర్వణువులట్లు.

తత్-త్వం-అసి-(అది నీవు) అనే శ్రుతి మహావాక్యం బ్రహ్మానికీ (ఈశ్వరుడికీ), జీవుడికీ, పూర్తి పోలికను పలుమాఱు స్థిరపరుస్తుంది – తత్ (అదీ) – త్వం (నీవూ) – అనే పదాలనల్ల. ఈ పదాలనూ వాటి సంబంధాలనూ విడిచి ఆ రెండిటి ఐక్యతను వాచ్యార్థంగా కాక, లక్ష్యార్థంతో గ్రహింపవలసి ఉంటుంది. ఏలననగా, అవి రెండూ ధర్మ విరుద్ధాలు కనుక. సూర్యుడూ – మిణుగురు పురుగూ, రాజూ–సేవకుడూ, సముద్రమూ–బావీ, మేరు పర్వతమూ–అణువూ, వలె.

తత్ త్వ మసి – అదీ నీవూ (బ్రహ్మమూ జీవుడూ) ఒకటే!– అంటూ శ్రుతిలోని మహావాక్యం సిద్ధాంతం చేస్తుంది. జీవుడూ –

దేవుడూ – ఒకటేనన్నమాట! విశ్వమంతటా అన్ని ప్రాణుల్లోనూ వ్యాపించి ఉండేది బ్రహ్మాత్మ – లేక, అధ్యాత్మ – మనిషి మనిషిలో ఆత్మగా ఉందని తేలింది – కనుక, మనిషికీ దేవుడికీ భేదం లేదని వాచ్యార్థం – అంటే మామూలు మాటల అర్థం. అది విడిచిపెట్టి లక్ష్యార్థం గ్రహించగలిగితేనే మహావాక్యం సార్థకమౌతుంది. మనిషి లోని ఆత్మ – విశ్వవ్యాప్తమైన పరమాత్మ – ఒక్కటే! – అనేది పరమార్థం. వాచ్యార్థం గ్రహిస్తే ఈశ్వరుడికీ–జీవుడికీ–పరస్పర విరుద్ధ ధర్మాలు గోచరిస్తాయి. (1) అపార కాంతిమంతుడు సూర్యుడూ, అల్ప కాంతి కలది మిణుగురుపురుగూ, (2) రాజు పాలించేవాడూ – సేవకుడు పాలింపబడేవాడూ, (3) సముద్రం అపారమూ, బావికొద్దిచోటు నాక్ర మించుకున్నదీ, (4) మేరు పర్వతం ఆకాశమంటేదీ, అణువు – ఊరూ పేరూ లేనిదీ. ఇలా బ్రహ్మానికీ జీవుడికీ సామ్యం చెప్పబడినా, ఈశ్వ రుడు సర్వజ్ఞుడూ, జీవుడు ఖద్యోతమూ, పరిచ్ఛిన్నుడూ (అల్పుడూ). జీవుడు కార్యోపాధి గలవాడూ, ఈశ్వరుడు కారణోపాధి గలవాడూ. జీవుడు బంధం కలవాడూ, ఈశ్వరుడు బంధం లేనివాడూ. కాబట్టి వాచ్యార్థంతో అభేదం కుదరదు – లక్ష్యార్థంతోనే కుదురుతుంది. ప్రారంభించబడిన దాన్నీ, ప్రసిద్ధమైనదాన్నీ, అనుభవించబడేదాన్నీ – తత్ శబ్దం బోధిస్తుంది. కనుక ఆ పరబ్రహ్మం నీకనుభవంలో ఉంది. అది నీవై ఉన్నావు – విచారణలేక మఱచినావు – అంటూ బోధించ బడుతున్నది.

శ్లో. తయో ర్విరోధోఽయ ముపాధికల్పితో
న వాస్తవః కశ్చిదుపాధి శేషః
ఈశస్యమాయా మహదాది కారణం
జీవస్య కార్యం శ్రుణు! పంచకోశం. 243

ఉ. వాని విరోధమెల్లను నుపాధుల భేదముచేత నేర్పడెం
గాని, నిజంబుకాదు; సరిగా గమనించిన తేటతెల్ల; మీ
శాను నుపాధి మాయ యన జాలు మహత్తగు; పంచకోశసం
ధాన ముపాధిజీవునకు; దాన విరోధముతోచు నింతకున్.

ఈ ధర్మవిరోధమనేది ఆరోపితమే కాని, వాస్తవంకాదు. ఈ యారోపణ ఉపాధులవల్ల ఏర్పడింది - లేదా, కల్పితమయింది. ఈశ్వరుడి ఉపాధి, మాయ-లేక, మహత్తూ అహంకారమూ కారణంగా గలది. జీవుడి ఉపాధి, మాయాకార్యాలైన పంచకోశాలు. కార్యోపాధి రయం జీవః, కారణోపాధిరీశ్వరః- అని శ్రుతి. ఆమాయనూ, ఈ పంచకోశాలనూ తొలగిస్తే, ఈశ్వరుడూ బ్రహ్మమే! జీవుడూ బ్రహ్మమే!

శ్లో. ఏతా వుపాధీ పర జీవ యోస్తయోః
సమ్యజ్నిరాసేన పరోన జీవః;
రాజ్యం నరేంద్రస్య భటస్య ఖేటకః
స్తయో రపోహే నభటో నరాజా. ౨౪౪

తే. గీ. ఈశ్వరునకును జీవున కీయుపాధు
వెడలినా? వేరు జీవుడు నీశ్వరుడును;
రాజు రాజ్యము - భటుని కరానడాలు -
లేనిచో, లేడు రాజును; లేడు భటుడు.

ఈశ్వరుడూ జీవుడూ - అనేవి రెండూ ఆరోపణలు మాత్రమే! ఉపాధులు రెండూ తొలగిస్తే, ఈశ్వరుడూలేడు, జీవుడూలేడు. రాజుకు చిహ్నం రాజ్యం; భటుడికి చిహ్నం డాలు. ఈ రెండూ లేకపోతే ఇద్దరూ మామూలు మనుష్యులే!

ఇక్కడ వ్యష్టి - సమష్టి - భేదాలు తెలుసుకోటం మేలు! వ్యష్టి - అంటే, ఒక వ్యక్తి; సమష్టి - అంటే, అన్ని జీవులూ (జగత్తు) (జీవుడు)

| వ్యష్టి | సమష్టి |
| --- | --- |
| (1) స్థూల శరీరంద్వారా జీవుడు ప్రవర్తిస్తే, మెలకువతో, అప్పుడతనికి విశ్వుడు – అని పేరు. | (1) అన్ని స్థూల శరీరాల్లోనూ మెలకువతో ప్రవర్తించే జీవుల సముదాయానికి విరాట్ – అని పేరు. |
| (2) సూక్ష్మశరీరం ద్వారా స్వప్నావస్థలో ప్రవర్తించే జీవుడికి తైజసుడని పేరు. | (2) అన్ని సూక్ష్మశరీరాల సముదాయం ద్వారా ప్రవర్తించే జీవుల (మనోబుద్ధుల) మొత్తానికి – హిరణ్యగర్భుడు – అని పేరు. |
| (3) కారణ శరీరం ద్వారా గాఢ నిద్రలో జీవుడుంటే, అతడూ, వాసనలూ (అజ్ఞానమూ) – సత్యం గుర్తించకపోవటం (అవిద్యా) అప్పుడు ప్రాజ్ఞుడనిపించుకుంటాడు. | (3) అన్ని కారణ శరీరాల ద్వారా ప్రవర్తించే జీవుల సముదాయమూ – మాయా– కలిసి– ఈశ్వరుడు అనిపించుకుంటాడు. |

ఈ వ్యష్టి – సమష్టుల్లో ప్రవర్తించే బ్రహ్మమంతా ఒక్కటే ! వ్యష్టినీ, సమష్టినీ తొలగిస్తే మిగిలేదేమిటి? – అంతా బ్రహ్మమే ! మనసూ, బుద్ధీ – తొలగిస్తే జీవుడేమౌతాడు? ఈశ్వరుడిలో లీనమౌతాడు. శారీరకంగా, మానసికంగా, బుద్ధిపూర్వకంగా జరిగే జీవుడి కర్మలన్నీ వాసనలను సృష్టిస్తాయి. ఆవాసనల మొత్తమే మాయ. వాసనలే ప్రపంచాన్ని సృష్టిస్తాయి. మనచుట్టూ ప్రపంచం వాసనలను సృష్టిస్తుంది, మనలో.

సత్యమైన బ్రహ్మం – నాకర్మలూ, వాసనలూ, భావనలూ, ఆవేశాల ద్వారా ప్రవర్తించి, ఈ స్థూలశరీరాన్ని నిర్మిస్తుంది, నాతల్లి

లని యనాత్మల నిరసించి-యవల-జీవు
డీశ్వరుండొకడే నని యెఱుగవలయు.

ఈ జీవతోపాధి దృశ్యమూ లేదు; ఈశ్వరతోపాధిదృశ్యమూ లేదు; ఈ దృశ్యాలు రెండూ కల్పితాలే కనుక, నిజంకావు. త్రాటి మీద ఆరోపించబడిన పామువలెనూ, మనసు కల్పించుకున్న కలలోని దృశ్యాలవలెనూ, ఇవి నిజాలుకావు. ఈ విధంగా విచారంచేసి,యుక్తుల ద్వారా దృశ్య ప్రపంచంలోని వస్తువులన్నిటినీ (అనాత్మలుగా) విమర్శించి, పూర్తిగా సత్యాన్ని గ్రహించి, ఈశ్వరుడికీ జీవుడికీ ఆధారమైన ఏకత్వాన్ని తెలుసుకోవలసింది.

ఈశ్వరుడి ఉపాధియైన కారణాత్మక మాయకానీ, జీవుడి ఉపాధులైన కార్యరూప పంచకోశాలుకానీ, బ్రహ్మమందు అజ్ఞానంతో ఆరోపింపబడినవేకాని, సత్యాలుకావు. "యద్దృశ్యం తన్నశ్యం"— కనపడేదంతా నశించేదే నన్నారు కనుక, యీ దృశ్యాలను దూరంగా విడనాడి, కేవల చిద్రూపులైన జీవేశ్వరులకు అభేదాన్ని తెలిసికోవలెను.

శ్లో. త తస్తుతౌ లక్షణయా సులక్ష్యౌ
తయోరఖండైక రసత్వ సిద్ధయే,
నాలం జహత్యా న తథాఽజహత్యా
కింతూభయార్థాత్మికయైవ భావ్యం. ౨౪౭

తే. గీ. దేవజీవుల లక్షణతో విమర్శ
సలుపవలయు నఖండరసైక సిద్ధు
లనుచు తేల్చంగ; జహతియు నజహతియును
వలవ; దుభయాత్మకముగ భావ్యంబు లెస్స!

కాబట్టి, ఈశ్వరుడూ, జీవుడూ – అనే యీ రెండు పదాలనూ జాగ్రత్తగా లక్షణరీత్యా అర్థం చేసుకొని, అఖండ రసైకత్వసిద్ధిని సిద్ధాంతం చేయవలసింది. జహల్లక్షణ – అంటేనూ, అజహల్లక్షణ –

లని యనాత్మల నిరసించి-యవల-జీవు
డీశ్వరుండొకడే నని యెఱుగవలయు.

ఈ జీవతో్పాధి దృశ్యమూ లేదు; ఈశ్వరతో్పాధిదృశ్యమూ లేదు; ఈ దృశ్యాలు రెండూ కల్పితాలే కనుక, నిజంకావు. త్రాటి మీద ఆరోపించబడిన పామువలెనూ, మనసు కల్పించుకున్న కలలోని దృశ్యాలవలెనూ, ఇవి నిజాలుకావు. ఈ విధంగా విచారంచేసి,యుక్తుల ద్వారా దృశ్య ప్రపంచంలోని వస్తువులన్నిటినీ (అనాత్మలుగా) విమర్శించి, పూర్తిగా సత్యాన్ని గ్రహించి, ఈశ్వరుడికీ జీవుడికీ ఆధారమైన ఏకత్వాన్ని తెలుసుకోవలసింది.

ఈశ్వరుడి ఉపాధియైన కారణాత్మక మాయకానీ, జీవుడి ఉపాధులైన కార్యరూప పంచకోశాలుకానీ, బ్రహ్మమందు అజ్ఞానంతో ఆరోపింపబడినవేకాని, సత్యాలుకావు. "యద్దృశ్యం తన్నశ్యం"— కనపడేదంతా నశించేదే నన్నారు కనుక, యీ దృశ్యాలను దూరంగా విడనాడి, కేవల చిద్రూపులైన జీవేశ్వరులకు అభేదాన్ని తెలిసికోవలెను.

శ్లో. త తస్తుతౌ లక్షణయా సులక్ష్యౌ
తయోరఖండైక రసత్వ సిద్ధయే,
నాలం జహత్యా న తథాఽజహత్యా
కిం తూ భయార్థాత్మికయైవ భావ్యం. ౨౪౭

తే. గీ. దేవజీవుల లక్షణతో విమర్శ
సలుపవలయు నఖండరసైక సిద్ధు
లనుచు తేల్చంగ; జహతియు నజహతియును
వలవ; దుభయాత్మకముగ భావ్యంబు లెస్స!

కాబట్టి, ఈశ్వరుడూ, జీవుడూ – అనే యీ రెండు పదాలనూ జాగ్రత్తగా లక్షణరీత్యా అర్థం చేసుకొని, అఖండ రసైకత్వసిద్ధిని సిద్ధాంతం చేయవలసింది. జహల్లక్షణ – అంటేనూ, అజహల్లక్షణ –

అంటేనూ ఇక్కడ సరిపోదు. జహదజహల్లక్షణ (భాగత్యాగలక్షణ) యేతగునని అంటున్నారు. ఔను! జీవేశ్వరుల అభిన్నత్వాన్ని విచారించ టానికై తత్–త్వం–పదాలను పరిశోధించి జీవేశ్వరులను తెలుసుకొని, వాటి లక్ష్యార్థాలైన కూటస్థ పరబ్రహ్మల తెలుసుకోవలెను. జీవేశ్వరు లలోని కించిజ్ఞత్వ సర్వజ్ఞత్వాదులు విడిచిపెట్టి, శుద్ధ చైతన్యముల అభేదాన్ని గ్రహించటానికై జహదజహల్లక్షణయే సమర్థమయింది. ఒక సిద్ధాంతాన్ని అంతరార్థంతో గ్రహించటాన్ని లక్షణ – అంటారు.

(1) జహల్లక్షణ –మామూలు (వాచ్యమైన) అర్థాన్ని కాదన టం. ఉదాహరణకు – గంగా యాం ఘోషః – గంగలో గొల్లపల్లె – అన్నప్పుడు గొల్లపల్లె గంగలోకాక, గంగఒడ్డున ఉందని అర్థం చేసు కోటం.

(2) అజహల్లక్షణ – మామూలు అర్థాని విశదీకరించటానికై మరికొంత చేర్చటం – ఉదాహరణకు–శ్వేతోధావతి–తెల్లది పరుగెత్తు తూంది–అంటే, తెల్లగుఱ్ఱమని చెప్పుకోవలసి ఉంటుంది.

(3) జహదజహల్లక్షణ (భాగత్యాగలక్షణ) – దీనికి ఉదా హారణ ముందుశ్లోకంలో.

శ్లో. స దేవదత్తోఽయ మితీహచైకతా
విరుద్ధ ధర్మాంశ మపాస్య కథ్యతే;
యథా తథా తత్ త్వమసీతి వాక్యే
విరుద్ధ ధర్మానుభయత్ర హిత్వా. ౨౪౭

శ్లో. సంలక్ష్య చిన్మాత్రతయా సదాత్మనో
రఖండభావః పరిచీయతే బుధైః;
ఏవం మహావాక్య శతేన కథ్యతే
బ్రహ్మాత్మనో రైక్య మఖండభావః. ౨౪౮

చ ఇత డల దేవదత్తుడని యేకముగా వచియించు వాక్యమం
దితర విరుద్ధ ధర్మములనెల్లను వీడిన భంగి; 'నీ వదే
పతి"-యనునట్టి-'తత్త్వమసి'-వాక్యము కూడ సమర్థనీయమౌ;
నితర విరుద్ధ ధర్మముల నెల్లను నిట్టటు వీడనాడుచున్.

తే. గీ. ఈశ్వరునకేని జీవునకేని చిత్ప్ర
కాశమే సారమని తెల్ప గలుగవలయు;
బ్రహ్మ జీవుల కైక్యత బహుళవేద
వాక్యములు చాటుచున్నవి వాస్తవముగ.

సోఽయం దేవదత్తః - ఇతడే ఆ దేవదత్తుడు - అనే వాక్యంలో పోలిక సమర్థింపబడుతున్నది. తత్-శబ్దానికి ఆదేశంలో ఆ కాలంలో ఉన్న దేవదత్తుడనీ, ఇదం - శబ్దానికి ఈ దేశంలో ఈ కాలంలో ఉన్న దేవదత్తుడనీ, వాచ్యార్థం. (సః అనేది తత్ శబ్దం పుంలింగ 'సు' స్థాన రూపం-అయం-అనేది, ఇదం-శబ్దం పుంలింగ 'సు' స్థానరూపం)ఇంతకూ దేవదత్తుడనే వ్యక్తి ఒక్కడే! ఆదేశం ఆకాలం-ఈ దేశం-ఈ కాలం-అనే భాగాలు ఐక్యతకు బాధకాలు కనుక, విరుద్ధాంశాలు విడిచి ఐక్యం గ్రహింపబడుతున్నది. తత్ త్వం అసి - అనే వాక్యంలోనూ, కారణోపాధి కార్యోపాధులనూ, ప్రత్యక్ష పరోక్షాలనూ, పరిపూర్ణత్వ పరిచ్ఛిన్నత్వాలనూ, విరుద్ధ ధర్మాలు కనుక విడిచి, తత్-త్వం-పదాలు రెండిటికీ లక్ష్యార్థంతో చిన్మాత్రులైన జీవేశ్వరులని సాధించి, ఐక్యం చెప్పుకుంటున్నారు, విద్వాంసులు.

దేవుడు పుట్టడు; జీవుడు పుడతాడు; దేవుడు నశించడు, జీవుడు నశిస్తాడు - దేవుడికి పరిమితులు లేవు, మనిషికున్నాయి - ఇలా సులభంగా ఆలోచించే కొద్దీ విరోధ ధర్మాలు గోచరిస్తాయి. వాటిని తొలగిస్తే - చైతన్యమే మిగులుతుంది.

బ్రహ్మం కంటే నేను వేఱు కానసే విజ్ఞానమే భవమోక్షానికి కారణం. దీనివల్ల తెలివైన సాధకుడు అద్వితీయమూ ఆనందమూ ఐన బ్రహ్మత్వాన్ని పొందుతాడు.

అనుభవజ్ఞానాన్నే విజ్ఞానమంటారు. ఈ స్వరూపజ్ఞానం సులభంగా అందఱికీ లభించేదికాదు. ఎన్నికోట్ల సాధకులలోనో, ఏ ఒక్కడో, అపరోక్షానుభూతి నందగలుగుతాడు.

శ్లో. బ్రహ్మ భూతస్తు సంస్మృత్యై - విద్వాన్నావర్తతే పునః
విజ్ఞాతవ్య మతః సమ్యగ్ - బ్రహ్మాభిన్నత్వమాత్మనః. ౨౨౪

తే. గీ. బ్రహ్మ భూతస్తుడైన విద్వాంసు డింక
తిరిగి జన్మింప భూమికి తిరిగి రాడు;
కనుక, సంపూర్ణముగ బ్రహ్మమునను కలిసి
పోవుటకు జీవుడెప్పుడు పూనవలయు.

అనుభవ పూర్వకంగా జీవుడిని బ్రహ్మంతో ఐక్యం చేసినవాడింకెప్పటికీ జనన మరణ రూపమైన యీ సంసారానికి తిరిగిరాడు. కనుక జీవ - బ్రహ్మైక్య సంధానానికై గట్టిగా ప్రయత్నించవలసింది.

శ్లో. సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ - విశుద్ధం పరంస్వతః సిద్ధం
నిత్యానందైక రసం ప్రత్య - గభిన్నం నిరంతరం జయతి. ౨౨౫

క. సత్యము, జ్ఞాన, మనంతము
నిత్యానందైక రసము, నిర్మలము, స్వయం
జాత్యము, బ్రహ్మము, పరమును
ప్రత్యగభిన్నంబు; నది, నిరంతర జయమౌ!

సత్యమూ, జ్ఞానమూ, అనంతమూ, నిత్యానందైకరసమూ. ప్రత్యగభిన్నమూ, పరిపూర్ణమూ, స్వతస్సిద్ధమూ ఐన పరబ్రహ్మ నిరంతరం సర్వోత్కృష్టంగా ఉంది.

ఉ. మట్టిని మల్చి చేసినవి మార్పులె కావె ఘటాదులెల్ల? చూ
పట్టును మట్టి రూపముగ బైటను లోపల; నట్టె చుట్టు క
న్పట్టెడి దెల్ల బ్రహ్మము వినా జగమన్యముకాదు; నిక్క మి
వట్టి ప్రశాంతమున్ విమల మద్వయమౌ పరమాత్మవే సుమా!

మట్టితో మల్చి చేయబడ్డిన కుండలూ మొదలైన వన్నీ మట్టే కాక, ఇంకో పదార్థమగునా? అదే విధంగా సత్తువల్ల పుట్టిన యీ చరాచర ప్రపంచమంతా సత్తే! పరబ్రహ్మమే! త్రికాలాల్లోనూ ఇంకొకటి కాదుకదా? సద్రూప బ్రహ్మం కంటె వేఱే పదార్థ మెక్కడా లేదు. అదే సత్తా స్ఫూర్తులు కలిగిన ఆత్మ! ప్రశాంతమూ, నిర్మలమూ, అద్వయమూ ఐన ఆపరబ్రహ్మమే నీవు.

శ్లో. నిద్రా కల్పిత దేశకాలవిషయ జ్ఞాత్రాది సర్వం యథా
మిథ్యాతత్వదిహాపి జాగ్రతి జగత్ స్వాజ్ఞానకార్యత్వతః
యస్మాదేవ మిదం శరీరకరణ ప్రాణాహమాద్య ప్యసత్
తస్మాత్ తత్వమసి ప్రశాంత మమలం బ్రహ్మాద్వయం
యత్పరం. ౨౫౩

మ. కలలో దేశముకాలమున్ విషయమున్ జ్ఞాతాదులెల్లన్ మృషల్
వలెనే, జాగ్రదవస్థలో ననుభవంబౌలోక, మజ్ఞాన సం
కలితంబౌట; శరీర మింద్రియము లింకన్ ప్రాణముల్ జీవుడుం
దలపోయన్ మృష; నీవు నిర్మల ప్రశాంతాద్వైత బ్రహ్మంబవే!

కలలో మనకు కనపడే దేశమూ, కాలమూ, విషయాలూ, అనుభవాలూ, జ్ఞాతా (తెలుసుకునేవాడూ) – మొదలైన దృశ్యాలన్నీ కలలో నిద్రాకల్పితాలు కాబట్టి, మెలకువరాగానే అబద్ధమని తేలిపోతున్నది. జాగ్రదవస్థలో కూడా ఈ ప్రపంచానుభవమంతా మన అజ్ఞానకారణంగా కలిగేదే కనుక, అబద్ధమే! ఎందుకంటే, ఈశరీరమూ,

ఇంద్రియాలూ, ప్రాణాలూ, అహంకారమూ మొదలైనవన్నీ అసత్యాలే! కాబట్టి నీవు ప్రశాంతమైన నిర్మలమైన, రెండవ పదార్థమే లేని పరబ్రహ్మనివిసుమా !

శ్లో. యత్ర భ్రాంత్యా కల్పితం తద్వివేకే
తత్తన్మాత్రం నైవ తస్మాద్విభిన్నం
స్వప్నేనష్టం స్వప్నవిశ్వం విచిత్రం
స్వస్మాద్భిన్నం కిన్ను దృష్టం ప్రబోధే. ॥ 3

ఉ. భ్రాంతిని కల్పితంబయిన వస్తువు దాని నిజంబెఱింగినన్
భ్రాంతి విడున్; పునాది కనుపట్టు; తదన్యము కాదు; స్వప్నలో
కాంతరద్వైత లోకమది యంతమగున్ కలయందె; కాన మా
వంతయు మేలు కాంచినపు; డయ్యది స్వాంతముకంటె భిన్నమా?

దేని యందైనా ఇంకొకటి భ్రాంతిచేత కల్పితమైతే, దాని నిజం తెలుసుకున్న తర్వాత, అధిష్ఠానం తప్ప వేఱేమీ కానరాదు. ద్వైతమైన స్వప్న ప్రపంచం కూడా స్వప్నంలోనే నశిస్తుంది. మేలుకోగానే అదేమైనప్పటికీ మనసు కంటే భిన్నంగా కనపడుతున్నదా!

స్తంభాన్ని చూచి భూతమనుకుంటేనూ, త్రాడును చూచి పామనుకుంటేనూ, ఆ భ్రాంతి తొలగి తెలివితో విచారింపగానే స్తంభమూ, త్రాడే ఉంటాయి. కాని, భూతమూ, పామూ ఉండవు – మాయమైపోతాయి. ఈ భ్రాంతి మానసిక వికారం మాత్రమే ! మనసే లేకపోతే, ఈ భ్రాంతికి కారణమే ఉండదు. అదే మాదిరిగా అజ్ఞానంవల్ల కలిగే చుట్టూ ప్రపంచవస్తువులన్నీ విచారణచేసి చూస్తే, భ్రాంతి నశిస్తుంది. తురీయావస్థలో ఈ ప్రపంచానుభవాలేవీ ఉండటం లేదు. అదంతా భ్రాంతి మాత్రమే !

## 254-266 ధ్యానసాధన

శ్లో. జాతినీతి కులగోత్ర దూరగం
నామరూప గుణదోషవర్జితం
దేశకాల విషయాతి వర్తియద్
బ్రహ్మతత్త్వమసి భావయాత్మని. ౨౫౪

ఆ. వె. కులము జాతి నీతి గోత్రంబు లేనిది;
నామ రూపములు గుణాగుణాలు
విడిచి; దేశకాల విషయాలకందని
బ్రహ్మమీవ యంచు భావముంచు!

కులమూ, జాతీ, నీతి, గోత్రమూ, దేనికిలేవో? నామరూపాలూ గుణాగుణాలూ దేనికంటవో? దేశకాల విషయాలకేది అతీతమో? ఆబ్రహ్మమే నీవని మనసులో ఏకాగ్రంగా ధ్యానించు!

నీవా బ్రహ్మనివే నన్నభావం నిరంతరం నీ హృదయంలో ఉండనీ! బుద్ధివల్ల జ్ఞానమూ, మనసువల్ల ధ్యానమూ, గట్టిపడతాయి. జ్ఞానం ఉపనిషత్తుల పఠనం వల్ల వృద్ధి పొందుతుంది. ధ్యానం భక్తి శ్రద్ధలవల్ల పెంపొందుతుంది. ఏ ఒకటీ, రెండవది లేకపోతే సత్యం బోధ పడదు. ఎందుకంటే సత్యమనేది మనసుకూ బుద్ధికీ అతీతం. భక్తి జ్ఞానాలు రెండూ, హృదయంలోని నిరంతర భావనచేత బాగా స్థిర పడతాయి.

శ్లో. యత్పరం సకలవాగగోచరం – గోచరం విమల బోధ చక్షుషః
శుద్ధ చిద్ఘన మనాది వస్తుయద్ – బ్రహ్మతత్త్వమసి భావ
యాత్మని. ౨౫౫

ఆ. వె. ఏ పరంబు భాషకేమాత్రమందదో?
జ్ఞాననేత్రమునకె కానబడునో?
అమల చిద్ఘనం బనాది యునేదొ? ఆ
బ్రహ్మ మీవటంచు భావముంచు!

ఏ పరబ్రహ్మం అన్ని భావలకూ అతీతమో ! జ్ఞాననేత్రానికి మాత్రమే దర్శనీయమో? పరిశుద్ధమైన జ్ఞానసర్వస్వమూ, ఆద్యంతాలు లేనిదీ ఏదో ! ఆపరబ్రహ్మనివే నీవని మనసులో నిష్ఠగా ధ్యానించు !

పరిశుద్ధమైన బుద్ధితో మాత్రమే జ్ఞాననేత్రం వికసిస్తుంది. వెనుకకూ ముందుకూ ఊగే బుద్ధితో అది కలుగదు. ఆ ఊగటం వాసనల ప్రభావం వల్లనే ! మనసూ బుద్ధీ నిర్మలం కావటానికి సాధకుడికి ఆయు మాసాలైనా పడుతుంది. రోజూ కొంతసేపు కండ్లు మూసుకొని అంత ర్నేత్రంతో చూడటం అభ్యాసం చేస్తూంటే, మొదటమొదటచీకటిగా ఉన్నది – క్రమంగా వెలుగును వెదజల్లుతుంది. ఇంకో విధంగా ఇది సాధ్యం కాదు.

శ్లో. షడ్భి రూర్మిభి రయోగి యోగి హృ
ద్భావితం నకరణై ర్విభావితం;
బుద్ధి వేద్య మన వద్య భూతి యద్
బ్రహ్మతత్త్వమసి భావ యాత్మని. ౨౫౬

ఆ. వె. ఆఱు తరగ లంట వద్దాని, యోగి హృ
ద్భావితంబు, కరణ పరముకాదు;
బుద్ధ్య వేద్య; మఘము పొందని, దా
పరబ్రహ్మ మీవయంచు భావముంచు !

ఆఱు ఊర్మిలూ – జరామరణాలూ, ఆకలి దప్పికలూ, వ్యాధీ, మృత్యువూ – దేన్ని అంటవో ? దేన్ని యోగిహృదయం ధ్యానిస్తుం దో? ఇంద్రియ విషయాలకేది గ్రాహ్యంకాదో? బుద్ధిదేన్ని తెలుసుకో లేదో? ఏది పాపాలన్నిటినీ పరిహరిస్తుందో ? – ఆ బ్రహ్మనివే నీవని బాగా మనసులో ధ్యానించు !

ఊర్మిలంటే అలలు – శరీరాన్నీ మనసునూ బాధించేవి – ఒక దానివెంటా ఒకటిగా క్రమ్ముకొని దుఃఖం కలిగిస్తాయి.

శ్లో. భ్రాంతి కల్పిత జగత్కలాశ్రయం
స్వాశ్రయంచ సదసద్వి లక్షణం;
నిష్కలం నిరుపమాన మృద్ధిమత్
బ్రహ్మతత్వమసి భావయాత్మని. ౨౫౭

ఆ. వె. భ్రాంతి కల్పిత ప్రపంచ నిమిత్తంబు;
స్వాశ్రయంబు; సత్తసత్తుకాదు;
భాగములును సాటివస్తువులేని, యా
బ్రహ్మ మీవటంచు భావముంచు !

ఏది భ్రాంతి కల్పితమైన యీవిశ్వాని కంతా ఆధారమో ? తనకు మాత్రం ఇంకే ఆధారమూ లేనిదో? స్థూల సూక్ష్మాలకంటే ఏది ప్రత్యేకమో? దేనిలో భాగాలనేవి ఉండవో? నిజానికి దాని సమాన మింకేదీ లేదో ? ఆ బ్రహ్మమే నీవనుకుంటూ మనసులో బాగా ధ్యానించు !

ఎన్నో మార్పులతో నిరంతరం భ్రాంతి కల్పించే ఈ దృశ్య ప్రపంచమంతా ఏమార్పూలేని బ్రహ్మం మీద ఆధారపడింది. భ్రాంతి కంతటికీ ఒక ఆధారముండక తీరదుగా ? త్రాడుంటేనే కదా పామనే భ్రాంతి కలిగేది? కాని, బ్రహ్మనికి మాత్రం ఇంకేఇతరాధారమూ లేదు. తనకుతానే ఆధారం. స్థూల వస్తువులన్నీ ఇంద్రియాలకు కనపడతాయి. సూక్ష్మవస్తువులు మనసుకూ బుద్ధికీ గోచరిస్తాయి. ఆత్మ, ఇంద్రియాలకూ మనోబుద్ధులకూ అతీతం; కనుక, స్థూలమూకాదు; సూక్ష్మమూ కాదు. స్థూలసూక్ష్మాలను చూపించగలుగుతుంది. సర్వవ్యాపకం కనుక భాగాలుండవు. వేఱేవస్తువే లేనప్పుడు దానికి సమానమేముంటుందీ ?

శ్లో. జన్మవృద్ధి పరిణ త్యపక్షయ-వ్యాధి నాశన విహీన మవ్యయం;
విశ్వసృష్ట్యవ విఘాత కారణం
బ్రహ్మతత్వమసి భావయాత్మని. ౨౫౮

ఆ. వె. పుట్టి పెరిగి వృద్ధి పొంది వృథా కాదు;
జబ్బు చావులేదు; సమసిపోదు;
విశ్వ సృష్టి విభవవిలయ కారణ, మట్టి
బ్రహ్మమీవ యనెడి భావముంచు !

పుట్టుటా, ఎదుగుటా, వృద్ధిపొందుటా, వ్యర్థమౌటా, వ్యాధీ, చావూ – వీటికేది దూరమో ? దేనికి నాశనమనేది లేదో? ఈ విశ్వం సృష్టికీ, స్థితికీ, లయానికీ ఏదికారణమో ? ఆబ్రహ్మమే నీవు – అనుకుంటూ మనసులో ధ్యానించు !

మనిషీ, పశువూ, పక్షీ, చెట్టూ – దేనికైనా పుట్టుకా, పెరుగుటా, మారుటా, తగ్గిపోవుటా, జబ్బుపడుటా, చచ్చుటా – అనే ఆఱుదశలు తప్పవు. ఈ దశలన్నీ బాధలతో కూడినవే! ఇవేవీ ఆత్మనంటవు – శరీరాన్నే బాధిస్తాయి – లేదా, మనసును బాధిస్తాయి. అందుచేత ఆత్మ అవ్యయం – మార్పులులేనిది; మనం చూచే యీ విశ్వమంతా మూడుగతులు పొందుతున్నది – సృష్టీ, స్థితీ, లయమూ. అందుకు కారణం నిత్యమైన బ్రహ్మమే! అదే నీవని బాగా ధ్యానించు!

శ్లో. అస్తభేద మనపాస్త లక్షణం
నిస్తరంగ జలరాశి నిశ్చలం
నిత్యముక్త మవిభక్తమూర్తి య
ద్బ్రహ్మ తత్త్వమసి భావయాత్మని. 264

ఆ. వె. ఏది భేదరహిత? మెది లేమి లేనిదో ?
నిస్తరంగ జలధి నిశ్చలంబొ?
ఏది నిత్యముక్త యెదియవిభక్త? మా
బ్రహ్మ మీవ యనెడి భావముంచు !

ఎటువంటి భేదాలూ దేనికి లేవో ! దేనిసారం ఎప్పటికీ లేక పోవటం లేనేలేదో? అలలులేని సముద్రంవలె ఏది చలనం లేక ఉం

టుందో? సర్వస్వతంత్రమూ, విభజన కలది కాని ఆకారం కలదీ, ఐన ఆ బ్రహ్మమే నీవని మనసులో ధ్యానించు !

అస్తభేదం - అన్ని భేదాలూ ఉడిగినది, అన్ని భేదాలూ నశిస్తే ఆత్మ ప్రశాంతమై ఉజ్జ్వలంగా ప్రకాశిస్తుంది. ఎప్పుడూ లేకపోవటమనేది దానికి లేనే లేదు. శరీరమూ, మనసూ, బుద్ధీ దాటి - వస్తువులూ ఆకర్షణలూ భావనలూ లేని దశలో - ఉండేది చైతన్య మొక్కటే ! ఆ ప్రశాంతత అలలులేని సముద్రంతో పోల్చబడింది. నిజంగా ఎక్కడైనా అలలు లేకుండా సముద్రముంటుందా? ఉండదు కనుకనే, ఊహించుకోవలసి ఉంటుంది.

శ్లో. ఏకమేవ సదనేక కారణం - కారణాంతర నిరాస కారణం;
కార్యకారణ విలక్షణం స్వయం
బ్రహ్మతత్త్వమసి భావయాత్మని. ౨౬౦

ఆ. వె. ఏకసత్యమై యనేక కారణ; మన్య
హేతు నిరసనం; బహేతుకంబు;
కార్యకారణముల కంటె ప్రత్యేక; మా
బ్రహ్మమీవ యనెడి భావముంచు !

ఏది శ్రుతిస్మృతి ప్రమాణాలవల్ల ఒక్కటే ఐనప్పటికీ మాయ చేత తనలో కల్పింపబడిన భూతభౌతికాద్యనేక కార్యాలకు కారణమో? ఇతర కారణాలతో అవసరం లేకుండా, నిమిత్తకారణమూ ఉపాదాన కారణమూ కూడా తానే యగుచున్నదో? ఏది కార్యమైన జగత్తుకూ, కారణమైన మాయకూ సంబంధం లేక, విలక్షణమో ? సర్వతంత్ర స్వతంత్రమైనదేదో? ఆ బ్రహ్మానివే నీవని అంతరంగంలో ధ్యానించు!

ఉండే ఉనికి ఒక్కటే ! ఐనా అనేక విధాలైన యీ దృశ్య ప్రపంచానికంతా అదే కారణం! ఈ భ్రాంతి కంతా అదే ఆధారం.

ఆచైతన్యమే లేకపోతే, ప్రపంచమే లేదుగా! తనకుతానే ఆధారమూ, తనకుతానే కారణమూ; ఇంకో ఆధారం కానీ కారణం కానీ ఆ [illegible] న్యానికి లేవు. ఆబ్రహ్మానివే నీవని ధ్యానించు !

శ్లో. నిర్వికల్పక మనల్ప మక్షరం
యత్ క్షరాక్షర విలక్షణం పరం;
నిత్యమవ్యయ సుఖం నిరంజనం
బ్రహ్మతత్వమసి భావయాత్మని. ౨౬౧

ఆ. వె. అక్షరంబు మాయకంట దనంతంబు:
పరము మాయకును ప్రపంచమునకు.
నిత్య మనయసుఖము నిజనిరంజనమైన
బ్రహ్మమీవ – యంచు భావముంచు !

నిర్వికల్పకమూ, అనంతమూ, అక్షరమూ, మాయకూ జగత్తుకూ అతీతమూ, అత్యుత్తమమూ, నిత్యమూ, సంగసుఖమూ, నిరంజనమూ ఐనదేదో? ఆబ్రహ్మమే నీవని మనసులో ధ్యానించు !

నిర్వికల్పక మంటే, వాసనలతో నిండిన మనసుకూ, బుద్ధికీ, అతీతం – ఏవికల్పాలూ లేనిది. అనల్పం – అల్పమంటే, అపరిమితం – అంతం లేనిది అనల్పం–మృతిలేనిదన్నమాట! దాన్నే ధామమంటారు. క్షరం–ఎప్పుడూ మారేది; – ప్రపంచం: అక్షరం – మాయ; [illegible] క్షరాలు రెండిటికీ ప్రత్యేకమై వాటిని వెలిగించేది – ఆత్మ.

శ్లో. యద్విభాతి స దనేకధా భ్రమా
న్నామ రూప గుణవిక్రియాత్మనా;
హేతు వ త్స్వయ మవిక్రియం సదా
బ్రహ్మతత్వమసి భావయాత్మని. ౨౬౨

ఆ. వె. ఏదనేక మగుచు నేర్పడు భ్రాంతిచే ?
నామ రూప గుణములోమి; మార్పు
లంది, పసిడివోలె నక్రియమైన; దా
బ్రహ్మమీవ యంచు భావముంచు !

బంగారమంతా ఒక్కటే! ఐనప్పటికీ కంసలివాళ్ల చేత అనేకాభరణాలుగా తయారౌతున్నది. వాటికి వేలువేలు నామరూపాలేర్పడుతున్నవి. ఆపరబ్రహ్మం కూడా ఒక్కడే ఐనప్పటికీ, మాయా కల్పిత భ్రాంతితో నానావిధాల నామరూపాలు కలిగిన ప్రపంచం కనపడుతున్నది. నీవా నిర్వికార బ్రహ్మానివేనని భావించి, బాగా ధ్యానించు !

శ్లో. యచ్చ కార్త్స్యన పరం పరాత్పరం
ప్రత్యగేక రస మాత్మలక్షణం;
సత్యచిత్సుఖ మనంత మవ్యయం
బ్రహ్మతత్త్వమసి భావ్యయాత్మని. ౨౬౩

ఆ. వె. ఏదిమించి యింకలేదొ? పరాత్పర
మేదొ? కార్యజగతి కెక్కుడేదొ?
సత్యచిత్సుఖంబు సకలాత్మ యవ్యయ
బ్రహ్మమీవటంచు భావముంచు !

దేని కతీతంగా ఇంకేమీలేదో? మాయ కతీతంగా ఏది ప్రకాశిస్తున్నదో? తన కార్యమైన విశ్వాని కంటే ఏది మించినదో? ఎటువంటి భేదమూ లేక ఎల్లరిలోనూ ఆత్మయై ఏది ఉన్నదో? ఉనికీ, జ్ఞానమూ, శాశ్వత సుఖమూ, అనంతమూ, అవ్యయమూ – ఐన ఆత్మవే నీవని మనసులో ధ్యానించు !

[అనపరం–ఇంతకంటే (అపరం) – ఇతరం ఏదీలేనిది; ప్రత్యగేక రసం – లోపల ఒకే విధంగా ఉండేది. సత్–ఉనికి; చిత్–నిర్మల జ్ఞానం; సుఖం అనంతమూ, అవ్యయమూ.]

శ్లో. ఉక్త మర్థమిమ మాత్మని స్వయం
భావయ ప్రథిత యుక్తిభిర్ధియా
సంశయాది రహితం కరాంబువత్
తేన తత్వనిగమో భవిష్యతి. ౨౬౪

ఉ. ఈనిగమోక్త మర్థము గ్రహించి సరాసరి చెప్పినట్లుగా
ధ్యాన మొనర్పగావలయు, తన్మయ బుద్ధి హృదంతరంబులో;
దాన లభించు సత్యమగు దర్శన; మప్పుడు సంశయంబులే
మైన నశించు; హస్తతలమందలి యంబువు పోల్కి తెల్లమై.

సంశయ, విపర్యయ, అసంభావనలనేవి అపరోక్ష జ్ఞానానికి ప్రతిబంధకాలు కనుక, అవి లేనట్లుగా నేను నీకీ-'తత్వమసి'-వాక్యార్థాన్ని బోధించినాను. ఈ దోషత్రయం విక్షేప శక్తివల్ల కలిగేవి. నేనుబ్రహ్మమని తెలుసుకోగానే అవన్నీ నశించేవే. నీవిప్పుడా మహావాక్యార్థాన్ని దృఢంగా మననంచేసి, ధ్యానాని కుపక్రమించు! క్రమంగా సత్యదర్శనం లభిస్తుంది. అటుచేతిలోని నీటివలె అన్ని సంశయాలూ నశిస్తాయి.

(1) సంశయం - శ్రుతినానాత్వం - ఉపనిషత్తులు జీవబ్రహ్మభేదాన్ని ప్రతిపాదిస్తున్నాయనేది సంశయం.

(2) అసంభావన - అద్వితీయ పరబ్రహ్మానికి అలౌకికత్వం సంభవింప దనుకొనుట.

(3) విపర్యయం - విపరీత భావన - నేను కర్తనూ, భోక్తననే అభిమానం.

శ్లో. సంబోధ మాత్రం పరిశుద్ధ తత్వం
విజ్ఞాయ సంఘే నృపవచ్చసైన్యే
తదాశ్రయ స్వాత్మని సర్వదాస్థితో
విలాపయ బ్రహ్మణి విశ్వజాలం. ౨౬౫

ఉ. కారణ కార్యమైన నిజకాయమునందె గ్రహించి; మాయతో
చేరని, దాని ధర్మమును చెందని, యాపరిశుద్ధ తత్వమున్;
భూరమణుండు సైన్యమున పోలిక; నాత్మ సదావసించి ని
ర్ధారణగా లయింపవలె బ్రహ్మమునందె సమస్త విశ్వమున్.

సభలో రాజు కిరీటమూ, భుజకీర్తులూ ధరించి, సింహాసనమెక్కి కూర్చుంటాడు. అదే రాజు సైన్యమధ్యంలో రథారూఢుడై అస్త్ర శాస్త్రాలు ధరించి, అంగరక్షకుల నడుమ ఉదాసీనంగా ఉంటాడు. ఏ విధంగా ఉండినా రాజునెక్కడనైనా గుర్తింపవచ్చు. అట్లనే ఆత్మ కూడా ఇంద్రియాది శరీరసంఘాతంలో సచ్చిదానంద లక్షణాలున్నదై, సహస్రారంలో స్వయం ప్రకాశమై, ద్యోతక మౌతున్నది. అంతః కరణమే రథం; బుద్ధియే మంత్రి; ఇంద్రియాలే సేన; మనోబుద్ధ్యాదులే అంగరక్షకులు; మాయ శత్రువు – దాన్నిసంహరించటానికై యుద్ధం! దృశ్యాన్నంతా పరబ్రహ్మలో లయింపజేసి, స్వస్వరూపమందే నిరంతరం నిలిచి ఉండు! సర్వమూ బ్రహ్మమేననుకో!

ఆత్మను రథంలో యజమానిగానూ, శరీరం రథంగానూ, బుద్ధి సారథిగానూ, మనస్సు కళ్ళెంగానూ తెలుసుకోమంటుంది, కఠోప నిషత్తు – (1-3.3)

"ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవతు;
బుద్ధింతు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవచ."

శ్లో. బుద్ధౌ గుహాయాం సదస ద్విలక్షణం
బ్రహ్మాస్తి సత్యం పర మద్వితీయం
తదాత్మనా యోఽత్ర వసే ద్గుహాయాం
పునర్నత స్యాంగ గుహాప్రవేశః.

ఆ. వె. సత్యమును పరంబు సదసద్విలక్షణ
మద్వితీయమైన యట్టి బ్రహ్మ

ముందు బుద్ధిగుహ; నెవండు బ్రహ్మముపోలె
నచట నుండు? జన్మమవల లేదు.

బుద్ధి గుహాలో స్థూల సూక్ష్మాల కంటే విలక్షణమై, సత్యమూ, పరమూ, అద్వితీయమూ, ఐన బ్రహ్మముంటుంది. అదే గుహాలో బ్రహ్మమై ఎవ డుంటున్నాడో, అతడికింక మళ్ళీ తల్లి గర్భంలో ప్రవేశించే పనే ఉండదు.

[బుద్ధిని గుహతో పోల్చి చెప్పటం శ్రుతి సంప్రదాయమన్నమాట!]

## 267-276 వాసనలు పోగొట్టుకోటమెలా?

శ్లో. జ్ఞాతే వస్తున్యపి బలవతీ వాసనాఽనాదిరేషా
కర్తా భోక్తా వ్యహమితి దృఢా యాస్యంసార హేతుః
ప్రత్యగ్ దృష్ట్యాఽఽత్మని నివసతాపావనేయా ప్రయత్నాత్
ముక్తిం ప్రాహు స్తదిహమున యో వాసనా తానవం యత్. ౨౬౭

చ. కలిగియు జ్ఞాన మచ్చముగ; కర్తగ భోక్తగ తానవాదిగా
బలపడి యున్న భావమెడబాయదు: సంసృతి హేతువద్దియే!
నిలిచి సతంబు బ్రహ్మమున నేర్పుగ దానితొలంగ ద్రోయగా
వలయును: ముక్తినామునులు వాసనలుండమి, నిప్పుడిక్కడే!

సత్యాన్ని బాగా తెలుసుకున్న తర్వాత కూడా నేను కర్తనూ భోక్తనూ అని అనాదిగా బలపడి ఉండే గట్టి అభిప్రాయం విడిచిపెట్టదు. అదే పునర్జన్మకు కారణం కదా! నిరంతరం ప్రత్యగాత్మలో లీనమై ఉంటూ, ప్రయత్న పూర్వకంగా ఆభావాన్ని తొలగించుకోవాలి. అలా వాసనలేవీ లేకుండా చేసుకోటాన్నే ముక్తి - అంటారు మునులు. ఆముక్తి ఇప్పుడే ఇక్కడే లభిస్తుంది-ఎప్పుడో కాదు. మనిషి కెప్పుడూ బాహ్యదృష్టేకాని, లోపలి దృష్టి ఉండదు. శాస్త్రాధ్యయనం చేసి సాధకుడు సత్యాన్ని గ్రహించినప్పటికీ, ఆచరణలో అదంతా మఱచి

వాసనల బలంవల్ల నేనే కర్తనూ భోక్తనూ అనే అహంకారంతో ప్రవర్తిస్తాడు. అంతా తనచేతిలోనే ఉన్నట్టు గర్వపడతాడు. కామమూ క్రోధమూ ప్రదర్శిస్తూనే ఉంటాడు. అహంకారణమే కదా పునర్జన్మకు కారణం? అహంకారమే జీవుడు కూడా-ఒకశరీరం విడిచి ఇంకోశరీరంలో దూరేదివాడే! నేను కర్తనూ కాను - భోక్తనూ కాను - అనే భావం బలపడి, వాసన లంతమైతే, అదేముక్తి ఎక్కడో ఎప్పుడో కాక, ఇక్కడే ఇప్పుడే లభిస్తుంది.

శ్లో. అహం మమేతి యో భావో - దేహాక్షా దావ నాత్మని
అధ్యాసోఽయం నిరస్తవ్యో - విదుషా స్వాత్మనిష్ఠయా. ౨౬౮

ఆ. వె. ఆత్మకాని దేహమం, దింద్రియాదుల
యందు, నేను - నాది - అను తలంపు;
నాత్మనిష్ఠచేత, నధ్యాసయనబడు
దాని విడువవలయు తత్వవిదుడు.

అనాత్మమైన దేహమందూ, ఇంద్రియాదులందూ, నేనూ-నాదీ అనే అహంకార మమకారాలనే అధ్యాస - అంటారు. ఈ యధ్యాస నాత్మ నిష్ఠతో తెలివిగలవాడు పూర్తిగా పోగొట్టు కుంటేనే, తరణోపాయం. నిరహంకారంగా నేను సాక్షిని మాత్రమే! - అనుకోగలిగితే, చెప్పేదేముందీ ?

శ్లో. జ్ఞాత్వా స్వం ప్రత్యగాత్మానం - బుద్ధి తద్వృత్తి సాక్షిణం
సోఽహమిత్యేవ సద్వృత్త్యాఽ - నాత్మన్యాత్మమతింజహి. ౨౬౯

ఆ. వె. ప్రత్యగాత్మ నంచు స్వయముగా బుద్ధికి
పనులకెల్ల సాక్షనని యెఱింగి;
సోఽహమనుచు నెపుడు నూహమానక యుండి;
జయము గొను మనాత్మ సంగమమును !

నీ లోపలి ప్రత్యగాత్మను బుద్ధికీ దాని భావాలకూ సాక్షిగా గుర్తించి, అదేనీవని యెప్పుడూ తెలుసుకో! సోఽహం - అనే ఆత్మ జ్ఞానంవల్ల అనాత్మలతో ఐక్యం కావటాన్ని జయించు !

బ్రహ్మాకార వృత్తి గట్టిపడి తేనే, అనాత్మభావంతో సంబంధం తొలగిపోతుంది. అది తొలగటానికై నేను – ఆత్మను – అనే భావం నిరంతరం ఉండకతప్పదు.

శ్లో. లోకాను వర్తనం త్యక్త్వా - త్యక్త్వా దేహాను వర్తనం
శాస్త్రానువర్తనం త్యక్త్వా - స్వాధ్యాసాపనయంకురు! ౨౭౦

తే. గీ. అనుసరించక, లోకమర్యాద విడిచి;
దేహపూజ లొనర్చెడి దృష్టి విడిచి;
పనికి మాలిన శాస్త్రాల పఠన విడిచి;
అంత మొందింపు మధ్యాస, నాత్మనుండి !

సంఘాన్ని గ్రుడ్డిగా అనుకరించి రకరకాల పోకడలు పోవటం మాను; దేహాన్ని అలంకరించుకోటంలోనే కాలక్షేపం చేయటంమాను; అనవసరంగా శాస్త్రాధ్యయనంలోమునిగి తేలుతూ వాదప్రతివాదాలతో కాలం వ్యర్థం చేయటాన్ని విడిచిపెట్టు ! అధ్యాసను మూలమట్టంగా పోగొట్టుకో !

ఇంకో విధంగా చెప్పవలెనంటే, లోకంలో మునిగి తేలకుండా లోకాన్ని ఉపయోగించుకో ! దేహాన్ని నియమంగా ఉంచుకొని ఆరోగ్యం కాపాడుకో ! శాస్త్రాలను విమర్శించి అనవసరాలు వర్జించు ! గొంతెమ్మ కోరికలన్నీ మానుకొని, ఆత్మదర్శనానికే ప్రయత్నించు!

శ్లో. లోకవాసనయా జంతోః - శాస్త్రవాసన యాపిచ
దేహవాసనయా జ్ఞానం – యథా వన్నైవ జాయతే. ౨౭౧

క. లోకము పై వ్యామోహము
ప్రాకట శాస్త్రముల మీది వ్యామోహము; నీ
కీ కాయముపై మోహము
పోకున్నను జ్ఞానమబ్బబో దెన్నటికిన్.

లోకవాసనా, శాస్త్రవాసనా, దేహవాసనా- అనే వాసనా త్రయం ఉన్నంత దాకా, ఆత్మజ్ఞానం గట్టిగా లభించదు. లోకవాసన - తనచుట్టూ ఉండే వాళ్ళందఱూ మెచ్చుకోవాలనీ, ఎవ్వరూ తన్ను తప్పుపట్ట కూడదనీ, అందఱిలో తానెంతో గొప్పగా పేరు తెచ్చుకోవాలనీ, అనుకోటం. శాస్త్రవాసన - పఠనమూ, ప్రవచనమూ, అనుష్ఠానమూ - అని మూడు విధాలు. అట్లే దేహవాసన కూడా మూడు రకాలు-దేహం నేనూ, ఇదినాదీ, అనుకుంటూ దేహంమీాది అపేక్షతో దాని పోషణ. ఈ వాసనాత్రయం విడిస్తేనే మోక్షం.

[జంతోః - జన్మించిన ప్రాణికన్నమాట !]

శ్లో. సంసార కారాగృహ మోక్షమిచ్ఛో
రయో మయం పాద నిబద్ధ శృంఖలం
వదంతి తజ్ఞాః పటు వాసనాత్రయం
యోఽస్మా ద్విముక్తస్సముపైతి ముక్తిం. ౨౭౨

తే. గీ. అవని సంసార కారాగృహంబు వెడల
నెంచు వానికి వాసనలే అయోమ
యంపు సంకెళ్ళు కాళ్ల కటంద్రు తజ్ఞు;
లవి తొలంగినచో ముక్తుడగునతండు.

ఈ ప్రపంచమనే (సంసారమనే) జైలు నుంచీ తప్పించుకో దలచినవాడ్రి కాళ్ళకీ మూడువాసనలే (లోకవాసనా, శాస్త్రవాసనా, దేహవాసనా) ఇనుప సంకెళ్లయి కాళ్లకు బిగించుకుంటాయి-అంటారు విజ్ఞులు. వాటి నుంచీ విముక్తి పొందితేనే ముక్తి లభిస్తుంది.

శ్లో. జలాది సంసర్గవశాత్ ప్రభూత
దుర్గంధ ధూతా గరు దివ్యవాసనా;
సంఘర్షణేనైవ విభాతి సమ్య
గ్వి ధూయమానే సతి బాహ్యగంధే. ౨౭౩

తే. గీ. జలము మొదలగువాని సంసర్గముననుమిగుల దుర్గంధ భూయిష్టముగను తోచు
నగరు చందన కాష్ఠాలు; అఱుగదీయ
సానపై; సొంత పరిమళం బూనుమఱల.

మంచి గంధపు చెక్కా మొదలైనవి నీళ్ళలో తడిసి మూలకు పడినప్పుడు, దుర్గంధ మీనుతాయి. సానమీద అఱుగురుద్దితే మళ్ళీ తమ సహజ పరిమళాన్ని అందుకుంటాయి. శరీరానికి గంధం రాచుకుంటే చెమటవల్ల దుర్వాసన లీనవచ్చును.

[అంతఃకరణమే ఒక అగరువత్తుల కట్ట. అందులో మలిన వాసనలు చేరుకున్నాయి. అందుకు జ్ఞానజ్యోతి సంబంధం కలిగితే మలిన వాసనలన్నీ నశించి, జడరహితమై ప్రకాశిస్తుంది.]

శ్లో. అంతశ్శ్రితానంత దురంతవాసనా
ధూళీవిలిప్తా పరమాత్మ వాసనా
ప్రజ్ఞాతి సంఘర్షణతో విశుద్ధా
ప్రతీయతే చందనగంధవత్ స్ఫుటా. ౨౭౪

ఆ. వె. స్వాంతమున దురంత వాసనలను ధూళి
మూసి యున్న ఆత్మవాసనయును
జ్ఞానఘర్షణమున కడుపరిశుద్ధమై
కమ్మనౌను మంచి గంధమట్లె.

మంచిగంధపు వాసనవలె, పరమాత్మ వాసన కూడా, మనసులోని అంతులేనన్ని దుర్వాసనల ధూళితో కప్పబడి ఉంది. నిరంతర జ్ఞాన ఘర్షణచేత పరిశుద్ధమైతే, మళ్లీ స్ఫుటంగా కానవస్తుంది. వాసన అనే సంస్కృత పదానికి రెండర్థాలు – సుగంధమనీ, కోరికలనీ. మనసులోని లెక్కలేనన్ని కోరికలతో ధూళిగప్పి, అంతరాత్మ కలుషితమై పోయింది. మోహమూ, కోపమూ, భ్రాంతీ, లోభమూ మొదలైన

దుర్వాసనలు నిండినాయి. ఇంద్రియ వ్యామోహంతో మనిషి అల్లాడి పోతున్నాడు. సహజంగా కానరావలసిన పరమాత్మ కానరావటంలేదు. మంచిగంధపు చెక్కతో పోలిక చెప్పిదీన్ని శంకరుడు సమర్థిస్తున్నాడు. దయాసత్యాలు మటుమాయమై దుర్గుణాలు ప్రదర్శించటం జరుగుతూ ఉంది. ఈ దయాసత్యాలనే శివ, కేశవులన్నాడు, పోతన తన భాగవతంలో.

తే. గీ. చేతులారంగ శివుని పూజింపడేని;
నోరునొవ్వంగ హరికీర్తి నొడువడేని;
దయయు సత్యంబు లోనుగా దలపడేని;
కలుగనేటికి తల్లుల కడుపుచేటు ?

మనోవాక్కాయ కర్మలనేవి మూడూ ఒకటిగా ఉంటే, త్రికరణ శుద్ధి - అంటారు. చేతులతో శివపూజా - వాక్కుతో హరికీర్తనా - మనసులో దయాసత్యాలూ - ఆరాధించకపోతే జన్మవ్యర్థమంటాడు. అంటే, దయాసత్యాలే శివ- కేశవులని అర్థం. అప్పుడే త్రికరణ శుద్ధి. అర్థమయిందిగా ?

శ్లో. అనాత్మ వాసనాజాలైః - స్థిరో భూతాత్మ వాసనా;
నిత్యాత్మ నిష్ఠయాతేషాం - నాశేభాతి స్వయంస్ఫుటా. ౨౭౨

ఆ. వె. ఆత్మనరయు కోర్కి నడ్డగించు ననాత్మ
వస్తువుల యనేక వాంఛితములు;
నిత్యమాత్మ నిష్ఠ నిలిచి వాని హతంబు
సలిపినపుడె ఆత్మ సన్నిహితము.

లెక్కలేనన్ని అనాత్మవస్తువుల మీది కోరికలు, ఆత్మ దర్శనాపేక్షను మబ్బులవలె చుట్టుకొని అడ్డుపడుతున్నాయి. ఎల్లప్పుడూ ఆత్మయందే లగ్నమై ఉండి. ఆవాసనలను నశింపజేస్తే, ఆత్మ తనంతటతానే ప్రత్యక్షమౌతుంది.

శ్లో. యథా యథా ప్రత్యగవస్థితం మనః
తథా తథా ముంచతి బాహ్యవాసనాః;
నిశ్శేష మోక్షేసతి వాసనానా
మాత్మానుభూతిః ప్రతిబంధ శూన్యా. ౨౭౬

ఆ. వె. మనసెలా ఎలాగ మగ్నమౌ నాత్మలో
బాహ్యవాంఛ లుడుగ బడు నలాగ;
నన్ని వాంఛ లుడిగి నంతటనే యడ్డు
లేక ఆత్మ ప్రజ్వలించు నెదుట.

ప్రత్యగాత్మలో మనసెంతెంతగా లగ్నమై ఉండసాగుతుందో, అంతంతగా అనాత్మవస్తువులను గూర్చిన బాహ్యవాసనలు దూరమై పోతాయి. అన్ని వాసనలూ అలా అంతరించగానే, ఆత్మదర్శనం నిరాటంకంగా లభిస్తుంది.

[ఆత్మలోనికి మనస్సు చొచ్చుకోపొయ్యే కొద్దీ, మనసే అందులో లయిస్తుంది. ఇంక వాసనలెక్కడుంటాయి?]

## 277-292 అధ్యాస నశించే మార్గం

శ్లో. స్వాత్మన్యేవ సదా స్థిత్వా – మనోనశ్యతి యోగినః;
వాసనానాం క్షయ శ్చాత – స్వాధ్యాసాపనయంకురు! ౨౭౭

ఆ. వె. స్వాత్మయందె మనసు సర్వదా లగ్నమై
యుంట మనసులయము నొందుదాన,
నపుడు కోర్కెలేవి? నారీతి నధ్యాస
పూర్తి యపనయింప బూనవోయి!

తన మనస్సును పరమాత్మలో లీనం చేయడమనేదే ఆత్మానుసంధానం. ఇదే అమనస్కయోగం – నిరంతరం మనసు, ఆత్మలో లగ్నమై ఉంటే, ఆమనసు నశిస్తుంది – సుషుప్తిలో మాస్తరుగానే!

ఐతే, అక్కడ అజ్ఞాన ముంటుంది - ఇక్కడ ఉండదు - సోఽహం భావంతో దృఢంగా ఉంటే అధ్యాసకు ఆస్కారమేలేదు. నీవు కూడా చక్కగా ఆత్మలో స్థిరపడిపోయి, అధ్యాసను నివారించుకో!

[ఇక్కడి నుంచీ 16 శ్లోకాల్లో గురువు శిష్యుడికి - అధ్యాసను పూర్తిగా వదిలించుకొని ఆత్మదర్శనం చేసే పద్ధతి బోధిస్తున్నాడు.]

శ్లో. తమో ద్వాభ్యాం రజః సత్వాత్ - సత్వం శుద్ధేన నశ్యతి
తస్మాత్ సత్వ మవష్టభ్య - స్వాధ్యాసాపనయంకురు! ౨౭౮

క. సమయును తమ ముభయముచే;
సమయును సత్వమున రజము; సత్వము శుద్ధిన్
సమయును; కనుక, సదాస
త్వము గొని అధ్యాస నెల్లవదలుము, వత్సా!

తమోగుణం- రజస్సత్వగుణాలు రెండిటిచేతా నశిస్తుంది. రజోగుణం - సత్వగుణంచేత నశిస్తుంది. కనుక, నీవు సత్వగుణం మీాదనే ఆధారపడి, అధ్యాసను తొలగించుకో !

వాసనలు ప్రతిమనిషిలోనూ, మూడు రకాలుగా ఉంటాయి - తమోవాసనలూ, రజోవాసనలూ, సత్వవాసనలూ. ఈ వాసనలన్నీ నశిస్తేనే ఆత్మానుభవం కలుగుతుంది. ఇవి పోవటం ఎలా? నిద్రా బద్ధకాలు, తమోగుణాలు; రజోధర్మాలైన ఆటలూ వ్యాయామాలూ మొదలైన వాటిచేత సత్వగుణ ధర్మాలైన కావ్యవినోద, గానాది కళలచేతా పోగొట్టుకోటం లోకంలో చూస్తున్నాము. ఏ మారకుండా ఎప్పుడూ ఏదో ఒకపని చేస్తుండటం రజోగుణధర్మం - ఇది సత్వధర్మమైన ఉపాసనాదులవల్ల తగ్గిపోతున్నది. ఆసత్వగుణమో ? వేదాంత శ్రవణ, మనన, నిదిధ్యాసనలవల్ల నశిస్తుంది. కనుక, సత్వగుణాన్ని ఆశ్రయిస్తే, క్రమంగా అధ్యాస తొలగిపోతుంది.

శ్లో. ప్రారబ్ధం పుష్యతి వపు - రితినిశ్చిత్య నిర్మలః
ధైర్యమాలంబ్య యత్నేన - స్వాధ్యాసాపనయంకురు! ౨౭౯

తే. గీ. తనువు ప్రారబ్ధమున పుష్టిగను నటంచు
నిశ్చయించి వసింపుము, నిశ్చలముగ;
ధైర్యము వహించి తగిన యత్నంబొనర్చి
మాను మధ్యాస నిక మూలమట్టముగను.

ప్రారబ్ధమే ఈ శరీరాన్ని పోషిస్తున్నదనే నమ్మకంతో, నిశ్చలంగా ఉండు! ప్రారబ్ధం నశించిందాకా ఏమిచేసినా, ఈ శరీరంపోదు. కనుక ధైర్యం తెచ్చుకొని, ప్రయత్నపూర్వకంగా అధ్యాసను అంతరింప జేసుకో !

ప్రారబ్ధ మనేది పూర్వజన్మ కర్మలవల్ల ఏర్పడి, ఈజన్మకు కారణమయింది; ఆ ప్రారబ్ధ మున్నంతవరకూ ఈ శరీరాన్ని సముద్రం లోకి నెట్టినా, ఎదురీది వస్తుంది. ఇది నిశ్చయంగా తెలుసుకుంటే, ఆహార భయముండదు. చావు భయమూ ఉండదు. అన్నం నీళ్లూ లేకున్నా - ఈ దేహం బ్రదికి తీరుతుంది. ప్రారబ్ధమంతా నశించిందాకా చావదు. కనుక, భగవంతుడి మీద భారంవేసి హాయిగా ఉంటూ అధ్యాసను పోగొట్టుకో! - అని బోధిస్తున్నాడు సద్గురుమూర్తి.

శ్లో. నాహం జీవః పరం బ్రహ్మే - త్యద ద్వ్యావృత్తి పూర్వకం
వాసనా వేగతః ప్రాప్త - స్వాధ్యాసాపనయంకురు! ౨౮౦

తే. గీ. కాను జీవుడ; బ్రహ్మమేనే - నటంచు;
నఖిలమైన యనాత్మల నవలద్రోసి;
పూర్వజన్మల వాసనా పూర్వకముగ
సంభవించిన యధ్యాస సాగనంపు!

ఈ శరీరంలోనూ, మనసులోనూ, బుద్ధిలోనూ పరిమితమై ఉండే జీవుడను నేనెంతమాత్రంకాను. సర్వవ్యాపకంగా ఉండే ఆపరమాత్మనే నేను - అనే భావం బాగా స్థిరపఱచుకొని అనాత్మ వస్తువుల మీది వ్యామోహాన్ని విడిచిపెట్టు! పూర్వవాసనల వల్ల ఏర్పడి ఉండే అధ్యాసను పూర్తిగా విసర్జించు!

శ్లో. శ్రుత్యా యుక్త్యా స్వానుభూత్యా
జ్ఞాత్వా సార్వాత్మ్య మాత్మనః;
క్వచి దాభాసతః ప్రాప్త
స్వాధ్యాసాపనయంకురు ! ౨౮౧

క. శ్రుతిచేత యుక్తిచేతను
సతతానుభవంబుచేత సకలాత్మునిగా
స్మృతికల్గి; కొంచెమైనను
మతిలోనధ్యాస మెదలు; మానుముదానిన్.

ఉపనిషత్తులు చదివి అర్థం చేసుకున్నందువల్లా, తెలివిగా ఆలోచించి తర్కించి నందువల్లా, స్వయంగా ఆర్జించిన అనుభవంవల్లా, నీలోని ఆత్మయే అందరిలోని ఆత్మ అనే సంగతి గట్టిగా గ్రహించు! ఏయే జన్మల నుంచో యందాకా ఏర్పడి ఉండే అధ్యాస - ఏ కొంచెం మనసులో మెదలినా, వెంటనే విసర్జించు !

శ్లో. అన్నాదాన విసర్గాభ్యా -మీషన్నాస్తి క్రియా మునేః
తదేక నిష్ఠయా నిత్యం - స్వాధ్యాసాపనయంకురు ! ౨౮౨

క. అన్నము తినుట, విసర్గము
నన్నపనులు మునిమనస్సు నంటవు కనుకన్;
పన్నిన యధ్యాసను వి
చ్ఛిన్నము గావింపు! మాత్మ చెందిన మతివై.

అన్నం తినటంలోకానీ, మలమూత్రాలు విసర్జించటంలోకానీ, యోగికి, ఏలాంటి ప్రమేయమూ ఉండదు. ఆక్రియల నతడెంత మాత్రం పట్టించుకోడు. కాబట్టి, నీవు కూడా నిరంతరం ఆత్మ నిష్ఠలోనే ఉండి; అధ్యాసను త్రోసిరాజును చెయ్యి !

శ్లో. తత్వమస్యాది వాక్యోత్థ - బ్రహ్మాత్మైక త్వ బోధతః
బ్రహ్మణ్యాత్మత్వ దార్ఢ్యాయ - స్వాధ్యాసాపనయంకురు ! ౨౮౩

తే. గీ. తత్త్వ మస్యాది వాక్య బోధంబు వలన
బ్రహ్మమున కాత్మకున్న సంబంధ మెఱిగి;
బ్రహ్మమందాత్మ కడు దృఢపడుట కొఱకు
మాను మధ్యాసనిక మూలమట్టముగను!

తత్త్వమస్యాది మహావాక్యాలు గురుముఖంగా విన్నావుకదా? తనలోని ఆత్మే – సకల విశ్వంలోనూ వ్యాపించి ఉండే పరమాత్మ; పిండాండంలో ఉండేదే బ్రహ్మాండంలోనూ ఉండేది – అంటూ ఉపనిషత్తులు కూడా మహావాక్యాల ద్వారా బోధిస్తున్నాయికదా! బ్రహ్మమందే ప్రత్యగాత్మ స్థిరంగా ఏకం కావటానికై, అధ్యాసను పూర్తిగా విడిచిపెట్టు!

శ్లో. అహం భావస్య దేహేస్మిన్ – నిశ్శేష విలయావధి
సావధానేన యుక్తాత్మా – స్వాధ్యాసాపనయంకురు! ౨౮౪

క. ఈవపువేననెడి యహం
భావము నిశ్శేషముగను వదలెడి దాకన్
నీవధ్యాసను దూరము
కావింపుము! సావధాన గతి ధ్యానమునన్.

జడమైన ఈ స్థూల శరీరంలో నేననే అహమ్మిభావం ఆక్రమించుకొని, అంతానాదేననే మమకారంతో అజ్ఞానభారాన్ని మోస్తున్నది. ఏ కొంచెం కూడా అహంభావం లేకుండా నశించేంతవఱకూ, అధ్యాస తొలగటం కల్ల. దేహాత్మ భ్రాంతే బ్రహ్మాత్మ బుద్ధికి ప్రతిబంధకం. కాబట్టి, సావధానంగా, యుక్తులతో తర్క-వితర్కాలు చేసి, అధ్యాసనెట్లైనా నిశ్శేషంగా తొలగించుకో!

గీత ఏమంటుంది?

శ్లో. శనైః శనై రుపరమే – ద్బుద్ధ్యా ధృతి గృహీతయా
ఆత్మసంస్థం మనః కృత్వా – నకించిదపి చింతయేత్. (గీత 6-5)

ధైర్యమవలంబించి బుద్ధిచేత మెల్లమెల్లగా మనసును బుజ్జగించి ఉపరతిలో దించి, ఆత్మలో చొప్పించి, ఏమాత్రం చింత లేకుండా ఉండమని బోధిస్తుంది. అలాచేసి, అధ్యాసను నిర్మూలించు !

శ్లో. ప్రతీతి ర్జీవ జగతో - స్స్వప్నవద్భాతి యావతా
తావన్నిరంతరం విద్వన్! - స్వాధ్యాసాపనయంకురు! ౨౮౫

ఆ. వె. స్వప్నమట్లు జీవజగము లెందాక ద
ర్శింతు వించుకైన నంతదాక;
అనవరతము విధిగ నధ్యాస తొలగించు
చుండవలయు; చూడ వోయి బుధుడ !

స్వప్నంలో వలెనైనా, నీకెంత వఱకూ జీవులూ, ప్రపంచమూ, కానవస్తుంటాయో, అంతవఱకూ - ఓయి విద్వాంసుడా! నీవు నీ అధ్యాసను విధిగా తొలగించుకుంటూ ఉండవలసిందే సుమా !

భారతదేశంలో రెండు తెగల యోగులున్నారు; ప్రపంచంతో అవసరం లేకుండా ఎల్లప్పుడూ ధ్యానంలోనే - జీవైక్యసంధానంలోనే, ఉండేవాళ్లు. సమర్థ రామదాసూ, శ్రీ రామకృష్ణ పరమహంసా, రమణ మహర్షి, మొదలైన మహాత్ములు. ఇంకో తెగవాళ్లు రాజయోగులు - వాళ్లు సంఘంలో కలిసి మెలసి జీవిస్తూ, నిత్యానందంలో మునిగి తేలుతుంటారు. శ్రీకృష్ణుడూ, జనకమహారాజూ, మొదలైనవాళ్లు. ఇరుతెగలవాళ్లనూ - లోకం పూజించి, గౌరవిస్తూనే ఉంది.

శ్లో. నిద్రాయా లోకవార్తాయాః - శబ్దాదేరపి విస్మృతేః
క్వచిన్నావసరం దత్వా - చింతాయాత్మా మాత్మని. ౨౮౬

ఆ. వె. నిద్రచేత లోక నిచయవార్తలచేత
విషయ సమితిచేత విస్మరింప
బోక కొంచెమైన; పూర్తిగా మనసు నీ
యాత్మ యందె యుంచు, మనవరతము !

నిద్రచేతకానీ, లోకవార్తలచేతకానీ, విషయాదుల చేతకానీ, ఆత్మను కొంచెమైనా మఱచి పోవటాని కవకాశ మీయకుండా, మనసులో నిరంతరం ఆత్మనే భావించు !

సాధకుడి సాధన కెన్నో భంగాలు ! ధ్యానంలో నిద్రముంచుకు వస్తుంది; మౌనంగా ఉండినప్పుడు లోకవార్తల దేపనిగా రేడియో లోనూ, టెలివిజన్ లోనూ వినిపిస్తుంటాయి, ఆకర్షణీయంగా చుట్టూ భార్యాబిడ్డలూ - శబ్ద స్పర్శ రూప రస గంధాలూ, ఇంటి వ్యవహారాలూ, బంధువుల రాకపోకలూ- ఆత్మను మఱచి పోవటానికి కారణాలౌతాయి. అలాంటి అవకాశం లేశం కూడా ఇవ్వవద్దంటున్నాడు, గురుదేవుడు.

శ్లో. మాతా పిత్రోర్మలో ద్భూతం
మలమాంసమయం వపుః
త్యక్త్వా చండాలవత్ దూరం
బ్రహ్మీభూయకృతీ భవ ! ౨౮౮

తే. గీ. తల్లిదండ్రుల ముఱికిచేతను జనించి;
మాంస మలమయమైన నీమైని, దూర
ముగను-నొక యంటరాని వానిగ-త్యజించి;
బ్రహ్మమై నీవు పూర్ణ జీవనముగనుము !

ఈ స్థూల శరీరం తల్లిదండ్రుల శుక్రశోణితాలనే ముఱికివల్ల పుట్టింది. మలమూత్రాలతోనూ రక్తమాంసాదులతోనూ నిండింది. ఇలాంటి ఈ దేహాన్ని అభిమానించక, ఒక అంటరానివాడిని చూచి నట్టుగా అసహ్యించుకో !నీవీశరీరానివి కావని, కేవలం బ్రహ్మానివని భావించు !

శ్లో. ఘటాకాశం మహాకాశ - ఇవాత్మానం పరాత్మని;
విలప్యాఖండ భావేన - తూష్ణీం భవ ! సదామునే ! ౨౮౯

తే. గీ. జీవుడి నఖండ బ్రహ్మముజేర్చి; కుండ
గలుగు నాకాశమును మహాకాశమందు
కలిపి నట్టులు; వాని యైక్యతను ధ్యాన
మూలమున గాంచి; శాంతిసంపూర్తి గనుము !

అంతవంతమైన జీవుడి, ననంతమైన బ్రహ్మంలో లీనంచేసి - ఘటాకాశం మహాకాశంలో కలిపినట్లుగా - జీవబ్రహ్మాల ఏకత్వాన్ని ధ్యానమూలకంగా నిరంతరం సాధిస్తూ, హాయిగా మౌనంగా ఉండు !

ఘటాకాశ - మహాకాశాల దృష్టాంతం వేదాంతంలో విరివిగా వచ్చేదే ! కుండలోని ఆకాశం - అది పగిలిపోతే - మహాకాశంలో కలుస్తుంది.

మనమంతా నిజానికి ఆకాశంలోనే తిరుగు తున్నాం. భూమిని ఆకాశం కౌగలించుకొని ఉందికదా? మనచుట్టూ ఆకాశం ఉండబట్టే, మనమాట లితరులకూ, ఇతరుల మాటలు మనకూ వినిపిస్తున్నాయి.

"ఇదం ద్యావా పృథివీ సత్యమస్తు పితర్ మాతర్" - ఈ ద్యూకాశమూ భూమీ నిజానికి తండ్రీ, తల్లీ - అని హెచ్చరిస్తుంది సంధ్యావందన మంత్రం. ఎందుకనీ? ఆకాశం సహకరిస్తేనే భూమి మనకు పంటలూ మొదలైన విస్తుంది. అంతేనా? భూమిలో బంగారూ మొద లైన లోహాలు దొరుకుతాయి. అసలు మన శరీరాలే మట్టి శరీరాలు !

అంతులేని ఆకాశమే మన ప్రపంచమంతా ఒకానొక ఆవరణంలో చుట్టూ గోడలు కట్టుకొని, ఇది మాయిల్లు-అంటున్నాము. ఆ గోడలు తొలగిస్తే, ఉండేది ఆకాశమే కదా? ఆకాశంలో సూర్యుడూ, చంద్రుడూ, నక్షత్రాలూ-ఉన్నాయి. ఐతే, వేటినీ ఆకాశం అంటడంలేదు. అలాగే ప్రతిప్రాణిలోనూ ఆత్మ ఉంది. చుట్టూ ఆత్మే ఉంది. అది దేన్నీ అంటడంలేదు. అంటదు. గాలినే చూడలేని వాళ్ళం, ఆకాశాన్ని చూడలేని వాళ్ళం; అంతకంటే సూక్ష్మమైన ఆత్మను చూడగలుగు

తామా? ఇంకో మాట! ఆకాశమనేది, వెలుపలేకాదు - లోపల కూడా వ్యాపించే ఉంది. ధ్యానం చేయగా చేయగా మనసు నిర్మలమైతే, లోపలి ఆకాశం ప్రత్యక్షమౌతుంది. దాన్ని దహరాకాశమంటారు. అందులో సమస్త ప్రపంచాన్నీ మనం చూడవచ్చు. సూర్య-చంద్ర-నక్షత్రాలు కూడా దర్శన మీయగలవు. కండ్లు మూసుకొని మౌనంగా కూర్చోగలిగితే, నీదృష్టి ప్రపంచమంతా వ్యాపించగలదు. పూర్వం మన మహర్షులలా చూచే అన్ని సంగతులూ వివరించినారు.

శ్లో. స్వప్రకాశ మధిష్ఠానం - స్వయం భూయ సదాత్మనా
బ్రహ్మాండ మపి పిండాండం - త్యజ్యతాం మలభాండవత్. - ౨౮౯

తే. గీ. సకల దృశ్య ప్రపంచంబునకు పునాది
స్వప్రకాశమునగు పరబ్రహ్మమీవె
యగుచు; బ్రహ్మాండమునను పిండాండమునను
నిరసనము చూపు! మలభాండ నిచయమట్లు.

ఈ దృశ్య ప్రపంచ వస్తువు లన్నిటికీ ఆధారమై, స్వయంప్రకాశమానమైన బ్రహ్మానివే నీవై, ఈ బ్రహ్మాండాన్నీ, పిండాండాన్నీ - మలపుకుండలవంటివిగా - తిరస్కరించు! ఆత్మ చైతన్యం వల్లనే యీ స్థూల-సూక్ష్మ-కారణ శరీరాలు నిల్చిపనిచేస్తున్నాయి. అంటే పంచకోశాదు లన్నీ ఆత్మ మీదనే ఆధారపడి ఉన్నాయి. అందువల్ల ఆత్మ అన్నిటికీ పునాది. స్వయంప్రకాశమై కాంతులు విరజిమ్ముతుంది. వ్యష్టిని పిండాండమనీ-సమష్టిని బ్రహ్మాండమనీ-అంటారు. రెండూ అనాత్మలే కనుక, వాటిని తిరస్కరించు!

శ్లో. చిదాత్మని సదానందే - దేహారూఢా మహంధియం
నివేశ్య లింగ ముత్సృజ్య - కేవలోభవ సర్వదా. ౨౯౦

తే. గీ. స్థిరపడిన దేహమందు గుర్తింపు నాత్మ
కును మరల్చియు - జ్ఞానంబు, మనికి, నిత్య
సుఖము భావించి - నిరసించి సూక్ష్మవపువు;
కేవలుడవు స్వతంత్రుడవై వసింపు!

ఇంత వఱకూ స్థూల దేహంమీద స్థిరపడిన, నేను - నేననే గుర్తింపు నిప్పుడు ఆత్మకు మళ్ళించు! ఉనికీ, జ్ఞానమూ, నిత్యానందమూ అంటే, సచ్చిదానందాత్మకమైన పరబ్రహ్మంలోకి ఆ గుర్తింపును చొప్పించు! ఇంక సూక్ష్మశరీరంతోనూ నిరభిమానంగానే ఉండు! ఇలా రెండు దేహాలనూ నిరసించి, సంపూర్ణ బ్రహ్మస్వరూపుడవై తరించు!

లింగ ముత్సృజ్య - సూక్ష్మశరీరానికే లింగశరీరమని కూడా పేరు. ఇంతకూ అంతఃకరణమే కదా, సూక్ష్మ శరీరం ? సోఽహం భావంతో ధ్యానిస్తే, అన్ని వృత్తులూ మాని పరమాత్మాకారాన్ని ధరిస్తుంది. అదే లింగశరీరం భంగపాటు! ఇదే జీవన్ముక్త స్థితి కూడా.

శ్లో. యత్రైష జగదాభాసో - దర్పణాంతఃపురం యథా;
తద్బ్రహ్మాహ మితి జ్ఞాత్వా - కృతకృత్యో భవిష్యసి. ౨౬౧

తే. గీ. ఎందు నాభాసమై తోచునెల్ల విశ్వ ?
మద్ద మందున బింబించి నట్టి పురము
వోలె; నాబ్రహ్మమే నీవుపో ! గ్రహించి;
ధన్యతను గాంచు, మపరోక్ష దర్శనమున.

అద్దంలో బింబించే అంతఃపురం - లేక, పురం మోస్తరుగా, సూక్ష్మమైన పరబ్రహ్మంలో మహత్తైన బ్రహ్మాండమంతా బింబిస్తున్నది, ఆభాసగా, అంటే, అద్దంలో నీ ప్రతిబింబమే చూడు! - కుడి ప్రక్క ఎడమప్రక్కగా, ఎడమప్రక్క కుడిప్రక్కగా కనపడటంలేదూ? నీవుత్తరానికి తిరిగితే, ఆ నీబింబం దక్షిణానికి తిరుగుతుంది. నీవిటుచూస్తే అది అటుచూస్తుంది - ఇదే ఆభాస!

బ్రహ్మానికీ – ప్రతిబింబమైన బ్రహ్మాండానికీ ఎంతభేదం! ఆత్మ సూక్ష్మమూ, విశ్వం స్థూలమూ! నీవారశూకవత్తన్వీ పీతాభాస్వత్యణూపమా – తస్యాః శిఖాయాః మధ్యే పరమాత్మా వ్యవస్థితః – వరిముల్లు వాసిగా బుద్ధి అణువై జ్యోతి స్వరూపమై సూక్ష్మాతి సూక్ష్మంగా ఉన్నది. దాని కొన మధ్యలో ఉన్నదా పరమాత్మ! – అంటుంది శ్రుతి. ఇంత సూక్ష్మమైన పరమాత్మ – ఈ బ్రహ్మాండాన్నంతా తనలో ఇముడ్చుకుంటున్నది. ఎంతాశ్చర్యం ?

అజ్ఞానంచేత జగత్తు ఉన్నట్టుగా తోస్తుంది. అద్దంలో పట్టణం లేనట్టే, పరమాత్మలో ప్రపంచం కూడా లేదు. పరమాత్మ బ్రహ్మాండానికి అధిష్ఠానం ! అధిష్ఠాన పరబ్రహ్మన్నే నేను – అనే జ్ఞానం కలిగితే, దృశ్య ప్రపంచం పటాపంచలై పోతుందిగా ? ఈ యపరోక్షజ్ఞానంచేత, నీవు కృతార్థుడవని, గురువు శిష్యుని దీవిస్తున్నాడు.

శ్లో. యత్సత్య భూతం నిజరూపమాద్యం
చిదద్వయానంద మరూప మక్రియం
తదేత్య మిథ్యావపు రుత్సృజేత
శైలూషవ ద్వేష ముపాత్త మాత్మనః. ౨౬౨

ఉ. ఏది సదా నిజంబొ? మఱి యే యది నీదగు నాది రూపమో ?
ఏదియొ జ్ఞాన? మద్వయమొ? యేది యనంత సుఖంబొ?అక్రియం
బేదొ? అరూపమేదొ? అది యౌవయి; వీడు నటుండు వేషమున్
మాదిరిగా నసత్యమగు మానవదేహముపై మమత్వమున్.

ఏది నిత్యసత్యమో? ఏది నీ అసలైన ఆదిమరూపమో? ఏది పరిపూర్ణ జ్ఞానమో? ఏది శాశ్వతానందమో? రెండవ వస్తువే లేనిదో? ఏది క్రియా రూప రహితమో? – అదే నీవై, నటుడు వేషాన్ని విడిచినట్టుగా – మిథ్యాశరీరం మీద మమకారాన్ని విడిచిపెట్టు!

మిథ్యాశరీరాలు – స్థూల – సూక్ష్మ – కారణ శరీరాలు – ఈ మూడూ, ఆత్మమీది అధ్యాస లే! నటుడు వేషం విడిచినట్టుగా–అంటే, రాజువేషంలోనో! ఆడవేషంలోనో, నటుడున్నాడనుకుందాం. అలంకారాలన్నీ విడిచి వేషం తీసేస్తే, మామూలు మనిషేగా? రాజూకాడు, ఆడదీకాడు – ఆత్మవైన నీవు, శరీరమనే ఉపాధిలో ఉండి భ్రాంతి పడుతున్నావు !

## 293-297 అహం పద విచారం

శ్లో. సర్వాత్మనా దృశ మిదం మృషైవ
నై వాహ మర్థః క్షణికత్వ దర్శనాత్
జానా మ్యహం సర్వమితి ప్రతీతిః
కుతోఽహ మాదేః క్షణికస్య సిద్ధ్యేత్. 293

ఉ. అన్ని విధాల దృశ్యమగునట్టి ప్రపంచ మబద్ధ; మట్లె నే
నన్న యహంబుకూడ నిజమైనదికాదు; క్షణక్షణంబు మా
ర్పున్నది కాన; నాకు తెలియున్ సకలం - బనుమాట కర్థమే
మున్న? దహం కరింపె! క్షణికోక్తులు భ్రాంతి యుతంబులే కదా?

ఆధ్యాత్మిక దృష్టితో చూచినప్పుడు, ఈ దృశ్యప్రపంచమంతా అబద్ధమే ! ఆత్మ ఒక్కటే సత్యం. అహం–నేను–అనేది ఆత్మకే చెల్లింది. "అహమిత్యేవ విభావయే భవానీం" అని లలితా సహస్రనామంలోని ప్రార్థనా శ్లోకపాదం. అహమనే పదానికింకో అర్థం – అకారాది హకారాంతంగల ఏబది అక్షరాలు – ఓంకారంలో నుంచీ పుట్టినవి.అదే వశిన్యాది వాగ్దేవతలు !

ఇలా శాశ్వతమైన ఆత్మకూ అక్షరాలకూ వాడవలసిన అహం శబ్దాన్ని మనం దురుపయోగం చేస్తున్నాము. క్షణికమైన దృశ్య పదార్థాల కుపయోగిస్తున్నాము.

ప్రపంచమే క్షణిక దృశ్యమైనందున అబద్ధమైతే, ఇక క్షణిక మైన అహంకారంతో కూడిన ఈ శరీరం నిజమా? అహంకారం నిజమా? అన్నీమారిపోతూ ఉండేవే! ఇప్పుడున్నదింకో క్షణాని కుండటం లేదు - అనుభవసిద్ధమే కదా?

ఎన్ని విధాలుగా చూచినా అన్ని విధాలుగానూ (సర్వాత్మనా) ఈ దృశ్య ప్రపంచం, మృష - కల్ల! ఈ దేహేంద్రియ ప్రాణాదికం - క్షణికం, జడం, అనేకం, మన వ్యవహారంలోనే చూడండీ! నేను చూస్తున్నానని ఒకసారీ, నేను వింటున్నా-నని ఇంకోసారీ, నేను వాసన చూస్తున్నా-నని మఱోసారీ, నేను తాకుతున్నా-నని మఱీ ఇంకోసారీ- అంటున్నాము. చూచేది కన్నూ, వినేది చెవీ, వాసన చూచేది ముక్కూ, తాకేది చర్మమూ - ఇవన్నీ నేను - నేనంటున్నాయన్న మాట! ఇంద్రియాలన్నీ జడపదార్థాలే! ఒకటి చేసేపనిని ఇంకొకటి చేయలేదు - ఇట్టివి నేను- అవుతాయా? సోఽహం - ఆపరమాత్మనే నేను - అనే మంత్రమెక్కడ? ఈ నేనెక్కడ? కనుక నేనూ, నాకీ-అనే అహంకారం కూడా అబద్ధమే! బాల్యంలోనూ, యౌవనంలోనూ, కౌమారంలోనూ, వృద్ధాప్యంలోనూ - ఈ నేను ఎన్నో మార్పులను అనుభవిస్తూంది. ఇంక, "నాకన్నీ తెలుసు"- ననుకోటం అహంకార లక్షణం. ఇదెంత మాత్రం నిజం? క్షణికోక్తులన్నీ భ్రాంతులేకదా? అంతఃకరణమైనా చైతన్యం ప్రతి ఫలిస్తే ఇతర వస్తువులను గుర్తింపగలిగేదే, కాని, తన్ను తాను తెలియగలదా? కనుక, నాకన్నీ తెలుసు- అనటంలో అర్థం లేదన్నమాట!

శ్లో. అహం పదార్థ స్త్వహమాది సాక్షీ
నిత్యం సుషుప్తా వపి భావదర్శనాత్
బ్రూతే హ్యజో నిత్య ఇతి శ్రుతి స్స్వయం
తత్ప్రత్యగాత్మా సదసద్విలక్షణః. ౨౯౮

చ. అహమనుమాట కర్థమగు నట్టి నిజందగు నేను-మాత్ర మీ
యహమును మున్నుగా గలుగునన్నిటి సాక్షి; సుషుప్తినైన తా
నృహ విడనాడకుండు; శ్రుతి చెప్ప నిజంబని నిత్యమంచు నా
యహ మదె ప్రత్యగాత్మ! వెలియై సదసత్తులకంటె, వేఱగున్.

ఐతే, నిజమైన "అహం - నేను"- అహంకారమూ మొదలైన వాటి కన్నిటికీ ఆది నుంచీ సాక్షీ మాత్రంగా ఉండేది. అదెప్పుడూ ఉంటుంది - గాఢనిద్రలో కూడా శ్రుతి స్వయంగా దాన్ని పుట్టుకలేని దనీ, శాశ్వతమనీ చాటుతుంది. కాబట్టి, అది ప్రత్యగాత్మ - స్థూల, సూక్ష్మ శరీరాల కంటే విలక్షణ మయింది.

శ్లో. వికారిణాం సర్వవికారవేత్తా
నిత్యావికారో భవితుం సమర్హతి
మనోరథ స్వప్న సుషుప్తిషు స్ఫుటం
పునః పునః దృష్ట మసత్త్వ మేతయోః. ౨౦౨

చ. మారు సమస్త వస్తువుల మార్పు లెఱింగెడిదేదొ? దానికే
మారుపు లేదటంట కనుమాన మెతే; దదినిత్యమైనదై
సారెకు విస్ఫుటం బగుచు స్వప్న సుషుప్తుల, జాగరంబునన్;
పేరుకు లేవహంకృతియు విశ్వమటంచును నిర్ణయించెడిన్.

మారే వస్తువులన్నిటిలోని మార్పులు తెలుసుకునేదేదో, అది తప్పక మార్పులేనిదై నిత్యమై ఉంటుందనటంలో సందేహంలేదు. స్థూల సూక్ష్మ శరీరాల అసత్యత్వాన్ని మాటిమాటికీ విశదంగా, ఊహాలోనూ, కలలోనూ, గాఢనిద్రలోనూ చూడటం జరుగుతుంది.

కలలోనూ, గాఢనిద్రలోనూ స్థూల శరీరం కానరాదు. గాఢ నిద్రలో సూక్ష్మశరీరం కానరాదు; కాబట్టి వాటి అసత్యత్వం అను భవంలో చూడటం జరుగుతున్నది.

శ్లో. అతోఽభిమానం త్యజ మాంసపిండే
పిండాభిమానిన్యపి బుద్ధి కల్పితే;

కాలత్రయాబాధ్య మఖండ బోధం
జ్ఞాత్వా స్వమాత్మాన ముపైహి శాంతిం. ౨౯౮

ఉ. కావున మాంసపిండమగు కాయము నందును; బుద్ధి కల్పితం
బై విలసిల్లు సూక్ష్మతను వందును; లేక, అహంబునందునన్,
నీవభిమానముం దొలగి నిల్చి; త్రికాలములందబాధ్యమున్,
కేవల బోధ, మాత్మ, పరికించి వహింపుము శాంతి నెప్పుడున్.

కాబట్టి మాంసపిండమూ, అవయవాలతో కూడినదీ, అనిత్యమూ, ఎప్పుడూ మారుతూ ఉండేదీ ఐన స్థూల శరీరమందూ, బుద్ధి కల్పితమై చైతన్య ప్రతిబింబమై అహంకార మమకారాలను ప్రదర్శించే జీవునియందూ, నేనూ-నాదీ-అనే అభిమానాన్ని విడిచిపెట్టు! త్రికాలాబాధ్యమూ, నిత్యమూ, అఖండ జ్ఞానమూ ఐన ఆత్మయే నీస్వరూపంగా తెలుసుకొని, శాంతి సుఖాలనుభవించు!

శ్లో. త్యజాభిమానం కులగోత్ర నామ
రూపాశ్రమే ష్వార్ద్ర శవాశ్రితేషు;
లింగస్య ధర్మానపి కర్తృతాదీం
స్త్యక్త్వా భవా ఖండ సుఖస్వరూపః! ౨౯౯

ఆ. వె. పచ్చిపచ్చి శవము వంటి దేహమునకే
కులము నాశ్రమమును గోత్రనామ
రూపములును; లింగ రూపంబునకె కర్తృ
తాద్యహంబు: విడిచి, ఆత్మవగుము!

కులమూ, గోత్రమూ, నామమూ, రూపమూ, ఆశ్రమమూ - ఇవన్నీ పచ్చి పీనుగవంటి యీ స్థూలదేహానికి సంబంధించినవే. వీటి మీాది అభిమానాన్ని పూర్తిగా విడిచిపెట్టు! అదే ప్రకారంగానే కర్తృత్వాది అహంకార ధర్మాలన్నీ సూక్ష్మ శరీరానికి సంబంధించినవి వాటిని కూడా అభిమానించక విడిచిపెట్టు! అఖండ సుఖస్వరూపమైన ఆత్మవే నీవై హాయిగా ఉండు!

కులగోత్రాదులన్నీ స్థూలదేహంతో నశించిపోయ్యేవే, కనుక, ఈ దేహం పచ్చిపీనుగ వంటి దయింది, జ్ఞానోదయంతో.

# 298-319 అహంకార త్యాగం

శ్లో. సంత్యన్యే ప్రతిబంధాః - పుంసః సంసార హేతవో దృష్టాః
తేషామేషాం మూలం - ప్రథమ వికారో భవత్యహంకారః.
298

తే. గీ. కలవు మనిషికి సంసార కారణంబు
లితర ప్రతిబంధకము లవియెన్ని యేని;
అన్నిటికి మూలమొక్క మాయా వికార
మగు నహంకారమేనని అరయవలయు.

స్థూల సూక్ష్మ శరీరాల మీాది అభిమానం, అనాత్మల అధ్యాస ఆత్మమీాద - ఉండటమేకాక, మనిషికి సంసారకారణాలైన ప్రతిబంధకాలు - కోరికలూ, ద్వేషాలూ మొదలైన వెన్నో ఉన్నాయి. అన్ని అనర్థాలకూ మాయావికారమైన అహంకారమే ! అదిలేకపోతే కోరికలూ లేవు; జానిసత్వమూలేదు. అనుభవించే కర్తృత్వమే నశిస్తే, ఇంకెక్కడి వాసనలు? జ్ఞానాగ్ని అవన్నీ భస్మమై పోతాయిగా !

శ్లో. యావత్స్యాత్స్వస్య సంబంధోఽ
హంకారేణ దురాత్మనా;
తావన్న లేశ మాత్రాపి
ముక్తి వార్తా విలక్షణా.
299

ఆ. వె. ఎంతదాక నరునికీ దురహంకార
మంటి యుండు కొంచె? మంతదాక
సాటిలేని ముక్తి సంగతి గూర్చిన
మాటలేదు లేశమాత్రమైన.

ఎందాకా మనిషికీ చెడ్డ అహంకారంతో సంబంధముంటుందో, అందాకా విలక్షణమైన ముక్తిని గూర్చిన ప్రసంగం కొంచెమైనా ఉండదు సుమా! అహంకారం పూర్తిగా నశిస్తేనే ముక్తి.

శ్లో అహంకార గ్రహాన్ముక్తః- స్వరూప ముప పద్యతే
చంద్ర వత్ విమలః పూర్ణ - స్సదానంద స్స్వయంప్రభః. ౩౦౦

తే. గీ. అలయహంకార మనెడి గ్రహంబు నుండి
ముక్తు డగు వాడె నిజరూపమున వెలుంగు;
చంద్రునింబోలె విమలుడై సాంద్రుడగుచు;
పరమ సంతోషియై స్వయంప్రభ వహించి.

అహంకార మనేదే ఒక రాహుగ్రహం, రాహుగ్రహం చంద్రుని కబళించి కనపడకుండా చేసినట్టుగానే, అహంకారం ఆత్మ స్వరూపాన్ని ఆవరించి, కనపడకుండా చేస్తున్నది. ఆ రాహువు విడిచిపెట్టిన పిమ్మటనే పూర్ణచంద్రుడు దర్శన మిస్తున్నాడు. అట్లనే అహంకారమనే అధ్యాస పూర్తిగా తొలగిన తర్వాతనే నిత్య సుఖస్వరూపమైన చిద్రూపం స్వయంప్రకాశ మాతున్నది. అప్పుడా సాధకుడు అంటు సొంటులు లేనివాడై సదానందుడై స్వయంప్రభతో దీపిస్తాడు.

గ్రహణ మనేది ప్రపంచాని కంతా తెలిసిన భారతీయ పౌరాణిక విశ్వాసం. రాహుకేతువు లిద్దరూ రాక్షసులు, వాళ్లను సూర్యచంద్రు లిద్దరూ అమృతం త్రాగకుండా అడ్డుపడినారు. ఆశత్రుత్వాన్ని మనసులో ఉంచుకొని, వాళ్లు వీళ్లను అప్పుడప్పుడూ మింగు తుంటారు. పూర్ణిమనాటి రాత్రి చంద్రగ్రహణమూ, అమావాస్య పగటిపూట సూర్యగ్రహణమూ. ఈ గ్రహణాలకు విజ్ఞాన శాస్త్ర కారణాలిప్పుడు వేఱుగా బోధింపబడుతున్నాయి.

శ్లో. యోవా పురేసోఽహ మితి ప్రతీతో
బుద్ధ్యా ప్రక్లుప్త స్తమసాఽతి మూఢయా
తస్యైవ నిశ్శేషతయా వినాశే
బ్రహ్మాత్మ భావః ప్రతిబంధ శూన్యః. ౩౦౧

ఉ. ఏయది బుద్ధిచేత సృజియింపబడున్, భ్రమగొల్పు మాయచే?
నేయది కాయమందొదవి - యేనుపలాన - యటంచుబల్కు? నా
ప్యాయత; నాయహంబనెడి భావము పూర్తి నశించి నప్పుడే
డాయును బ్రహ్మ భావము దృఢంబగుచున్, ప్రతిబంధ శూన్యమై.

ఏది బుద్ధిచేత కల్పితమో ? ఏది తామసమనే అవిద్య చేత ఎక్కువగా భ్రాంతి పరుస్తుందో? – ఏది శరీరంలో – నేను పలానా – అని పిస్తుందో? ఈ యహంకారం పూర్తిగా నశించినప్పుడే బ్రహ్మాత్మ భావం సాధకుడికి లభిస్తుంది.

స్థూల శరీరాన్ని నేనేననే అభిమానం బుద్ధి బలంగా ఊహించటం వల్ల ఏర్పడుతుంది. తమస్సుతో కూడిన అవిద్యావరణం చేత కప్పబడి, సత్యం గ్రహించలేక భ్రాంతి పెరుగుతుంది. ఇలా భ్రమించిన బుద్ధి – నేను పలానా – అంటుంది.

అహంకారం పూర్తిగా నశిస్తేనే – నేనాత్మను; నాలోని ఆత్మే అందరిలోని పరమాత్మ – అనే ఎఱుక పొటమరిస్తుంది.

శ్లో. బ్రహ్మానంద నిధిర్మహా బలవతా - హంకార ఘోరాహినా
సంవేష్ట్యాత్మని రక్ష్యతే గుణమయై - శ్చండై స్త్రిభిర్మస్తకైః
విజ్ఞానాఖ్య మహాసినా శ్రుతిమతా - విచ్ఛిద్య శీర్షత్రయం
నిర్మూల్యాహి మిమం నిధిం సుఖకరం - ధీరోఽభోక్తుంక్షమః. ౩౦౨

మ. అలరున్ మేన రహస్యమైన నిధి బ్రహ్మానంద; మాచుట్టుమున్
బలవంతంబు భయంకరం బయిన సర్పంబై యహంకార, మా
తలమూడు గుణాలగాచు తనకై; తజ్జుండు జ్ఞాని నా
తలలన్ వేదమతంబుచే నఱికినన్; దక్కున్ నిధానం బికన్.

బ్రహ్మానందమనే నిధిని, బలవంతమూ భయంకరమూ ఐన అహంకారమనే పాము చుట్టుకొని ఉంది. దానికి మూడు గుణాలూ మూడు పడగలైనాయి. ఆ ఘోరసర్పం బుస కొడుతూ తన స్వార్థం

కోసం ఆ నిక్షేపాన్ని కాపాడుకుంటూ ఉంది. హృదయక్షేత్రంలోనే ఉండే ఆబంగారు పాతర జోలి కెవ్వరూ పోలేకుండా ఉన్నారు. నూటికి కోటికెవడో మహాధీరుడైనవాడు, విజ్ఞాన మనే పదునైన ఖడ్గంతో, శ్రుతి ప్రమాణంగా, ఆ మూడు తలలనూ తెగనఱికితే, హాయిగా ఆ నిధిని పొందవచ్చు.

శ్లో. యావద్వా యత్కించిత్ - విషదోష స్ఫూర్తి రస్తిచే ద్దేహే
కథమారోగ్యాయ భవేత్ - తద్వదహంతాపియోగినో ముక్త్యై. 303

తే. గీ. ఎంత వఱకుండు విషదోష మించుకైన ?
నంతవఱకత డారోగ్యవంతుడెట్లు ?
ఆ ప్రకార మహంకార మది రవంత
పూనెనా ? యోగికైనను ముక్తి యెట్లు ?

ఎందాకా పరవంతైనా విషదోషం శరీరాన్ని అంటి ఉంటుందో, అందాకా అతడారోగ్యవంతు డనటానికి ఆస్కారం లేదు. అలాంటిదే అహంకార ప్రభావం కూడా స్వార్థమనే అహంకారం ఏ లేశమైనా తగిలి ఉన్నంత వఱకూ, యోగికైనా సరే! - ముక్తి లభించటం సాధ్యంకాదు.

శ్లో. అహమోఽత్యంత నివృత్త్యా - తత్కృత నానావికల్ప సంహృత్యా
ప్రత్యక్తత్త్వ వివేకాది - దమమస్మీతి విందతే తత్త్వం. 304

తే. గీ. మూలమట్టు మహంకారమును త్యజించి
దాని నానావికల్పాలు మానిపించి;
ప్రత్యగాత్మ విచారంబు వలన, సత్య
మరసి. అదె నే నటంచు నీవనుభవించు !

ఊచమట్టుగా అహంకారాన్ని అంతరింపజేయటం ద్వారా, ఆ అహంకారంవల్ల చెలరేగే విపరీతమైన మానసిక తరంగాలను అప్పు

చేయటం ద్వారా, ప్రత్యగాత్మను విచారణ చేయటం ద్వారా, నేనాత్మ ననే సత్యాన్ని గ్రహించి, అనుభవానికి తెచ్చుకో !

మానసిక తరంగాలంటే, సంశయించటమూ, తప్పుత్రోవలు త్రొక్కటమూ, మొదలైనవి. అహంకారంపోతే, అవి పోతాయి. ప్రత్యగాత్మ ఇంకెక్కడో లేదు. నీలోనే ఉంది. అదే నేను – అని తెలుసుకుంటే, ముక్తి.

శ్లో. అహంకారే కర్తర్యహమితి మతిం ముంచ సహసా
వికారాత్మ న్యాత్మ ప్రతిఫల జుషి స్వస్థితి ముషి;
యద ధ్యాసా త్ప్రాప్తా జని మృతి జరా దుఃఖ బహుళా
ప్రతీ చ శ్చిన్మూ ర్తే స్తవ సుఖతనోః సంసృతి రియం. ౩౦౫

మ, ప్రతియై ఆత్మకు; కర్తగా మతి వికారంబై, అహంకార ము
ద్ధతి నీ స్వస్థితి మాన్చి, జన్మమృతివార్ధక్యాది దుఃఖంబు లీ
గతి కల్పించెను; వెంటనే విడు మహంకారంబు! నీవాత్మ వు
న్నతమౌ సాక్షివి; జ్ఞానరాసివి; సదానందుండ వేనాటికిన్.

అహంకార మనేది ఆత్మకు ప్రతి బింబమే! మనోవికారంవల్ల కలిగిన మార్పే అది. అతి తెలివి చూపించి, తానే కర్తనని నిక్కుతూ, నిజస్వరూపం నీకు తెలియకుండా చేస్తున్నది. అధ్యాసవల్ల నీకీ బహుళ దుఃఖాలు – జన్మమనీ, మరణమనీ, ముసలి తనమనీ, వ్యాధులనీ – కలిగినాయి. నీ వింతకూ ఇన్నిటికీ సాక్షివి మాత్రమే! జ్ఞానసారానివి, అనంతా నందానివి, ఆత్మవు. సాహసించి వెంటనే అహంకారాన్ని సాగనంపు !

శ్లో. సదైక రూపస్య చిదాత్మనో విభో
రానంద మూర్తే రనవద్య కీర్తేః
నైవాన్యథా క్వాప్య వికారిణ స్తే
వినాఽహ మధ్యాస మముష్య సంసృతిః. ౩౦౬

తే. గీ. నీ కహంకారమున నంటులేక యున్న
నింక నీవు పునర్జన్మ మెత్తబోవు;
సచ్చిదానందమూర్తితో సముడవగుచు
ననుభవించెద వనవద్యమైన కీర్తి.

అధ్యాసవల్ల అహంకరించట మొక్కటే పునర్జన్మకు మూలం. లేకపోతే ఆనందమే నీజన్మహక్కు! ప్రకాశించటమే నీ లక్షణం. నిత్యమైన ఉనికి నీ స్వభావం ఆత్మలో మగ్నుడవైతే అనంత కీర్తి!

శ్లో. తస్మా దహంకార మిమం స్వశత్రుం
భోక్తుర్గళే కంటకవత్ ప్రతీతం;
విచ్ఛిద్య విజ్ఞాన మహాసినా స్ఫుటం
భుంక్ష్వాత్మ సామ్రాజ్య సుఖం యథేష్టం. 302

తే. గీ. అందువలన నహంకార మనువిరోధి
భోక్త గొంతున ముల్లును పోలుదాని
ఖండన మొనర్చి జ్ఞాన ఖడ్గంబుచేత
మంచిగా గొను మాత్మ సామ్రాజ్యసుఖము!

అందుచేత, అహంకారమనే యీనీ శత్రువును, తినేవాడి గొంతులో ముల్లువలె గ్రుచ్చుకొని బాధపెట్టే దాన్ని. విజ్ఞానమనే పదునైన కత్తితో నఱికివేసి, ఆత్మ సామ్రాజ్య సుఖాన్ని యిష్టానుసారం అనుభవింతువు గాక!

శ్లో. తతోఽహమాదే ర్వినివర్త్య వృత్తిం
సంత్యక్త రాగః పరమార్థలాభాత్
తూష్ణీం సమాస్స్వాత్మ సుఖానుభూత్వా
పూర్ణాత్మనా బ్రహ్మణి నిర్వికల్పః. 303

తే. గీ. అహము మొదలగు వృత్తుల నణచివైచి;
రాగమును వీడి, పరమార్థ యోగముగను
ఆత్మ సుఖమొంది, ద్వైతమే మైన లేక
బ్రహ్మ మందుండు! స్వస్థితి బడయుకతన.

నేనూ - నాదీ - అనేవి రెండూ అహంకార లక్షణాలు. అవి విడిచిపెట్టు! సత్యం తెలుసుకోని, కోరికలన్నీ మానుకో! ఆత్మసుఖాన్ని అనుభవించటం ద్వారా ద్వైతం జోలికి పోకు! నిర్వికల్ప బ్రహ్మమందే లీనమైపో! అప్పటికి నీవు స్వస్థితి నందుకో గలుగుతావు.

శ్లో. స మూల కృత్తోపి మహానహం పునః
వ్యుల్లేఖితః స్యా ద్యది చేతసా క్షణం
సంజీవ్య విక్షేప శతం కరోతి
న భస్వతా ప్రావృషి వారిదో యథా. 309

తే. గీ. మూలమట్టముగా లేకపోయి మఱల
మది నహంకారమొక క్షణమొదలెనేని?
సేయు చెలరేగునట్లు విక్షేప శతము.
విరిసి గాలికి మేఘంబు నెరసినట్లు.

వ్రేళ్ళతో పెకలింపబడి పోయినప్పటికీ, ఈ భయంకరమైన అహంకారం మళ్ళీ ఒక్క క్షణకాలం మనసులో పొడచూపినంతే, ఇంక వందల కొద్దీ కొంటె తనాలు (విక్షేపాలు) సృజిస్తుంది - వాన కాలంలో గాలికి విచ్చిపోయిన మేఘం మళ్ళీ కూడు కున్నట్లుగా.

శాశ్వతంగా అహంకారం చచ్చిందని యెంచరాదు. ఎప్పు డెప్పటి జ్ఞాపకాలో తటాలున జ్ఞాపకానికి వస్తాయి. వెంటనే మనసంతా అల్లకల్లోలమౌ తుంది. ఎప్పటి కప్పుడు నిగ్రహిస్తూ రావలసిందే!

## 310-319 కామనలూ, వాసనలూ-నిరసన

శ్లో. నిగృహ్య శత్రో రహమోఽవకాశః
క్వచిన్మదే యో విషయాను చింతయా
స ఏవ సంజీవన హేతురస్య
ప్రక్షీణ జంబీర తరో రివాంబు. ౩౧౦

తే. గీ. గెల్చియును శత్రువగు నహంకృతిని; విషయ
చింత కవకాశమిదకు! రవంతయైన
నదె పునర్జీవ కారణమగును, నిమ్మ
యెండినది నీట చిగురించు చుండునట్లు.

ఒకసారి నీ శత్రువైన అహంకారాన్ని చంపి కూడా, ఏమరుపాటున క్షణకాలమైనా విషయ చింతనకవకాశ మీయరాదు. ఇచ్చినావంటే, అదే మళ్ళీ బ్రదకటాని కాస్కారమేర్పడుతుంది – ఎండిపోయిన నిమ్మచెట్టుకు నీళ్లుపోస్తే, అది మళ్ళీ చిగురింపక మానదుకదా!

శ్లో. దేహాత్మనా సంస్థిత ఏవ కామీ
విలక్షణః కామయితా కథం స్యాత్;
అతోఽర్థ సంధాన పరత్వమేవ
భేద ప్రసక్త్యా భవ బంధ హేతుః. ౩౧౧

తే. గీ. తనువె తాననుకొనువాడె తగని కామి;
కాననెడి వానికెక్కడి కామితములు?
కనుక, విషయాభిలాషయే కారణంబు
బానిసత్వమునకు భవబంధమునకు.

దేహాభిమానమున్న వారికే విషయ భోగాల మీద కోరికలుంటాయి. కాని, అదిలేని వాడి కెక్కడి కోరికలు! కాబట్టి విషయ వాంఛలే పునర్జన్మ మెత్తటానికీ, భేదబుద్ధికీ బానిసత్వానికీ, భవబంధానికీ, కారణాలు.

శ్లో. కార్య ప్రవర్ధనా ద్బీజ - ప్రవృద్ధిః పరిదృశ్యతే
కార్యనాశాత్ బీజనాశః - తస్మాత్ కార్యం నిరోధయేత్. ౩౧౨

తే. గీ. కార్యములకెప్పు డభివృద్ధి కలుగు? నపుడె
బీజముల కభివృద్ధియు విశదమగును;
కార్యము నశింప, బీజమే కలుగబోదు;
కనుక, కార్యనిరోధంబు కలుగవలయు.

స్వార్థ బుద్ధితో మన మెప్పుడు కార్యా లెక్కువ చేస్తామో! వాటి బీజాలైన విషయాభిలాషలు కూడా ఎక్కువై తీరుతాయి. కార్యాలు నశిస్తే బీజాలూ నశిస్తాయి. కాబట్టికార్యాలను నిరోధించు!

శ్లో. వాసనా వృద్ధితః కార్యం - కార్య వృద్ధ్యాచ వాసనా
వర్ధతే సర్వథా పుంసః - సంసారో నవివర్తతే. ౩౧౩

తే. గీ. వాసనలు రేగ కార్యమున్ బహుళమగును;
కార్య బహుళత వాసనల్ కనును పెంపు;
స్వార్థపరుడైన మనుజుడు జన్మమీద
జన్మలెత్తుట సతతంబు సాగుచుండు.

శ్లో. సంసార బంధ విచ్ఛిత్త్యై - తద్ద్వయం ప్రదహేద్యతిః;
వాసనా ప్రేర్యతే హ్యంత - శ్చింతయా క్రియయా బహిః. ౩౧౪

తే. గీ. యతి యయినవాడు సంసార మనెడి గొలుసు
త్రెంచుటకు రెండు పూర్తి వహించవలయు;
విషయభోగాలపై చింత వెలయు టొకటి;
వాసనలు పెంచు స్వార్థంపు పనులు రెండు.

జన్మమీద జన్మలెత్తించే యీ సంసారమనే గొలుసును త్రెంచటానికై రెండిటిని బూడిద చేయవలసి ఉంటుంది. ఒకటే మంటే, విషయానుభవాలమీది కోరిక; రెండవది, స్వార్థంతో కోరికలూరక పెరిగే బయటి కార్యాలు చేయటం.

శ్లో. తాభ్యాం ప్రవర్ధమానాసా - సూతే సంసృతి మాత్మనః
త్రయాణాంచ క్షయోపాయః - సర్వావస్థాసు సర్వదా. 317

శ్లో. సర్వత్ర సర్వతః సర్వ - బ్రహ్మమాత్రా వలోకనైః
సద్భావ వాసనా దార్ఢ్యాత్ - తత్త్రయంలయమశ్నుతే. 318

శా. ఈ రెండింటను కోరికల్ పెరిగి సాయించున్ పునర్జన్మలన్
దూరం బౌటకు మూ; డుపాయమిది-యెందున్ సర్వమున్ సర్వదా
పారం జూచుట బ్రహ్మముంజ వెనె, యిబ్భంగిన్ సదా బ్రహ్మమం
దే రూఢిం గనినంతనే, లయములౌ దేహత్రయీ ధర్మముల్.

జన్మ జన్మాంతరాల నుంచీ అజ్ఞాన బలంతో పుంజుకున్న మలిన సంస్కారమూ; అనాత్మ విషయాల మీది భావనలూ, కార్యాలూ - సంసారాన్ని వృద్ధి చేస్తున్నాయి. జాగ్రత్ స్వప్న సుషుప్తు లుండక తప్పనందువల్ల సంస్కారాలు కలుగుతూనే ఉంటాయి. సంస్కారమూ సంకల్పమూ, కార్యమూ - ఈ మూడూ నాశనమయ్యే ఉపాయం? దేహత్రయానికి అతిరిక్తమైన ఆత్మనే సదా భావిస్తూ, అదే అంతటా చూస్తూ, బ్రహ్మనిష్ఠుడై ఉండటమే!

శ్లో. క్రియానాశే భవే చ్చింతా - నాశోఽస్మా ద్వాసనాక్షయః
వాసనా ప్రక్షయో మోక్షః - సా జీవన్ముక్తి రిష్యతే. 319

తే. గీ. స్వార్థపరమైన క్రియలను వదలివేయ
విషయచింతలు పూర్తిగా వీడిపోవు;
నందుచేతను వాసన లంతరింప
మోక్షమొనగూడు; జీవన ముక్తి యదియె!

స్వార్థమైన పనులన్నీ మానుకోటంవల్ల, విషయ చింతలు మానుతాయి. అవి మానటంతో కోరిక లంతరిస్తాయి. అలా కోరికలేవీ లేకపోవటం వల్ల మోక్షం లభిస్తుంది. దాన్నే జీవన్ముక్తి అంటారు.

జీవన్ముక్తి – అంటే, బ్రదికి ఉండగానే మోక్షమన్నమాట! వాసనలు–అంటే, కోరికలూ, కర్మలూ–నశిస్తే అదే ముక్తి.

శ్లో. సద్వాసనా స్ఫూర్తి విజృంభణే స –
త్యసౌవిలీనా వ్యహమాది వాసనా
అతి ప్రకృష్టాఒప్యరుణ ప్రభాయాం –
విలీయతే సాధు యథా తమిస్రా. 318

తే. గీ బ్రహ్మమున నైక్యమగు వాంఛ బలిసెనేని
వదలి పోవు నహంకార వాంఛలెల్ల;
నరుణ కిరణ ప్రసార మైనంతలోనె
మాయమైపోవు గాఢ తమంబు వోలె.

బ్రహ్మంతో ఐక్యమై పోదామనే కోరిక బలపడి పోయినంతనే, అహంకారంతో కూడిన కోరికలన్నీ అంతరిస్తాయి – సూర్య కిరణాలు సోకిన వెంటనే, కారు చీకట్లు మాయమై పోయినట్లే! సద్వాసనలు విజృంభిస్తే కామవాసనలు నశిస్తాయన్నమాట! అంతా బ్రహ్మమయ మనే భావన బలపడితే, మనిషికింక ఇష్టానిష్టాలుండవు. దయాదాక్షిణ్యాలూ, క్షమా, ప్రేమా, మొదలైన మంచి తనాలు – లోకంమీద చూపించటం జరుగుతుంది.

శ్లో. తమ స్తమః కార్య మనర్థ జాలం
నదృశ్యతే నత్యుదితే దినేశే
తథా ద్వయానంద రసాను భూతౌ
నైవాస్తి బంధో నచ దుఃఖ గంధః. 319

తే. గీ. కారు చీకటి – చీకటి కార్యమగు న
నర్థ జాలము – సూర్యోదయమున తొలగు;
నావిధాన సదానంద మనుభవింప
బంధములు – దుఃఖ గంధాలు పారిపోవు.

కారు చీకట్లూ - చీకటిలో జరిగే అనర్థ కార్యాలూ-సూర్యోదయం కాగానే మాయమైపోతున్నాయి. ఆ ప్రకారంగానే, నిత్యానంద రసానుభవంతో, బంధాలూ, దుఃఖ గంధాలూ, పటా పంచలౌతాయి.

తమః కార్యమంటే చీకటిలో జరిగే దొంగతనాలూ, దోపిడీలూ, ఖూనీలూ, మోసాలూ, ఎన్నో ? ఇంకా తేళ్ళూ, పాములూ, కండ్లు కానక దారి తప్పటాలూ, తట్టుకోవటాలూ, ప్రమాదాలూ, బోలెడన్ని జరుగుతాయి. ఇవన్నీ పగటిపూట ఉండవేమో ? ఉన్నా తక్కువన్నమాట !

## 320-329 ప్రమాద నింద-ముందు జాగ్రత్తలు

శ్లో. దృశ్యం ప్రతీతం ప్రవిలాపయన్ స్వయం
సన్మాత్ర మానంద ఘనం విభావయన్
సమా హి తస్సన్ బహిరంతరం వా
కాలం న యేధా స్పతి కర్మ బంధే. ౩౨౦

చ. వెలుపల లోపలం గనెడి విశ్వము కన్పడ కుండజేసి; ని
శ్చలముగ ధ్యానమున్ సలిపి సత్యము గూర్చి; సదాప్రమోదివై
వలసిన యంత జాగ్రతగ వర్తిలి, కాలము సాగనిమ్ము! ని
ష్ఠులమగు కర్మబంధమును త్రోయగరాని దటంచు నెంచుచున్.

లోపలా వెలుపలా ఇప్పుడూ చూస్తుండే ప్రపంచాన్ని ఏకాగ్ర చిత్తంతో మాయమయ్యేట్టుచేసి, ఆనందఘనమైన సత్యాన్ని గురించి ధ్యానంచేస్తూ. జాగ్రత్తగా కాలక్షేపం చెయ్యి! ఏ మాత్రమైనా కర్మబంధం - తల్రవాత-లేక, ప్రారబ్ధం మిగిలి ఉంటే, దాన్ని అనుభవించు! (తప్పదు కదా?) పూర్వ వాసనలేమైనా మిగిలి ఉంటే, దాన్ని ప్రారబ్ధమంటారు. అది అనుభవించి తీర వలసిందే ! అన్యమార్గం లేదు.

శ్లో. ప్రమాదో బ్రహ్మనిష్ఠాయాం - న కర్తవ్యః కదాచన
ప్రమాదో మృత్యు రిత్యాహ-భగవాన్ బ్రహ్మణ స్సుతః. 321

ఆ. వె. బ్రహ్మమందు నిష్ఠ పట్ల ప్రమాదంబు
చేయరాదు గాక చేయరాదు;
బ్రహ్మపుత్రుడైన భగవానుడీ ప్రమా
దంబు మృత్యువనుచు తలచినాడు.

ఎప్పటికీ బ్రహ్మనిష్ఠ విషయంలో ఏమరుపాటు పనికిరాదు. అంటే, బహిర్ముఖుడు కావటం తగదు. ప్రమాదం కంటే ఇంకో అనర్థం లేదన్నారు పెద్దలు. అసలు బ్రహ్మకొడుకైన సనత్కుమారుడే "ప్రమాదం వై మృత్యు మహం బ్రవీమి" - ప్రమాదమే (జ్ఞానికి) మృత్యువని నేనంటున్నా - నన్నాడు.

శ్లో. న ప్రమాదా దనర్థోఽన్యో - జ్ఞానినః స్వస్వరూపతః
తతో మోహ స్తతోఽహంధీ- స్తతోబంధ స్తతోవ్యథా. 322

ఆ. వె. జ్ఞాని స్వస్వరూప సంవర్తనమున ప్ర
మాదమునకు మించి లేదనర్థ;
మందుచేత మోహ, మజ్ఞాన మందుచే
బంధ మవల; కడకు వ్యథ జనించు.

జ్ఞానికి తన సహజ స్వరూపాన్ని చూచుకోటంలో నిర్లక్ష్యంకానీ ఏమరు పాటుకానీ, ఉండరాదు, ఉంటే, అంతకు మించిన ఆపద ఇంకేదీ లేదు. దానివల్ల భ్రాంతీ, దానివల్ల అహంకారమూ, దానివల్ల బంధమూ, దానివల్ల దురదృష్టమూ - వరుసగా చుట్టుకుంటాయి.

శ్లో. విషయాభి ముఖందృష్ట్వా - విద్వాంస మపి విస్మృతిః
విక్షేప యతి ధీదోషైః - యోషాజారమివ ప్రియం. 323

ఆ. వె. విషయములకు లొంగి విద్వాంసుడైనను
ప్రాకులాట చూడ వాని మఱపె
బాధపెట్టు బుద్ధి భ్రమగొల్పి చెడ్డగా
చేడె జారువలచి చెఱచినట్లు.

స్వస్వరూప విస్మృతి – తన ఆత్మను తాను మఱచిపోవటం – ఒక కులట వంటిది. ఆ జారిణి ఎదుట జారుని చూచి ఎన్నెన్నో వగలు చూపి ఆకర్షించి పతితుని చేస్తుంది. ధన ప్రాణమానాలు హరిస్తుంది. ఆ ప్రకారంగానే విషయాలకు లొంగినవాడు, విద్వాంసుడైనప్పటికీ, మనసుకు సహజమైన చాపల్యాన్ని బట్టి. ఆత్మజ్ఞానానికి తప్పించి, భ్రమ కలిగిస్తుంది.

శ్లో. యథాపకృష్టం శైవాలం – క్షణమాత్రం న తిష్ఠతి;
అవృణోతి తథా మాయా–ప్రాజ్ఞం వాపి పరాఙ్ముఖం. 3 ౨౮

ఆ. వె. త్రోచి వేయబడిన ప్రాచి క్షణంబైన
నీటి గప్పకుండ నిలిచిపోదు;
మాయకూడనట్లె మఱి పరాఙ్ముఖుడైన
ప్రాజ్ఞునైన భంగ పఱచితీరు.

ప్రాచిని (నాచును) మాటిమాటికీ తొలగ త్రోసినప్పటికీ, అది మళ్ళీ మళ్ళీ నీటిని కప్పుతూనే ఉంటుంది. మాయ కూడా అదే ప్రకారంగా ఆత్మధ్యానంలో ఉండటం మఱచి బహిర్ముఖుడైన విద్వాంసునైనా, ఆవరించి అవివేకంలో ముంచుతుంది.

శ్లో. లక్ష్యచ్యుతం చేద్యది చిత్తమీషద్
బహిర్ముఖం సన్నిపతేత్తతస్తతః
ప్రమాదతః ప్రచ్యుత కేళి కందుకః
సోపాన పంక్తౌ పతితో యథా తథాః 3 ౨౯

ఆ. వె. మనసొకింత లక్ష్యమును వీడి బయటికి
వెడలెనేని, జారిపడును క్రింద;
నాదమఱచి విసర, నాట బంతియు మెట్ల
వరుస నుండి క్రింద పడిన రీతి.

ఇంచుకైనా మనసు లక్ష్యం విడిచి వెలుపలికి పోసాగిందో? క్రిందికి క్రిందికై పడిపోవటం తప్పదు. ఆటబంతి పొరపాటున మెట్ల మీదికి దొర్లితే, మెట్టుకు మెట్టు జారుతూ క్రిందికి పడిపోతుంది కదా?

లక్ష్యమంటే బ్రహ్మమన్నమాట! ఎంత మంచి హెచ్చరిక! సాధకుని మనస్సు ఏ మాత్రమైనా తనలోపలి గుటిని విడిచి వెలుపలికి వెడలిందో? విచ్చల విడిగా తిరుగటానికి ప్రయత్నిస్తుంది. నిలకడ అనేది ఉండదు. కనుక కడపట పతనం తప్పదు.

శ్లో. విషయే ష్వావిశచ్చేత - స్సంకల్పయతి తద్గుణాన్
సమ్యక్ సంకల్పనాత్ కామః - కామాత్ పుంసః ప్రవర్తనం. 326

తే. గీ. విషయ వస్తువు లందున వివశమైన
మనసు వాటి గుణాలను మాటికెన్ను;
రేగి సంకల్ప బలము కోర్కిని ఘటించు;
కోర్కి యావస్తువును పొందగోరు బలిసి.

మనసు విషయ వస్తువుల మీదికి ప్రసరిస్తే, వాటి గుణాలమీద ప్రతి ఫలిస్తుంది. బాగా బలపడిన ప్రతిఫలం వల్ల కోరిక చెలరేగుతుంది. కోరిక తరువాత, మనిషి దాన్ని పొందటానికై తహతహలాడి, కోరిక తీర్చుకుంటాడు.

శ్లో. తతః స్వరూప విభ్రంశో - విభ్రష్ట స్తు పతత్యధః
పతి తస్య వినానాశం - పునర్నారోహ ఈక్ష్యతే. 329

ఆ. వె. కనుక, స్వస్వరూపమును వీడి భ్రష్టుడౌ;
భ్రష్టుడైన పిదప పతనమొందు;
పతితుడైన వాడు పడయు వినాశంబు;
మఱల తిరుకొనెడి మాట యరుదు.

కాబట్టి, మఱపుచేత మనిషి, స్వస్వరూపాన్ని దర్శించేది మాని, భ్రష్టుడౌతాడు. అలా భ్రష్టుడైనవాడు పతనం పొందుతాడు. పతనం పొందినవాడు వినాశనాన్ని తెచ్చుకుంటాడు. మళ్ళీ బాగుపడి పైకి రావటమనేది అరుదు – మనం చూడలేదు.

శ్లో. సంకల్పం వర్జయేత్ తస్మాత్ – సర్వానర్థస్య కారణం;
అపథ్యాని హి వస్తూని – వ్యాధిగ్రస్తో యథోత్సృజేత్. 328

తే. గీ. వ్యాధి పీడితుడగు వాడ పథ్యములనె
అరగింపని రీతి; నీ వందువలన
వదలవలయు ననర్థ సర్వస్వమునకు
కారణం బైన విషయ సంకల్ప మెపుడు.

కాబట్టి, వైద్యుడు సూచించిన అపథ్యమైన తినుబండారాలను, రోగి యెలా తినరాదో, ఆ విధంగా అన్ని అనర్థాలకు మూల కారణమైన విషయ వస్తువుల మీదికి మనసు మళ్ళటమనే అభ్యాసాన్ని పూర్తిగా నిరోధించు! కామ సంకల్పం లేకపోతే, నీవు తప్పక తరిస్తావు.

శ్లో. అతః ప్రమాదాన్న పరోऽస్తి మృత్యుః
వివేకినో బ్రహ్మవిదః సమాధౌ
సమాహితః సిద్ధి ముపైతి సమ్యక్
సమాహితాత్మా భవ! సావధానః. 329

ఆ. వె. అగుట, బ్రహ్మవేత్త యైన వివేకికి
మఱపు కంటె చావు మఱియు లేదు;

ధ్యాన నిరతి నున్నవాని కబ్బుసమాధి;
సావధానముగను సలుపవయ్య!

కాబట్టి, విచక్షణ జ్ఞానంతో బ్రహ్మాన్ని తెలుసుకున్నవానికి, ప్రమాదం కంటే మించిన చావింకొకటి లేదు. నిరంతరం ధ్యానంలో మగ్నుడై ఉండేవాడు తప్పక సమాధి సిద్ధి పొంది తీరుతాడు. జయం లభించి తీరుతుంది. అందువల్ల నీవు జాగ్రత్తగా నీ మనసును బ్రహ్మమందు లీనం చెయ్యి! లీనం చేసి బాగా ధ్యానించు!

## 330-338 అసత్తు పరిహరించు!

శ్లో. జీవతో యస్య కైవల్యం – విదేహే చ స కేవలః
యత్కించిత్ పశ్యతో భేదః–భయం బ్రూతే యజుశ్శ్రుతిః. 330

ఆ వె. జీవితమున తాను కేవలుండగువాడు
గిట్టినపుడు తనువు, కేవలుండె!
ఇంచుకైన భేద మెంచెనా భయముంట
ఖాయ మంచు తైత్తిరీయ మనును.

జీవించి ఉండి నప్పుడే బంధముక్తు డెవడౌతున్నాడో? అతడు దేహ పతనానంతరం కూడా ముక్తుడే అవుతాడు. ఏ మాత్రమైనా భేదం గమనించే వాడికి భయం ఉంటుందని తైత్తిరీయోపనిషత్తు – "యదా హ్యేవైష ఏతస్మిన్ ఉత్+అరం (ఉదరం) అంతరం మురుతే, అథ తస్య భయం భవతి" – అనే వాక్యంతో హెచ్చరిస్తుంది. కైవల్యానికి గతి నిర్వికల్ప సమాధి నిష్ఠ!

శ్లో. యదా కదా వాపి విపశ్చిదేష
బ్రహ్మణ్య నంతేఽప్యణు మాత్ర భేదం
పశ్య త్యథా ముష్య భయం తదేవ
యదీక్షితం భిన్న తయా ప్రమాదాత్. 331

ఆ. వె. ఎప్పుడేని విబుధు డించుకంత అనంత
మైన బ్రహ్మమందు నరయుభేద ?
మా ప్రమాదవశత నగుపట్టు భిన్నత
భయమునకును హేతు వయి స్ఫురించు.

ఎప్పుడైనా సరే! ఈ యనంతమైన బ్రహ్మంలో జ్ఞానియైన వాడు అణుమాత్రమైనా భేదం కనిపెడతాడో, అప్పుడే ఆ క్షణమే అజ్ఞానికి ప్రమాదవశాత్తుగా కనపడే భిన్నత, భయకారణ మౌతుంది.

ద్వితీయాద్వై భయం భవతి - (బృహదారణ్యకం ౧-౪-౨)
రెండవ వాడుంటేనే కదా భయం ? పరమాత్మ కంటే ఇంకో పదార్థం ఉన్నదంటే, అది ద్వైత మౌతుంది. అద్వైతం కాదుగా ?

శ్లో. శ్రుతి స్మృతి న్యాయశతై ర్నిషిద్ధే
దృశ్యేఽత్ర యస్స్వాత్మ మతిం కరోతి;
ఉపైతి దుఃఖోపరి దుఃఖ జాతం
నిషిద్ధ కర్తా స మలిమ్లు చో యథా. 332.

ఆ వె. శ్రుతుల స్మృతుల న్యాయశతముచేత నిషిద్ధ
మగును దృశ్యజగము నాత్మయనుట;
దేహదృష్టి వలన తీరని దుఃఖమే !
దొంగతనము వలన దొంగకట్లు.

ఉపనిషత్తులూ, శాస్త్రాలూ, స్మృతికాది న్యాయాలూ- ఇలా అనేకాలచేత, అహంకారం మొదలు దేహం వరకూ ఉండే విషయ ప్రపంచమనే దృశ్యం నిషేధింప బడింది. దృశ్య మంటే దృక్కైన ఆత్మకు కనపడేదంతా దృశ్యం ఆత్మకంటే వేరైనది - అంటే దృశ్య మంతా అనాత్మలమయం. ఆత్మను అనాత్మగానూ, దేహాదులను ఆత్మగానూ - చూస్తున్న విపర్యా సంతో కల్పితమయింది ప్రపంచమూ, దాని వ్యవహారమూ ! ఇదంతా నశించేదేనని శ్రుతులూ, శాస్త్రాలూ

న్యాయాలూ చాటుతున్నాయి. బ్రహ్మ ఒక్కటే సత్యం! ఇదంతా నిర్లక్ష్యంచేసి అసత్యమగు దేహాదులందు కర్తృత్వ భోక్తృత్వ లక్షణాలపై అభిమాన పడేవాడు, జనన మరణాది దుఃఖాలు పొందక తప్పదు. తనవి కాని వస్తువులను దొంగిలించటానికై పోయిన దొంగవలె అనేక దుఃఖాలకు పాల్పడుచున్నాడు.

శ్లో. సత్యాభి సంధాన రతో విముక్తో
మహత్వ మాత్మీయ ముపైతి నిత్యం
మిథ్యాభి సంధాన రతస్తు నశ్యేత్
దృష్టం తదే తద్యద చోర చోరయోః. 333

తే. గీ. సత్యమును గూర్చి ధ్యానంబు సలుపువాడు
మాయను జయించి ఆత్మ సామ్రాజ్యమేలు;
మిథ్యనే నమ్ముకొనువాడు మిడుకుచుండు;
చొరకు దొంగకు నెట్లొ? యిర్వురకు నట్లె!

ఆత్మాను సంధానంచేసి ధ్యానంలో మునిగిన వాడు, మాయ నుంచీ స్వతంత్రుడై బ్రహ్మ మౌతాడు. ఆత్మ వైభవాన్ని అనుభవిస్తాడు. అటుగాక మిథ్యా ప్రపంచంలోనే మునిగి తేలేవాడు, తన నాశనాన్ని తానే తెచ్చుకుంటాడు. ఇందుకు దొరనూ, దొంగనూ ఉదాహారణంగా చెప్పకోవచ్చు.

శ్లో. యతి రస దనుసంధిం బంధ హేతుం విహాయ;
స్వయ మయ మహ మస్మీత్యాత్మ దృష్ట్యైవ తిష్ఠేత్;
సుఖ యతి ననునిష్ఠా బ్రహ్మణి స్వాను భూత్యా
హరతి పరమ విద్యాకార్య దుఃఖం ప్రతీతం. 334

చ. యతి యగువాడు బంధమయమైన యసత్యము నంటబోక, సం
తతము నిజాత్మ నుండి - ఇదె తానను భావము నిల్పి గట్టిగా

వ్రతముగ ధ్యానమున్ సలుప, బ్రహ్మము సుస్థిరమై సుఖంబిడున్;
వెతలను మాన్పు పూర్తిగ నవిద్య నొకానొక డున్నవేళలన్.

సన్యాసి – లేక, సాధకుడైన వాడెప్పుడూ బంధకారణమైన అసత్యం జోలికి పోరాదు. దానిలో ఉండనూరాదు. తన భావాన్ని యెల్లప్పుడూ ఆత్మ మీదనే స్థిరంగా ఉంచి– ఇదే నేను – అనుకుంటూ (సోఽహం) ఉండవలసింది. అలా తెలుసుకోటం ద్వారా బ్రహ్మంలో ఐక్యమైతేనే ఆనందం అనుభవానికి వస్తుంది. ఒకానొకడు అజ్ఞాన దశలో అనుభవించే మాయామయమైన దుఃఖాలన్నిటినీ దూరంగా ఉంచుతుంది. విషయ వస్తువులను గుఱించి (అసత్యం) నిరంతరం తల పోయటం వల్లనే, బంధాలకు కారణాలు కలుగుతున్నాయి. ఆముష్మిక సుఖానికవి అడ్డగోడ లౌతున్నాయి. జీవిత లక్ష్యాన్ని మఱుగు పఱచి, నానావస్థలూ కలిగిస్తాయి. కనుక అంతవంతమైన అనాత్మ వస్తువులను గుఱించి ఆలోచించనే వద్దు! ఇది జరిగితే అజ్ఞానం నశించి, ఆత్మను గుఱించి దృఢమైన విజ్ఞానం కలుగుతుంది. అంతటా నిండి ఉండే ఆత్మ– తనలోనూ ఉంది – అనే భావం ధ్రువపడుతుంది. అనుభవించే కొద్దీ, బాధలు తొలగి, అనంతానందం లభిస్తుంది.

శ్లో. బాహ్యాను సంధిః పరివర్ధయే త్ఫలం
దుర్వాసనా మేవ తత స్తతోఽధికాం
జ్ఞాత్వా వివేకైః పరిహృత్య బాహ్యం
స్వాత్మాను సంధిం విదధీత నిత్యం. 332

ఆ. వె బాహ్యవిషయ సంధి ఫలవృద్ధి గావించు
చెడ్డ కోర్కెలూరు చిత్తమందు;
తెలివితో గ్రహించి; దిగనాడి బాహ్యంబు
నిత్యమాత్మ యందె నెగడవలయు.

బాహ్య మందలి విషయ వస్తువుల్లో ప్రవేశించే కొద్దీ, ఫలాలు అంత కంతకూ పెరుగుతాయి. దుర్వాసన లధిక మౌతాయి. వివే కంతో బాహ్యాన్ని విడిచిపెట్టి నిత్యమూ ఆత్మ యందే నిలిచి ఉండు!

శ్లో. బాహ్యాని రుద్ధే మనసః ప్రసన్నతా;
మనసః ప్రసాదే పరమాత్మ దర్శనం;
తస్మిన్ సుదృష్టే భవ బంధ నాశో
బహిర్ని రోధః పదవీ విముక్తేః. 336

తే. గీ. బాహ్యవస్తు ప్రపంచ మీ పగిది మూసి
నపుడు మనస ప్రసన్నమౌ; నాత్మ వెలుగు!
నట్టి యెఱుకను భవబంధ మంతరించు;
బాహ్యముడుగుట ముక్తికి ప్రథమ పదవి.

బాహ్యవస్తు ప్రపంచ మీ విధంగా యెప్పుడు మూత పడు తుందో, అప్పుడు మనసు ప్రసన్న మౌతుంది. ఆ ప్రసాద గుణం వల్ల పరమాత్మ దర్శన మౌతుంది, ఎఱుక బాగా బలపడి పోతే, భవబం ధాల గొలుసు పూర్తిగాపటాపంచలై తెగిపోతుంది. కాబట్టిబాహ్యాన్ని నిషేధించటమే ముక్తికి మొదటి మెట్టన్నమాట!

శ్లో. కః పండితస్సన్? సదసద్వివేకీ
శ్రుతి ప్రమాణః పరమార్థ దర్శీ
జానన్హి కుర్యా దసతోఽవలంబం
స్వపాత హేతోః శిశువన్ముముక్షుః. 337

ఉ. చక్కగ విద్యనేర్చి; సదసత్తుల భేద మెఱింగి; వేదముల్
మిక్కిలిగా ప్రమాణమయి మించి; సదా పరమార్థ దర్శియై;
మక్కువ ముక్తిపై గలుగు మానవు డెక్కడనే నసత్తుపై
గ్రక్కున దూకునా? పతన కారణమున్, పసిబిడ్డ పోలికన్.

బాగా చదివి పండితుడై, ఇది సత్యమూ - ఇది అసత్యమూ - అనేది తెలుసుకున్న వాడై, వేదాలు ప్రమాణాలని నమ్మినవాడై, ఆత్మ యందే చూపు నిల్పి పరమార్థం చూచినవాడై, మోక్షాపేక్ష యెక్కువగా ఉండే మానవోత్తము డెక్కడైనా, పసిబిడ్డవలె, తన పతనానికి కారణమైన యీ యసత్తు (ప్రపంచం) మీదికి మొగ్గుతాడా! అంత తెలివి తక్కువ వాడెవ్వడూ ఉండడు కదా!

శ్లో. దేహాది సంసక్తి మతో న ముక్తిః;
ముక్తస్య దేహాద్యభిమత్య భావః;
సుప్తస్యనో జాగరణం నజాగ్రత
స్వప్న స్తయో ర్భిన్న గుణాశ్రయత్వాత్. 330

తే. గీ. ముక్తి యబ్బదు దేహాది సక్తునకును;
ముక్తునకు లేదు దేహాది సక్తి యెపుడు;
కలను మెలకువ, మెలకువం గలయు లేదు;
రెండు భిన్న గుణంబులై యుండుకతన.

దేహాభిమాన మోక్షాలు రెండూ పరస్పర విరుద్ధాలు. దేహాభిమానం అజ్ఞానం; స్వస్వరూప జ్ఞానం మోక్షం. కాబట్టి దేహాదుల మీద వ్యామోహపడే వాడికి ముక్తి లేదు. ముక్తుడైన వాడికి దేహాదుల మీద భ్రాంతే ఉండదు. నిద్రలో కలలూ కంటూ ఉండే వాడికి మెలకువ లేదు. మెలకువలో ఉన్నవాడికి కలలురావు. దేహాభిమాని జాగ్రదవస్థలో స్థూలదేహంతో విషయ భోగాల అల్పసౌఖ్యాలను భవించ గలుగుతాడు; నిద్రలో సూక్ష్మ శరీర సంబంధంవల్ల కలలు కంటాడు. కారణ శరీర సంబంధంతో గాఢనిద్ర ననుభవిస్తాడు. ఇంతే! మోక్షకామి ఆ కారణ శరీరాన్ని గూడా దాటి తురీయావస్థలో ఉంటాడు. ఈ మూడు దేహాలనూ మఱచి ఉంటాడు. అలాంటి వారికీ, మామూలు మనిషికీ, ఎక్కడికెక్కడ? ఇతడెంతటి హీనదశలో ఉన్నాడో?

## 339 - 348 ఆత్మనిష్ఠ

శ్లో. అంతర్బహిః స్వం స్థిర జంగమేషు
జ్ఞాత్వాఽఽత్మనా ధారతయా విలోక్య
త్యక్తాఖిలోపాధి రఖండ రూపః
పూర్ణాత్మనా యః స్థిత ఏవ ముక్తః. 339

ఆ. వె. అతడు ముక్తు డెవ్వ డంతరంగబు లో
పల చరాచర ప్రపంచ మాత్మ
యని యెఱుంగు? దాని నాధారముగ నెంచు ?
భ్రమలు విడిచి నిలుచు బ్రహ్మమందు ?

ఎవరైతే మనసులో స్థావర జంగమాత్మకాలైన ప్రపంచవస్తువులన్నీ – లోపలా వెలుపలా – అధిష్ఠానమైన ఆత్మగా తానే వెలుగుతున్నా ననుకుంటాడో ? అనుభవ పూర్వకంగా గ్రహిస్తాడో ? ఉపాధులన్నీ అజ్ఞాన పూర్వకమైన అధ్యాసతో ఏర్పడినవని నిశ్చయించుకుంటాడో? సచ్చిదానంద పరిపూర్ణ బ్రహ్మంలో నిరంతరం ఉండగలుగు తున్నాడో? వాడు ముక్తుడు.

శ్లో. సర్వాత్మనా బంధ విముక్తి హేతుః
సర్వాత్మ భావాన్న పరోఽస్తి కశ్చిత్;
దృశ్యాగ్రహే సత్యుప పద్యతేఽసౌ
సర్వాత్మ భావోఽస్య సదాత్మనిష్ఠయా. 340

ఉ. ఈ యఖిల ప్రపంచము గ్రహించుట యాత్మగ బంధమోక్షణో
పాయము; విశ్వ మాత్మయను భావము కంటెను మించినట్టి దిం
కే యది లేదు; మానవున కీ దశకోశము, వస్తులోకమున్
మాయ మొనర్చి; ఆత్మను నిమగ్నత జెందుట యొప్పునెంతయున్

సర్వాత్మ భావ మంటే, తనవలెనే అన్ని వస్తువులనూ ప్రాణులనూ ఆత్మగానే భావించటం. అదే బంధాలు త్రెంచుకునే మార్గం. అంతకు మించిన దింకేదీ లేదు. "అంత ర్బహిశ్చ భూతానా మచరం

చరమే వచ" – భూతాల బాహ్యాభ్యంతరాల్లో అంతటా చరంగానూ అచరంగానూ పరబ్రహ్మమే ఉంది. (గీ. ౧౩-౧౬.) ఈ దశను పొంద దలచినవాడు వస్తు ప్రపంచాన్ని పూర్తిగా విడిచిపెట్టి, స్థిరంగా అహం బ్రహ్మాస్మి – అనుకుంటూ ఆత్మానుభవ మగ్నుడు కావలెనన్నమాట! అదే కైవల్య స్థితి.

శ్లో. దృశ్యస్యా గ్రహణం కథం ను ఘటతే? – దేహాత్మనా తిష్ఠతో;
బాహ్యార్థాను భవ ప్రసక్త మనసః – తత్తత్క్రియా కుర్వతః;
సన్న్యస్తాఖిల ధర్మకర్మ విషయై – ర్నిత్యాత్మ నిష్ఠాపరైః
తత్త్వజ్ఞైః కరణీయ మాత్మని సదా–నందే చ్ఛ భిర్యత్నతః. ౩౮౧

ఉ. దేహమె తానుగా దలచి, దీనను బాహ్యసుఖాలు కోరి, వ్యా
మోహముతో పనుల్ సలుపు మూర్ఖుడు, దృశ్యము వీడనేర్చునా?
బాహిర ధర్మకర్మముల పట్ల విరక్తి వహించి; యత్నతన్
సోహమటంచు నిష్ఠ గనుచున్ బుధు డందును నిత్యసౌఖ్యమున్.

ఎవడు దేహాభిమానంతో జీవిస్తూ, మనసులో బాహ్యావస్తువుల సుఖాల మీద భ్రాంతి పడుతూ, అందుకై అనేక కార్యాలు చేస్తూ ఉంటాడో? వాడికి దృశ్య ప్రపంచం మీద విరక్తి ఎలా కలుగుతుంది? విజ్ఞుడైనవాడు అన్ని ధర్మాలనూ కర్మలనూ విడిచిపెట్టి, నిత్యమూ ఆత్మయందే నిమగ్నుడై సదానందాన్ని అనుభవించ గోరేవాడు ప్రయత్న పూర్వకంగా దృశ్యాలను అగ్రహణం చేయువలసింది.

శ్లో. సర్వాత్మ సిద్ధయే భిక్షోః – కృత శ్రవణ కర్మణః
సమాధిం విదధాత్యేషా – శాంతో దాంత ఇతి శ్రుతిః. ౩౮౨

తే. గీ. శ్రవణ మొనరించి బాగుగా సన్యసించి
భిక్షువై శాంతి దాంతి లభించి యున్న
వానికె సమాధి విధియించె బహుళ శ్రుతులు
ఆత్మగా విశ్వమంతయు నరయు కొఱకు.

అన్ని శ్రుతులూ బ్రహ్మనిష్ఠుడైన గురువువల్ల బాగా శ్రవణం చేసి, విన్నదాన్ని మననంతో బలపరచుకొని మనోనిగ్రహాన్ని పొంది, భిక్షువైన వాడికే, సర్వాత్మ సిద్ధి కోసం సమాధి విధింపబడింది.

"శాంతో దాంత ఉపరతి తితిక్షః సమాహిత

శ్రద్ధా విత్తో భూత్వాఽత్మా న్యేవ ఽత్మానం పశ్యేత్"-

అంటుంది బృహదారణ్యకం (1) శమమూ (శాంతి) (2) దమమూ (దాంతి-ఇంద్రియనిగ్రహం) (3) ఉపరతి (వస్తు ప్రపంచం మీది విరక్తి) (4) తితిక్ష (ఓర్పు) (5) శ్రద్ధ (తనయందూ, శాస్త్రమందూ, సత్యమందూ నమ్మకం) (6) సమాధానం (ఉన్నదానితోనే తృప్తి) - ఈ ఆరు గుణాలూ ఉంటేనే, ఆత్మావలోకనం సులభమౌతుంది. అట్టి భిక్షువుకే సమాధి సిద్ధిస్తుంది.

శ్లో. ఆరూఢ శక్తే రహమో వినాశః
కర్తుం న శక్యః సహసాపి పండితైః
యే నిర్వికల్పాఖ్య సమాధి నిశ్చలా
స్తానంత రానంత భవా హి వాసనాః॥ 343

తే. గీ. గట్టి పడెనే నహంకార మిట్టి కడకు
నెట్టి శక్యము కాదు మనీషికేని;
నిర్వికల్ప సమాధిలో నిశ్చలునకు
తప్ప - బహు జన్మ ఫలములు తలపు లగుట.

ఒకసారి ఆ అహంకారం గట్టి పడిపోతే, దాన్ని నాశనం చేయటం ఎంత పండితుడికైనా సాధ్యమైన పనికాదు. అహంకారం శక్తి అసామాన్యం. రకరకాల భ్రమలు చెలరేగించి విజృంభిస్తుంది. అనేక జన్మల పరిపాకం కదా ? నిర్వికల్ప సమాధిలో నిలువ గలిగిన వాడికే తప్ప సాధ్యంకాదు. సమాధి రెండు విధాలు - సవికల్ప సమాధీ, నిర్వికల్ప సమాధీ. (1) జ్ఞాతా జ్ఞేయమూ, జ్ఞానమూ అనే త్రిపుటి విలీనం

కాకుండానే కేవలంగా బ్రహ్మ మందు చిత్తవృత్తి నిల్చిపోయి బ్రహ్మా కారంగా ఉండేది, సవికల్పం. (2) మనస్సు, జ్ఞాతృ-జ్ఞాన భేదం వదలి జ్ఞేయ మందే స్థిరంగా నిల్చిపోతే, నిర్వికల్ప సమాధి. నీళ్లలో ఉప్పు కరిగిపోయి నీళ్ళ రూపం గానే ఉన్న విధంగా బ్రహ్మాకారంలో మానస ప్రవృత్తి కలిసిపోతే, అది నిర్వికల్ప మన్నమాట !

శ్లో. అహం బుద్ధ్యైవ మోహిన్యా-యోజయిత్వాఽఽవృతేర్బలాత్
విక్షేప శక్తిః పురుషం – విక్షేప యతి తద్గుణైః. 344

తే. గీ. ఆవరణ శక్తి చేయు సహాయమునను
చేవ మీఱెడునట్టి విక్షేపశక్తి
నరుని సమ్మోహ పరచి నానావిధాల
చెఱచు, పెంచి యహంకార చిహ్నములను.

ఆవరణ శక్తి తమోగుణం వల్ల చెలరేగి, బుద్ధిని భ్రమింపజేసి, సత్యాన్ని గుర్తించనీయదు. అలా బుద్ధి భ్రంశం కలిగితే, విక్షేప శక్తి రజోగుణం వల్ల మనసు నుద్రేక పరచి, ఏవేవో ఊహాలు పుట్టిస్తుంది. ఇదే మనో- బుద్ధుల చిలిపి తనం. దీనివల్లనే మనిషి యెడతెగని దుఃఖాల్లో మునిగి తేలుతాడు.

శ్లో. విక్షేప శక్తి విజయో విషమో విధాతుం
నిశ్శేష మావరణ శక్తి నివృత్త్య భావే
దృగ్దృశ్యయో స్ఫుట పయోజల వద్విభాగే
నశ్యేత్త దావరణ మాత్మనిచ స్వభావాత్
నిస్సంశయేన భవతి ప్రతిబంధ శూన్యో
విక్షేపణం నహి తదా యదిచే న్మృషార్థే. 345

శా. చావం జేసిన గాని యావరణ మాసాంతంబు; గెల్వంగ రా
దీ విక్షేపము; నాత్మ గప్పుటది తానే మాయు దృగ్దృశ్య భా
గా విష్కారము పాలు నీటివలె చేయన్; గెల్పు నిస్సంశయం
బౌ; వీడున్ ప్రతిబంధన్; మది మృషార్థాపేక్ష లేకుండినన్.

ఆవరణ శక్తి కొంచెమైనా మిగులకుండా, వ్రేళ్ళతో దాన్ని పెకలించి వేయకపోతే, విక్షేపశక్తి మీాద విజయం సాధించటం కష్టమౌతుంది. అప్పుడదిఆత్మను కప్పుకొని ఉండటాన్ని సహజంగానేమాని, మాయమౌతుంది – పాలను నీటినివలె, దృక్ దృశ్యాలను (కర్తా, కర్మలను) వేఱుపరచి గుర్తిస్తే విజయం ప్రతిబంధశూన్యమై నిస్సంశయంగా విజయం లభిస్తుంది – మనసు నిజంకాని విషయ – వస్తువుల మీాదికి ప్రసరించనందువల్ల.

శ్లో. సమ్యగ్వివేకః స్ఫుట బోధ జన్యో
విభజ్య దృక్ – దృశ్య పదార్థ తత్వం;
ఛినత్తి మాయాకృత మోహ బంధం
యస్మా ద్విముక్తస్య పునర్న సంసృతిః; ౩౪౮

ఆ. వె. గట్టి బోధచేత కలుగు వివేకంబు
వలన కర్తృ - కర్మముల విభాగ
మబ్బు; మాయ బంధ మంతరించి విముక్తి
కలుగు; మఱల జన్మ కలుగబోదు.

శ్రుతులవల్లా, ఆచార్య ప్రసాదంవల్లా దొరికిన మహావాక్యార్థాను భవం, – "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా" – బ్రహ్మ సత్యమూ జగత్తు మిథ్యా అనే వివేకానికి దారి తీస్తుంది. ఈ వివేకంవల్ల దృగ్ – దృశ్య పదార్థతత్వం – నీరక్షీరాలవలె - విభజించి చూడటం జరుగుతుంది. అందువల్ల దేహాత్మ భ్రాంతి (సంసార బంధం) పూర్తిగా త్రెంచి వేయటం జరుగుతుంది. అలా మోక్షం పొందిన వారికిక మళ్ళీ జన్మలేదు.

శ్లో. పరావరైకత్వ వివేక వహ్నిః
దహత్య విద్యా గహనం హ్యశేషం
కింస్యా త్పునః సంసరణస్య బీజ
మద్వైత భావం సముపేయు షోஉస్య. ౩౪౯

తే. గీ. జీవుడే బ్రహ్మమను జ్ఞాన సిద్ధి యనెడి
దహను డజ్ఞాన గహన మంతయు దహించు
నిట్టి యద్వైత భావంబు గట్టి పడిన
జను పునర్జన్మమునకు బీజంబు కలదె ?

"తత్వమసి"- మొదలైన మహావాక్యార్థంతో, జీవుడూ బ్రహ్మమూ ఒకటేనన్న జ్ఞానం, అజ్ఞాన కాననాన్ని నిశ్శేషంగా దహించి వేస్తున్నది. ఇలాంటి అద్వైత భావ మెవడికి బలపడిందో, అతని కింక పునర్జన్మ కోసం విత్తన మెక్కడ మిగులు తుందీ !

శ్లో. ఆవరణస్య నివృత్తిః -భవతి చ సమ్యక్ పదార్థ దర్శన తః;
మిథ్యా జ్ఞాన వినాశః - తద్వత్ విక్షేప జనిత దుఃఖ నివృత్తిః. ౩౪౭

తే. గీ. ఆవరణ శక్తి తనకు తానై నశించు
నాత్మ దర్శన మనుభవంబైన యపుడు;
మిథ్యయగు జ్ఞాన మెడలు నామీద; నంత
తొలగు విక్షేప జనితమౌ దుఃఖమెల్ల.

సత్యాన్ని పూర్తిగా అనుభవానికి తెచ్చుకోగానే ఆత్మను కప్పుకొని ఉండే ఆవరణ శక్తి పూర్తిగా మాయమైపోతుంది. మిథ్యాజ్ఞానమంతా దాని వెంటనే దూరమౌతుంది. విక్షేప శక్తివల్ల జనించిన దుఃఖాలన్నీ తీరిపోతాయి. ఆవరణమూ, అధ్యాసా, విక్షేపమూ - ఈ మూడు ప్రతి బంధకాలూ వాటి కార్యాలూ, బ్రహ్మసాక్షాత్కారం చేత నశిస్తున్నాయి.

"భిద్యతే హృదయ గ్రంధిః ఛిద్యంతే సర్వసంశయాః
క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే"

సర్వాధిష్ఠానమైన పరబ్రహ్మను దర్శింపగానే, సర్వసంశయాలూ, సర్వ కర్మలూ ఉడిగి, అజ్ఞానావరణ పూర్తిగా నశిస్తున్నది. (ముండకోపనిషత్తు)

# 349-353 అధిష్ఠాన నిరూపణ

శ్లో. ఏత త్త్రితయం దృష్టం - సమ్యగ్రజ్జు స్వరూప విజ్ఞానాత్
తస్మాద్వస్తు సతత్త్వం-జ్ఞాతవ్యం బంధముక్తయే విదుషా. ౩౪౯

తే. గీ. త్రాడును గుఱించి సత్యంబు చూడ గలిగి
నప్పుడీ మూడు నాశనమగుట తెలియు;
కనుక, విజ్ఞాని బంధ మోచనము కొఱకు
వస్తుతత్త్వము తెలియగావలయు సరిగ.

ఇది త్రాడే కాని పాముకాదని బాగా తెలుసుకున్న తర్వాత ఈ మూడూ (1) త్రాటి యందు ఆవరణ నివృత్తి (2) సర్పభ్రాంతి - అనే మిథ్యాజ్ఞానమూ (3) సర్పభ్రాంతి అనే విక్షేపం వల్ల కలిగిన భయ - కంప - రోదనాదులైన దుఃఖాలూ-నశిస్తున్నాయి. కాబట్టి విద్వాంసు డైనవాడు బంధకారణాలైన ఆవరణ విక్షేప శక్తులను నశింపజేసుకో టానికై స్వస్వరూపాన్ని తెలుసుకోవలసి యున్నది.

శ్లో. అయోఽగ్ని యోగాదివ సత్సమన్వయాన్
మాత్రాది రూపేణ విజృంభతే ధీః
తత్కార్య మేతత్ త్రితయం యతోమృషా
దృష్టం భ్రమ స్వప్న మనోరథేషు. ౩౫౦

శ్లో. తతో వికారాః ప్రకృతే రహం ముఖాః
దేహావసానా విషయాశ్చ సర్వే
క్షణేఽన్యథా భావిన ఏష ఆత్మా
నోదేతి నాప్యేతి కదాపి నాన్యథా. ౩౫౧

చ. ఇనుమది కాలి యగ్నివలె కన్పడు రీతిగ; బుద్ధి బ్రహ్మమం
దునికిని కర్త-కర్మ యగు చుండును; రెండును బుద్ధి కార్యముల్;
కనబడు భ్రాంతి స్వప్నముల కల్పన లందు నసత్యమై; యటుల్
తను-వహ-మింద్రియంబులు కృత ప్రకృతుల్ మృషవే! క్షణక్షణం
బును నవి మారుచుండుటను; బొత్తుగ మారని దొక్క ఆత్మయే!

ఇనుపకడ్డీ నిప్పుల్లో కాలినప్పుడు ఆనిప్పులవేడినీ, కాంతినీ,పొందుతుంది. బాగా కాలేకొద్దీ ఏది ఇనుమో, ఏది నిప్పో, తెలియనట్లుమారిపోతుంది. అదే ప్రకారంగా బ్రహ్మంలో లగ్నమైన బుద్ధి కూడా, బ్రహ్మం ప్రభావం వల్ల – జ్ఞాతా, జ్ఞానమూ – అవుతుంది. ఈ రెండూ బుద్ధి కార్యాలే! – భ్రాంతిలోనూ, స్వప్నంలోనూ, ఊహలోనూవలె అబద్ధాలై కనపడతాయి. అలాగే ప్రకృతి రూపాలైన అహంకారం మొదలు స్థూల శరీరం దాకా – అన్ని విషయ వస్తువులూ అబద్ధాలే! అబద్ధాలెందుకంటే, అవి క్షణక్షణం మారుతూనే ఉంటాయి ఎప్పటికీ మారకుండా ఉండే దొక ఆత్మ మాత్రమే!

శ్లో. నిత్యా ద్వయాఖండ చిదేక రూపో
బుద్ధ్యాది సాక్షీ సదసద్వి లక్షణః
అహం పద ప్రత్యయ లక్షితార్థః
ప్రత్యక్సదానంద ఘనః పరాత్మా. 3౯౨

తే. గీ. అద్వయము నిత్యము నఖండమై చిదేక
లీల, బుద్ధ్యాది సాక్షియై; స్థూల సూక్ష్మ
ముల కతీతము; నేను – కు మూల సూచి;
ప్రత్యగానంద ఘనము పరాత్మ సుమ్ము!

ఆత్మ స్వభావ మెప్పుడూ నిత్యమూ, అద్వయమూ, చిదేక రూపమూ, బుద్ధ్యాదులకు సాక్షీ, స్థూలమూ – సూక్ష్మమూ – కానిదీ నేను–అనే మాటకు సరియైన అర్థమూ, లోపల సదానంద ఘనమూ, (మాటలతో చెప్పటానికి వీలుకానిదీ.)

[నిత్యమంటే మొదలూ తుదా లేనిది; అద్వయం– రెండవదేదీ లేనిది; అఖండం – దేశకాల పాత్రలచేత విభజింపరానిది – అంటే సర్వవ్యాపి. చిదేక రూపం–జ్ఞానం లేక ప్రజ్ఞ ఒకే రీతిగా ఉండేది. బుద్ధ్యాది సాక్షి – బుద్ధికీ, మనసుకూ, శరీరానికీ చేసేపనులన్నిటికీ సాక్షిగా

ఉండేది. సదస ద్విలక్షణం - స్థూలమూ కాక, సూక్ష్మమూ కాక, ఆ రెండిటికీ వేత్తై ఉండేది - అంటే ఆ స్థూల సూక్ష్మాలను వెలిగించి చూపేది.]

శ్లో. ఇత్థం విపశ్చిత్ సదసద్వి భజ్య
నిశ్చిత్య తత్వం నిజబోధ దృష్ట్యా
జ్ఞాత్వా స్వమాత్మాన మఖండ బోధం
తేభ్యో విముక్తః స్వయమేవ శామ్యతి. 353

తే. గీ. ఈ విధంబుగ సదసత్తు వేర్పడించి
జ్ఞాన దృష్టిని తత్వ నిశ్చయ మొనర్చి
ఆత్మ పరిపూర్ణ జ్ఞాన మంచరసి, బుధుడు
వీడి ప్రతి బంధముల; శాంతి వెలయుటొప్పు.

పండితుడైన వాడీ విధంగా సత్యమేదో, అసత్యమేదో, చక్కగా విచక్షణచేసి, తన జ్ఞాన దృష్టితో సత్యాన్ని నిర్ణయించి పరిపూర్ణ జ్ఞానరాసియైన ఆత్మను అనుభవించి, నేరుగా శాంతిని పొందుగాక!

## 354-372 సమాధి నిరూపణ

శ్లో. అజ్ఞాన హృదయ గ్రంధేః - నిశ్శేష విలయస్తదా
సమాధినాఽవికల్పేన - యదాఽద్వైతాత్మ దర్శనం. 354

తే. గీ. నిర్వికల్ప సమాధిలో నిలువనేర్చి
ద్వైత రహితంబుగా నాత్మ దర్శనంబు;
చేసినప్పుడు వీడు నిశ్శేషముగను
హృదయమున గ్రంథుల జ్ఞాన హేలజములు.

అహం బ్రహ్మాస్మి-అనే మహావాక్యానికి లక్షితార్థం - అంటే నేను శరీరాన్ని కాను; మనసును కాను; బుద్ధిని కాను; చూచి అనుభవించి భావించే ఇంద్రియాలను కాను; అన్నిటినీ వెలిగించే నేను-అదే పదాని

కర్తాన్ని. నేనే అంతటా ఉన్నాను. ఆపరాత్మను అనుభవించటానికై ప్రత్యగాత్మగా గుర్తించవచ్చు-అను కుంటూ, సదా ఆనందమయంగా ధ్యానంలో పడితే, కొంత కాలానికి నిర్వికల్ప సమాధిలో అద్వైత మైన ఆత్మను చూడ గలుగుతావు - అప్పుడు హృదయ గ్రంథులు పూర్తిగా నశిస్తాయి.

[మనసు లయించితే కాని నిర్వికల్ప సమాధి సిద్ధించదు. అప్పుడ ద్వైతాత్మ అనుభవానికి వస్తుంది. (1) అవిద్యా (2) అందువల్ల చెల రేగే వాసనలూ, (3) స్వార్థకర్మలూ - అనేవి హృదయ గ్రంథులు - వీటినే బ్రహ్మగ్రంథీ, విష్ణుగ్రంథీ, రుద్రగ్రంథీ-అంటారు.]

శ్లో. త్వ మహ మిద మితీయం కల్పనా బుద్ధి దోషాత్
 ప్రభవతి పరమాత్మ న్యద్వయే నిర్విశేషే
 ప్రవిలసతి సమాధావస్య సర్వోవికల్పో
 విలయన ముపగచ్ఛేద్ వస్తు తత్వావ ధృత్యా. 3౫౫

ఉ. నీవును-నేను-నిద్ది-అది-నిక్కముగా నివి బుద్ధి దోషముల్
 కేవల కల్పితంబులె! ఒకింత సమాధి మునింగి నప్పుడా
 దేవుడు, పూర్ణు, డద్వయుడు, దివ్యముగా కనుపట్టు నాత్మగా;
 భావన లెల్ల మాయమగు బ్రహ్మమె సత్యమటంచె అంగినన్.

వ్యావహారికంగా నీవూ-నేనూ, ఇదీ, అదీ-అనే మాటలు మనం వాడుకుంటున్నాము. నీవూ చైతన్యం-నేనూ చైతన్యం-ఇదీ చైతన్యం-అదీ చైతన్యం-అనే దృష్టితో మనమీ పదాలను వాడటంలేదు. బుద్ధి మాలిన్యం వల్ల (రజస్తమాలు కారణంగా) భేదభావంగా వాడుకుంటు న్నాము. బుద్ధి-ఆత్మకు ఉపాధి- అదే జీవుడు ! అజ్ఞానంతో ఊహాలు కల్పించు కుంటున్నాము. నిజానికి పరమాత్మ అద్వితీయం-తాను తప్ప ఇంకేదీ లేనివాడు. జాతీ, గుణమూ, క్రియా ఏదీలేనివాడు.ఆ పరమాత్మ దర్శనం ఒక్కసారి సమాధిలో లభిస్తే, ఈ భేదాలన్నీ మొదలంట నశిస్తాయి. బ్రహ్మ మొక్కటే సత్యమని తేలిపోతుంది.

శ్లో. శాంతో దాంతః పరముపరతః కాంతి యుక్తః సమాధిం
కుర్వన్నిత్యం కలయతి యతిః స్వస్య సర్వాత్మ భావం;
తేనా విద్యా తిమిరజనితాన్ సాధు దగ్ధ్వా వికల్పాన్
బ్రహ్మీ కృత్యా నివసతి సుఖం నిష్క్రియో నిర్వికల్పః. 356

ఉ. శాంతుడు, దాంతుడే బయటి సంగతులన్ స్మృతి లేనివాడు; బల్
క్షాంతుడు; బ్రహ్మమందు తన స్వాంతము పూర్తిలయింపజేసి వి
శ్రాంతి వహించు మౌని, కడు సౌఖ్యము నొందు సమాధి మగ్నుడై;
అంత నవిద్యయున్ క్రియలు నన్నివికల్పము లౌను బూడిదల్.

జితేంద్రియుడై, బాహ్యేంద్రియాలను నిరోధించినవాడై, బాహ్యవృత్తులను విసర్జించినవాడై, చలీ యెండా మొదలైన ద్వంద్వాలను జయించినవాడై నిర్వికల్ప సమాధిలో ఆత్మదర్శనం చేస్తుంటాడు. యోగి, సర్వాత్మ భావాన్ని అనుభవిస్తాడు. అవిద్యా జన్యమైన ఊహాలన్నిటినీ దహించి బ్రహ్మాకారు డౌతాడు. క్రియాశూన్యుడై ఆనందిస్తాడు.

శ్లో. సమాహితా యే ప్రవిలాప్య బాహ్యం
శ్రోత్రాది చేతః స్వమహం చిదాత్మని;
త ఏవముక్తా భవపాశ బంధైః
నాన్యేతు పారోక్ష్య కథాభి ధాయినః. 357

చ. ఎవడు సమాధిలో మునిగి యింతకు బాహ్యజగంబు, నింద్రియ
ప్రవితతి, మానసంబును, సరాసరి జీవునితోడ నాత్మలో
ప్రవిమల జ్ఞానమందు - కలుపంగలడో ? భవబంధముక్తుడీ
భువి నతడే ! పరుల్ వదరు బోతులు, వట్టి పరోక్ష భాషణుల్.

ఎవడైతే సమాధిలో ఉండ గలిగి, యీ బాహ్య జగత్తునూ, ఇంద్రియాలనూ, మనస్సునూ - అంతేకాదు - జీవుణ్ణీ పరిపూర్ణ జ్ఞానమైన ఆత్మలో లయింప జేస్తాడో, అతడొక్కడే పుట్టుకా, చావూ -

అనే సంసార బంధం నుంచీ విముక్తుడౌతాడు. తక్కిన వాఖ్యాలక బ్రహ్మాన్ని గురించి కథలు చెప్పేవాళ్లు మాత్రమే ? పరోక్ష జ్ఞానంతో మాట్లాడుతుంటారు.

శ్లో. ఉపాధి యోగాత్ స్వయమేవ భిద్యతే
చోపాధ్య పోహే స్వయమేవ కేవలః
తస్మా దుపాధేర్విలయాయ విద్వాన్
వసేత్ సదా కల్పసమాధి నిష్ఠయా. 354

తే. గీ. భేద మెంచు టుపాధుల భేదముననె;
కేవలుడె తా, నుపాధు లభావమైన;
కనుక విజ్ఞు డుపాధుల కడకుద్రోసి
నిర్వికల్ప సమాధిలో నెగడవలయు.

ఉండే దంతా ఒకే ఆత్మ! ఉపాధు లెక్కువగా ఉండటం వల్ల' మనిషి తన వ్యక్తిత్వాన్ని ఎంతో భేదంగా చూస్తున్నాడు. ఉపాధు లన్నీ మాయవల్ల ఏర్పడ్డవి కదా ? వీటిని విడిచిపెడితే, తానాత్మను మాత్రమే! అని బాగా అర్థం చేసుకుంటాడు. కాబట్టి, ఈ యుపాధు లను పోగొట్టుకోటానికై నిష్ఠగా నిర్వికల్ప సమాధిని సాధించటమే ఉపాయం. అప్పుడు మనసు శాంతించి ఊరకుంటుంది.

శ్లో. సతి సక్తో నరోయాతి - సద్భావం హ్యేక నిష్ఠయా
కీటకో భ్రమరం ధ్యాయన్ - భ్రమరత్వాయ కల్పతే. 355

ఆ. వె. సత్యమును గుఱించి సర్వదా ధ్యానించు
జనుడు తప్పకుండ సత్యమగును;
భ్రమరమును గుఱించి భావించు కీటక
మట్టె మారి భ్రమరమైన రీతి.

ఏకాగ్రంగా సత్యాన్ని (బ్రహ్మాన్ని) ధ్యానిస్తూ ఉండేవాడు క్రమంగా సత్యమై (బ్రహ్మమై) తీరుతాడు - తుమ్మెద నంటిపెట్టుకొని

దాన్నే చింతించే పురుగు, తాను కూడా తుమ్మెదగా మారుతున్నట్లే! బరిణ పురుగును తలవలలో చిక్కించుకొని భ్రమరం దాని చుట్టూ తిరుగుతూ ఉంటుంది. పురుగు భయపడి పోయి తుమ్మెదనే తలచుకుంటూ పచ్చగామారి భ్రమరమౌతుందని, మనవాళ్ళ విశ్వాసం.

శ్లో. క్రియాంతరా సక్తి మపాస్య కీటకో
ధ్యాయన్న యాళిం హ్యళి భావ మృచ్ఛతి;
తథైవ యోగీ పరమాత్మ తత్వం
ధ్యాత్వా సమాయాతి తదేక నిష్ఠయా. 360

ఆ. వె. అన్ని పనులు మాని అళినె ధ్యానించుచు
నళిగ మారు పురుగునట్లె యోగి
పట్టు విడువకెపుడు పరమాత్మ ధ్యానించి
సత్యమూర్తి యగును సత్యమరసి.

ఇతరమైన పనులింకేమీ చేయక బరిణ పురుగు భ్రమరాన్నే ఏకాగ్రంగా ధ్యానిస్తూ ఆ భ్రమరరూపాన్నే పొందుతున్నట్లుగానే, యోగి కూడా ఏకాగ్రంగా భక్తి శ్రద్ధలతో సత్యమైన పరమాత్మనే ధ్యానిస్తూ, తాను బ్రహ్మం గా గలుగుతాడు.

శ్లో. అతీత సూక్ష్మం పరమాత్మ తత్వం
న స్థూల దృష్ట్యా ప్రతిపత్తు మర్హతి;
సమాధి నాత్యంత సుసూక్ష్మ వృత్యా
జ్ఞాతవ్య మార్యై రతి శుద్ధ బుద్ధి భిః. 361

ఆ. వె. పరమ సూక్ష్మమైన పరమాత్మ తత్వంబు
స్థూల దృష్టి కెపుడు దొరకబోదు;
శుద్ధ బుద్ధితోడ చొచ్చి సమాధిలో
నుత్తములు సుసూక్ష్మ వృత్తి గంద్రు.

పరమాత్మ తత్వం చెప్పరానంత మిక్కిలి సూక్ష్మమైంది. స్థూల దృష్టి కెంత మాత్రం అందదు. పూర్తి నిర్మలమైన బుద్ధితో సమాధి ద్వారా, ఉత్తములైన వాళ్లు మాత్రమే, అతీతమైన స్వచ్ఛ మానసంతో, ప్రత్యక్షంగా చూడగలుగుతారు.

మన మీా స్థూల దృష్టితో మామూలు గాలినే చూడలేము. వీచినప్పుడు మాత్రం స్పర్శగుణాన్ని అనుభవించి గాలి వీచిందంటాము. ఆకాశం అంతకంటే సూక్ష్మం. మన చుట్టూ ఆకాశమే ఉందని తెలిసి కూడా మనం దాన్ని చూడలేక పోతున్నాము. అలాంటి మనం అంత కంటే ఎంతో సూక్ష్మమైన పరమాత్మ నెలా చూడగలుగుతామూ ? మనసు నిర్మలమై ఏకాగ్రమైన వాళ్ళకే అది సాధ్యం, ధ్యానంలో ! అది కూడా భగవదనుగ్రహం ఉంటేనే లభిస్తుంది. అలాంటి వాళ్ళే ఉత్తములు – వాళ్లు మాత్రమే సమాధిని పొందగలుగుతారు.

శ్లో. యథా సువర్ణం పుటపాక శోధితం
త్యక్త్వామలం స్వాత్మ గుణం సమృచ్ఛతి;
తథా మనః సత్వరజ స్తమో మలం
ధ్యానే సంత్యజ్య సమేతి తత్వం. 362

ఆ వె. పుటముపెట్టి కరిగి పోసిన బంగారు
మలిన ముడిగి కాంతి వెలుగునట్లు;
మనసు సత్వ-రజ-తమంబుల మలమును
వదలి ధ్యాననిష్ఠ బ్రహ్మమగును.

నిప్పుల్లో పుటపాకం పెట్టి కరిగిపోసిన బంగారం ఏ విధంగా మురికినంతా పోగొట్టుకొని సొంత కాంతిని పుంజుకుంటుందో, ఆ విధం గానే మనసు నిరంతర ధ్యానంవల్ల సత్వరజ స్తమో గుణాల మురికిని పోగొట్టుకొని పరిశుద్ధమై క్రమంగా బ్రహ్మాకారాన్ని ధరిస్తున్నది–లేదా బ్రహ్మంగా మారుతున్నది.

శ్లో. నిరంతరాభ్యాస వశాత్తదిత్థం
పక్వం మనో బ్రహ్మణి లీయతే యదా;
తదా సమాధిః సవికల్ప వర్జితః
స్వతోఽద్వయానంద రసాను భావకః. 363

తే. గీ. పక్వమగుచు నిరంతరాభ్యాసము నను
మనసు బ్రహ్మంబులోన నిమగ్నమైన;
గడచి సవికల్పమును నిర్వికల్ప మమరు;
నద్వయానంద సుఖమపు డను భవించు.

ఈ విధంగా నిరంతరాభ్యాసంచేత మనసెప్పుడు పరిపక్వమౌతుందో, అప్పుడు సవికల్ప సమాధి నుంచీ నిర్వికల్ప సమాధికి మారుతుంది. నేరుగా బ్రహ్మంలో లీనమై రెండవదేదీలేని ఆనందరసానుభూతిని పొందుతుంది.

శ్లో. సమాధి నాఽనేన సమస్త వాసనా
గ్రంధే ర్వినాశోఽఖిల కర్మనాశః
అంతర్బహిః సర్వత ఏవ సర్వదా
స్వరూప విస్ఫూర్తి రయత్న తః స్యాత్. 364

ఆ. వె. ఈ సమాధిచేత నెల్లవాసనలను
గ్రంధులూడిపోవు; కర్మలూడు;
స్వస్వరూపమపుడు సర్వదా సర్వత్ర
నావహిల్లు నప్ర యత్నముగనె.

ఈ సమాధివల్ల వాసనా రూపంగా ముడిపడి ఉండే అన్ని కోరికలూ నశిస్తాయి. అన్ని సంచిత కర్మలూ అంతరిస్తాయి. లోపలా, వెలుపలా, అంతటా ఎల్లప్పుడూ స్వస్వరూప దర్శనం ఏ ప్రయత్నమూ లేకుండానే లభిస్తుంది.

శ్లో. శ్రుతేః శతగుణం విద్యా - న్మననం మననా దపి
నిది ధ్యాసం లక్షగుణ - మనంతం నిర్వికల్పకం. 365

తే. గీ. శ్రవణమున కంటె మననంబు శతగుణంబు;
మననమున కంటె ధ్యానంబు మఱియు లక్ష
గుణ మనంగనువచ్చు; పేర్కొనగరాదు
నిర్వికల్ప సమాధి యెన్నిటను మెఱుగొ?

శ్రవణం కంటే మననం నూరింతలు గొప్ప; ఆ మననం కంటే నిది ధ్యాసం (తదేక ధ్యానం) లక్షరెట్లు మిన్న. మఱి అంతకంటే నిర్వికల్ప సమాధి – అనంత గుణం అనవచ్చునేమో?

శ్రవణ మంటే ఈ చెవితో విని ఆచెవితో వదలటంకాదు. శ్రద్ధా భక్తులతో గురువు దగ్గఱ వినేది శ్రవణం. పుస్తకాలు చదివి నేర్చుకునేదీ కూడా ఒక విధమైన శ్రవణమే! అందువల్ల జ్ఞానం కలుగుతుంది. ఆవిన్నదాన్ని – చదివి తెలుసుకున్నదాన్ని – బాగా నెమరు వేసుకొని తన సొంతం చేసుకోగలగటం, మననం. అర్థం చేసుకున్నందువల్ల నూరింతలు ఫలితం లభిస్తుంది. సాధకుడైనవాడు, అజ్ఞానాన్ని నిరంతర ధ్యానంతో అనుభవానికి తెచ్చుకుంటే, అది లక్షరెట్లు ఫలిస్తుంది. అలా ఒక దశకు హెచ్చుతూ రాగానే, కొంత కాలానికి సమాధి లభిస్తుంది. నిర్వికల్ప సమాధి – సవికల్ప సమాధి కంటే – ఎన్నోరెట్లు మేలు! ఇదంతా ధ్యాన ఫలితమే!

శ్లో. నిర్వికల్ప సమాధినా స్ఫుటం
బ్రహ్మతత్త్వ మవగమ్యతే ధ్రువం:
నాన్యథా చల తయా మనో గతేః
ప్రత్యయాంతర విమిశ్రితం భవేత్. ౩౬౬

తే. గీ. నిర్వికల్ప సమాధిచే నిశ్చయముగ
బ్రహ్మతత్త్వము వెల్లడౌ బాగుగాను;
అన్యథా మాత్ర మెపుడు సాధ్యంబుకాదు;
మనసు చపలత నితరంబు నెనయుగనుక.

నిర్వికల్ప సమాధివల్ల బ్రహ్మతత్వం తేట తెల్లంగానూ, ధ్రువం గానూ, తెలిసిపోతుంది. ఇతర పద్ధతులవలంబించి నందువల్ల అదిసాధ్యం కాదు. ఎందువల్ల నంటే. సహజంగా మనస్సుకు చలించే స్వభావం కద్దు ! ఇతర దృశ్యాలతో కలిసి పోవటానికది యెప్పుడూ, ఉవ్విళ్ళూరు తుంది. అవకాశం దొరికితే, ఊరకుండదు.

మనసు శాంతించటానికి కొన్ని పద్ధతులున్నాయి-భక్తి యోగం జ్ఞానయోగం, కర్మయోగం, ప్రాణాయామం, ఉపాసనా-మొదలైనవి. శీర్షాసనాది వివిధాసనాలు కూడా అందుకుపయోగిస్తాయి. కాని, వాటి చేత సగుణ బ్రహ్మమే కాని, నిర్గుణ బ్రహ్మం ప్రత్యక్షంకాదు. ఎందు కంటే, మనసుతోనూ బుద్ధితోనూ తెలుసుకునే జ్ఞానమంతా సగుణం మీదనే ఆధారపడుతుంది. నిర్గుణ బ్రహ్మానుభవానికొక నిర్వికల్ప సమాధే మార్గం. ఇతర మార్గాలుకావు.

శ్లో. అతః సమాధ త్స్వ యతేంద్రియః సన్
నిరంతరం శాంతమనాః ప్రతీచి;
విధ్వంసయ ధ్వాంత మనాద్య విద్యయా
కృతం సదేకత్వ విలోకనేన. 368

తే. గీ. ఇందుచేత సమాధిలో నింద్రియముల
నణచి; యేకాగ్రముగ చిత్తమాత్మ నుంచి;
శాంతి నొంది; స్వరూపంబు సత్యమెఱిగి
మాయతమము ననాదిని మాపుకొనుము !

కాబట్టి, పరిశుద్ధమైన మనస్సుతో, అతీంద్రియుడవై, మనసు నెల్లప్పుడూ నీలోపలి ఆత్మలో మగ్నంచేసి, ఆత్మే నీవని బాగా గట్టి పరచుకొని, అనాదిగా ఉండే అవిద్యాంధకారాన్ని ధ్వంసం చెయ్యి ! ఇంద్రియ నిగ్రహంవల్ల మనోనిగ్రహమూ, మనోనిగ్రహంవల్ల ఇంద్రియ నిగ్రహమూ లభిస్తాయి. విషయాల మీాద భ్రాంతి తొలగుతుంది. పూర్వవాసనలేమైనా ఉంటే కోరికలుంటాయి. వాటినిధ్వంసం చెయ్యి!

శ్లో. యోగస్య ప్రథమద్వారం - వాఙ్నిరోధోఽపరిగ్రహః;
నిరాశాచ నిరీహాచ - నిత్యమేకాంత శీలతా. 368

తే. గీ. వాఙ్నిరోధము; దానాలు పట్టకుంట;
కోరికలు లేమియును; నహంకార యుక్త
మగు పనులు వీడు; ఏకాంత మందునునికి;
మొదటి మెట్లివి యోగ వైభోగమునకు.

యోగానికి ప్రథమా ద్వారా లైదూ - (1) వాగ్వ్యాపారాన్ని మాని, మౌనంగా ఉండటం (2) అపరిగ్రహం - ఇతరులను యాచించి దానాలు తీసుకోక పోవటం (3) నిరాశ - దేని యందూ కోరిక లేకుండుట (వైరాగ్యం) (4) నిరీహ -ఏ విధమైన సంకల్పాలూ లేకపోవుట (5) ఏకాంత వాసం- నిర్జన ప్రదేశంలో ఉండటాని కలవాటు పడటం.

శ్లో. ఏకాంత స్థితి రింద్రియో పరమణే హేతుర్దమ శ్చేతసః
సంరోధే కరణం శమేన విలయం యాయాదహం వాసనా;
తేనానంద రసానుభూతి రచలా బ్రాహ్మీసదా యోగినః
తస్మాత్ చిత్తనిరోధ ఏవ సతతం కార్యః ప్రయత్నాన్మునేః !

శా. ఏకాంతస్థితి యింద్రియంబుల నిభాయించున్; మనస్సందుచే
నేకాగ్రంబగు; దానిచే నహముతా నే మాయమౌ; యోగియున్
సాకల్యంబుగ బ్రహ్మముందెలియగా శక్తుండగున్; కాని, ధ్యా
నైకా కాంక్ష మనోవినిగ్రహమే సేయంజెల్లు ముఖ్యంబుగన్.

ఏకాంతంగా ఉండేది అలవాటైతే, ఇంద్రియ నిగ్రహం కలుగుతుంది. ఇంద్రియాలు స్వాధీనంలో ఉంటే, మనోనిగ్రహ మేర్పడుతుంది. అహంకార మనేది నశిస్తుంది. యోగికి నిరంతరం బ్రహ్మానందానుభవం లభిస్తుంది. కాబట్టి, ఎవడు ధ్యానంలో పడదలచుకున్నాడో, వాడెల్లప్పుడూ మనోనిగ్రహం కలిగి ఉండటం తప్పదు.

ఏకాంత స్థితి-అంటే, ఎవ్వరూ లేనిచోట ఉండటంకాదు; నలుగురిలో తిరుగుతూ కూడా హృదయంలో ఒకే లక్ష్యంతో ఉండటం. ఇందుకు మనోనిగ్రహమే ముఖ్యం. అందువల్ల మనశ్శాంతి ఏర్పడుతుంది.

శ్లో. వాచం ని యచ్ఛాత్మని; తం ని యచ్ఛ
బుద్ధౌ; ధియం యచ్ఛర బుద్ధి సాక్షిణి;
తం చాపి పూర్ణాత్మని; నిర్వికల్పే;
విలాప్య శాంతిం పరమాం భజస్వ ! 320

ఆ. వె. మాట మనసులోన మనసును బుద్ధిలో
బుద్ధి - బుద్ధిసాక్షి పొందుపరచి;
బుద్ధి సాక్షి గలిపి పూర్ణాత్మలో నిర్వి
కల్పముగను; శాంతి గనుము, సతము.

వాక్కును (బాహ్యేంద్రియాలని కూడా వాక్కు- కర్థముంది) అంతరింద్రియమైన మనసులో నియమించు ! మనసువల్లనే బాహ్యేంద్రియ వ్యాపారాలన్నీ జరుగుతున్నాయి- కనుక, వాటిని జయించమని కూడా సూచన. మౌనం బాగా దృఢపడిన తర్వాత, ఆ మనస్సును నిశ్చయాత్మకమైన బుద్ధిలో లయం చెయ్యి ! దానివల్ల చిత్తనిరోధమేర్పడుతుంది. ఆ బుద్ధిని ప్రేరేపించేది జీవాత్మ (బుద్ధి సాక్షిణి); కనుక బుద్ధిని బుద్ధి సాక్షిణియైన జీవాత్మలో ఉంచు ! బుద్ధ్యుపాధి లేకపోతే, జీవుడు (కూటస్థుడు) శుద్ధ చైతన్యమే ! ఆ ప్రత్యగాత్మను (శోధిత త్వం పదార్థాన్ని) పరమాత్మమైన నిర్గుణ పరబ్రహ్మంతో ఏకం చెయ్యి ! పరమశాంతిని అనుభవించు !

శ్లో. దేహ ప్రాణేంద్రియ మనో - బుద్ధ్యాది భి రుపాధి భిః
యైర్యై ర్వృత్తేః సమాయోగః - త త్తద్భావోస్య యోగినః. 321

తే. గీ. దేహమును ప్రాణములును నింద్రియ సమూహ
మును మనస్సును బుద్ధ్యాదు లను నుపాధు

లందు నెద్దాన నేవృత్తి నొందు యోగి
మనసు? తద్రీతి నతడును మార్పు జెందు.

దేహమూ, ప్రాణమూ, ఇంద్రియాలూ, మనస్సూ, బుద్ధీ మొదలైనవన్నీ ఉపాధులు. అంతఃకరణ వృత్తియే యేయేఉపాధుల్లో ఉంటుందో, దాని ధర్మమే అంతః కరణానికి అనుభూతమౌతూ ఉంటుంది.

మొదటి ఉపాధి శరీరం - అంతఃకరణ వృత్తి ఈ ఉపాదిలో ఉన్నప్పుడు తానే శరీరమనుకొని తాదాత్మ్యం చెంది, శరీరంచిక్కిపోతే నేను చిక్కిపోయినాననీ, బలిస్తే తాను బలిసినాననీ, అనుకుంటుంది. జ్ఞాని శరీరోపాధిలోని అంతఃకరణమేమో శరీర ధర్మాలైన కృశత్వ స్థౌల్యాలు తనవిగా భావిస్తుంటే, ఆ జ్ఞాని మాత్రం ఆసంగతి గ్రహించి తాను తటస్థుడై ఉండగలుగుతాడు. రెండవ ఉపాధి ప్రాణం - దీనికి ఆకలి దప్పికలు ధర్మాలు. వాటిని యోగి తనవిగా భావింపక అంతః కరణ మా ఉపాధి యందుండి ఆ ధర్మాలను తనవిగా భావిస్తున్నదని యెంచి, తాను మాత్రం తటస్థుడుగా ఉంటాడు.

మూడవ ఉపాధి ఇంద్రియాలు - అవి వాటి వాటి ధర్మాల ననుసరించి పనిచేసేటప్పుడు నేను చేస్తున్నానని అనుకోక నా అంతః కరణ ఆ ఉపాధులతో తాదాత్మ్యం పొంది ఆయాపనులు తనవిగా భావిస్తున్నదే కాని, తనకేమీ సంబంధం లేదనుకుంటాడు.

నాలుగవ ఉపాధి మనస్సు-మనస్సుకు సుఖదుఃఖాలు ధర్మాలు- అవి కలిగినపుడు అంతఃకరణ ఆ ఉపాధిలో ఉండి ఆ ధర్మాలు తనవిగా భావిస్తున్నదని యెంచి తనవికానట్టుగా ఉండవలసింది అతని కర్తవ్యం.

ఐదవ ఉపాధి బుద్ధి - యుక్తాయుక్త వివేచన దీని ధర్మం. ఇక్కడ కూడా అంతకరణ ఆయాపనులు జరిపిస్తున్నదని యెంచి యోగి మాత్రం తాను తటస్థంగా ఉండవలెను.

ఇంకా స్వప్న సుషుప్త్యాదుల్లోనూ మానసికంగా అవికలుగుతున్నాయనీ, తనకేమీ సంబంధంలేదనీ, యోగి భావించవలసిందే !

ఇలా యోగి ఎప్పుడూ ఉపాధులతో తాదాత్మ్యం పొందక తాను వేఱుగా ఉన్నట్టు భావించటం సబబు. ఐతే, అలా జరుగుతున్నదా ? లేదా ? అనేది ఎవరికివాళ్లే తెలుసుకోగలరు.

శ్లో. తస్మి న్వృత్త్యాముసేః సమ్యగ్ - సర్వోప రమణం సుఖం
సందృశ్యతే సదానంద - రసానుభవ విప్లవః. 322

ఆ. వె. ఇది యతండు పూర్తి వదలి పెట్టిన యప్పు
డింక దేనినైన నిట్టె విడుచు;
సులభముగ లభించు సుఖము సర్వోపరి
ననుభవింప గల డనంతముగను.

పై శ్లోకంలో ప్రకారం యోగి చేయగలిగి, ఉపాధి తాదాత్మ్యాన్ని పూర్తి వదలగలిగితే, ఇంక అన్నిటినీ అతడు సులభంగా విడువ గలుగుతాడు. విడిచినప్పుడా ! అపార నిత్యానందరసాన్ని విప్లవం వలె అనుభవించ గలుగుతాడు.

## 373-378 వైరాగ్య నిరూపణ

శ్లో. అంతస్త్యాగో బహిస్త్యాగో - విరక్తస్యైవ యుజ్యతే
త్యజత్యంత ర్బహిః సంగం - విరక్త స్తు ముముక్షుణా. 323

ఆ. వె. అంతరమున బాహ్యమందు త్యాగమునకు
నర్హుడొక విరక్తుడైన వాడె !
అతడు మోక్షకామి యగుట నంతర్బహి
స్త్యాగమునకు సిద్ధుడన్ని యెడల.

అంతస్సంగ మంటే, దేహేంద్రియ ప్రాణమనో బుద్ధ్యాదులందు తాదాత్మ్య భావన; వానియందు అభిమానించుట. బహిస్సంగ మంటే

నో! పుత్రమిత్ర కళత్రాదులందూ గృహారామక్షేత్రాదులందూ, విత్తమందూ, మమకారం కలిగి ఉండటం. ఈ రెండూ మోక్షకాములైన విరక్తుడు మాత్రమే విడిచిపెట్ట గలుగుతాడు.

శ్లో. బహిస్తు విషయైః సంగం – తదాంతరహమాదిభిః
విరక్త ఏవ శక్నోతి – త్యక్తుం బ్రహ్మణి నిష్ఠితః. 328

ఆ. వె. బాహ్యమందు విషయవస్తు సంగంబును
నహము ప్రభృతి సంగ మంతరమున;
వదల గలుగువాడు వైరాగ్యవంతుడే!
బ్రహ్మమందు నిష్ఠ ప్రబలమగుట.

బ్రహ్మమందు పూర్తిగా మనసులగ్నమై ఉండే వైరాగ్యవంతుడొక్కడే – బాహ్యమైన విషయవస్తువుల మీది అపేక్షనూ, అంతరంగంలోని అహంకారమూ మొదలైన వాటిమీది అభిమానాన్నీ వదల గలుగుతాడు. ఈ రెండు త్యాగాలూ మామూలు మనిషి చేయ లేడన్నమాట!

శ్లో. వైరాగ్య బోధౌ పురుషస్య పక్షివత్
పక్షౌ విజానీహి విచక్షణత్వం;
విముక్తి సౌధాగ్ర లతాధి రోహణం
తాభ్యాం వినా నాన్యతరేణ సిద్ధ్యతి. 329

ఉ. బోధయు నున్ విరక్తియును ముఖ్యముగానివి రెండు రెక్కలో
సాధక! పక్షికింబలెనె; చాలదొకానొక రెక్క మాత్రమే!
సౌధముపైని ముక్తిలత చక్కగ జేరుకొనంగ, రెండునున్
సాధన యోగ్య పక్షములు, చాల బలిష్ఠములౌట మేలగున్.

సాధకా! బాగా తెలుసుకో! వివేకమూ – వైరాగ్యమూ – పక్షికి వలెనే నీకూ రెండు రెక్కలనుకో! రెండూ సమానంగా ఉంటేనే కాని, ఉపయోగించవు. ఏ ఒక రెక్క మాత్రమే ఉంటే, ఎవరికైనా,

మిక్కిలి యెత్తున సౌధాగ్రం మీద ఉండే ముక్తిలతను చేరుకోటం, సాధ్యంకాదు సుమా!

ముక్తినొక సౌధాగ్రం మీది లతతో పోల్చినాను, శంకరుడు ఏగుడి గోపురాల మీదనో ఒక తీగ మొలిచిందనుకుందాము. దాన్ని అందుకోటానికై ఎగరక తప్పదు. మామూలు మనిషికది సాధ్యమా? అని ఆయన అభిప్రాయం కాబోలు!

శ్లో. అత్యంత వైరాగ్యవతః సమాధిః
సమాహి తస్యైవ దృఢ ప్రబోధః
ప్రబుద్ధ తత్వస్యహి బంధ ముక్తిః
ముక్తాత్మనో నిత్య సుఖాను భూతిః. 376

తే. గీ. గాఢ వైరాగ్యవంతుడే కను సమాధి;
ఆ సమాహితునకె దృఢమైన బోధ;
బోధ కలవానికే బంధముక్తి; ముక్తు
డైన వానికె నిత్యసుఖాను భూతి

అత్యంత వైరాగ్యవంతుడైన వానికే సమాధి లభిస్తుంది. సమాధి లభించినవాడికే నిజమైన ఎఱుక ఏర్పడుతుంది. ఎఱుక కలిగిన వాడికే బంధముక్తి అప్రయత్నంగా జరుగుతుంది. అలా ముక్తుడైన వాడికే నిత్యసుఖాను భవం అబ్బుతుంది.

శ్లో. వైరాగ్య సంపన్న పరం సుఖస్య జనకం పశ్యామి వశ్యాత్మనః;
తచ్చే చ్ఛుద్ధ తరాత్మబోధ సహితం స్వారాజ్య సామ్రాజ్యధుక్
ఏతద్ద్వార మజస్రముక్తియువతే యస్మాత్త్వ మస్మాత్పరం
సర్వత్రా స్పృహ యా సదాత్మని - సదా ప్రజ్ఞాం కురు శ్రేయసే. 377

శా. వైరాగ్యంబున కంటె సౌఖ్యదమికన్ వశ్యాత్ముడౌ వానికన్
వేరేలే, దదిశుద్ధ బోధ యుతమై స్వేచ్ఛా ప్రభుత్వంబు, చే

దూరం జేయును; ముక్తికాంత తలుపా కూటంబు కాబట్టి, శ్రే
యో రూఢంపు విరక్తితోడ నెపుడాత్మోపాసనం జేయుమా !

ఆత్మ నిగ్రహం కలవాడికి వైరాగ్యం కంటే సుఖప్రదమైన దింకేదీ లేదని నాకనిపిస్తుంది. ఆవైరాగ్యం పరిపక్వమైన వివేకంతో కూడి ఉంటే, స్వారాజ్య సామ్రాజ్యం కరతలామలకమై ఉంటుంది. ముక్తి కాంతా మందిర ద్వారం అదే కనుక, నీ శ్రేయస్సు కోసం, లోపలా వెలుపలా వైరాగ్యం పూని, మనసునెప్పుడూ పరమాత్మ యందే ఉండ నిమ్మని చెపుతున్నాను.

[స్వారాజ్యం – అద్వయమైన ఆత్మ యందే మనసుండటంవల్ల లభించే నిరంతరానందం అంతరాయమేదీ ఉండదు కనుక.]

శ్లో. ఆశాంఛింది విషోపమేషు విషయేష్వేషైవ మృత్యోః సృతిః
త్యక్త్వా జాతి కులాశ్రమేష్వభిమతం ముంచాతి దూరాత్క్రియాః
దేహాదావసతి త్యజాత్మధిషణాం ప్రజ్ఞాం కురుష్వాత్మని
త్వం ద్రష్టాస్యమలోఽసి నిర్ద్వయ పరబ్రహ్మాసి యద్వస్తుతః. 379

మ. వెడలం గోసి విషోపమాన విషయాభీష్టంబు, మృత్యుప్రతిన్;
కడిమిన్ జాతి కులాశ్రమాద్యహము నింకంజేసి; స్వార్థక్రియన్
విడి; దేహాద్యభిమానమున్ వదలి; యేవేళన్ మనం బాత్మలో
నిడుమా ! అద్వయమైన బ్రహ్మమవు నీవే సాక్షి వన్నింటికిన్.

విషయ వస్తువులైన శబ్దస్పర్శ రూపాదులూ, పుత్రమిత్రకళత్రాదులూ, గృహారామ విత్తాదులూ, విషంతో సమానమైనవి కనుక, వానియందాశను తెగనఱుకు! అవన్నీ మృత్యువుకు ప్రతిరూపాలనుకో! జాతి కులాశ్రమాదులున్నాయనే అహంకారం విడిచిపెట్టు ! స్వార్థక్రియ లన్నిటినీ దూరంగా నెట్టు! మనసు నాత్మయందే లగ్నం చెయ్యి!ఎందు కంటే నీవు నిజానికి బ్రహ్మనివి – ఈ శరీరానివికావు – అన్నిటికీసాక్షివి మాత్రమే ! అహం బ్రహ్మాస్మి – బ్రహ్మ వస్తువునే నేను – అని గట్టి నమ్మకంతో ప్రవర్తించు !

# 379-383 ధ్యాన విధానం

శ్లో. లక్ష్యే బ్రహ్మణి మానసం దృఢతరం సంస్థాప్య బాహ్యేంద్రియం
స్వస్థానే వినివేశ్య నిశ్చల తను శ్చోపేక్ష్య దేహస్థితిం
బ్రహ్మాత్మైక్య ముపేత్య తన్మయతయా చాఖండ వృత్త్యానిశం
బ్రహ్మానంద రసం పి బాత్మని ముదా శూన్యైః కిమన్యైర్భ్రమైః. 379

మ. మనసున్ గట్టిగ లక్ష్యమందునిచి బ్రహ్మంబందు; బాహ్యేంద్రియా
లను స్వస్థానము జేర్చి; యా తనువుపట్లన్ తిండితీర్థాల చిం
తను వర్జించి; స్థిరంబుగా నెపుడు నాత్మైక్యంబు సంధించి; గై
కొని యానందరసంబు త్రాగుమిక ! తక్కుల్ వ్యర్థ విభ్రాంతులే !

"ప్రారబ్ధం పుష్యతి వపుః" - ప్రారబ్ధ కర్మయే శరీరాన్ని పెంచుతుంది - అనే నిశ్చయంతో దేహస్థితి, దేహపోషణా మొదలైన సంగతుల మీద అభిమానాన్ని విడిచిపెట్టు! సుఖాసనంలో ఉండి బాహ్యేంద్రియాలను స్వస్థానంలో నిగ్రహించు లక్ష్యమైన బ్రహ్మమందే మనసును లయించు ! జీవ బ్రహ్మైక్య సంధానం చేసి, అపరోక్షానుభూతితో బ్రహ్మానంద రసాన్ని పానం చెయ్యి! వ్యర్థమైన భ్రాంతులన్నీ దూరంగా నెట్టు! స్థిరంగా సుఖాసనంలో ఎంతసేపుంటే, అంత మంచిది సుమా !

శ్లో. అనాత్మ చింతనం త్యక్త్వా - కశ్మలం దుఃఖకారణం;
చింత యాత్మాన మానంద - రూపం యన్ముక్తి కారణం. 380

తే. గీ. కశ్మలము దుఃఖములకెల్ల కారణంబు
నగు న నాత్మను చింతించుటాపి వైచి;
అతిశయానంద రసరూప మగుచు ముక్తి
దాయకంబైన ఆత్మ చింతన మొనర్చు !

మిక్కిలి అపవిత్రమైన కీడు కలిగించేదీ, అనంత దుఃఖాలకు కారణమైనదీ ఐన అనాత్మ చింతనమాని, అతిశయానంద రసరూపమై, ముక్తి కారణమైన ఆత్మచింతన చెయ్యి !

శ్లో. ఏష స్వయం జ్యోతి రశేషసాక్షీ
విజ్ఞానకోశే విలసత్య జస్రం
లక్ష్యం విధాయైన మసద్విలక్షణం
అఖండ వృత్త్యాత్మత యాను భావయ ! ౩౮౧

తే. గీ. ఇదె స్వయంజ్యోతి ! అన్నిటికేక సాక్షి ;
తనకు విజ్ఞానకోశమే స్థానమెపుడు;
ఈ యసత్య విలక్షణమే నిజాత్మ
యని యఖండముగా ధ్యానమందు మునుగు!

ఈ యాత్మ స్వయం ప్రకాశమైనది. ఇతర వస్తువులచేత ప్రకాశించేది కాదు. సర్వద్రష్ట. విజ్ఞానమయ కోశంలో ఉంటుంది. జడములూ దృశ్యాలూ ఐన బుద్ధ్యాదుల కంటే విలక్షణమైనది. ఈ యాత్మనే లక్ష్యంగా చేసుకొని, మనసంతా అక్కడే మగ్నంచేసి, ధారావాహికమైన అఖండ జ్ఞానంతో, స్వస్వరూపంగా సాక్షాత్కరించుకో !

శ్లో. ఏతమచ్ఛిన్నయా వృత్త్యా - ప్రత్యయాంతర శూన్యయా
ఉల్లేఖయన్ విజానీయాత్ - స్వస్వరూపతయా స్ఫుటం. ౩౮౨

తే. గీ. ప్రత్యయాంతర మేది యేర్పడక యుండ
ధ్యాన మొనరింపు మీయాత్మ ననవరతము;
సందు వదలక, దీనినే స్వస్వరూప
మనుచు భావించి ప్రత్యక్ష మనుభవించు !

నడుమ నడుమ ఇంకేదీ అడ్డు రాకుండా విచ్ఛిత్తి కలుగకుండా తైలధారవలె అఖండంగా బ్రహ్మాకారవృత్తిని అనుభవించు ! అదే స్వస్వరూపమని స్ఫుటంగా తెలుసుకో !

శ్లో. అత్రాత్మత్వం దృఢీకుర్వ - న్నహమాదిషు సంత్యజన్
ఉదాసీనతయా తేషు తిష్ఠేద్ ఘటపటాదివత్. ౩౮౩

తే. గీ. ఆత్మయే స్వస్వరూప మటంచు గట్టి
పరచి; అహమాదులను వేఱుపడగ విడిచి;
పగిలి పోయిన కుండయు పటమువోలె
వాని పట్టించుకొన కుదాసీన బుద్ధి.

ఆత్మయే స్వస్వరూప మనేది పూర్తిగా సాధిస్తూ, అహంకారాది అనాత్మలందు ఆత్మ బుద్ధిని విడిచి, అపత్తులూ జడములూ ఐన అహంకారాదులను ఉదాసీన భావంతో పగిలిన కుండవలెనూ, చినిగినవస్త్రం వలెనూ, చూడు ! (నేనూ-నాదీ-అనిమాత్రం అనుకోకు !)

## 384-397 ఆత్మజ్ఞానము

శ్లో. విశుద్ధ మంతః కరణం స్వరూపే -
నివేశ్యసాక్షిణ్యవబోధమాత్రే
శనై శ్శనైర్నిశ్చలతా ముపానయన్ -
పూర్ణత్వ మేవాను విలోక యే త్తతః. ౩౮౪

తే. గీ. జ్ఞాన సర్వస్వమును సాక్షియైన ఆత్మ
యందె అంతఃకరణ శుద్ధి పొందుపఱచి;
కొంచె కొంచెముగా గలయించి పిదప;
తనదు విశ్వాత్మతను కనుంగొనగవలయు.

రజస్తమోగుణాల మాలిన్యం అణుమాత్రమైనాలేని పరిశుద్ధమైన అంతఃకరణాన్ని జ్ఞాన సర్వస్వమూ, సర్వసాక్షీయైన స్వస్వరూపంలోకి కొంచెం కొంచెంగా ప్రవేశపెట్టి, అదిమళ్లీ బహిర్ముఖం కాకుండా చూస్తూ, అంటే మెల్లమెల్లగా నిశ్చలత్వాన్ని పొందిస్తూ, అక్కడే ఉంచే ప్రయత్నం చెయ్యి! ఆ పిమ్మట పూర్ణత్వాన్నే చూడు ! ఇదే సందర్భంలో గీతాశ్లోకం జ్ఞాపకానికి వస్తుంది.

శ్లో. శనైః శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతి గృహీతయా
ఆత్మసంస్థం మనః కృత్వా - నకించి దపి చింతయేత్. (గీ. 6-25)

సంకల్పాలవల్ల కలిగే కోరికలను దృఢమైన వివేకంతో కూడిన చిత్తంతో నిశ్శేషంగా తెగటార్చి, ఇంద్రియ వ్యాపారాలన్నిటినీ నిగ్రహించి, ధైర్యవంతమైన బుద్ధితో మనస్సును మెల్లమెల్లగా ఆత్మలో చొప్పించి, ఉపరతి చెంది, వేజే చింతలన్నీ మానుకో !

శ్లో. దేహేంద్రియ ప్రాణమనోహమాదిభిః
స్వాజ్ఞాన క్లుప్తై రఖిలై రుపాధి భిః;
విముక్త మాత్మాన మఖండ రూపం
పూర్ణం మహాకాశ మివావలోకయేత్. ३८२

తే. గీ. తనువు నింద్రియములు ప్రాణమును మనంబు
సహము నజ్ఞానజనితములగు నుపాధు
లనుచు విడిచి, యఖండ మనంతమైన
యాత్మ - తుదిలేని యాకాశమట్లెఱుంగు !

ఈ శరీరమూ, ఇంద్రియాలూ, ప్రాణాలూ, మనసూ, జీవుడూ, ఇవన్నీ అజ్ఞానంచేత ఏర్పడ్డ ఉపాధులు. అసత్య పదార్థాలు. ఇన్నిటి నుంచీ విడివడిపోయి అఖండమూ, పరిపూర్ణమూ, ఐన ఆత్మను అనుభవానికి తెచ్చుకో ! - అంతులేని ఆకాశం మాస్తరుగా! ఘటాకాశ, మఠాకాశాదులను మహాకాశంలో కలిపినట్టుగా, జీవచైతన్యాన్ని బ్రహ్మచైతన్యంలో కలుపు !

శ్లో. ఘటకలశ కుసూల సూచి ముఖ్యైః
గగన ముపాధిశతైః విముక్త మేకం
భవతి, నవివిధం; తథైవ శుద్ధం
పర మహమాది విముక్త మేకమేవ. ३८३

తే. గీ. కుండ, కూజాయు, ధాన్యపుకొట్టు, సూది -
వంటి వందలుపాధులు వదలి గగన

మొక్కటే! భేదములు లేవు; నిక్కమగ్లై
బ్రహ్మ మొక దహమాదుల వదలినపుడు.

మనమంతా ఆకాశంలోనే ఉన్నాము. వట్టికుండలోనూ ఆకాశమే! కూజాలోనూ ఆకాశమే! ధాన్యపు కొట్టులోనూ ఆకాశమే! సూది బెజ్జంలోనూ ఆకాశమే! ఆయా బయళ్లన్నీ ఉపాధులన్నమాట! ఆ ఉపాధులను తొలగిస్తే ఉండేదంతా ఒకే మహాకాశం దానిలో భేదాలు లేవు. ఈ బయలును వేదాంతులంతా ఆత్మతో పోలుస్తారు. కాని, అంతమాత్రాన ఆకాశాన్ని ఆత్మగానూ, ఆత్మను ఆకాశంగానూ, భావించరాదు. ఆకాశానికి శబ్ద గుణముంది. ఆత్మ నిర్గుణం కదా? ఆత్మ-దేహమూ, మనసూ, బుద్ధీ-అనే ఉపాధులచేత చుట్టబడి ఉంది. ఉపాధులన్నీ భ్రాంతి మూలకాలు- మనసుచేత కల్పితాలు. ఇవి తొలగిస్తే ఆత్మ ఒక్కటే! అందటిలోనూ ఉంది. అదొక్కటే శాశ్వతం - ఈ సిద్ధాంత మింకా ముందు శ్లోకాల్లో వివరించబడింది.

శ్లో. బ్రహ్మాద్యాః స్తంభ పర్యంతా - మృషామాత్రా ఉపాధయః
తతః పూర్ణం స్వమాత్మానం - పశ్యేదేవాత్మనా స్థితం. 388

ఆ. వె. బ్రహ్మ మొదలు స్తంభ పర్యంతమును నీప్ర
పంచ మంతయును నుపాధిమయమె!
మృషలుపాధు లెల్ల; మిగుల జాగ్రత్తగా
నాత్మ యొకటె యునికి యని యెఱుంగు!

సృష్టి కర్తయైన బ్రహ్మ మొదలుకొని, సృష్టిలోని గడ్డిపరక వఱకూ, అన్నీ ఉపాధులే! ఐతే అన్నీ మిథ్యలే! సర్వాధిష్ఠానమైన బ్రహ్మమందు కల్పితాలు. వాస్తవాలుకావు. విమర్శిస్తే వాటికి ప్రతీతి యెంత మాత్రంలేదు. కనుక, ప్రళయ కాల సముద్రం మోస్తరుగా ఒక్కటే స్వరూపంతో ఉండేదీ, త్రివిధ పరిచ్ఛేదాలు లేక పూర్ణమ యిందీ, ఐన స్వస్వరూపాన్ని ప్రత్యక్షంగా చూడు!

శ్లో. యత్ర భ్రాంత్యా కల్పితం యద్వివేకే
తత్తన్మాత్రం నైవ తస్మాద్విభిన్నం
భ్రాంతేర్నాశే భ్రాంతి దృష్టాహి తత్త్వం
రజ్జుస్తస్మాద్విశ్వమాత్మ స్వరూపం. 388

తే. గీ. ఏది పొరపాటుచేత నూహింపబడిన ?
దది వివేకముచేత సత్యమును తెల్పు;
భ్రాంతి పాము తొలంగిన త్రాడె మిగులు !
అటులె యీవిశ్వమాత్మయే ! అనుట నిజము.

పొరపాటున ఏదో ఉన్నదని భ్రాంతి పడిందంతా, సరియైన విచక్షణచేత తొలగి, సత్యం తెలిసి పోతుంది. భ్రాంతిలో ఏదో పామను కున్నది – ఆ భ్రాంతి తొలగగానే విచక్షణచేత త్రాడని బాగా తేలి పోతుంది. అదే ప్రకారంగా ఈ విశ్వమంతా విచారించి చూస్తే ఆత్మ స్వరూపం మాత్రమే !

త్రాడు త్రాడుగా ఎప్పటికీ ఉంది. అది పాముగా మారిందిలేదు. పాము పామనుకోటం నీ భ్రాంతి మాత్రమే! అలా నీవు ప్రపంచమని భ్రాంతి పడేదంతా బ్రహ్మమే !

శ్లో. స్వయం బ్రహ్మ స్వయం విష్ణుః – స్వయమింద్రః స్వయం శివః
స్వయం విశ్వమిదం సర్వం – స్వస్మాదన్యం నకించన. 389

ఆత్మయే బ్రహ్మ, ఆత్మయే ఆదివిష్ణు
వింద్రుడాత్మ, శివుండాత్మ; ఈ సమస్త
విశ్వమంతయు నాత్మయే ! వేఱు కాదు,
లేదు వేదాత్మ తప్ప ఇంకేది లేదు.

ఆత్మే బ్రహ్మ; ఆత్మే విష్ణువు; ఆత్మే ఇంద్రుడు; ఆత్మే శివుడు; ఆత్మే ఈ విశ్వమంతా కూడా. ఆత్మ తప్ప ఇంకేదీ ఎక్కడా లేనే లేదు.

"సృష్టి కర్త్రీ బ్రహ్మరూపా, గోప్త్రీ గోవిందరూపిణీ, సంహారిణీ రుద్ర రూపా" – అని లలితా సహస్ర నామావళి. బ్రహ్మ విష్ణు మహేశ్వర రూపాలు మూడూ నీవే! – అన్నందువల్ల సృష్టి– స్థితి–లయాలు చేసే టప్పుడు ఆత్మకా పేళ్ళని విశదమౌతుంది. కనుక ఈ మూర్తులన్నీ ఉపాధి భేదాలే!

ఇంకా విమర్శిస్తూపోతే, సత్వరజస్తమో గుణాలకే ఈ మూడు మూర్తుల పేళ్లు! కనుక ఈ ముగ్గురూ ప్రకృతి బిడ్డలే! అందటిలోనూ ఉండేది అదే చైతన్యమే! "అసావాదిత్యో బ్రహ్మ" – అని సంధ్యా వందనం. ఓం – ఇత్యేకాక్షరం బ్రహ్మ – ఇత్యాదులన్నీ ఆత్మకు నామ రూప భేదాలనే సూచిస్తాయి.

శ్లో. అంతః స్వయం చాపి బహిః స్వయంచ;
స్వయం పురస్తా త్స్వయమేవ పశ్చాత్;
స్వయం హ్యా వాచ్యాం స్వయమప్యుదీచ్యాం;
తథోపరిష్టా త్స్వయ మప్యథస్తాత్. ౩౯౦

ఆ. వె. అంతరమున నాత్మ; ఆత్మ బాహ్యమునను;
నాత్మ ముందు ప్రక్క; నాత్మ వెనుక;
నాత్మ దక్షిణమున; నాత్మ యుత్తరమున;
నపై యాత్మమీద; నాత్మ క్రింద.

లోపలా ఆత్మ; వెలుపలా ఆత్మ; ముందటా ఆత్మ; వెనుకా ఆత్మ; (పూర్వ పశ్చిమాల్లో) దక్షిణానా ఆత్మ; ఉత్తరానా ఆత్మ; పైనా ఆత్మ: క్రిందా ఆత్మ. అంతటా తానే!

శ్లో. తరంగ ఫేన భ్రమ బుద్బుదాది
సర్వం స్వరూపేణ జలం యథా తథా
చిదేవ దేహా ద్యహ మంతమేత
త్సర్వం చిదేవైక రసం విశుద్ధం. ౩౯౧

ఆ. వె. అలలు నురుగు సుడులు నఖిల బుద్బుదములు
నాదియైన వెల్ల నంబుసార;
మట్లె దేహమాది అహముదాకను సత్తె
శుద్ధచిత్తె అన్నిచోట్ల సమము.

అలలూ, నురుగూ, సుడి గుండాలూ, బుడగలూ–మొదలైన వన్నీ సారమేమని చూస్తే నీళ్ళే! అదే మాదిరిగా దేహం మొదలు జీవుడి దాకా అన్నీ చిత్తే! ఆచిత్తే అన్నిటిలోనూ శుద్ధంగానూ సమానంగానూ ఉంది. చిత్తంటే స్వయంప్రకాశమైన ఆత్మ–పరిపూర్ణ జ్ఞానం. అదే శరీరాన్నీ మనసునూ, బుద్ధినీ వెలిగిస్తుంది.

శ్లో. సదే వేదం సర్వం జగదవ గతం వాఙ్మనసయోః
సతోఽన్య న్నాస్త్యేవ ప్రకృతి పరసీమ్ని స్థిత వతః;
పృథ క్కిం మృత్స్నాయాః కలశఘట కుంభాద్యవగతం
వదత్యేష భ్రాంత స్త్వహమితి మాయా మదిరయా. ౩౯౨

శా. వాక్కున్ మానసమూలమై దెలియు విశ్వంబంతయున్ బ్రహ్మమే
తక్కన్ భిన్నము కాదికన్ ప్రకృతి పుంతల్ దాటు బ్రహ్మంబుకా
కొక్కండున్ మఱిలేదు; మృత్తికకు వేఱోకుండ కూజాలు? కై
పెక్కన్ భ్రాంతుడు మాయవారుణిని, నీవేనంచు మాట్లాడెడిన్.

వాక్కూ మనసూ ద్వారా తెలుసుకునే యీ విశ్వమంతా బ్రహ్మమే తప్ప ఇంకొకటి కాదు. ప్రకృతి పరిధిని దాటి ఉండే బ్రహ్మం తప్ప తక్కినదంతా నాస్తే! మట్టితో తయారైన కుండలూ, కూజాలూ, బానలూ, అన్నీ మట్టే కదా ? మాయా మద్యపానంచేసి భ్రాంతుడైన వాడు–నీవూ నేనూ–అని మాట్లాడుతాడు.

విశ్వంలో వేఱువేఱుగా కనపడేవన్నీ నామరూపాలు మాత్రమే! అని తొలగించి చూస్తే, అంతా బ్రహ్మమే!

శ్లో. క్రియా సమభిహారేణ - యత్రనాన్యదితి శ్రుతిః
బ్రవీతి ద్వైతరాహిత్యం - మిథ్యా ధ్యాస నివృత్తయేః 3F3

ఎచట నితరమేది యెసగదో ? - అని శ్రుతి
బహుళ క్రియలచేత ప్రకటపరచు;
మిథ్యయైన యట్టి అధ్యాస మాన్పుట
కొఱకు; ద్వైత రహిత మెఱుక పడగ.

యత్ర నాన్య దితి-ఎక్కడ ఇతరమేమీ చూడటంలేదో ?-అని మొదలుపెట్టి అనేక క్రియలతో ద్వైత రాహిత్యాన్ని చాటుతుంది - శ్రుతి. ఇదంతా మిథ్యాభూతమైన అధ్యాసను పోగొట్ట డానికే! యత్ర నాన్య త్పశ్యతి నాన్య చ్ఛృణోతి నాన్యద్విజానాతి సభూమా-ఎక్కడ ఇతరం ఒకడేమీ చూడడో, ఏమీ వినడో, ఏమీ తెలియడో, అది అనంతం అంటుంది ఛాందోగ్యోపనిషత్తు. మిథ్యా భూతమైన ప్రపంచ రూపాధ్యాస తొలగటానికై నపశ్యతి నశృణోతి నవిజానాతి-కనడూ, వినడూ, తెలిసికొనడూ-అని క్రియలను మాటిమాటికీ ఉపయోగించి ద్వైతం లేదని బోధిస్తుంది. ద్వైత ప్రపంచ మొకటి సత్యమై ఉండిన యెడల బ్రహ్మనిష్ఠుడు చూడవలసినదే, వినవలసినదే, తెలుసుకో వలసినదే ! బ్రహ్మనిష్ఠుడికి నిద్రపోయినవానికి వలె విశ్వమనే భావమే ఉండదు. కనుక, ద్వైత ప్రపంచం మిథ్య-వట్టిభ్రాంతి.

మనం దేహమూ, మనసూ, బుద్ధీ - అనే ఉపాధుల్లో ఉండటం వల్ల జ్ఞాతా, జ్ఞేయమూ, జ్ఞానమూ - వేఱువేఱను కుంటున్నాము. ఈ భ్రాంతిని తొలగించటానికై శ్రుతులెన్నో క్రియలుపయోగించి సత్యం చాటుతున్నాయి. ఇతరమేమీ ఎక్కడ చూడమో ?- అంటే, అక్కడ చూడటానికేమీ వస్తువులే లేవన్నమాట! ఏమీ వినమో? - అంటే, మనసేమీ పనిచేయటం లేదన్నమాట ! ఏమీ తెలుసుకోమో ? - అంటే, బుద్ధి ఏమీ చింతించటం లేదన్నమాట! ఎప్పుడిదంతా జరిగేది? కేవలం ధ్యాన సమాధిలోనే ? ,, జీవుడు (అహంకారం) లేనప్పుడే!-ఈ బ్రహ్మైవలోకనమే సాధకుడి లక్ష్యం - వ్యక్తిగత జీవుడందులో మాయమైపోతాడు.

శ్లో. ఆకాశ వన్నిర్మల నిర్వికల్ప
నిస్సీమ నిష్పందన నిర్వికారం
అంతర్బహి శ్శూన్య మనన్య మద్వయం
స్వయం పరం బ్రహ్మ కి మస్తి బోధ్యం. 3౯౮

ఉ. ఆకస మట్లు బ్రహ్మమును నంటును సొంటును లేక; పూర్ణమై;
ఏకడ నంతులేనిదియు; నేమియు స్పందన పొందకున్నదై;
సోకని మార్పుతో వెలిని శూన్యము, లోపల శూన్యమై, పరం
బేకము, నద్వయాత్మ; కలదే యితరంబగు బోధమింతకున్?

ఆకాశంవలెనే పరబ్రహ్మ నిర్మలమైనదీ, నిర్వికల్పమైనదీ, అనంతమైనదీ, కదలిక లేనిదీ, మార్పు చెందనిదీ, లోపలా వెలుపలా శూన్యమైనదీ, ఒకే ఉనికి కలదీ, రెండవ పదార్థంలేనిదీ; అదే నీస్వస్వరూపం! ఇంకెక్కడైనా ఏదైనా తెలుసుకోదగింది ఉందా? (లేదు).

ఆత్మే కర్తా, ఆత్మే కర్మ; ఆత్మ తప్ప ఇంకేమీ లేదు - ఇలా చెప్పుకుంటూపోతే, ఏం లాభం? - అనుకుంటావేమో? ఆచార్య శంకరుడు, సాధకుడి ధ్యానం కుదురుకోటానికై ఇంతగా బోధిస్తున్నాడు. ఆత్మ అసదృశమైనప్పటికీ, సులభంగా అర్థం కావటంకోసం ఆకాశంతో పోల్చి చెపుతున్నాడు.

శ్లో. వక్తవ్యం కిము విద్యతేఽత్ర బహుధా బ్రహ్మైవ జీవస్స్వయం:
బ్రహ్మైతజ్జగదా పరాణు సకలం బ్రహ్మ ద్వితీయం శ్రుతేః;
బ్రహ్మైవాహమితి ప్రబుద్ధమతయః సంత్యక్త బాహ్యాః స్ఫుటం
బ్రహ్మీభూయ వసంతి సంతత చిదానందాత్మ నైవ ధ్రువం. 3౯౯

మ. పలుమాటల్ పనియేమి? జీవుడనగా బ్రహ్మంబె; విశ్వంబు న
ట్టులె బ్రహ్మంబె; శ్రుతిప్రమాణములుచాటుంగాదె యద్వైతమున్?
తెలివిం గల్గినవాడు బ్రహ్మపరులై త్రెళ్లించి బాహ్యంబు; కే
వల బ్రహ్మీయులుగా చరింతురుసదా ప్రత్యగ్ చిదానందులై.

దీన్ని గురించి ఇంకా విస్తారంగా చెప్పట మెందుకూ? జీవుడు బ్రహ్మమే తప్ప వేఱు కాడు. సకల ప్రపంచమూ బ్రహ్మమే తప్ప ఇంకొకటి కాదు. శ్రుతి కూడా బ్రహ్మం అద్వయమని చాటుతుంది. ఉత్తమ సంస్కారం కలిగిన వాళ్లు – నేను బ్రహ్మాన్నే – అని భావిస్తూ బాహ్య వస్తు ప్రపంచాన్ని విసర్జిస్తూ బ్రహ్మంలో లీనమై సదా చిదానందాన్ని అనుభవిస్తూ తేజరిల్లుతున్నారు.

శ్లో. జహి మలమయకోశేఽహం ధియోత్థాపితాశాం
ప్రసభమ నిలకల్పే లింగదేహేఽపి పశ్చాత్;
నిగమ గదితకీర్తిం నిత్యమానందమూర్తిం
స్వయమితి పరిచీయ బ్రహ్మరూపేణ తిష్ఠ! ౩౯౬

చ. మలమయ స్థూలదేహమున మాటికి జీవుడు రేపువాంఛలన్
విలయమొనర్చి; గాలివలె వెల్గెడి లింగశరీరమందు నున్
బలిమినదేపనిన్ సలిపి; బ్రహ్మము – నిత్యసుఖంబు-లేదని
స్తులనుత – మాత్మగా తెలిసి; బ్రహ్మముతో విలసిల్లు మెప్పుడున్.

మలమయంగా ఉండే స్థూల శరీరంలో జీవుడు చెలరేగించేకోరికలన్నిటినీ నాశనం చెయ్యి! ఆమీదట గాలివలె ఉండే సూక్ష్మశరీరంలో కూడా బలిమితో అదే పనిచెయ్యి! శ్రుతిచేత కీర్తింపబడేదీ, నిత్యానంద రూపమూ, ఐన బ్రహ్మాన్ని స్వస్వరూపంగా తెలుసుకొని, బ్రహ్మంగా విలసిల్లు!

స్థూల – సూక్ష్మ శరీరాలు రెండూ ఆత్మను ఆవరించుకొని ఉంటాయి. ఈ శరీరాలను దాటిపోతే సచ్చిదానందం అనుభవించి ముక్తుడవౌతావు.

శ్లో. శవాకారం యావద్భజతి మనుజ స్తావ దశుచిః
పరేభ్య స్స్యాత్ క్లేశో జననమరణవ్యాధి నిరయాః
యదాత్మానం శుద్ధం కలయతి శివాకార మచలం
తదా తేభ్యో ముక్తో భవతి హి తదాహ శ్రుతిరపి. ౩౯౭

ఉ. పీనుగు వంటి దేహమును ప్రేమ భజించెడిచో నశౌచమే !
వానికి జన్మమున్ మృతియు వ్యాధియు నన్యభయంబు తప్ప; దా
మానవు డాత్మ శుద్ధమును మంగళమున్ స్థిరమంచు నెంచుచో;
మానక ముక్తుడౌ ననెడి మాట నిజంబు; శ్రుతిప్రమాణమున్.

ఎందాకా మానవుడు, (జడం కనుక) శవంతో సమానమైన తన స్థూల శరీరాన్నే పూజించు కుంటూ, పోషించు కుంటూ, ఉంటాడో, అందాకా అశౌచమే! పుట్టుకా, చావూ, రోగమూ, నరకాదులూ తప్పవు, ఇహంలోనూ, పరంలోనూ. ఎప్పుడు గురూప దిష్టమైన మహా వాక్యార్థాన్ని శ్రవణ మననాదులుచేసి, తాను దేహత్రయ విలక్షణుడుగానూ, సచ్చిదానందుడుగానూ, నిత్యశుద్ధుడుగానూ, స్పష్టంగా తెలుసుకుంటాడో, అప్పుడు సర్వానర్థాల నుంచీ తప్పుకుంటాడు. శ్రుతులు కూడా దీన్నే సమర్థిస్తాయి.

[శరీరం ఎప్పటికైనా పోయ్యేదే కనుక, పీనుగు వంటిదే! కాని, ఆత్మను తెలుసుకోటాని కది అవసరం. ఉన్నంత దాకా శుభ్రంగా ఉంచుకోక తప్పదు. ఐతే, దాని మీద వ్యామోహం పడరాదు.]

## 398-406 ప్రపంచ బాధ

శ్లో. స్వాత్మన్యారోపితాశేషా భాస వస్తు నిరాసతః
స్వయమేవ పరంబ్రహ్మ పూర్ణమద్వయ మవ్యయం. 398

ఆ. వె. అఖిలమాత్మ మీద నారోపితమ్మగు
భాస వస్తువులను వదలినంత;
నద్వయం బనంత మక్రియంబగు పర
బ్రహ్మ స్వయముగానె భాసమగును.

ఆత్మమీద ఆరోపింపబడిన ఆభాస వస్తువు లన్నిటినీ తొలగించి నప్పుడు, మిగిలేది అనంతమూ, అద్వయమూ, అక్రియమూ, ఐన పరబ్రహ్మం మాత్రమే ! తనంతట తాను ఏకంగా ప్రత్యక్షమౌతుంది.

ప్రారంభంలో ప్రయత్న పూర్వకంగా దృశ్య ప్రపంచాన్ని నిరోధించి, సమాధి చేసి, ఆ సమాధినిష్ఠుడైన వానికి దృశ్యం భాసించినా, కుందేటి కొమ్ము వంటిదని – సుఖ దుఃఖ రాగ ద్వేషాదులు కలుగవని, బోధిస్తున్నాడు, శంకరుడు.

శ్లో. సమాహితాయాంసతి చిత్తవృత్తౌ
పరాత్మని బ్రహ్మణి నిర్వికల్పే;
నదృశ్యతే కశ్చిదయం వికల్పః
ప్రజల్ప మాత్రః పరిశిష్యతే తతః. ౩౯౯

ఆ. వె. చిత్తవృత్తులెల్ల మొత్తమా పరమాత్మ
బ్రహ్మమందు మగ్న పఱచినపుడు
దృశ్య విశ్వమది యదృశ్యమై పోవును;
మార్పులెల్ల వట్టి మాటలగును.

చిత్తవృత్తులన్నీ పరమాత్మమైన బ్రహ్మంలో నిర్వికల్పంగా కరగి పోయినప్పుడు, వికల్పమయమైన యీదృశ్య ప్రపంచ మెక్కడా కానరాదు. ప్రపంచ సంక్షోభమంతా మనసులోనే ఉంది. మనసు లయిస్తే అదెక్కడుంటుంది? నిర్వికల్ప సమాధిలో విశ్వమంతా మాయమైపోతుంది. ఏకంగా ఆత్మే అనుభవంలో ఉంటుంది.

శ్లో. అసత్కల్పో వికల్పోఽయం – విశ్వమిత్యేక వస్తుని
నిర్వికారే నిరాకారే – నిర్విశేషే భిదా కుతః? ౪౦౦

ఆ. వె. ఏక సత్యమందు నీ విశ్వకల్పన
బూటకంబె కాక ఏటి నిజము?
మార్పులేని, రూపు మఱిలేని, పరిపూర్ణ
మందు భిన్నమైన దమరునెట్లు?

ఏకైక సత్యమైన బ్రహ్మంలో విశ్వకల్పన వట్టి బూటకమే! మార్పులేని, ఆకారమసలే లేని, పరిపూర్ణమైన దానిలో భిన్నత్వమెలా ఉండగలుగుతుంది?

అనుభవమూ, యుక్తీ, దృష్టాంతమూ, శ్రుతీ - అనే నాలుగు పద్ధతులతోనూ భిన్నత్వం లేదని నిరూపిస్తున్నాడు.

శ్లో. ద్రష్టృ దర్శన దృశ్యాది - భావ శూన్యైక వస్తుని;
నిర్వికారే నిరాకారే - నిర్విశేషే భిదా కుతః? ४०೧

తే. గీ. ద్రష్టయును దర్శనంబును దృశ్య మనెడి
త్రిపుటియే లేని - యెట్టి మారుపులు లేని -
అకృతేలేని - పరిపూర్ణ మేకసత్య
మందు భిన్నత్వ మేరీతి పొందనేర్చు?

చూచే వాడూ, చూడటమూ, చూడదగినదీ (ద్రష్టా, దర్శనమూ, దృశ్యమూ) - ఇవన్నీ ఉండేది అజ్ఞానదశలోనే! జ్ఞానదశలో ఇలాంటి భేదభావాలు లేనిదీ, ఏకైకమూ, నిరాకారమూ, నిర్విశేషమూ (పరిపూర్ణమూ) ఐన పరబ్రహ్మంలో భిన్నత్వం (దృశ్య ప్రపంచం) ఎక్కడుంటుందీ? ఉండటాని కెంత మాత్రం అవకాశమే లేదు. ఆత్మ ప్రకృతీ, జగత్తు వికృతీ - అనే ప్రకృతి వికృతి భావాలు లేనందువల్ల భేదప్రసక్తి ఉండదు.

శ్లో. కల్పార్ణవ ఇవాత్యంత - పరిపూర్ణైక వస్తుని
నిర్వికారే నిరాకారే నిర్విశేషే భిదా కుతః? ४०౨

తే. గీ. జగతి ముంచిన కల్పాంత సాగరంబు
వోలె నిశ్చలమై వ్యాప్తి పొందియున్న
నిర్వికార నిరాకార నిర్విశేష
మేక సత్యంబులో భేదమెట్టులుండు?

కల్పాంతంలో నాలుగు సముద్రాలూ పొంగి ఒకదానితో ఒకటి కలిసి పోతాయి. ప్రపంచమంతా జలమయమై ఉంటుంది. అలాంటి కల్పాంత సముద్రంవలె నిశ్చలంగాసర్వవ్యాప్తంగాఉండి, నిర్వికారమూ నిరాకారమూ, నిర్విశేషమూ ఐన ఏకసత్యంలో ప్రపంచమనే భిన్నత్వ మెలా ఉండ గలుగుతుంది?

అంతా జలమయమైనప్పుడు, ఏది హిందూ మహాసముద్రమో? ఏది అరేబియా సముద్రమో? ఏది గంగో? ఏది యమునో? ఏది తుంగభద్రో? ఏది గోదావరో? ఏది చెఱువో? ఏది బావో? ఎలా తెలుస్తుంది? ఆత్మ కూడా అంతటా వ్యాపించి నిరాకారమై ఉన్నప్పుడు, అందులో భిన్నత్వమెలా చూడటం? ఉండనే ఉండదని భావం.

ఇంతకు ముందు కూడా భేదమనేది ఉండ లేదు. ఐతే, భేద భ్రాంతికి కారణమైన అజ్ఞానం ఉండేది. అదిప్పుడు సమూలంగా నశించింది.

శ్లో. తేజసీవ తమో యత్ర - విలీనం భ్రాంతి కారణం
అద్వితీయే పరేతత్వే - నిర్విశేషే భిదా కుతః? ౪౦౩

తే. గీ. అద్వితీయము పరిపూర్ణమైన దగుచు;
భ్రాంతి కారణ మజ్ఞాన మంతరింప
జేయగల్గు పరబ్రహ్మ చాయలందు,
భిన్నమెట్లుండు? చీకటి వెలుగునవలె.

అన్వయమూ, సంపూర్ణమూ, భ్రాంతి కారణమైన అజ్ఞానం పూర్తిగా పోగొట్టేదీ, ఐన పరబ్రహ్మంలో భిన్నత్వమెలా ఉండగలుగుతుంది? - వెలుతురులో చీకటి మాస్తరుగా!

అహంకారం ఎప్పుడైతే మూలమట్టంగా నశించిందో - కాదు; ఆత్మలో లీనమై పోతుందో? అప్పుడు జ్ఞాతా, జ్ఞేయమూ, జ్ఞానమూ - అనే త్రిపుటి కూడా ఉండదు. దృశ్య ప్రపంచం అంటే, నామరూపాలే కదా? అవి కరిగి పోతాయి. అనంతంలో ద్వైతమూ, నిరాకారంలో ప్రత్యేకతా, పరిపూర్ణంలో భిన్నతా - ఎలా పొందుతాయి? అజ్ఞానం తొలగి పోగానే, జ్ఞానమే అనుభవానికి వస్తుంది. అంతటా ఏకసత్యమే గోచరిస్తుంది. అప్పుడు జీవాత్మకూ, పరమాత్మకూ ఏమాత్రమూ లేని భేదాన్ని ఎవరు కల్పించ గలుగుతారు?

శ్లో. ఏకాత్మకే పరేతత్త్వే - భేదవార్తా కథం భవేత్ ?
సుషుప్తౌ సుఖ మాత్రాయాం - భేదః కేనావలోకి తః ? ४०४

ఆ. వె. సరిసమంబు నేక సత్యమౌ పరతత్వ
మందు భేదవార్త పొందునెట్లు ?
గాఢ నిద్రలో నఖండ సౌఖ్యములోన
నేవిభేదమైన నెవడు చూచె ?

ఒకటే విధంగానూ, ఏకంగానూ, ఆకార వికార విశేషాలేవీ లేకుండానూ, ఉండే పరతత్వంలో భేదవార్తకు తావెక్కడ ? గాఢ నిద్రావస్థలోని అఖండానందంలో ఏభేదమైనా ఎవడైనా చూచినాడా? నీవూ, నేనూ, వాడూ, వీడూ-అనటానికి ఆస్పదం ఉంటుందా?

నిద్రావస్థ అందరికీ ఒకటే ! పండితుడనీ, పామరుడనీ, రాజనీ, భృత్యుడనీ, ఏలాంటి భేదమూ ఉండదు - అందఱూ సుఖస్వరూపులే!

శ్లో. నహ్యస్తి విశ్వం పరతత్వ బోధాత్
సదాత్మని బ్రహ్మణి నిర్వికల్పే
కాలత్రయే నాప్యహిరీక్షితో గుణే
నహ్యంబు బిందు ర్మృగ తృష్ణికాయాం. ४०५

ఆ. వె పరమ సత్య మెఱుక పడిన తర్వాత వి
శ్వంబు లేదు నిండు బ్రహ్మమందు;
కానరాదు పాము కాలత్రయంబున
త్రాట; నెండమావి నీటి యట్లు.

పరమ సత్యాన్ని గుర్తించి బాగా ఎఱుక కలిగినప్పుడు, ఈవిశ్వం-ఉనికి సారమైన పూర్ణబ్రహ్మంలో ఉండనే ఉండదు. మూడుకాలాల్లో నూ ఎప్పటికీ పాము త్రాటిలో కానరావటం లేదు. ఎండమావుల్లో నీటి బిందువు లెక్కడైనా ఉంటాయా ?

దేహమూ, మనసూ, బుద్ధీ; చూచేవాడూ అనుభవించేవాడూ ఆలోచించే వాడూ; వస్తువులూ, ఆవేశాలూ, భావాలూ-ఇవన్నీ కలిసిందే విశ్వం! ఒకసారి తత్వం తెలిసిపోతే, ఇవేవీ ఉండవు. తురీయావస్థలో దేహమూ, మనసూ, బుద్ధీ-ఉండవు. ఆ దశలో వస్తుప్రపంచ మెక్కడిదీ? నామాలూ రూపాలూ ఆత్మలో లేవు.

శ్లో. మాయా మాత్ర మిదం ద్వైత - మద్వైతం పరమార్థతః
ఇతి బ్రూతే శ్రుతిః సాక్షాత్ - సుషుప్తా వను భూయతే. ౪౦౬

ఆ. వె ద్వైత మెల్ల మాయ పరమార్థ మద్వైత
మంచు మనల హెచ్చరించు శ్రుతులు;
ప్రతి మనుష్యునకును బాగుగా ననుభవం
బందు గాఢనిద్ర యందు కలదు.

ఉపనిషత్తులన్నీ నేరుగా ప్రకటిస్తున్నాయి - ద్వైత ప్రపంచం (దృశ్యం) కేవలం మాయ; పరమార్థమయింది అద్వైతమైన ఆత్మ ఒక్కటే! - అదే పరిపూర్ణ సత్యం. ఇది సుషుప్తిలో (గాఢనిద్రలో) ప్రతి మనిషి అనుభవంలోనూ ఉన్నదే! (గాఢనిద్రలో ప్రపంచం కానరాదు). జీవుడు వేరే బ్రహ్మం వేరే అనేది ద్వైతం. ఈ భేదం మాయా కల్పితం. ఈ మాయవల్లనే నామ రూపభేదాలన్నీ ప్రపంచంలో కనపడు తున్నాయి. మాయకు మూల ప్రకృతీ, అజ్ఞానమూ, అధ్యాసా మొదలైన పేర్లున్నాయి. ఆ మాయను గురించి విచారణచేస్తే, బ్రహ్మజ్ఞానుల కదిలేని దాని క్రిందనే లెక్క. ద్వైత మంతా లోక వ్యవహారంలోనే! పరమార్థంలో అద్వైతమే! జీవుడు బ్రహ్మమేకాని, వేరుకాదు - నేనే బ్రహ్మాన్ని అనే అపరోక్ష జ్ఞానమే యథార్థం. శ్రుతులు దీన్ని సమర్థిస్తున్నాయి.

శ్లో. అనన్యత్వ మధిష్ఠానా దారోప్యస్య నిరీక్షితం
పండితై రజ్జుసర్పా దౌ వికల్పో భ్రాంతి జీవనః. ౪౦౭

క. ఆరోపిత మాధారము
వేఱేకాదని గ్రహింత్రు విజ్ఞులు; త్రాడా
ధారంబు పాము కట్టులె!
వేరై కనుపట్టు టెల్ల విభ్రాంతి సుమీ!

ఆరోపితమైన దంతా ఆధారం మీదనే నిలచి ఉంటుంది. త్రాడు లేకపోతే పామనే భ్రాంతి కూడా ఉండని విధంగానే! భేదభావం కేవలం అధ్యాసవల్ల కలిగిందే! ఇది విజ్ఞులు పరిశీలిస్తారు. పామనే అధ్యాస త్రాడు కంటే భిన్నంకాదు. భూతం స్తంభం మీదా, వెండి ముత్తెపు చిప్ప మీదా – అలాంటి ఉదాహరణలే!

ఒక వస్తువు నందు ఇంకో వస్తు ధర్మం ఆరోపించటాన్ని ఆరోపమంటారు. త్రాటి యందు సర్పధర్మం ఆరోపం. అలాంటిదే ముత్తెపు చిప్ప యందు వెండి రూపకల్పన. ఎప్పటికీ త్రాడు త్రాడుగానే పాము పాముగానే, శుక్తి శుక్తిగానే, రజతం రజతంగానే ఉన్నాయి. భ్రాంతి చేత కలిగిన ఊహ (ఇచ్ఛ) చేత పామూ, వెండీ–అనే జ్ఞానాలు కలుగుతున్నాయి. కేవల సచ్చిదానంద నిర్వికార నిష్కళంక నిరాకార బ్రహ్మంమీాద అజ్ఞానంచేత ప్రపంచ ధర్మం ఆరోపింపబడుతున్నది. దాని వల్ల అజ్ఞానులు అనృత–జడ–దుఃఖాత్మక ప్రపంచాన్నీ–దేహాదులనూ, సత్య–చైతన్య–ఆనంద స్వరూపాలుగా తలచుచున్నారు. దీన్ని నివారించటానికే శ్రుతులు–నేతి–నేతీత్యాది అపవాదాలను శాసిస్తున్నాయి.

## 408-413 ఆత్మ విచార పద్ధతి

శ్లో. చిత్తమూలే వికల్పోఽయం – చిత్తాభావే న కశ్చన
అతశ్చిత్తం సమాధేహి – ప్రత్యగ్రూపే పరాత్మని. ౪౦౮

క. మొత్తము ప్రపంచమున కీ
చిత్తమె మూలంబు, లయము చేయ మనంబున్
ఉత్తదె ప్రపంచ; మగుటను
చిత్తము నీ యాత్మ లయము చేయుము, స్థిరతన్.

స్పష్టంగా కనపడే ఈ ప్రపంచానికంతా మూలం (తల్లివేరు) నీ మనసులోనే ఉంది. నీ మనసులయమై పోతే ఈ ప్రపంచం ఉండదు. కాబట్టి నీయంతరాత్మరైన పరబ్రహ్మంలో నీ మనసును ధ్యాన పూర్వకంగా లయించు !

నీ మనసు బయటి ప్రపంచం మీదికి ప్రసరిస్తే, అదే చిత్తం. అప్పుడు ప్రపంచం నిజమనిపిస్తుంది. దాన్నే వ్యావహారిక సత్యమంటారు. అందులో మునిగితే అన్నీ దుఃఖాలే! కనుక, నీవా మనస్సును లోపలికి త్రిప్పి ఆత్మలో లీనంచెయ్యి! అప్పుడీ ప్రపంచం కానరాకుండాపోతుంది. మనసు లయించి దేహం మీద స్పృహ లేకపోతే, అదే సమాధి!

శ్లో. కి మపి సతత బోధం కేవలానంద రూపం
నిరుపమ మతివేలం నిత్యముక్తం నిరీహం
నిరవధి గగనాభం నిష్కలం నిర్వికల్పం
హృది కలయతి విద్వాన్! బ్రహ్మపూర్ణం సమాధౌ. ౪౦౯

మ. హృదయం బందు సమాధిలోన విబుధుం డీక్షించు బ్రహ్మంబు; నె
య్యదియో చెప్పగరాని బోధయును, పూర్ణానందమున్. సాటి లే
నిదియున్, హద్దులనెల్ల దాటినదియున్, నిత్యస్వతంత్రంబు, నే
యదియున్ కార్యములేని, దంతరహితం బాకాశ మట్లెంతయున్.

ఏదో వివరింపరాని (అకారణ) బోధగా ఉండేదీ, కేవలానంద రూపమైనదీ, సామ్యంలేనిదీ, హద్దులన్నిటినీ దాటినదీ, నిత్య స్వతంత్రమైనదీ, ఏపనీ చేయనిదీ, భాగాలుగా విభజింపరానిదీ, ఆకాశంవలె అనంతమైనదీ, ఐన పరిపూర్ణ బ్రహ్మాన్ని-విద్వాంసుడైనవాడు సమాధి ద్వారా హృదయంలో చూచి తెలుసుకుంటాడు.

శ్లో. ప్రకృతి వికృతి శూన్యం భావనాతీత భావం
సమరస మసమానం మాన సంబంధ దూరం
నిగమ వచన సిద్ధం నిత్య మస్మత్ ప్రసిద్ధం
హృది కలయతి విద్వాన్ బ్రహ్మపూర్ణం సమాధౌ. ౪౧౦

మ. హృదయంబందు సమాధిలోన విబుధుం డీక్షించు బ్రహ్మంబు, త
త్పదమో ? కారణ కార్య శూన్యమును, భావాతీత సత్యంబు, నే
కదశన్ భాసిలు; సాటిలేనిది, పరీక్షా తీతమున్, వేద వా
క్య దృఢం, బెల్లరలోన జీవుడయి ప్రఖ్యాతిన్ విడంబించెడిన్.

కారణ కార్య (ప్రకృతి - వికృతి) శూన్యమై, ఊహలకందని సత్యమై, సమరసమూ, అసమానమై, అన్ని రుజువులకూ దూరమై, వేదవాక్య ప్రమాణాలచేత ప్రసిద్ధమై, మనలో జీవుడని యెప్పుడూ అనుభవంలో ఉండే బ్రహ్మాన్ని, విద్వాంసుడైనవాడు, సమాధిలో తన హృదయంలో చూచుకుంటాడు.

ప్రకృతి అనేది పదార్థ రూపం - శరీరమూ, మనసూ, బుద్ధీ, పదార్థాలు. ఆ ప్రకృతి మార్పే వికృతి - వస్తువులూ, ఉద్రేకాలూ, భావనలూ. ఇవన్నీ శూన్యమంటే ఉపాధులను దాటిపోయిన దశ-అదే బ్రహ్మం! అది బుద్ధి కందేది కాదు కనుక, భావనాతీత భావం. ఈ యనుభవం సమాధిలో సమరసంగా ఉంటుంది. భూత-వర్తమాన-భవిష్యత్తుల్లో ఒకే రకమన్నమాట ! దానికి సాటి అదే! వేటే ఏమీ లేదు కనుక అసమానం. అన్ని రుజువులకూ దూరం - మానసంబంధ దూరం ఇంక ఆబ్రహ్మాన్ని ఎలా తెలుసుకోటం? అంటే, ఉపనిషత్తులు ప్రకటించటం ద్వారా. గుడ్డిగా నమ్మమంటావా? - అని అడుగుతావేమో ? వద్దు, వద్దు! మనలో జీవుడొకడుండటం సుప్రసిద్ధమే ! - నిత్యమస్మత్ ప్రసిద్ధం - అంటూ గురువు బోధిస్తున్నాడు. శిష్యుడు నిరుత్సాహ పడకుండా సాధ్యమైనంత సులభంగానే వివరిస్తున్నాడు.

శ్లో. అజర మమర మస్తా భావ వస్తు స్వరూపం
స్థిమిత సలిలరాశి ప్రఖ్య మాఖ్యావిహీనం
శమిత గుణ వికారం శాశ్వతః శాంతమేకం
హృది కలయతి విద్వాన్ బ్రహ్మపూర్ణం సమాధౌ. ౪౧౧

మ. హృదయం బందు సమాధిలోన విబుధుం డీక్షించు బ్రహ్మంబు, త
గ్గ దమర్త్యంబు; న భావ హీనమగు నికర్మంబున్. ప్రశాంతాబ్ధి వం
టిది; పేరేమియు లేని. దేగుణము సొంటేలేని. దెల్లప్పుడు
న్నది; శాంతి ప్రదమైన యట్టిది. యవన్యంబైన దత్యంతమున్.

అజర మంటే క్షయం కానిదన్నమాట ! ఎప్పటికీ తగ్గిపోదు. అమర మంటే, నాశరహితం; అస్తాభావ వస్తుస్వరూపం – అంటే, అభావాలు లేని సత్యస్వరూపం; అభావాలు రెండు విధాలు – ప్రాగ భావమూ, ప్రధ్వంసా భావమూ; ప్రాగభావం – సృష్టికి ముందులేక పోవటం లేనిది. ప్రధ్వంసా భావం – ప్రళయకాలంలోనూ నశించనిది. ఈ యభావాలు రెండూ లేనిది – బ్రహ్మం, స్థిమిత సలిలరాశి ప్రఖ్యం– అలలు లేని సముద్రాన్ని మనం ఊహించుకోవలసి ఉంటుంది. దాని వలె స్థిమితగా ఉండేది. ఆఖ్యావిహీనం – ఏపేరూ లేనిది. శమిత గుణ వికారం – గుణాలుంటే వాసనలుంటాయి. అలాంటి మంచిచెడ్డలేవీ అక్కడలేవు. శాంతమూ, ఏకమూ, ఐన బ్రహ్మాన్ని విద్వాంసుడైన వాడు, సమాధి ద్వారా, తన హృదయంలో చూచి తెలుసు కుంటున్నాడు.

అస్తాభావ – అనే దానికి అస్తాభాస – అని కూడాపాఠాంతరం. ఆ భాసలు – భ్రాంతి దృశ్యాలన్నీ అస్తమించి ఉండే దన్నమాట ! ఆభాసప్రాయుడైన జీవుడందులో అస్తమిస్తాడు కదా ?

శ్లో. సమాహితాంతః కరణ స్వరూపే
విలోక యాత్మాన మఖండ వైభవం
విచ్ఛింది బంధం భవగంధ గంధిలం
యత్నేన పుంస్త్వం సఫలీ కురుష్వ ! 361

ఆ. వె. మగ్న పఱచిమది సమాధిలోన నఖండ
మాత్మ వైభవంబు నరయు ! మఖిల

బంధములను పూర్వ గంధములను కోసి
సాధనమున జన్మ సఫల పరచు !

అంతఃకరణ మంటే మనోబుద్ధి చిత్తాహంకారాలు - పేర్ల భేదమేకాని, అంతా మనసే! అది లయమైతే ఆత్మ వైభవం అపార మౌతుంది. ఎదుట బాగా లోపలి కంటికి గోచరిస్తుంది. మనసును నిగ్రహించి సమాధిలో మగ్నపఱచి నీలోని అఖండమైన ఆత్మ వైభవాన్ని దర్శించు ! అనేక జన్మవాసనలచే బలపడిన బంధాలన్నిటినీ త్రెంచు! ప్రయత్న పూర్వకంగా ఈ మానవ జన్మసార్థకం చేసుకో ! పుంస్త్వాన్ని సఫల పరచు !

శ్లో. సర్వోపాధి వినిర్ముక్తం - సచ్చిదానంద మద్వయం
భావ యాత్మాన మాత్మస్థం - న భూయః కల్పసేఽధ్వనే. ४०३

తే. గీ. నీ నిజాత్మ, నుపాధులన్నిటిని దాటి;
అద్వయము - సచ్చిదానంద - మనుచు ధ్యాన
మగ్నుడవు కమ్ము ! నీకింక మఱల జన్మ
మృత్యు చక్రము తిరుగ దగత్యముగను.

అన్ని ఉపాధులను దాటినదీ, ఉనికీ జ్ఞానమూ ఆనందమూఐనదీ, రెండవదేదీ లేనిదీ, ఐన నీయాత్మను దర్శించు! అప్పుడు నీకు మళ్ళీ పుట్టుకా చావూ అనే సంసార చక్రంలో పడవలసిన పరిస్థితి యెప్పటికీ రాదు.

స్థూల సూక్ష్మ కారణ శరీరాలనే ఉపాధులన్నిటినీ దాటి ఆత్మ ధ్యానంలో ఉండు! ఉండే కొద్దీ అద్వయమైన సచ్చిదానందాన్ని అనుభవిస్తావు. ఆత్మ నీ స్వస్వరూపం - ఆరుచి తగిలితేనా ? ఇంక మళ్ళీ ఈ లోకానికి దిగిరావు.

# 414-418 దేహ-దృశ్య నిరసన

శ్లో. ఛాయేవ పుంసః పరిదృశ్యమాన
మాభాస రూపేణ ఫలాను భూత్యా
శరీర మారాచ్ఛవ వన్ని రస్తం
పున ర్న సంధత్త ఇదం మహాత్మా. ౪౧౪

తే. గీ. పూర్వ సంచితమున నీడవోలె తనకు
నరయ వచ్చుచునున్న మహాత్ముడెపుడు
శవమువోలె శరీర విసర్జనంబు
సలిపి మున్ముందు మమతను చెందబోడు.

ప్రపంచాన్ని గురించీ శరీరాన్ని గురించీ మహాత్ముని చూపు మన చూపుకు ప్రబల విరుద్ధంగా ఉంటుంది. మనకు శరీరం తప్పితే వేరే ఉనికే లేదు. ఉపాధులే నిజమనుకుంటాము. కాని, ఒకసారి శరీరాన్ని విసర్జించిన తర్వాత మహాత్ముడైనవాడు, మళ్లీ దాని మీద మమత చెందడు. ప్రారబ్ధ ఫలితమైన ఆశరీరం, మనిషికి నీడ మోస్తరుగా కనపడుతూనే ఉంటుంది. అలా పైకిపొయ్యే అనుభవం మనకెంతమాత్రం లేదు. ఈ విషయంలో మహాత్ముడైన వానికీ మనకూ హస్తిమశకాంతర మన్నమాట! ఈ దృశ్యమాన శరీరాన్ని - మానవుడు తననీడ నెలా నిర్లక్ష్యం చేస్తాడో. ఆప్రకారం నిర్లక్ష్యం చేస్తాడు. శరీరముంటేనే కదా నీడ వెంబడిస్తుంది? అదే విధంగా ఆత్మ ఉంటేనే, శరీరం కలుగుతుంది. దేహానికీ నీడకూ ఉండే సంబంధమే, ఆత్మకూ శరీరానికీ ఉండే సంబంధం కూడా. కనుక నీడవలెనే, శరీరం కూడా ఆభాస. మహాత్ముడైనవాడు అందుకే ఈ శరీరాన్ని ఉదాసీనంగా చూస్తాడు. ఇది ఏనాటికైనా నశించేదేనని దీనిమీద ధ్యాసే ఉంచుకోడు. పాము కుబుసాన్ని విడిచిన తర్వాత మళ్ళీ దానివంక చూస్తుందా? ఏమైనా అభిమాన పడుతుందా? జ్ఞాని కూడా అలాగే!

శ్లో. సతత విమల బోధానంద రూపం స్వమేత్య
త్యజ జడమల రూపో పాధిమేతం సుదూరే
అధ పునరపి నైప స్మర్యతాం వాంత వస్తు
స్మరణ విషయ భూతం కల్పతే కుత్సనాయ. ౪౧౫

తే. గీ. అమల మానందమును జ్ఞానమాత్మ నెఱిగి;
జడము మలమయ దేహంబు విడిచిపెట్టు !
మఱల దాని గుఱించి సంస్మరణ వలదు;
పాడుగా నుండు కక్కిన కూడువోలె !

శాశ్వతమూ, పరిశుద్ధమూ, జ్ఞానానందరూపమూ, ఐన ఆత్మను చక్కగా స్వస్వరూపమని యెంచి, జడమూ మలమయమూ ఐన ఉపాధిగా ఉండే ఈ స్థూల శరీరాన్ని చాల దూరంగా విడిచిపెట్టు! మళ్ళీ దాని సంగతి పట్టించుకోవద్దు! కక్కిన కూడు జ్ఞాపకానికి వస్తే ఎంత అసహ్యమనిపిస్తుంది?

శ్లో. సమూల మేతం పరిదహ్య వహ్నౌ
సదాత్మని బ్రహ్మణి నిర్వికల్పే
తతః స్వయం నిత్యవిశుద్ధ బోధా
నందాత్మనా తిష్ఠతి విద్వరిష్ఠః. ౪౧౬

ఆ. వె. జ్ఞాన వహ్ని స్థూలమైన దేహాదుల
వేఱు మిగులకుండ వే దహించి;
నిరత నిష్ఠ నొంటి నిజమైన విజ్ఞు డా
నందబోధ మాత్మయందె నిల్చు.

శాశ్వతమూ సంపూర్ణమూ ఐన ఆత్మ అనే బ్రహ్మాగ్నిలో ఈ స్థూల శరీరాన్నీ దాని వెంటా దృశ్య ప్రపంచాన్నీ పూర్తిగా వేఱు మిగులకుండా కాల్చివేసి, నిజమైన జ్ఞాని, నిరంతరం ఏకాంతంలో నిత్య నిర్మల బోధానందమైన ఆత్మలో పట్టువదల కుండా ఉండి పోతాడు.

శరీరమూదిగా వస్తు ప్రపంచాన్నంతటినీ ఆత్మజ్ఞానంతో దహించట మంటే, మాయను తొలగించట మన్నమాట! వస్తు ప్రపంచాని కంతా వేరుగా ఉండేది ప్రకృతి – అదే మాయ. దానితోనే దేహం కల్పితమయింది. జ్ఞానికి దేహం మీద స్పృహే ఉండదు.

శ్లో. ప్రారబ్ధ సూత్ర గ్రంథితం శరీరం
ప్రయాతువా తిష్ఠతు గోరివస్రక్
నతత్పునః పశ్యతి తత్త్వవేత్తా
నందాత్మనా బ్రహ్మణి లీనవృత్తిః. ౪౧౩

తే. గీ. తనువు ప్రారబ్ధ సూత్ర వర్ధనము; దీని
నూడె నొండెను పట్టించుకోడు యోగి;
ఆవు మెడలోని హారమట్లతని మనసు
శాంతి నానంద బ్రహ్మము పొంతనుంట.

ఈ శరీరం ప్రారబ్ధం పేనిన దారాలతో అల్లబడింది. ప్రారబ్ధం నశిస్తే రాలిపోతుంది. లేకపోతే ఉంటుంది. ఈ సత్యాన్ని బాగా తెలుసుకున్న యోగి ఇది ఊడినా ఉండినా ఏమీ పట్టించుకోడు–ఆవు మెడలో వేసిన హారం మోస్తరుగా. అతని మనస్సెప్పుడూ ఆనంద ఘనమైన బ్రహ్మంలో లీనమై ఉంటుంది కనుక, అంతర్ముఖుడై ఉంటాడు.

ఆవు మెడలోని హారం – అంటే, గోకులాష్టమినాడు మనవాళ్లు ఆవును బాగా కడిగి పసుపు కుంకుమలతో పూజించి, మెడలో పూల దండలు వేస్తారు. ఆదండ వేసినారని ఆవేమైనా సంతోషిస్తుందా? తెగిపోయి క్రింద పడితే చింతిస్తుందా? రెండూ లేవు. అలాగే యోగి కూడా శరీరాన్ని అభిమానించడు.

శ్లో. అఖండా నంద మాత్మానం – విజ్ఞాయ స్వస్వరూపతః
కి మిచ్ఛన్ కస్యవా హేతో – ర్దేహం పుష్ణాతి తత్త్వవిత్. ౪౧౪

తే. గీ. శాశ్వతానందమగు నాత్మ స్వస్వరూప
మనెడి తత్వ మెఱింగిన యట్టి యోగి
ఏమి భావముతోడ నింకెవరికోస
మీ శరీరము పోషించు నెక్కువగను ?

అఖండానంద రసమైన ఆత్మయే స్వస్వరూపమని బాగా తెలుసు కున్న మహాత్ముడు, ఏమి కోరి, ఎవరి కోసం, ఈ శరీరాన్ని అదే పనిగా పోషిస్తాడు ?

ఏదైనా కోరిక మిగిలి ఉంటే, దొరకని దాన్ని దొరికించుకోటం కోసం ప్రయత్నించటానికి, శరీరం అవసరం కనుక, దీన్ని పోషించు కుంటూ ఉండవచ్చు. ఏ కోరికా లేనప్పుడు ఏ ఫలంకోరి దేహపోషణ చేసుకుంటాడూ? ఇదే ప్రశ్న శ్రుతిలోనూ ఉంది.

"ఆత్మానంచే ద్విజానీ యాదయమస్మీతి పూరుషః- కి మిచ్ఛన్ కస్య కామాయ శరీర మనుసం జ్వరేత్" - ఈ యాత్మయే నేనని గ్రహించిన పురుషుడు, ఏమభిలషించి, ఏ కామం తీర్చుకోటానికై ఈ శరీరంతో పాటు బాధపడుతుంటాడు ? - అని.

## 419-425 ఆత్మజ్ఞాన ఫలము

శ్లో. సంసిద్ధస్య ఫలం త్వేత జ్జీవన్ముక్తస్య యోగినః
బహిరంతః సదానంద రసాస్వాదన మాత్మని. ౪౧౯

తే. గీ. యోగ సంపూర్ణతను పొంది నట్టి యోగి
బ్రదికి యుండగనే ముక్తి పడసి నతడు
పొందు ఫలమిది - బాహ్యము నందు లోప
లను సదానంద రసమె స్వాదన మొనర్చు.

యోగం బాగా పండి ఆత్మానుభవంతో పరిపూర్ణుడైనయోగి, జీవన్ముక్తుడైన వాడు పొందే ఫలమిదీ - అంతఃకరణ లోపలా, వెలు పలా ఎల్లప్పుడూ ఆనంద రసా స్వాదనమే చేయగలుగుతాడు.

జీవితంలో ఆనందం కోసమే ప్రతి మనిషీ అంగలారుస్తాడు. ఒక్క-సారిగా బ్రహ్మానందాన్ని అనుభవించిన తరువాత, తుచ్ఛ సుఖాలకోసం ఎందు కారాట పడతాడూ? వజ్రం దొరికితే చిల్లరపైసల నెవడాశి స్తాడూ? జీవన్ముక్తు డెప్పుడూ చిఱునవ్వుతో వికసించిన చూపులతో అందఱికీ ఆకర్షణీయంగా కనపడతాడు. ఏసాధనలు ఏఫలాల నిస్తాయో తెలిసినప్పుడు ముముక్షువైనవాడు ఆసాధనలతో పరిపూర్ణత పొంద టానికి వీలవుతుంది. కనుక, క్రమంగా వైరాగ్య-బోధ- ఉపరతుల ఫలాలను విశదీకరిస్తున్నాడు.

శ్లో. వైరాగ్యస్య ఫలం బోధః బోధస్యో పరతిః ఫలం
స్వానందాను భవాత్ శాంతిః ఏషైవో పరతేః ఫలం. ౪౨౦

తే. గీ. బోధ యనునది వైరాగ్యమునకు ఫలము;
విషయముల వీడియుంట వివేక ఫలము;
ఉపరతి ఫలంబు స్వానంద మెప్పుడు ననుభ
వించు; టందుకు ఫలము శాంతించియుంట.

వైరాగ్యానికి ఫలం జ్ఞానం; జ్ఞానానికి ఫలం ఉపరతి (విషయా లకు విముఖుడై ఉండటం); ఉపరతికి ఫలం ఆత్మానంద మనుభవించటం అందుకు ఫలం శాంతి.

స్వస్వరూప జ్ఞానం అనుభవానికి రాకపోతే, వైరాగ్యం బలపడ లేదని అర్థం; ఉపరతి లభించకపోతే (బాహ్యంలోని అనాత్మ వస్తువుల మీాద అభిలాష మొలకెత్తితే) పూర్ణబోధ కలుగలేదని అర్థం. ఇలా ముముక్షువైన వాడు తన్నుతాను పరిశీలించుకుంటూ పైమెట్టుకు ప్రయత్నించవచ్చు.

శ్లో. యద్యుత్త రోత్తరా భావః - పూర్వ పూర్వంతు నిష్ఫలం;
నివృత్తిః పరమా తృప్తిః - ఆనందోఽనుపమః స్వతః. ౪౨౧

ఆ. వె. పైకి పైకి మెట్లు లేకపోయిన లేని
నిష్ఫలములు క్రింది నిచ్చెనలును;
వరుస నుండె నేని పరమ సంతృప్తి, యా
నంద మనుపమంబు నందు నరుడు.

మీాది మీాదికి మెట్లెక్క లేకపోయినట్లైతే, క్రింది మెట్లన్నీ వ్యర్థమే! (వరుస తప్పకుండా) వస్తు ప్రపంచాన్నుంచీ నివృత్తి కలిగినట్లైతే, పరమ తృప్తీ, సాటిలేని ఆనందమూ సహజంగా కలిగి తీరుతుంది.

శ్లో. దృష్ట దుఃఖేష్వను ద్వేగో - విద్యాయాః ప్రస్తుతం ఫలం
యత్కృతం భ్రాంతి వేళాయాం - నానాకర్మ జుగుప్సితం
పశ్చాన్నరో వివేకేన - తత్కథం కర్తృ మర్హతి? ४२२

చ. కలిగెడి దుఃఖజాలముల గాసిల కోరిచియుంట, విద్యకున్
ఫలము; గతంబులో నెపుడొ భ్రాంతి కతంబున చెడ్డచెడ్డ క
ర్మల నతిగా నొనర్చియును మానవుడిప్డు వివేకవంతుడై
సలుపగ నెట్లు నేర్చునవి? సాధనకే కడునంత రాయముల్.

ఎన్ని దుఃఖాలు సంభవించినా తొణకకుండా ఉండటమే విద్య ఉన్నందుకు ఫలం. ఇంతకు ముందు అజ్ఞానంలో ఉండినప్పుడు ఏవేవో చెడ్డ కర్మలు చేసి ఉండినప్పటికీ, ఇప్పుడు విచక్షణ జ్ఞానం కలిగిన తరువాత, అలాంటి పనులు మళ్ళీ చేయకున్నా చేయగలుగుతాడా? అది అసంభవం.

శ్లో. విద్యా ఫలం స్యా దసతో నివృత్తిః
ప్రవృత్తి రజ్ఞాన ఫలం యదీక్షితం
తద్ జ్ఞా జ్ఞ యోర్యన్మృగ తృష్టికాదౌ
నోచే ద్విదో దృష్ట ఫలం కి మస్మాత్. ४२३

చ. విముఖతయే యనాత్మల, నివృత్తి పథం; బది విద్యకున్ ఫలం;
బమరు ప్రవృత్తి మార్గము ననాత్మలయం దభిమానమున్న; నా

క్రమమె అవిద్యకున్ ఫలము; కన్పడు సామ్యత యెండ మావులన్
భ్రమయని వానికిన్ భ్రమయువానికి; జ్ఞానికి కేమి లాభమో ?

అశాశ్వతమైన అనాత్మ వస్తువుల మీద విముఖత్వమే నివృత్తి మార్గం; అది సరియైన విద్యకు ఫలంగా ఉండవలసిందే! అనాత్మలనంటి పెట్టుకొని ఉండేదే ప్రవృత్తి మార్గం. అది అజ్ఞానానికి ఫలంగా ఉండేది. ఈ యిద్దరికీ పోలిక – ఎండ మావులను చూచి భ్రమించనివాడొకడూ భ్రమించి పరుగెత్తే వాడొకడూ – అనుకోవచ్చు! కాకపోతే, ఇంక బ్రహ్మ జ్ఞానం కలిగినందుకు ఫలమేమిటి?

ఎండ మావులను చూచి అందులో నీళ్లుండవని తెలిసినవాడు, నవ్వుకుంటాడు; తెలియనివాడు వెంట పరుగెత్తుతాడు. జ్ఞానియైన వాడు, లోకాన్ని చూచి అసత్యమని గుర్తించి ఊరకుంటాడు; అజ్ఞాని ఆకర్షణలకు భ్రమించి భ్రష్టుడౌతాడు.

శ్లో. అజ్ఞాన హృదయ గ్రంథే ర్వినాశో యద్యశేషతః
అదిచ్ఛో ర్విదుషః కింను ప్రవృత్తేః కారణ స్వతః. ౪౩౫

తే. గీ. హృదయమున నుండి అజ్ఞాన మది బిగించు
గ్రంథు లన్నియు సడలి పోగలిగినపుడు;
కామకర్మల కేముండు కారణంబు ?
విషయ విముఖు డహంకారవృత్తుడగునె ?

అజ్ఞాన హృదయ గ్రంథులన్నీ మొదటికి ఛేదించబడినప్పుడు, విషయ విముఖుడైన వాడికి మళ్ళీ అహంకారంతో కూడిన కామ కర్మలకు ప్రేరేపించే సహజకారణ మేముంటుంది?

[అవిద్యా – కామమూ – కర్మా – ఈ మూడూ హృదయ గ్రంథులని వేదాంతుల మతం.]

శ్లో. వాసనా నుదయో భోగ్యే వైరాగ్యస్య తదావధిః
అహంభావో దయాభావో బోధస్య పరమావధిః
లీనవృత్తే రనుత్పత్తి ర్మర్యా దోప రతేస్తు సా. ౪౨౫

తే గీ. రాగహీనత ప్రబల వైరాగ్యమునకు;
జ్ఞాన సంపూర్ణతకు నహంకారమేమి
లేమియును; నుపరతికి విలీనమగుట
మానసము; పరమావధిగా నుతింత్రు.

భోగ్య వస్తువుల మీద కోరిక (వాసన) మళ్ళీ పొటమరించక పోతే, అంటే, పూర్వం అనుభవించిన వస్తువు యెదుటనే ఉండినప్పటికీ దానిమీద బుద్ధి పట్టకపోతే, అది వైరాగ్యానికి పరాకాష్ఠ. అహంకారం మళ్ళీ ఎక్కడా లేకపోతే, అది జ్ఞానానికి పరమావధి. అహం బ్రహ్మాస్మి-నేను బ్రహ్మాను - అనుకుంటున్నవా డిప్పుడు - నేను నేను అని నేననుకుంటూ ఉండినది బ్రహ్మమే! - అనుకోటం సంభవిస్తుంది. 'అహం భావోదయా భావః' - కోశాలయందు అహంబుద్ధి లేకుండా ఉండటం అని కూడా అర్థం. ఆనందాత్మలో లీనమై పోయిన మనో వృత్తి - (నెయ్యి మళ్ళీ పాలుగా మారదు - ఆవిధంగా)-తిరిగీ చిగురింపక ఉండటం, ఉపరతికి పరమావధి.

## 426-445 జీవన్ముక్త లక్షణం

శ్లో. బ్రహ్మాకారతయా సదాస్థితతయా నిర్ముక్త బాహ్యార్థ ధీః
అన్యావేదిత భోగ్య భోగ కలనో నిద్రాళువత్ బాలవత్
స్వప్నాలోకిత లోకవజ్జగదిదం పశ్యన్ క్వచిల్లబ్ధ ధీః
ఆస్తే కశ్చి దనంత పుణ్యఫల భు గ్ధన్యః సమాన్యో భువి. ౪౨౬

శా. ఆలోకింపడు బాహ్య సత్యమును బ్రహ్మాకారుడై యుండి; ని
ద్రాళుండన్ శిశువట్టు లన్యులిడు నర్థంబుల్ గ్రహించున్; జగం
బాలోకించును స్వప్నలోకముగ; నాహా! అంతవాడేడి? యీ
భూలోకంబున; పూర్వపుణ్యఫలభుక్; పూజ్యుం డతండే కదా?

ఎల్లప్పుడూ బ్రహ్మంలోనే లీనమై ఉండటం వల్ల బాహ్య వస్తువులను సత్యమనుకోడు. ఇతరులిచ్చే తిండి పదార్థాలూ మొదలైన వాటిని నిద్రాళువూ, శిశువు మోస్తరుగా స్వీకరిస్తాడు. ఈ లోకాన్ని స్వప్నంలో చూచినట్టుగా అప్పుడప్పుడూ చూస్తాడు. ఆహా! అలాంటి వాడు అరుదుగా ఉంటాడు కదా? అనంతమైన పూర్వ పుణ్యాల ఫలాలను బాగా అనుభవిస్తాడు. భూలోకంలో అలాంటి వాడొక్కడే పూజ్యుడు. రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే – ఆ పరమాత్మ సాక్షాత్కారం లభిస్తే విషయ వాసనలన్నీ తమంతటతామే తొలగిపోతాయి. అలా సదా బ్రహ్మంలో మునిగి తేలుతుండే జ్ఞాని మనసూ బుద్ధీ ఆత్మ లోనే లీనమై ఉంటాయి. అతడింక బాహ్య పదార్థాలను కోరేదేముంది?

మన వంటి అజ్ఞానులైతే అదీ–ఇదీ–కావలె కావలెనని ఆరాటపడుతుంటాము. ఈ మామూలు దశ నతడెన్నడో దాటినాడు. అత్యుత్తమ దశకు చేరుకున్నాడు. తిండి తీర్థాల చింతకూడా అతనికెక్కడిదీ? భగవంతుని ప్రోత్సాహంవల్ల ఎవరైనా తెచ్చి పెడితే లేక బలవంతం చేసి బతిమాలితే, విధిలేక తీసుకున్నట్టుగా తీసుకుంటాడు. పసిబిడ్డవలె–నిద్రాళువువలె ఎవ్వరినీ ఏమీ అడుగడు. ఆకలి దప్పికలే అతనికి తెలియవన్నమాట! భగవద్గీతలోని స్థిత ప్రజ్ఞుడి లక్షణాలే ఇవన్నీ కూడా.

శ్లో, స్థిత ప్రజ్ఞో యతిరయం యః సదానంద మశ్నుతే
బ్రహ్మణ్యేవ విలీనాత్మా నిర్వికారో వినిష్క్రియః. ४३२

తే. గీ. స్థిరముగా నేయతీంద్రుడు తేజరిలునొ
బ్రహ్మ మందాత్మ నటుమగ్న పఱచి యుండి?
నిర్వికారుండు పూర్తిగా నిష్క్రియుండు
నై సదానంద వైభవ మనుభవించు.

బ్రహ్మమందే లీనమైపోయిన అంతఃకరణ కలవాడై-హర్షమూ విషాదమూ మొదలైన మానసిక వికారాలు లేనివాడై-వినిష్క్రియః బాహ్యాలైన దేహాదుల చేష్టలు కూడా లేనివాడై ఎల్లప్పుడూ ఎవడు ఆనుదాన్ని అనుభవిస్తుంటాడో, అతడు స్థిత ప్రజ్ఞుడు.

శ్లో. బ్రహ్మాత్మనోః శోధితయో - రేక భావావగాహినీ
నిర్వికల్పాచ చిన్మాత్ర - వృత్తిః ప్రజ్ఞేతి కథ్యతే
సాసర్వదా భవేద్యస్య - స జీవన్ముక్త ఉచ్యతే. ४३७

తే. గీ. ఏక భావావగాహిని యేది. బ్రహ్మ
మునకు జీవుని లంకించు? పూర్తినిర్వి
కల్పమై కాంతి. నదిప్రజ్ఞ; గట్టిగాను
దీన నుండు స్థిత ప్రజ్ఞుడైనవాడు.

స్థితాప్రజ్ఞా యస్యసః-ఎల్లప్పుడూ ఉండే ప్రజ్ఞ ఎవనికో అతడు స్థిత ప్రజ్ఞుడని విగ్రహావాక్యం. ప్రజ్ఞ-అంటే ఏమి? శోధితయోః-మహా వాక్య విపులీకరణంలో, తత్ - త్వం- పదాలచేత లక్షణా వృత్తితో బోధింపబడిన, ఉపాధిరహితాలైన పరమాత్మ - ప్రత్యగాత్మలకు, ఏక భావావగాహినీ - ఐక్యాన్ని పరామర్శించేదీ, నిర్వికల్పా-అసత్యభూతాలైన సంసర్గాదులకు సంబంధంలేనిదీ, అంటే, ఉదాహరణకు - రామం ఫలం భక్షయతి - రాముడు పండు తినుచున్నాడు. రాముడు కర్తా, పండు కర్మా, తినుచున్నాడు క్రియా- తినటం అనే క్రియలో రాముడు అనే పదార్థం కర్త, ఫలం పదార్థం కర్మ - ఇలా క్రియలో రెండూ అన్వయించి నాయని చెప్పేదే సంసర్గం. తత్త్వమసి - వాక్యార్థంలో ఈ పదార్థ సంసర్గమేమీ భాసించదు. చిదాకారా-అఖండ చిదాకారమైన వృత్తిః - శ్రవణ మనన నిదిధ్యాసలచేత సంస్కరించబడిన మనస్సు యొక్క పరిణామం-ప్రజ్ఞ. ఆ ప్రజ్ఞలో ఎల్లప్పుడూ ఉండేవాడు కనుక, స్థిత ప్రజ్ఞుడు.

సులభంగా చెప్పవలెనంటే, హద్దులులేక అద్వయమై ఏ మానసిక ప్రవృత్తి బ్రహ్మాన్నీ ప్రత్యగాత్మనూ పరస్పర భేదం లేకుండాచూపి చిన్మాత్రమైన జ్ఞానంగా ప్రకాశిస్తుందో ? – అది ప్రజ్ఞ. ఆప్రజ్ఞలో స్థిరంగా ఉండేవాడు, స్థిత ప్రజ్ఞుడు.

శ్లో. యస్య స్థితా భవేత్ ప్రజ్ఞా – యస్యానందో నిరంతరః
ప్రపంచో విస్మృత ప్రాయః – స జీవన్ముక్త ఉచ్యతే. ४२९

తే గీ. ఎవడు స్థిరముగ ప్రజ్ఞలోనే వసించు ?
నంతులేని సదానంద మనుభవించు ?
స్మరణకే రాదెవనికి దృశ్య ప్రపంచ ?
మతడు సూవె జీవన్ముక్తు డనగబరగు.

ఎవనిది స్థిరమైన జ్ఞానమో, నిరంతరం ఆనందాన్నే ఎవడనుభవిస్తాడో, ఎవడీ దృశ్యప్రపంచాన్ని మఱచిపోయి ఉంటాడో, అతడే జీవన్ముక్తుడని అంటారు.

శ్లో. లీన ధీరపి జాగర్తి యో జాగ్రద్ధర్మ వర్జితః
బోధో నిర్వాసనో యస్య సజీవన్ముక్త ఉచ్యతే. ४३०

తే. గీ. మగ్నుడై యుండి కూడ బ్రహ్మమున నెవడు
మెళకువగ నుండు? కాని, యా మెళకువకును
కలుగు లక్షణములు వీడు కామరహితు
డైన జ్ఞాని జీవన్ముక్తు డనగబరగు.

ఎవడు బ్రహ్మంలో లీనమై ఉండి కూడా జాగ్రత్తగా జాగరూకుడై ఉంటాడో, (సుషుప్తిలో ఉండే అజ్ఞానమిక్కడ లేదు కనుక) బుద్ధి వృత్తిలయించి నప్పటికీ జాగ్రదవస్థ – కనుక జాగ్రద్ధర్మాలను (అహంకార మమకారాలనూ, రాగద్వేష హర్ష విషాదులనూ) పొందడో? ఎవని జ్ఞానం ఏ కోరికలూ లేనిదో? అతడు జీవన్ముక్తుడని చెప్పుకుంటారు.

శ్లో. శాంత సంసార కలనః కలావానపి నిష్కలః
యః సచిత్తోఽపి నిశ్చిత్తః సజీవన్ముక్త ఉచ్యతే. ४३०

తే. గీ. సర్వ సంసారమున మహాశాంతి నొంది;
అవయవము లుండియును లేని యట్లయుండి;
చింతలేవియు లేనట్టి చిత్తముండు
నతడు సూవె జీవన్ముక్తు డనగబరగు.

ఈ సంసారాన్ని గురించిన శ్రద్ధలన్నీ – అహంకారం మొదలు దేహం వఱకూ, ఉండే ఆంతరంగిక సంసారమూ, భార్యాపుత్ర గృహారామాది బాహ్యసంసారమూ, వీటిని గురించిన సంబంధాలన్నీ–ఎవడికి లేక నిత్యశాంతుడై ఉంటాడో? ఎవడు చతుష్షష్టి కళలూ నేర్చినవాడైనప్పటికీ ఏవిద్యలూ తానివానివలె ఉంటాడో? లేక, షోడశ కళలు కలవాడై కూడా సంగంలేనివాడై ఉంటాడో ? చిత్తముండి కూడా (బ్రహ్మాకార చిత్తవృత్తిలో ఉన్నందున) చిత్తం లేనివానివలె ప్రవర్తిస్తాడో? అతడు జీవన్ముక్తుడని చెప్పుకుంటారు.

శ్లో. వర్తమానేఽపి దేహేఽస్మిన్ – ఛాయావదనువర్తిని
అహంతా మమతాఽభావో – జీవన్ముక్తస్య లక్షణం. ४३१

తే. గీ. నీడ మాదిరి నిరతంబు తోడువచ్చు
నిజ శరీరము నందైన నేను-నాది-
యను నహంకారమును మమతను నభావ
శిక్షనిడుట జీవన్ముక్త లక్షణంబు

మన నీడ యెప్పుడూ శరీరాన్ని అనుసరిస్తూ ఉండినా, మనం దాన్ని లక్ష్యపెట్టము. ఎందుకంటే అది మిథ్యయని మనకు తెలుసు. ఆ ప్రకారం నీడవలెనే జీవితాంతం అనుసరించి ఉండేఈ స్థూలశరీరాన్ని మిథ్యగా భావించినందువల్ల–నేనూ–నాదీ– అనటం అభావ మొవనికో ? అతడు జీవన్ముక్త లక్షణాలున్నవాడు.

శరీరం మీదనే ధ్యాసలేనివాడికి, జనన మరణ జరావ్యాధి దుఃఖాలుంటాయా? రాగద్వేషాదులుంటాయా? నిర్వికారంగా ఉండటమే జీవన్ముక్త లక్షణం.

శ్లో. అతీతా నను సంధానం - భవిష్య దవిచారణం
ఔదాసీన్య మపిప్రాప్తే - జీవన్ముక్తస్య లక్షణం. ౪౩౩

తే. గీ. గతమును గుఱించి యే జ్ఞాపకమును లేమి;
జరుగ బోయెడి దాని విచారణమును
మానుటయు; వర్తమానము పైనలక్ష్య
లక్షణమును జీవన్ముక్త లక్షణంబు.

జరిగి పోయిన దాన్ని గుఱించి స్మరణ లేకుండుటా, రానున్న దానిని గుఱించి ఆలోచన లేకుండుటా! వర్తమానాన్ని గుఱించి ఉదాసీనంగా ఉండుటా (సంగ రాహిత్యమూ)-ఇవి జీవన్ముక్తుని లక్షణాలు.

శ్లో. గుణదోష విశిష్టేఽస్మిన్ - స్వభావేన విలక్షణే
సర్వత్ర సమదర్శిత్వం - జీవన్ముక్తస్య లక్షణం. ౪౩౪

తే. గీ. గుణములును దోషములచేత కూడియున్న
పంచ భూతాత్మకంబు ప్రపంచ మందు;
సహజ భేదములను సర్వసమముగా, ద
లంచు చూపు జీవన్ముక్త లక్షణంబు.

గుణదోషాలతో కూడిన భూతాలవల్ల సహజంగా ఒకటితో ఒకటి భేదించి ఉండే ఈ ప్రపంచమంతటా సమదృష్టితో ప్రవర్తించటం జీవన్ముక్తుడి లక్షణం.

దోష ముందని దేన్నీ నిషేధించడు; గుణముందని దేన్నీ స్వీకరించడు. అంతా అవిద్యా కల్పితమేనని తెలుసు. కనుక, ఉదాసీనుడై ఉంటాడు. ఇదీ సమదర్శిత్వమే! ఇలాకాక, నిర్దోషం హి సమం బ్రహ్మ' బ్రహ్మ నిర్దోషమూ, సమమూ అనే గీతావాక్యాను సంసారం 'సర్వత్ర సమ దర్శినః' – అంతటా బ్రహ్మన్నే చూడటం జీవన్ముక్త లక్షణం.

శ్లో. ఇష్టా నిష్టార్థ సంప్రాప్తౌ - సమదర్శిత యాత్మని
ఉభయత్రా వికారిత్వం - జీవన్ముక్తస్య లక్షణం. 435

తే. గీ. మోదమో ఖేదమో వస్తు మూలముగను
కలిగినపుడెల్ల సమదృష్టి కారణమున
నుభయమందు వికారంబు నొందకుండు
లక్షణంబె జీవన్ముక్త లక్షణంబు.

ఇష్టాన్నీ (సంతోషాన్నీ), అనిష్టాన్నీ (దుఃఖాన్నీ), కలిగించే వస్తువులతోడి సంబంధం కలిగినపుడల్లా తాను సమాన దృష్టితో చూడటం ద్వారా, ఆ రెండిటి యందూ మానసిక వికారం పొందక పోవటమే జీవన్ముక్తుడి లక్షణం. మనం మామూలుగా సంతోషం కలిగితే ఉబ్బితబ్బిబ్బులౌతాడు. దుఃఖం కలిగితే పెడబొబ్బలు పెడతాము. చుట్టూ పరిసరాలను బట్టి మనం ఎప్పటికప్పుడు మారు తుంటాము. జీవన్ముక్తుడో! శరీరంలో ఉండి కూడా ఆశరీరంతో తనకు సంబంధం లేదను కుంటాడు. ఆత్మతో మాత్రమే అనుబంధం పెంచుకుంటాడు. అన్ని శరీరాల్లోనూ తానే ఉన్నానను కుంటాడు. ఎవరి మనసులో ఏముందో సూక్ష్మ దృష్టితో చూడగలుగుతాడు. ఏకైకాధారమైన బ్రహ్మం మీదనే అతని దృష్టి. అందువల్ల ఇష్టమూ, అనిష్టమూ - అనేవి అతని కుండవు. నిర్వికారంగా, నిశ్చలంగా ఉంటాడు.

శ్లో. బ్రహ్మానందరసా స్వాదా - సక్త చిత్తతయా యతేః
అంతర్బహిర విజ్ఞానం - జీవన్ముక్తస్య లక్షణం. 436

తే. గీ. బ్రహ్మమనెడి సదానంద రసము నందె
మగ్నమానసుడగు యోగి, మఱచి యుండు
నంతరం బిది బాహ్యమటన్న తెలివి;
అట్టివాడె జీవన్ముక్తు డనగ బరగు.

ఎప్పుడూ బ్రహ్మానందంలోనే మునిగి తేలుతూ, ఇది బాహ్యం, ఇది అంతరం, ఇది ప్రపంచం, ఇది అనాత్మ – అనే భేదమే తెలియకుండా ప్రవర్తించటం జీవన్ముక్తుని లక్షణం.

బ్రహ్మానంద రసాస్వాదనమంటే, చిత్త మొక్కటే ఆనందమనుభవిస్తున్నదనే అర్థం కాదు. సర్వేంద్రియాలూ అమృతమయాలై ఆనందాన్ని ప్రసరిస్తున్నాయని అర్థం.

శ్లో. దేహేంద్రియాదౌ కర్తవ్యే – మమాహం భావ వర్జితః
ఔదాసీన్యేన్య యస్తిష్ఠేత్ – సజీవన్ముక్త ఇష్యతే. ४३०

తే. గీ. దేహమందున నెల్ల యింద్రియములందు
నాది-నేనను భావమనేది లేక;
తానుదాసీను, డెవడు కర్తవ్యహీన
దీక్షు? డతడె జీవన్ముక్త లక్షణుండు.

దేహేంద్రియాలూ, మనోబుద్ధ్యహంకారాలూ, వీటి యందూ, చేయదగిన కర్మలందూ, మమకార అహంకారాలులేనివాడై, ఉదాసీనంగా (ఏదీ పట్టించుకోకుండా) ఎవడుంటాడో ? అతడు జీవన్ముక్తుడి లక్షణాలున్నవాడు.

మమకార అహంకారాలు లేకపోవడమంటే – నేను ఫలానా వాడను. నేను చేస్తున్నాను. నేను వస్తున్నాను. ఇదినాదీ. ఇదినేను తయారు చేసినాను – ఇత్యాది అధ్యాస కల్పితమైన తాదాత్మ్యంలో పడకుండా సంగరహితుడై ఉండటం.

శ్లో. విజ్ఞాత ఆత్మనో యస్య – బ్రహ్మభావః శ్రుతేర్బలాత్
భవబంధ వినిర్ముక్తః – స జీవన్ముక్త ఇష్యతే. ४३१

తే. గీ. బ్రహ్మభావంబు శ్రుతివాక్య బలముచేత
నాత్మలోపల గుర్తించి నందువలన

నెవడు భవబంధముక్తుడై యెసగువాడొ ?
అతడు స్థావె జీవన్ముక్తుడనగ బరగు.

ఆత్మయే అన్నిటికీ అధిష్ఠానమనీ, సత్యమనీ, శ్రుతులన్నీ ప్రకటిస్తున్నాయి. ఆయెఱుక బాగా వ్రేళ్లుపాతుకొని పోయి ఎవని కుంటుందో? పుట్టుకా, చావూ, ముసలితనమూ, వ్యాధీ, దుఃఖమూ, ఇల్లూ వాకిలీ, పెండ్లామూ పిల్లలూ, పొలమూ, ఉద్యోగమూ, ధనమూ – మొదలైన బంధాలేవీ ఎవనికి లేవో ? అతడే జీవన్ముక్తుడని చెప్పుకుంటారు.

శ్లో. దేహేంద్రియే ష్వహంభావ – ఇదం భావ స్తదన్యకే
యస్యనో భవతః క్వాపి – సజీవన్ముక్త ఇష్యతే. ౪౩౯

తే. గీ. కాయ మింద్రియముల నహంకార మొకటి;
బాహ్య వస్తువులంది దంభావ మొకటి;
యెవ్వనికి బొత్తుగాలేవొ? యిట్టివాడె
బ్రదికి యుండగనే ముక్తి పడయువాడు.

దేహమందూ, ఇంద్రియాలయందూ, (నాకేమి ? నేను బాగున్నాను–అనే) అహంకార మెవనికి లేదో? ఇతర వస్తువులందు ఇదీ–అదీ అనేభావం ఎవని కుండదో? – వాడే జీవన్ముక్తుడని చెప్పుకుంటారు.

ఈ ఉపదేశమంతా నిన్ను నీవు పరీక్షించుకొని ఉద్ధరించుకోటానికే, కాని, ఇతరులను గురించి తీర్మానాలు చేయటానికి కాదు. ఇతరులిట్టి వారని చాటడానికి నీవెవడవు గనుక? నీవు జీవన్ముక్తుడవు కావటానికి లక్షణాలవసరం.

శ్లో. నప్రత్యగ్ బ్రహ్మణోః భేదం – కదాపి బ్రహ్మసర్గయోః
ప్రజ్ఞయా యో విజానాతి – స జీవన్ముక్త లక్షణః. ౪౪౦

తే. గీ. ఎఱుకచే పరిపూర్ణుడై యెవడు భేద
మరయడో జీవునకును బ్రహ్మంబునకును ?

బ్రహ్మమునకును నళ్లై ప్రపంచమునకు;
నట్టివాడు జీవన్ముక్తు డనగజెల్లు !

ప్రజ్ఞ ద్వారా ఎవడు ప్రత్యగాత్మకూ, బ్రహ్మానికీ, అట్లనే, బ్రహ్మానికీ ప్రపంచానికీ, భేదం చూడడో ? వాడే జీవన్ముక్త లక్షణా లున్నవాడు. "ఋతంభరా తత్ర ప్రజ్ఞా"–సత్యవస్తు బోధకమై సత్స్వరూపమైన దేదో అది ప్రజ్ఞ – అంటుంది పతంజలి యోగ సూత్రం. అటువంటి ప్రజ్ఞ ద్వారా తెలుసుకునేదేమిటి ? బ్రహ్మానికీ ప్రత్యగాత్మకూ భేదంలేదని; బ్రహ్మానికీ ప్రపంచానికీ భేదం లేదని. అంటే, అన్నిటికీ అధిష్ఠానంగా ఉండేదొక బ్రహ్మమే కనుక, ఉన్న సద్వస్తు వొక్కటే కనుక, ఏదీ బ్రహ్మం కంటే వేఱు కాదు. ఇలాంటిఅద్వితీయాఖండ విజ్ఞానమే ప్రజ్ఞ.

శ్లో. సాధుభిః పూజ్యమానేఽస్మిన్ – పీడ్యమానేఽపి దుర్జనైః
సమభావో భవేద్యస్య – స జీవన్ముక్త ఇష్యతే. ౪౪౧

క. సాధువు లారాధించిన
బాధించిన దుర్జనాళి స్వశరీరము; నే
మేధావి తొణకడో? అత
డీ ధర జీవన్విముక్తుడే యనగదగున్.

ఎవడు తన శరీరాన్ని సాధువులారాధించినా, దుష్టులు బాధించినా, ఒకే విధంగా (సమభావంతో) తొణకక ఉంటాడో? – అతడు జీవన్ముక్తుడని చెప్పుకుంటారు.

శ్లో. యత్ర ప్రవిష్టా విషయాః పరేరితాః
నదీప్రవాహా ఇవ వారిరాశౌ;
వినంతి సన్మాత్రతయా న విక్రియాం
ఉత్పాదయంత్యేష యతి ర్విముక్తః. ౪౪౨

చ. పరులు పయింబయిన్ విషయ వస్తువులం గురియింప మౌని, సా
గరము నదీప్రవాహములకైవడి గైకొని యూరకుండు; మా
ర్పరయగరాదు, పూర్ణమగు బ్రహ్మమునందు లయించియుంట, త
త్పరుడయి; అట్టివాని ననవచ్చును ముక్తుడటంచు నెప్పుడున్.

ఏ యతిమీాద ఇతరులు విషయ వస్తువుల నూరక వర్షంగా కురి పిస్తారో, ఆ యతి వాటిని – నదీప్రవాహాలను సముద్రుడు గ్రహించి నట్లుగా – గ్రహించి ఊరకుంటాడు. అతనిలో మార్పేమీా ఉండదు. ఎందుకంటే, అతడెప్పుడూ పరిపూర్ణమైన సత్యం (ఉనికి)లో లీనమై ఉంటాడు. అట్టివాడే నిజమైన ముక్తుడు.

ముక్తుడైనవాడు విషయ వస్తువులను కోరనే కోరడు. ఐతే, ఇతరులూరకుంటారా ? మంచివాళ్లు మంచివీ, చెడ్డవాళ్లు చెడ్డవీ, తెచ్చి అతని మీాద గుప్పుతారు. అతడి జ్ఞాన వాహినిలో అవన్నీ లీనమై పోతాయి. లెక్కలేనన్ని నదులు వచ్చి సముద్రంలో పడతాయి. సముద్రమేమైనా ఎక్కువ తక్కువ వౌతుందా? అదే ప్రకారం ఆముని కూడా మార్పులేక హాయిగా ఉంటాడు. బెదరింపులూ, శిక్షలూ, కొట్టడాలూ, తిట్టడాలూ, పూజలూ పురస్కారాలూ పొగడ్తలూ – అన్నీ అతడి హృదయంలో అదృశ్యమైపోతాయి. పరిపూర్ణ జ్ఞాన మొక్కటే అతనిలో నిలిచి ఉంటుంది. ఈ ఇతరులు విసరిన విసురులన్నీ అతడి బ్రహ్మభావాన్ని మరింత బలపరుస్తాయి.

శ్లో. విజ్ఞాన బ్రహ్మతత్వస్య – యథా పూర్వం న సంసృతిః
అస్తిచేన్నన విజ్ఞాత – బ్రహ్మభావో బహిర్ముఖః. ४४३

ఆ. వె. బ్రహ్మతత్వవేత్త బాహ్య వస్తువులందు
ముందువోలె తగుల మొంద బోడు;
తగులువాడు బ్రహ్మతత్వజ్ఞు డెట్లౌను ?
నిందుగా బహిర్ముఖుండె కాని.

బ్రహ్మతత్వాన్ని బాగా గ్రహించిన వాడెప్పటికీ విషయ వస్తువులను ముందువలె అందుకోడు. అందుకంటేనో? అతడు బ్రహ్మవేత్త కాడు. బహిర్ముఖుడైన మామూలు మనిషే !

అనుభవ పూర్వకంగా బ్రహ్మతత్వాన్ని తెలుసుకున్న యోగి అజ్ఞానదశలో వలె సంసారంలో పడడు. పడితే, అనాత్మ వస్తువుల మీద అభిమానంగల బహిర్ముఖుడే !

దుఃఖే ష్వను ద్విగ్న మనాః – సుఖేషు విగత స్పృహః
వీతరాగ భయక్రోధః – స్థిత ధీ ర్ముని రుచ్యతే. (గీ. 2-56)

దుఃఖాలకు దిగులుపడని మనస్సు కలవాడూ, సుఖాలకు ఆశలేని వాడూ, రాగభయ క్రోధాలు విడిచిన వాడూ. ఐన ముని స్థితప్రజ్ఞుడని అనిపించుకుంటాడు. ఇంకెవడూ ఈ విధంగా ఉండలేరు.

శ్లో. ప్రాచీన వాసనా వేగా – దసౌ సంసరతీతి చేత్
నసదేకత్వ విజ్ఞానా – న్మందీ భవతి వాసనా. ౪౪౪

ఆ. వె. ప్రాత వాసనల ప్రవాహవేగము చేత
విషయ వస్తు ప్రీతి వెలసెనన్న;
లేదనే జవాబు; లీనమైనప్పుడు
బ్రహ్మమందు, వాని బలము తగ్గు !

ప్రాతవాసనల కదలిక వల్ల ఇంకా విషయవస్తువుల మీద అపేక్ష వదలటం లేదని వాదిస్తే, అది అబద్ధమన్నదే జవాబు. ఎందుకంటే బ్రహ్మ మందైక్యత పొందగానే, ఆవాసనలు బలహీనమై తగ్గిపోతాయి. సూర్యోదయంతో చీకటివలె ధ్వంసమై తీరుతాయి.

శ్లో. అత్యంత కాముక స్యాపి – వృత్తిః కుంఠతి మాతః
తథైవ బ్రహ్మణి జ్ఞాతే – పూర్ణానందే మనీషిణః. ౪౪౫

ఆ. వె. పరమ పాపికైన పాడు కోర్కెలు మాతృ
సన్నిధాన మందు సమసిపోవు;
నటులె పూర్ణ బ్రహ్మమందు నానందించు
వాని కుండవెట్టి వాసనలును.

అధమాధమమైన పరమ కాముకునికైనా, పాడు కోరికలు కన్న తల్లి యెదుట ఆగిపోతాయి. అదే విధంగా పూర్ణబ్రహ్మానుభవం కలిగి ఆనందించే యోగి కెటువంటి ప్రపంచ వాంఛలూ ఎంత మాత్రం ఉండవు.

## 446-464 ప్రారబ్ధ విచారము

శ్లో. నిది ధ్యాసన శీలస్య - బాహ్య ప్రత్యయ ఈక్ష్యతే
బ్రవీతి శ్రుతి రేతస్య - ప్రారబ్ధం ఫలదర్శనాత్. ౪౪౬

ఆ. వె. ధ్యానమునను నిపుణుడైన వాడింకను
బాహ్య జగతి ననుభవము వహించు;
ప్రతి ఫలాలు చూచి శ్రుతులది ప్రారబ్ధ
మనుచు మనకు తెలియునట్లు పలుకు.

ధ్యానాన్ని నిత్యమూ అభ్యాసంచేసి నిపుణుడైన సాధకుడికి కూడా ఇంకా ఇప్పటికీ బాహ్యానుభావాలు పొందటం కానవస్తుంది. అలాంటి వాడికి సుఖదుఃఖాలు అనుభవానికి వస్తున్నందున, శ్రుతులు అది వాడి ప్రారబ్ధ మంటున్నాయి.

ధ్యానం సవికల్ప సమాధిలోనే కనుక, ఆధ్యానం ముగియగానే దేహాది భావాలు మెదలుతూనే ఉంటాయి. పూర్వకర్మానుసారం సుఖదుఃఖాలు తప్పవు. శరీర ధ్యాసపోతేనే కాని, అవి వదలవు. అందు వల్ల నిర్వికల్ప సమాధి లభిస్తే, ఆసుఖ దుఃఖాలు అంత మౌతాయి. అందాకా వాడిగతి అంతే!

శ్లో. సుఖాద్యను భవోయావత్ - తావత్ ప్రారబ్ధ మిష్యతే;
ఫలోదయః క్రియా పూర్వో- నిష్క్రియో నహికుత్రచిత్. ౪౪౭

ఆ. వె. ఎంత వఱకు సుఖాదుల పొంతనంబొ ?
అంత వఱకును ప్రారబ్ధ మనుసరించు;
ఫలములెల్ల క్రియాపూర్వ కలన గలుగు
కాని, క్రియలేక ఫలమెందు కానరాదు.

ఎందాకా సుఖదుఃఖాల అనుభవ ముంటుందో, అందాకా ప్రారబ్ధ కార్యంగానే కనపడుతుంది. ప్రతి ఫలితమూ క్రియాపూర్వకమే, క్రియలేని ఫలితం ఎక్కడా కానరాదు. సుఖదుఃఖాలు పూర్వ పుణ్య పాప ఫలాలేకదా! బాహ్యజ్ఞానంతో ధ్యానంచేసే సాధకుడికి కర్మాను సారమైన సుఖదుఃఖాలు అనుభవానికి వస్తాయి.

శ్లో. అహం బ్రహ్మేతి విజ్ఞానాత్ - కల్పకోటి శతార్జితం
సంచితం విలయం యాతి -ప్రబోధాత్ స్వప్న కర్మవత్. ౪౪౮

తే. గీ. నేను బ్రహ్మముననెడి జ్ఞానానుభవము
కల్పకోటి శతార్జిత కర్మలను న
శింప జేయును; కలలోన చేసినట్టి
కర్మము నశించినట్లు మేల్కొంచగానె.

నేను బ్రహ్మాన్ని - అనే ఎఱుక అనుభవానికి రాగానే, శతకోటి కల్పాలకాలంలో చేసినవైనా కర్మలన్నీ ఒక్కపెట్టున నశిస్తాయి-కలలో మనం చేసిన కర్మలు మేలుకోగానే నశించినట్టుగా.

"భిద్యతే హృదయ గ్రంథి - చిద్యతే సర్వ సంశయాః
క్షీయంతే చాస్య కర్మాణి - తస్మిన్ దృష్టే పరావరే"

అంటుంది ముండకోపనిషత్తు. జ్ఞానాగ్నిలో ఎఱుకగలవాని సమస్త వాసనలూ దగ్ధమై పోతాయి.

శ్లో. యత్కృతం స్వప్నవేళాయాం - పుణ్యంవా పాపముల్బణం
సుప్తే స్థితస్య కిం తత్స్యాత్-స్వర్గాయ నరకాయవా? ౪౪౯

ఆ. వె. నిద్రపోయినపుడు నేరుగా కలలోన
పుణ్యపాప కర్మముల ప్రభావ
మతడు మేలు కాంచినపుడు స్వర్గానికో ?
నిరయమునకొ? చేర్ప నేర్చునేమి ?

స్వప్నంలో తాను చేసి నట్లూహించుకునే పుణ్య కర్మలుకానీ, పాప కర్మలుకానీ, మేల్కొ-గానే అతడిని స్వర్గానికో నరకానికోతీసుకు పోగలుగుతున్నాయా ?

అనేక జన్మల్లోని సంచిత కర్మలన్నీ జ్ఞానోదయంతో నశించిపోతా యని ఇంతకు ముందే చెప్పబడింది. దాన్ని బలపరచేందుకే ఈ ఉదా హరణ. స్వప్న కాలంలో చేసిన పుణ్యకర్మలేకానీ, పాపకర్మలేకానీ, మేల్కొ-న్నప్పుడు ఫలితాల నీయటంలేదు. నిజానికి స్వప్నావస్థకూ జాగ్రదవస్థకూ సంబంధమేలేదు. అప్పటి అనుభవాలువేఱూ, ఇప్పటి అనుభవాలు వేఱూ.

అలాగే జ్ఞానోదయమైన యోగికీ, అజ్ఞానికీ ఎంతో భేదం. జ్ఞానికి అహంకారంలేదు. అజ్ఞానిలో అహంకారం వల్లనే కర్మఫలాలు అనుభవానికి రావటం. కనుక అహంకార శూన్యుడైన యోగికి పూర్వ సంచితాలేవీ అంటవు. ఉపాధులే తనవి కావనుకునే యోగికి కర్మఫలా లెక్కడివీ ?

శ్లో. స్వమ సంగ ముదాసీనం - పరిజ్ఞాయ నభో యథా
నశ్లిష్యతి చ యత్కించిత్ - కదాచిత్ భావికర్మభిః ౪౫౦

అ. వె. ఆకసంబువోలె నంట కుదాసీను
డైన యాత్మవేత్త, అనితరుండు;
సంగరహితుడగుట సంబంధమే లేదు
భావి కర్మలకును తావుగలదె ?

తనను సంగరహితుడుగానూ, కేవలుడుగానూ కర్తృత్వం లేని వానినిగానూ బాగా తెలుసుకున్న తత్వవేత్త - ఆకాశంవలె(జలమూ, గాలీ, అగ్నీ మొదలైన వాటితో) సంబంధం లేక - ఉదాసీనుడై ఉంటాడు. అజ్ఞానం నశించి, దేహాదులతో తాదాత్మ్యం లేనప్పుడు, భావికర్మలు కొంచెమైనా అతని నంటవు. కర్మలన్నీ దేహానికే సంబంధించినవి - ఆత్మకు సంబంధింపవు.

శ్లో. న నభోఘట యోగేన - సురాగంధేన లిప్యతే
తథాత్మోపాధి యోగేన - తద్ధర్మై ర్నైవ లిప్యతే. ౪౫౧

ఆ. వె. కుండలోన గగనముండియు నందలి
కల్లు కంపు తాను కలుపుకొనదు;
ఆత్మయును నుపాధు లందుండి యట్టులే
తద్గుణాళి యందు తగులుపడదు.

ఆకాశం కుండతో సంబంధం కలిగి ఉండినప్పటికీ, దాని కల్లు కంపు చేత కలుషం కావటంలేదు. అదే ప్రకారంగా ఆత్మ కూడా ఉపాధులతో సంబంధం కలిగి ఉండినప్పటికీ, వాటి గుణాలను అంటించుకోదు.

ప్రకర్షణ ఆరబ్ధం ఇతి ప్రారబ్ధం -ఫలోన్ముఖమైన కర్మను ప్రారబ్ధమంటారు. ఈ ప్రారబ్ధమే ప్రతిజీవి శరీర నిర్మాణానికీ కారణం. కనుక శరీరం పొయ్యేదాకా ఉంటుంది. ఈ శరీరమే ఆత్మకు ఉపాధి. యోగి కూడా ఆత్మజ్ఞానానుభవాన్ని శరీరంలో ఉండే పొందుతాడు. ఐతే, అతడీ శరీరం తాను కాదనుకుంటాడు. కనుక, కర్మలేవీ అంటవు. ఆకాశం అంతటా ఉంటుంది. ఐతే దానిలోని వస్తువులేవీ ఆకాశాన్ని కలుషితం చేయలేవు. కుండలోని కల్లు కంపు చుట్టూ ప్రసరిస్తుంది. గాలినైనా చెడగొడుతుందేమో కాని, ఆకాశాన్ని ఏమీ చేయలేదు. కల్లు కుండలోని ఆకాశం విడిగానే ఉంటుంది. ఆ ప్రకారంగానే యోగికి స్థూల-సూక్ష్మ-కారణ శరీరాల వాసనలేవీ అంటవన్నమాట!

శ్లో. జ్ఞానోదయా త్పురారబ్ధం - కర్మ జ్ఞానాన్న నశ్యతి
అదత్వా స్వఫలం లక్ష్య - ముద్ది శ్యో త్సృష్ట బాణవత్. ४५३

ఆ వె. జ్ఞానమునకు ముందుగానె శరీరంబు
కలుగ జేసినట్టి కర్మ చెడదు;
ఫలము లీక. జ్ఞాన బలముచే; గుఱిపెట్టి
వదలి పెట్టబడిన బాణమట్లు.

జ్ఞానోదయానికి ముందుగానే శరీర నిర్మాణానికి మూలకారణమైన కర్మ, ఆ జ్ఞానంచేత ఫలాలీయకుండా నశించదు. గుఱి చూచి సూటిగా కొట్టిన బాణం వలెనే !

కర్మ మూడు విధాలు - సంచితమూ, ప్రారబ్ధమూ, ఆగామీ; (1) బహుజన్మలలో పూర్వం చేసిన పుణ్యాపాప మిశ్రిత కర్మ. (2)ఫలోన్ముఖమై యిప్పుడీ శరీరంతో అనుభవించేది ప్రారబ్ధం. (3) ముందు జరుగబొయ్యేది ఆగామి.

జ్ఞానోదయంతో సంచితమంతా నశిస్తుంది. కాని, ప్రారబ్ధం వదలదు. అది అంతకు పూర్వమే ఫలానుభవం చేయించటానికై బయలుదేరింది.

ప్రతి వ్యక్తికీ ప్రారబ్ధమే శరీరంగా ఏర్పడుతుంది. తల్లిగర్భంలో నుంచీ కాటికి చేరేదాకా ప్రారబ్ధమే అన్ని పనులూ చేయిస్తుంది. ఇది జ్ఞానోదయంతో మారేదికాదు. దీన్నే జీవిత మంటారు. ఈ జీవితంలో ఒక్కొకరికి ఒకానొక వయసులో జ్ఞానోదయ మౌతుంది. ఆచార్య శంకరుడికి పంద్రెండో యేట ! వివేకానందుడికి ఇరవైనాలుగో యేట! బుద్ధుడికి నలభై రెండో యేట! రమణ మహర్షికీ, రామకృష్ణ పరమహంసకూ, బాల్యంలోనే! జ్ఞానోదయమయింది. కాని యీ జ్ఞానోదయానికి ముందే ప్రారబ్ధం తనపని తాను చేస్తూ వచ్చింది. తల్లి గర్భంలో పిండానికి రూపమేర్పడగానే ప్రారబ్ధం మొదలయిందన్న మాట ! అతడి కర్మ - ఆ శరీరమనే బాణాన్ని ఎక్కుపెట్టి విడిచిందన్న

మాట! అది కాటికి చేరేదాకా ప్రారబ్ధం వెంబడిస్తూనే ఉంటుంది. ప్రారబ్ధమే శరీరం కనుక, ఆ శరీరంతోనే ప్రారబ్ధం నశిస్తుంది. యోగి విషయంలో అతడు శరీరంతో తాదాత్మ్యం చెందడు కనుక, దానంతట అది జీవిస్తుంది. సుఖదుఃఖాలు శరీరానికున్నప్పటికీ, అవి యోగిని బాధించవు. అతడు తాను వేఱూ-శరీరం వేఱూ అనుకునేవాడు కనుక, లోలోపల నవ్వుకుంటాడు. మనమో? నానావస్థలూపడి, ప్రారబ్ధాన్ని అనుభవిస్తాము.

శ్లో. వ్యాఘ్రబుద్ధ్యా వినిర్ముక్తో - బాణః పశ్చాత్తు గోమతౌ
న తిష్ఠతి చ్ఛినత్త్యేవ - లక్ష్యం వేగేన నిర్భరం. ౪౫౩

క. పులిగా తలంచి విడిచిన
ములికి కదే నడుమ నద్ది మొదువని తెలియన్
నిలుచునె ముందుకు సాగక ?
పొలిపుచ్చునె కాక వేగపూర్ణంబగుచున్.

పెద్దపులిగా భావించి సూటిగా విడిచిన బాణం, అది పులికాక ఆవని మధ్యలో తెలిస్తే మాత్రం ఆగుతుందా? పరిపూర్ణ వేగంతో వెళ్లి గ్రుచ్చుకునే తీరుతుంది.

ఆ దూరాని ఉండేది పెద్దపులి! మిక్కిలి క్రూరమృగం! తప్పక చంపవలసిందే! అనుకుంటూ విలుకాడు బాణం ఎక్కుపెట్టి సూటిగా వదలినాడు. వదలిన వెంటనే చూస్తే అక్కడ పులిలేదు - ఆవు కన పడింది. అయ్యో! ఆవే! అని నాలుక కఱచుకుంటే మాత్రం ఆ బాణం ముందుకు దూసుకు పోకుండా ఆగుతుందా? లక్ష్యాన్ని ఛేదించే తీరు తుందిగా? అదే విధంగా నీవు - నేను శరీరాన్నే అనుకొని, భావాలూ ఉద్దేశాలూ కోరికలూ - అనే బాణాలెన్నో వదలినావు. ఇప్పుడు సత్యం తెలుసుకున్నావు. నేను శరీరాన్ని కాను - ఆత్మను-అనే జ్ఞానం కలిగింది. కాని, అంతకు ముందే ప్రయోగించిన ప్రారబ్ధం ఆ శరీరం అనుభవించక తప్పుతుందా?

శ్లో. ప్రారబ్ధం బలవత్తరం ఖలు విదాం భోగేన తస్య క్షయః
సమ్యగ్ జ్ఞానహుతాశనేన విలయః ప్రాక్సంచితా గామినాం
బ్రహ్మాత్మైక్య మవేక్ష్య తన్మయతయా యేసర్వదా సంస్థితా
స్తేషాం తత్త్రితయం నహి క్వచిదపి బ్రహ్మైవతే నిర్గుణం. ౪౫౪

శా. ప్రారబ్ధం బది జ్ఞానికిన్ బలతరంబై; మాను భోగంబుచే
పూర్ణజ్ఞాన హుతాశనంబున లయంబుల్ సంచితాగాములై
తీరుంగాని; సతంబు బ్రహ్మమున వర్తించే మహాజ్ఞాని, కీ
ప్రారబ్ధాదులు మూడునంట; వతడే బ్రహ్మంబుగా నుండుటన్.

ప్రారబ్ధ కర్మ జ్ఞానికైనా బలవత్తరంగానే ఉంటుంది. అనుభవిస్తేనే క్షీణిస్తుంది. సంచితా గాములేమో జ్ఞానాగ్నిలో దగ్ధమై పోతాయి. ఐతే, ప్రారబ్ధాదులు మూడూ బ్రహ్మాత్మైక్యం పొంది సదాతన్మయుడై ఉండేవాడి నేమీ బాధించవు. ఎందుకంటే, అతడే నిర్గుణ పరబ్రహ్మమై ఉంటాడు కనుక.

శ్లో. ఉపాధి తాదాత్మ్య విహీన కేవల
బ్రహ్మాత్మ నైవాత్మని తిష్ఠతో మునేః
ప్రారబ్ధ సద్భావ కథా న యుక్తా
స్వప్నార్థ సంబంధ కథేవ జాగ్రతః. ౪౫౫

తే. గీ. అద్వయంబైన బ్రహ్మము నం దుపాధి
రహితుడై యున్నమునికి ప్రారబ్ధ మనుట
కర్థమే లేదు; మేల్కొని నపుడు నిద్ర
స్వప్న వస్తువుతోడి సంబంధమట్లు.

అద్వయమైన బ్రహ్మంగా ఆత్మను దర్శిస్తూ, ఉపాధిరహితుడై ఉండే మునికి, ప్రారబ్ధ మనేది అర్థంలేని మాట ! నిద్రలేచిన వాడికి కలలో చూచిన దృశ్యవస్తువులతో ఏమైనా సంబంధం ఉంటుంది గనుకనా ?

శ్లో. నహి ప్రబుద్ధః ప్రతి భాసదేహో
దేహోపయోగిన్యపి చ ప్రపంచే
కరోత్య హంతా మమతా మిదం తాం
కింతు స్వయం తిష్ఠతి జాగరేణ. ४७८

తే. గీ. నిద్ర మేల్కొన్న వానికి - నేను - నాది
యనెడి భావము స్వప్న దేహమున లేదు;
స్వప్నలోకము తోడి సంబంధమట్లె
స్వయముగా జాగరూకత వదలుగాన.

నిద్ర నుంచీ మేల్కొన్నవాడు, స్వప్నంలోని తన దేహాన్ని చూచుకొని, నేనూ-నాదీ-అనే అహంకార మమకారాలు పొందడు. కలలోని ప్రపంచ వస్తువులను చూచి - ఇదీ, అదీ, అనే సంబంధం పెట్టుకోడు. తనంతట తాను జాగ్రదవస్థలో ఉంటాడు. ఉపాధులను దాటి తురీయావస్థలో ఉండేవాడు, నేనూ, నాదీ, ఇదీ, అదీ - అనే అహంకార మమకారాలుంచుకోడు.

శ్లో. న తస్య మిథ్యార్థ సమర్థనేచ్ఛా
న సంగ్రహ స్త జ్జగతోఽపి దృష్టః
తత్రాను వృత్తి ర్యదిచే న్మృషార్థే
ననిద్రయా ముక్త ఇతీష్యతే ధ్రువం. ४७९

తే. గీ. కల్ల వస్తువుల్ నిజమన నొల్లడతడు;
స్వప్న జగతి సమర్థింప జాలడింక;
నతడు మిథ్యార్థముల కొఱకాశపడియె
నేని? నిద్దుర లేవమియే నిజంబు.

నిద్ర మేల్కొన్నవాడు నిద్రలోని కలలో చూచిన మిథ్యా పదార్థాలన్నీ యథార్థాలని సమర్థించే దెక్కడా ఉండదు. అవన్నీ చేర్చి పెట్టుకుందామని ఎప్పుడూ అనుకోడు. ఒకవేళ అలా ఎవడైనా ఆ కల్ల వస్తువులను కోరుతున్నట్లైతే, అతడింకా నిద్రలోనే ఉన్నాడని అర్థం.

శ్లో. తద్వత్పరే బ్రహ్మణి వర్తమానః
సదాత్మనా తిష్ఠతి నాన్య దీక్షతే;
స్మృతి ర్యథా స్వప్న విలోకితార్థే
తథా విదః ప్రాశన మోచనాదౌ. 414

ఆ. వె. అటులె యాత్మ బ్రహ్మమందు లయించిన
యోగి కూడ చూడకుండు నితర;
మొకడు కలను చూచి యున్నవాటి స్మరించు
నట్లు యోగి ప్రాశ నాదు లరయు.

ఆ ప్రకారంగానే పరబ్రహ్మంలో లీనమై ఉండే యోగి కూడా-సర్వదా అసంగుడై చిద్రూపంగా ఉంటాడు కనుక – ఇతర ప్రపంచ వస్తువుల వంక చూడడు. ఐతే, బ్రహ్మవేత్తలైనా ఆహారపానీయాలూ మలమూత్ర విసర్జనలూ చేయక తప్పదు కదా? అది యెలా? అనే శంకకు సమాధానంగా ఉత్తరార్థం. జాగ్రదవస్థలో ఉన్నవాడు స్వప్నావస్థలో చూచిన వస్తువులను జ్ఞాపకముంచుకోవచ్చు. కాని అవి నిజమని అనుకోడు. అట్లే యోగి సైతం తిండి తీర్థాలూ మొదలైన దినచర్యలు నిర్వహిస్తాడు. కాని, తాను కర్తగా భావించడు. దేహం తన అవసరాలను తాను తీర్చుకుంటున్నదని అనుకుంటాడు. అందులో తనకేమీ సంబంధం లేదనుకుంటాడు. అజ్ఞాన దశలో మనిషికుండే దేహ తాదాత్మ్యం యోగికి లేదు కదా?

శ్లో. కర్మణా నిర్మితో దేహః – ప్రారబ్ధః తస్య కల్ప్యతాం
నానాదే రాత్మనో యుక్తం – నైవాత్మా కర్మ నిర్మితః. 415

ఆ. వె. కర్మచేత తనువు నిర్మితంబగుట, ప్రా
రబ్ధ మొప్పు తత్పరంబుగానె;
ఆత్మ కంట బెట్టుటదితగ; దెట్లన్న
కర్మ నిర్మితంబు కానిదాత్మ.

కర్మచేత యీ శరీరం నిర్మాణ మయింది. కనుక ప్రారబ్ధం అనే దాన్ని శరీరాని కన్వయించటం తగును; ఐతే, ఆత్మకా ప్రారబ్ధాన్ని అంటగట్టడం తగదు. ఎందుకంటే, ఆత్మ ఏకర్మచేతా నిర్మాణంకాలేదు.

శ్లో. అజో నిత్య ఇతి బ్రూతే - శ్రుతిరేషా త్వమోఘవాక్
తదాత్మనా తిష్ఠతోఽస్య - కుతరి ప్రారబ్ధ కల్పనా? ౪౬౦

తే. గీ. పుట్టనిది నిత్యమైనది పట్టిపోని
దాత్మ యనెడి నమోఘ వాక్యముల శ్రుతులు;
కనుక, నాత్మైక నిష్ఠుడౌ జ్ఞాని యెడల
నెట్లు ప్రారబ్ధ కర్మ నంటింపవచ్చు?

పుట్టుక లేనిదీ, ఎల్లప్పుడూ ఉండేదీ, కృశించి పోనిదీ, ఆత్మ - అంటూ శ్రుతులు అమోఘ వాక్కులతో ఘోషిస్తాయి. అలాంటి ఆత్మలీనమై ఉండే యోగికి, ప్రారబ్ధకర్మ నెలా అంట గట్టడం?

శ్లో. ప్రారబ్ధం సిద్ధ్యతి తదా - యదా దేహాత్మనా స్థితిః
దేహాత్మభావో నైవేష్టః - ప్రారబ్ధం త్యజ్యతా మతః. ౪౬౧

ఆ. వె. ఎంతదాక దేహమే తానొ? ప్రారబ్ధ
కర్మ మంతదాక కలుగుగాక!
యెఱుక కలుగువాని కెటులుండు దేహాత్మ
భావ? మందువలన వట్టిమాట!

దేహాత్మ భావంతో ఉండేవాడికే ప్రారబ్ధ కర్మ ఉంటుందని ఒప్పుకోవచ్చు. కాని, యెఱుక కలిగి ఆత్మానుభవమున్న యోగికి, దేహాత్మ భావంలేదని అందరికీ తెలుసుకదా? అటువంటప్పుడు ప్రారబ్ధ కర్మ అతడి విషయంలో నిరాకరించవలసిందే! ఉండటాని కవకాశమే లేదు.

శ్లో. శరీరస్యాపి ప్రారబ్ధ కల్పనా భ్రాంతిరేవహి
అధ్యాస్తస్య కుత స్సత్వ - మస త్వస్య కుతో జనిః ?
అజాతస్య కుతో నాశః - ప్రారబ్ధ మసతః కుతః ? ౪౬౨

శా. ప్రారబ్ధంబొక కల్పనేసః శరీరం బందు, నధ్యాసకే
యేరీతింగలదున్కి? పుట్టుటయు తానెట్లీ యసత్యంబు? జ
న్మే రానప్పుడు దాని చావెటులనో? మిథ్యా పదార్థంబుపై
ప్రారబ్ధం బదియెట్లు కార్యముఖమై రాజ్యంబు సాగించెడిన్ ?

శరీరానికైనా ప్రారబ్ధ కర్మమనే కల్పన కేవలం భ్రాంతిగానే కనిపిస్తుంది. అధ్యాసకు ఉనికి ఎలా ఉండ గలుగుతుంది? అబద్ధమైన దానికి పుట్టుక ఎలా ఉంటుంది? పుట్టుకే లేనిదానికి చావెలా వస్తుంది? కాబట్టి, మిథ్యా పదార్థం మీద ప్రారబ్ధం ఎలా పనిచేయగలుగుతుంది?

వేదాంత శాస్త్రం మామూలు మనిషికి విచిత్రంగానే అగుపడు తుంది. కాని, సత్యమేమో వేదాంతమే ! ఆత్మకు ప్రారబ్ధం లేదనేది ఇంతకు ముందే నిరూపిత మయింది. ఆత్మ జ్ఞాని శరీరానికి కూడా ప్రారబ్ధం లేదని యిప్పుడంటున్నారు. జ్ఞానికి తన శరీరం మీద ధ్యాసే ఉండటం లేదు. లోతుకుదిగి విచారించే కొద్దీ, అసత్యం బోధపడుతుంది.

త్రాటి మీద పాము ఆరోపింపబడినట్లే, ఆత్మ మీద దేహం ఆరోపింపబడింది. అజ్ఞాని మాత్రమే శరీరాన్ని తాననుకుంటాడు - భ్రాంతుడు మాత్రమే పామును చూచినట్లుగా. జ్ఞానికి శరీరం ఎక్కడ? మాయా నిర్మితం కనుక దానికే ఉనికే లేదు. ఆత్మ తప్ప తక్కినవన్నీ అసత్యమే! అసత్యమైన శరీరానికి పుట్టుకా, చావూ కూడా కల్పితమే ! ఐనప్పుడు ప్రారబ్ధం ఎలా పనిచేస్తుంది ?

శ్లో. జ్ఞానే నాజ్ఞాన కార్యస్య - సమూలస్య లయో యది
తిష్ఠత్యయం కథం దేహః - ఇతి శంకావతో జడాన్
సమాధాతుం బాహ్య దృష్ట్యా - ప్రారబ్ధం వదతి శ్రుతిః. ౪౬౩

శా. జ్ఞానం బెప్పుడొ మూల మట్టముగ నజ్ఞానంపు కార్యంబులన్
తానై భస్మము చేసినప్పుడిక గాత్రంబెట్లు జీవించి యుం
డేనో?-యంచడుగందొడంగు జడ సందేహంబు వారింప నీ
వైనంబౌ వ్యవహార దృష్టిని శ్రుతుల్ ప్రారబ్ధమం చాడెడిన్.

అజ్ఞాన కార్యాలన్నిటినీ(పంచ భూతాత్మక ప్రపంచమూ, అహంకారాది దేహాంతమూ) మూల మట్టంగా జ్ఞానం పెకలించి వేసినప్పుడింకా శరీరం బ్రదికే ఉండటమెలా సంభవం! -అంటూ మందబుద్ధులు సందేహిస్తుంటారు. అలాంటి వ్యవహార జ్ఞానమే కలిగిన అవివేకులను సమాధాన పరచటానికై శ్రుతులు, ప్రారబ్ధకర్మమనే పేరుతో వాళ్లను వశీకరించుకుంటున్నాయి.

యోగులకు అంతర్దృష్టేకాని, బాహ్యదృష్టి ఉండదనే సంగతి, మూఢులు గ్రహింపలేరు. కనుక ఇలాంటి సంశయాలుంటాయి.

శ్లో. నతు దేహాది సత్యత్వ - బోధనాయ విపశ్చి తాం
యతః శ్రుతేరభిప్రాయః - పరమార్థైక గోచరః. ౪౬౪

తే. గీ. శ్రుతులు ప్రారబ్ధమని చెప్పి చూపుటెల్ల
తనువు జ్ఞానికి సత్యమే ననుచు రూఢి
పఱచుటకు కాదు; శ్రుతులెల్ల పరమసత్య
మొక్కటేనని గట్టిగా నొక్కి పలుకు.

ఉపనిషత్తులు ప్రారబ్ధాన్ని విశదీకరించటమంతా, జ్ఞాని దేహం సత్యమని నిరూపించటానికి కానేకాదు. శ్రుతులన్నీ ఒకటైనా మినహాయింపు లేకుండా, పరమార్థ మొక్కటేనని గట్టిగా ఘోషిస్తున్నాయి కనుక.

ఇది ద్వైతుల మీద దెబ్బతీయుట మన్నమాటే! ద్వైతులెప్పుడూ ప్రారబ్ధాన్ని బలపరిచే శ్రుతివాక్యాలను మాత్రమే ఉదాహరించి, యోగికైనా ప్రారబ్ధం తప్పదని చెపుతూ - భౌతిక ప్రపంచమూ

బ్రహ్మమూ-రెండూ సత్యమేనని సమర్థిస్తుంటారు. ఆచార్య శంకరుడు ద్వైతుల కాళ్ళక్రింది పలకనే లాగివేస్తున్నాడు.

ఉపనిషత్తులలా అవివేకులైన వాళ్ళమీద దయతలచి, వాళ్లు మొదట మొదట ఇలా వాదించినా, క్రమక్రమంగా ఏకసత్యాన్ని గ్రహించే శక్తి సంపాదించుకోటానికై అవకాశమిస్తూ, ప్రారబ్ధ కర్మను అంగీకరించినాయి. ఏ సాధకుడైనా ఉపనిషత్తుల ఆవేదన - ఏకైక పరమార్థాన్ని-బ్రహ్మాన్ని-తెలుపటానికేనని సులభంగా గ్రహించగలడు.

## 465-471 ద్వైతం లేనేలేదు

శ్లో. పరిపూర్ణ మనాద్యంత - మప్రమేయ మ విక్రియం
ఏకమే వాద్వయం బ్రహ్మ - నేహ నానాస్తి కించన. ४६५

ఆ. వె. బ్రహ్మమొకటె కలదు, పరిపూర్ణమును, ననా
ద్యంత, మప్రమేయ, మక్రియంబు;
నద్వయంబు; దాని యందేరవంతైన
గాని, ద్వైతమేమి కానరాదు.

ఉండేది బ్రహ్మమొక్కటే! అది పరిపూర్ణం; రెండవపదార్థమే లేనిది; అనాద్యంతం - మొదలూ తుదీ లేనిది; అంటే, పుట్టుకా, చావూ లేనిదన్నమాట! అప్రమేయం-సాటిలేనిది; దేహ మనోబుద్ధుల కతీతం; అవిక్రితం -ఏ మార్పూ లేనిది. అద్వయం - సజాతీయ విజాతీయ భేదం లేనిది, నానాత్వం బొత్తుగా లేనిది.

శ్లో. సద్ఘనం చిద్ఘనం నిత్య - మానంద ఘన మక్రియం;
ఏకమేవా ద్వయం బ్రహ్మ - నేహ నానాస్తి కించన. ४६६

తే. గీ. సద్ఘనము చిద్ఘనంబును శాశ్వతముగ
నలరు నానంద ఘనమును నక్రియంబు;

బ్రహ్మ మొక్కటి మాత్రమే పరగు, నందు
ద్వైతమే కొంచెమేనియు తనరదెపుడు.

స్వరూప (ఉనికి) సారమూ, జ్ఞాన సారమూ, నిత్యానంద సారమూ, రెండవ పదార్థమేదీ లేనిదీ, ఏపనీ చేయనిదీ, బ్రహ్మమొకటి మాత్రమే కద్దు! అందులో ద్వైత మన్నేది ఏ కొంచెం కూడా లేదు.

బ్రహ్మ స్వరూపాన్ని కానీ, ఆత్మ(జీవుని)ను కానీ, ఇలా ఉంటుం దని చెప్పటం ఎవరికైనా కష్టమే! – చేతగాని పని. అది మాటలకూ మనసుకూ అందేది కాదు కనుక, సాధ్యం కాదన్నమాట! ఐతే, ఒక విధంగా సూచించవచ్చు! "ఒక సూర్యుండు సమస్త జీవులకు తానొ క్కొక్కడై తోచు పోలిక" – అంటుంది భాగవతం. ఉండే దొక్కడే సూర్యుడు! ఐతే, దహరాకాశంలో జ్ఞానుల కొక్కొక్కడై కనపడ తాడు. అలాగే, ఆత్మ ఎవరంతటవాళ్ళకు వేఱువేఱుగా కానరావచ్చు! కాని, విశ్వమంతా వ్యాపించి ఉండే ఆత్మ-బ్రహ్మం-ఒక్కటే!

ఆత్మ బోధలో – "ఆత్మ చైతన్య మాశ్రిత్య దేహేంద్రియ మనోధియః; స్వ క్రియార్థేషు వర్తంతే సూర్యలోక యథా జనాః" – ఆత్మ చైతన్యం మీద ఆధారపడి, దేహమూ, ఇంద్రియాలూ, మనసూ బుద్ధీ, తమ తమ పనుల్లో వర్తిస్తాయి. సూర్యకాంతి మీద ఆధారపడి జనులు తమతమ పనుల్లో నిమగ్నులైనట్లుగా–అని వివరింపబడింది.

ఇక్కడ ఈ శ్లోకంలో సద్ఘనం, చిద్ఘనం, నిత్యానంద ఘనం – అనే సూచన చూడండీ! స్థూల శరీరంలో సద్ఘనం (ఉనికి) – సూక్ష్మ శరీరంలో చిద్ఘనం (జ్ఞానమూ) – కారణ శరీరంలో నిత్యానందమూ– కాబట్టి, ఆత్మ సచ్చిదానందం! సత్తూ, చిత్తూ, ఆనందాల మొత్తమే పర బ్రహ్మ మన్నమాట! అక్రియం–ఏపనీ చేయదు – కాని, అన్ని పను లకూ సాక్షిగా ఉంటుంది. ఆయా శరీరాలనే మాత్రం అంటదు. అందు వల్ల ఆత్మ మాత్రమే సత్యం–అందులో ద్వైతం లేనేలేదు.

శ్లో. ప్రత్యగేక రసం పూర్ణ - మనంతం సర్వతోముఖం;
ఏకమేవా ద్వయం బ్రహ్మ - నేహ నానాస్తి కించన. ౪౬౭

ఆ. వె. ప్రత్యగేక రసము పరిపూర్ణమును నవం
తంబు సర్వతో ముఖంబు నేక
మద్వయంబు బ్రహ్మమది మాత్రమే యుండు;
ద్వైత మించుకైన దానలేదు.

అందరిలోనూ కర్త; సాక్షీ స్వరూపం; అనృత జడ దుఃఖాత్మకమైన యీ ప్రపంచం కంటే విలక్షణమైనది. రెండవ పదార్థం లేనిది. సర్వ సమానం. అంతు లేనిదీ, అంతటా వ్యాపించినదీ; ఒకే బ్రహ్మమే ఉండేది. అందులో అద్వైతం ఏకొంచమైనా లేదు.

శ్లో. అహేయమను పాదేయ - మనాదేయ మనాశ్రయం
ఏకమేవా ద్వయం బ్రహ్మ - నేహ నానాస్తి కించన. ౪౬౮

తే. గీ. విడుచుటకు తీసికొనుటకు పడయుటకును
రాని, రెండవ దేదియులేని, యట్టి;
దాశ్రయములేక వెలుగునదైన బ్రహ్మ
మొకటె కల; దందు ద్వైతమే ఉండ దెపుడు.

ఎవరికి వారిలో స్వస్వరూపంగా ఉండేది కనుక, విడువరానిది; క్రొత్తగా తీసుకునేదికాదు; స్వభిన్నంగా లేదు కాబట్టి, పొందటానికి వీలైనది కాదు. తానే అన్నిటికీ అధిష్ఠానం కనుక, ఆశ్రయం ఇంకొకటి లేనిది. అహేయం -అంటే ఏ దోషాలూ లేనిది; అనుపాదేయం-అంటే నిర్గుణం; అని కూడా అర్థం చేసుకోవచ్చు.

శ్లో. నిర్గుణం నిష్కలం సూక్ష్మం - నిర్వికల్పం నిరంజనం
ఏకమేవా ద్వయం బ్రహ్మ - నేహ నానాస్తి కించన. ౪౬౯

తే గీ. లేవు గుణములు, భాగముల్ లేవు, సూక్ష్మ
మును ప్రపూర్ణము దేనినంటనిది బ్రహ్మ

మద్వయం బొక్కటే! కల; దందులోన
ద్వైత మనునది మఱి రవంతయునులేదు.

గుణాలు కొత్తగా లేవు, అవయవాలు అంతకంటే లేవు; కాబట్టి మిక్కిలి సూక్ష్మం; వికల్పాలుండవు; దేన్నీ అంటదు. రెండవదేదీ లేక ఉండేది బ్రహ్మ మొక్కటి మాత్రమే! దానిలో ద్వైతం రవంతైనా లేదు. కనపడే భేదాలన్నీ అజ్ఞానంలో స్ఫురించేవే! పరిపూర్ణమూ, నిర్మలమూ.

శ్లో. అనిరూప్య స్వరూపం య - న్మనో వాచామ గోచరం;
ఏకమేవా ద్వయం బ్రహ్మ - నేహ నానాస్తి కించన. ౪౭౦

క. అని రూప్యమైన రూపం
బును; మనసుకుమాట కందబోని స్వభావం
బును, నద్వయంబు బ్రహ్మం
బన నొకటే వెలుగు! ద్వైత మలరదు దానన్.

నిరూపించరాని రూపంకలదీ, మనసుకూ మాటకూ అందు బాటులో లేనిదీ, అద్వయమూ ఐన బ్రహ్మం ఒకటి మాత్రమే! అందులో ద్వైత మనేది ఏమీ ఉండదు.

అది రూప్యం - ఇలాంటిదని ఏమీ అర్థం కానిది; మనోవాచా మగోచరం - మనసూ మాటా బ్రహ్మం వల్లనే వెలుగుతాయి కనుక, ఆ రెండిటికీ అందదన్నమాట!

శ్లో. సత్సమృద్ధం స్వతస్సిద్ధం - శుద్ధం బుద్ధ మనీ దృశం
ఏకమేవా ద్వయం బ్రహ్మ - నేహ నానాస్తి కించన. ౪౭౧

తే. గీ. తనకు తానున్కి; సాక్షియు తనకు తానె;
నిర్మల జ్ఞాన; మేది లేనిది - సమాన;
మద్వయము బ్రహ్మ మొక్కటే! యలరు; దాని
యందు ద్వైతము మందునకైన లేదు.

పరిపూర్ణమైన ఉనికి (త్రికాలాబాధ్యం); స్వయంసాక్షి (అన్ని ప్రమాణాల ప్రవృత్తికీ కారణం; ఇంకొక ప్రమాణంచేత సిద్ధమయ్యేది కాదు); నిర్మల జ్ఞానం; సమానం లేనిది; రెండవదేదీ లేనిది; బ్రహ్మ మొక్కటే ! అందులో లేశమైనా ద్వైతం లేదు.

సత్-సమృద్ధం-ఏ ఉపాధులతోనూ సంబంధం లేకుండా అంతటా తనకుతానే ఉనికిగా ఉండేది. అసీ దృశం - అంతవంతమైన ఏ వస్తువు తోనూ పోలిక లేనిది. బుద్ధం - జ్ఞానం; పరిపూర్ణ జ్ఞానస్వరూప మన్న మాట !

## 472-479 ఆత్మానుభవం

శ్లో. నిరస్త రాగా వినిరస్త భోగాః
శాంతాస్సు దాంతా యతయో మహాంతః
విజ్ఞాయ తత్వం పరమేత దంతే
ప్రాప్తాః పరాం నిర్వృతి మాత్మ యోగాత్. ౪౭౨

తే. గీ. రాగ భోగాల మీద విరక్తి జెంది
శాంతి దాంతులు కలిగిన సజ్జనాళి
తగిన యత్నముచేత తత్వము గ్రహించి
దీని ఫలముగ గాంత్రు విదేహ ముక్తి.

అన్ని కోరికలూ మానుకున్న వాళ్లూ, విషయ భోగాలను విసర్జించిన వాళ్లూ, విరామంగా ఉండే వాళ్ళూ, ఇంద్రియ నిగ్రహాన్ని సాధించిన వాళ్ళూ, ఐన ఉత్తములు ఈ బ్రహ్మ తత్వాన్ని బాగా తెలుసుకుంటారు. ఆ ఎఱుక ఫలితంగా దేహాంతంలో ముక్తిని పొందు తారు.

ఇంత వఱకూ ఆత్మ స్వభావాన్ని వివరించి, ఇప్పుడు బ్రహ్మాను భవాన్ని గుఱించి కొన్ని సూచనలిస్తున్నాడు గురుదేవుడు, సాధకునికి వీలుగా. నిరస్త రాగాః - ఏ కోరికలూ ఎంతమాత్రం లేనివాళ్లు; విన

రక్త భోగాః-భోగాలన్నిటినీ మానుకున్న వాళ్లు; అవసరాలు మాత్రమే తీర్చుకునే వాళ్లు. శాంతాః-మనసు నిర్మలంగా ఉండేవాళ్లు; సుదాంతః - జరిగిపోయిన అనుభవాలను జ్ఞాపకానికి తెచ్చుకోకుండా ఉండగల వాళ్లు. మహాంతః - ఉదార హృదయులైన ఉత్తములు. యతయః - ప్రయత్నం కొనసాగించే వాళ్లు, ఆత్మ యోగంతో విదేహ ముక్తి పొందుతారు.

శ్లో. భవాన పీదం పరతత్వ మాత్మనః
స్వరూప మానంద ఘనం విచార్య;
విధూయ మోహం స్వమనః ప్రకల్పితం
ముక్తః కృతార్థో భవతు ప్రబుద్ధః. ౪౭౩

ఆ. వె. ఈవుసైత మిట్లె యీ పరతత్వ, మా
నంద ఘనము, నాత్మ నైజ మరసి;
బుద్ధి కల్పితంబు మోహంబు తెగనాడి
ముక్తుడవు కృతార్థ మూర్తివగుము!

నీవు కూడా ఈ పరతత్వాన్ని బాగా విచారించి, ఆత్మ-ఆనంద ఘనమైన నీ స్వస్వరూపంగా తెలుసుకొని, నీ మనస్సుచేత నీవే కల్పించుకున్న అధ్యాసను తెగతెంపులు చేసుకొని, ముక్తుడవూ, జన్మసార్థకం చేసుకున్నవాడవూ, అగుదువు గాక!

ఈ సంసారమంతా నీకై నీవు సృజించుకున్నదే! అధ్యాసవల్ల ఇదంతా జరిగింది. సత్యం తెలుసుకొని ఎందరో తరించినారు. ఇప్పుడు నీవు కూడా అదే మార్గాన్ని అవలంబించు! ఈ దేహాదివి నీవు కాదని గట్టిగా తెలుసుకో! ఆనందాత్మకమైన ఆత్మవు నీవు. అధ్యాస రూపకమైన బంధాన్ని త్రెంచుకొని, మర్త్య లక్షణాలు విడిచిపెట్టి, అమరుడవని గుర్తించి, మహత్తరమైన జ్ఞానాన్ని పొంది, జన్మ సార్థకం చేసుకో! అని గురువు శిష్యుడికి బోధిస్తున్నాడు.

శ్లో. సమాధినా సాధు వినిశ్చలాత్మనా
పశ్యాత్మ తత్వం స్ఫుట బోధ చక్షుషా;
నిస్సంశయం సమ్యగవేక్షిత శ్చేత్
శ్రుతః పదార్థో నపునర్వి కల్ప్యతే. ४८४

తే. గీ. మనసు నిశ్చలమైన సమాధి యందు
చూడు! సత్యాత్మ జ్ఞాన చక్షువున సరిగ;
శ్రుత పదార్థము సంశయ శూన్యమేని?
మఱల సందేహమనియెడి మాటరాదు.

మనసు ఏకాగ్రంగా నిలిచి పోయిన సమాధి ద్వారా, జ్ఞాన నేత్రంతో సత్యమైన ఆత్మను చూడు! నిస్సంశయంగా నీకు గురువు బోధించిన శ్రుతి వాక్యాల కర్థం బాగా తెలిసిపోయి ఉండినట్లైతే, మళ్ళీ సందేహానికింక ఆస్పదం ఉండదు.

శ్రుత పదార్థం – అంటే, తత్వమసి– అదే నీవు – మొదలైన మహావాక్యాల కర్థమన్నమాట! గురువు బోధించి ఉన్నందున బాగా తెలుస్తుంది. అప్పుడీ కండ్లతో కాక, మనో నేత్రంతో సత్యాన్ని చూడటం అలవాటవు తుంది నిరంతర ధ్యానంతో సమాధి ఏర్పడుతుంది. పరవశత్వం కలుగుతుంది.

శ్లో. స్వస్యా విద్యా బంధ సంబంధ మోక్షాత్
సత్య జ్ఞానానంద రూపాత్మ లబ్ధౌ;
శాస్త్రం యుక్తి ర్దేశికో క్తిః ప్రమాణం
చాంతః సిద్ధా స్వానుభూతిః ప్రమాణం. ४८५

తే. గీ. సత్యమును జ్ఞాన మానందసార మాత్మ
లబ్ధి, కజ్ఞాన బంధములను విదల్చు
కొనుటయే దారి; శ్రుతి- యుక్తి- గురునిబోధ
యును ప్రమాణము; లను భవమో? మఱొండు.

సొంతంగా అవిద్యా బంధాల సంబంధాన్ని త్రెంచుకోటం వల్లనే సత్యమూ జ్ఞానమూ ఆనందమూ – ఐన ఆత్మ దర్శనం లభిస్తుంది. ఇందుకు ప్రమాణాలు – శాస్త్రమూ, విమర్శా, గురువాక్యమూ. మనసు నేకాగ్రంచేసి ధ్యానించి సమాధిలో ఉండటంవల్ల కలిగే స్వానుభవం ఇంకో ప్రమాణం !

అవిద్యా బంధ సంబంధ మోక్షాత్ – అజ్ఞానం, లేక అధ్యాస వల్ల కలిగిన బంధాల సంబంధం నుంచీ విముక్తే, మోక్షంగా చెప్ప బడుతుంది. అజ్ఞానంలో ఉన్నంత వరకూ అన్నీ దుఃఖాలే ! ఆత్మ దర్శనం లభిస్తే అవన్నీ అంత మౌతాయి. అదొక్కటే సత్యమూ, జ్ఞానమూ, ఆనందమూ కదా? ఈ యాత్మ జ్ఞానానికి ప్రమాణాలు (1) శ్రుతీ (శాస్త్రమూ) (2) యుక్తీ (విమర్శా) (3) గురు వాక్యమూ. శ్రుతి, నీవు బ్రహ్మమేననీ, నానాత్వమంతా అబద్ధమనీ, ప్రకటిస్తుంది. దాన్ని గురించి నీవు తర్కించి సత్యం గ్రహించవలసి ఉంటుంది. బంధా లన్నీ నీవు సొంతంగా తెచ్చుకున్నవేననీ, నీ మనసే వీటిని సృజించు కున్నదనీ, కాబట్టి అబద్ధమనీ విమర్శించు కోవటం వల్ల బ్రహ్మ జ్ఞానా నికి అవకాశ మేర్పడుతుంది గురువు నీకెప్పుడూ ఆప్తుడే కనుక,ముక్తుడు. కనుక ఆయన మాట ప్రమాణమౌతుంది. ఈ మూడూఉండినా,స్వాను భవంతో ఆత్మదర్శనం లభిస్తేనే మనసుకు తృప్తి; కనుక, అది అన్నిటి కంటే ఉత్తమ ప్రమాణం ! సత్యం ప్రత్యక్షమౌతుందిగా ?

శ్లో. బంధో మోక్షశ్చ తృప్తిశ్చ – చింతా రోగ్య క్షుధా దయం
స్వేనైవ వేద్యా యద్ జ్ఞానం – పరేషా మాను మానికం. ౪౭౬

తే. గీ. బంధమును, మోక్షమును, తృప్తి పడుట, చింత
అకలియును- నారోగ్యంబు, నాదియైన
వెల్ల సొంతము తానె గ్రహింప గలుగు;
పరుల కీయవి అనుమాన భాజనములు.

బంధమూ, మోక్షమూ, తృప్తీ, విచారమూ, రోగ విముక్తీ, ఆకలీ – మొదలైన వన్నీ తనకు తానే స్పష్టంగా తెలుసుకునేవి. ఇత రుల కివి అనుమానం వల్ల తెలిసేవే!

బంధమూ, మోక్షమూ, తృప్తీ – అనేవి స్వానుభవం ద్వారా విచారమూ, ఆరోగ్యమూ, ఆకలీ మొదలైన వాటివలెనే తెలుసుకో గలిగినవి. నా కాకలైతే నీవన్నం తింటావా? నావిచారం నీకర్థమా తుందా? నాకు జబ్బుచేస్తే నీవు మందులు త్రాగుతావా? అలాగే నీ బంధ మోక్షాలు నీకే అర్థమౌతాయి కాని, ఇతరుల కర్థంకావు. తనదు కాలుగోయ తన తమ్ముడేడ్చునా?–అంటాడు వేమన.

శ్లో. తటస్థితా బోధయంతి – గురవః శ్రుతయో యథా
ప్రజ్ఞైవ తరే ద్విద్వాన్ – ఈశ్వరాను గ్రహీతయా. 478

ఆ. వె. గురులతోడ శ్రుతులు కూడ తటస్థమై
యుండి బోధ సలుపు చుంట కలదు;
ప్రజ్ఞచేత తెలిసి పరమేశ్వరాను గ్ర
హంబుచేత నాత్మనరయు నరుడు.

గురువులు శిష్యుడికి పరోక్షంగా బోధించటం మామూలు. ఇట్లా చెయ్యి, అట్లా చెయ్యి! అందువల్ల బాగు పడగల మంటూ సూచన లివ్వగలరు. శ్రుతులు కూడా అంతే! సత్యమే పలుకు! ధర్మంగా ప్రవ ర్తించు! అంటూ సూచిస్తాయి. పరోక్షంగా శిష్యుడు స్వప్రయత్నంతో అపరోక్ష జ్ఞానాన్ని అలవఱచుకొని, భగవదనుగ్రహంతో అవిద్యా బంధాలను త్రెంచుకొని, తరిస్తాడు. నిరంతరం చిదాకార వృత్తిలో ఉండి తనకు తానే తరింపవలసి ఉంటుంది. అందుకు దైవానుగ్రహం ఒక్కటే ఆధారం. మన పూర్వ వాసనలను నిశ్చయించి, ఆజ్ఞాపించి. మన జీవితాలను క్రమ పద్ధతిలో దిద్ది తీర్చేవాడు, ఈశ్వరుడు. మన హృదయంలోనే ఉంటాడు. నిజానికి వాసనల మొత్తమైన కర్మయే దేవుడు.

శ్లో. స్వానుభూత్యా స్వయం జ్ఞాత్వా - స్వమాత్మాన మఖండితం;
సంసిద్ధః సమ్ముఖం తిష్ఠే - న్నిర్వికల్పాత్మ నాత్మని. ౪౭౮

ఆ. వె. స్వానుభవము వలన స్వయముగా నాత్మన
ఖండితముగ తెలియ గలిగి నిర్వి
కల్పుడగుచు తాముఖాముఖి నాత్మను
చూడవలయు ద్వైత శూన్యు డగుచు.

శ్లో. వేదాంత సిద్ధాంత నిరుక్తి రేషా
బ్రహ్మైవ జీవః సకలం జగచ్చ;
అఖండ రూప స్థితిరేవ మోక్షో
బ్రహ్మ ద్వితీయే శ్రుతయః ప్రమాణం. ౪౭౯

తే. గీ. ఎల్ల వేదాంత సిద్ధాంత మిదియె; జీవు -
డఖిల విశ్వంబు బ్రహ్మమే! ఐక్య మగుట
బ్రహ్మ మందున స్వస్వరూపంబు ముక్తి;
అద్వయం బని చాటు బ్రహ్మంబు శ్రుతులు.

వేదాంత సిద్ధాంత మంతా వెల్లడించే అభిప్రాయమేమంటే, జీవుడూ, ఈ సమస్త ప్రపంచమూ, బ్రహ్మమే తప్ప వేఱుకావు. మోక్షమంటే, ఆ యఖండ బ్రహ్మంలో స్వస్వరూపాన్ని ఐక్యం చేసి ఉండ గలగటమే! - అని. బ్రహ్మం అద్వితీయమనటానికి ప్రమాణం శ్రుతి.

శ్రుతులంటే వేదాలూ, ఉపనిషత్తులూ. ఒక్కో- వేదానికి కడపట కొన్ని ఉపనిషత్తులు పుట్టినాయి. ఐతే, వేదాలు అపౌరు షేయాలు-ఉపనిషత్తులు ఋషి ప్రోక్తాలు.

మామూలుగా వేదాలన్నీ ప్రవృత్తి మార్గానికి (కర్మకాండకు) సంబంధించినవి. ఉపనిషత్తులు నివృత్తి మార్గానికి (జ్ఞానకాండకు) సంబంధించినవి.

గురుదేవుడు శిష్యుడి కోసం - వేదాంత సిద్ధాంత సారాన్ని సంగ్రహించి చెపుతున్నాడు. ముఖ్యంగా తెలుసుకోవలసిందేమిటంటే :— (1) ఒక్కొక్క శరీరిలో ఆత్మ ప్రతిబింబంగా ఉండే జీవుడు కూడా బ్రహ్మమే ! (2) నానాత్వంతో కూడి ఉండేట్టు మన స్థూల దృష్టికి కనిపించే ఈ సమస్త విశ్వమూ బ్రహ్మమే! (3) ద్వైత మనేది లేశ మాత్రమైనా లేని ఈ బ్రహ్మంలో అఖండంగా కలిసి పోవటమనేదే మోక్షం. ఇందుకు ప్రమాణం శ్రుతి - ఉపనిషత్తులే! ఈ మోక్షమనేది సొంతంగా అనుభవించి తెలుసుకోదగిందే !

## 480-520 యోగానుభవాలు

శ్లో. ఇతి గురువచనాత్ శ్రుతి ప్రమాణాత్
పరమవగమ్య సతత్వ మాత్మ యుక్త్యా
ప్రశమిత కరణః సమాహితాత్మా
క్వచి దచలాకృతి రాత్మనిష్ఠతోఽభూత్. 480

ఉ. ఈ గురుబోధ నంతయు గ్రహించి; తలంచి శ్రుతి ప్రమాణముల్;
బాగుగ నాత్మ తత్వమును స్వాంతము నందు మథించి; శిష్యుడున్
వేగ శుభస్మరంబయినవేళ మనంబును నింద్రియాలొకే
లాగున నిగ్రహించి; యచలత్వమునొందె సమాధి నిష్ఠుడై.

ఉపనిషద్విజ్ఞానంతో కూడిన గురుదేవుని బోధచేతనూ, ఉపనిషత్తుల ప్రమాణాల చేతనూ, తాను సొంతంగా తత్వ విచారంచేసి, ఆ శిష్యుడు బాగా పరబ్రహ్మ తత్వాన్ని అర్థం చేసుకున్నాడు. ఇలా ఎఱుకగలవాడై ఒకానొక శుభముహూర్తాన, మనస్సును ఏకాగ్రంగా నిలుపుకున్నాడు. కండ్లూ ముక్కూ చెవులూ మొదలైన బాహ్యేంద్రియాలన్నిటినీ నిగ్రహించి, నిర్వ్యాపారం చేసుకున్నాడు. అంతఃకరణాన్ని పరబ్రహ్మంలో ఐక్యంచేసి, నిశ్చలంగా ఉండ గలిగినాడు. అంతట సమాధి కుదిరినట్లయింది.

212వ శ్లోకంలో శిష్యుడు గురువునడుగుతాడు. దేవా! నిజాలు కాని పంచకోశాలను నేను కాదని నిరాకరించి చూడసాగితే, ఏమీ కానరాదే? కనపడే దొక గుండుసున్న మాత్రమే! ఇంక నేను అనుభవించేదేమిటి? శూన్యాన్ని నేనెలా అనుభవించటం?

అప్పుడు గురుదేవుడు 213 శ్లోకం నుంచీ బోధించటం ఆరంభించి 479 శ్లోకంతో ముగించినాడు. ఆఖరున ఉపనిషత్తుల అభిప్రాయాలను టూకీగా విశదీకరించినాడు.

ఇదంతా ఆలకించిన తర్వాత, మననం చేసుకున్నాడు. లోలోపల బాగా తర్కించుకున్నాడు. పరోక్షంగా నిస్సంశయంగా సత్యం తెలిసి పోయింది. వెంటనే మనస్సును ఏకాగ్రంగా నిలిపి, ఇంద్రియాలను నిగ్రహించి, ధ్యానంలో పడినాడు. అపరోక్ష జ్ఞానం అనుభవానికివచ్చింది. ఆత్మలో మనసు లీనమయ్యే సరికి స్తంభించిపోయి, సమాధిలో ఉండ గలిగినాడు. ఇలాంటి శిష్యుడు లోకంలో అరుదేమో? ఒకొక్కరు కొన్ని సంవత్సరాల తరబడి అభ్యాసం చేస్తేనే కాని, యీ సమాధి కుదురదు.

శ్లో. కించిత్కాలం సమాధాయ - పరే బ్రహ్మణి మానసం
ఉత్థాయ పరమానందా - దిదం వచన మబ్రవీత్. ౪౮౧

తే. గీ. ధ్యానముంచి పరబ్రహ్మమందు కొంత
కాలముండి సమాధిలో; కడకులేచి
గురువు కడ పరమానంద భరితుడగుచు
శిష్యుడీ రీతిగా తాను చెప్పసాగె.

కొంత కాలం దాకా మనసును పరబ్రహ్మం మీదనే ఉంచి, ధ్యాన నిమగ్నుడై ఉన్న తరువాత, శిష్యుడు సమాధి నుంచీ లేచి, పరమానంద భరితుడై ఇలా మాట్లాడసాగినాడు.

కొంత కాలమంటే, అదెంత కాలమో తెలియదు. సమాధిలో కాలమానానికి స్థానంలేదు. సమాధిలో రమణ మహర్షి ఎన్నో సంవత్సరాల కాలం అలాగే ఉండిపోయి నాడని ప్రతీతి. ఆయన దేహమంతా చీమలు పట్టిపోతే, నూనె రాచి, ఉడుకు నీళ్లుపోసి, కడిగితే స్పృహ వచ్చిందట! శ్రీ రామకృష్ణ పరమహంస ఒకోక్కసారి ఒళ్లు తెలియకుండా పడిపోతే, అన్నరసం పట్టించేవాళ్ళట! – వారాలకొద్దీ!– ఇలా ఈ శిష్యుడెంత కాలానికి లేచినాడో! లేవగానే ఆనందం పట్టలేక తన అనుభవాలు గురువుతో విన్నవించుకున్నాడు.

శ్లో. బుద్ధి ర్వినష్టా గళితా ప్రవృత్తిః
బ్రహ్మాత్మనో రేకతయాధి గత్యా
ఇదం న జానేఽప్య నిదంనజానే
కిం వా కి యద్వా సుఖమాత్మపారం. ౪౮౨

తే. గీ. ఆత్మ బ్రహ్మమునందైక్య మంది నంత
బుద్ధియు ప్రవృత్తియును లేకపోయె నాకు;
నిదియు–నిదికాదటన్నదే – యెఱుగ నైతి;
నాత్మ సుఖపారమేమి? యెంతని వచింతు?

ఓ గురుదేవా! నేనెంతగా మారిపోయి నానోనాకే తెలియదు. నాకంటే అన్యపదార్థమేదీ ఎక్కడా కానరావటంలేదు. నా యాత్మను బ్రహ్మంతో ఐక్యం చేసినందువల్ల – కట్టెలు లేక అగ్ని చల్లారిపోయి నట్టు–విషయం లేనందుచేత – బుద్ధే మాయమై పోయింది. దానితో ప్రవృత్తి కూడా నశించి పోయింది. ఇది ప్రత్యక్షమూ–ఇదిపరోక్షమూ అనే దెంత మాత్రం అర్థం కావటంలేదు. అనంతమైన ఆత్మానందానుభవాన్ని – ఎంతా ఏమిా అని తెలుపలేక పోతున్నాను. ఆ సుఖానికొక హద్దూ పద్దూ ఉండటం లేదు. దేశ–కాల–వస్తుపరిచ్ఛేదం ఎంత మాత్రంలేని పరమసుఖాన్ని అనుభవిస్తున్నాను.

శ్లో. వాచావక్తు మశక్యమేవ మనసా - మంతుం నవాశక్యతే
స్వానందామృత పూర పూరిత - పర బ్రహ్మాంబుధే ర్వైభవం
అంభోరాశి విశీర్ణ వార్షిక శిలా - భావం భజన్మే మనో
పశ్యాంశాంశలవే విలీన మధునాఽ - నందాత్మనా నిర్వృతం. ౪౮౩

శా. స్వానందామృత పూరపూరిత పరబ్రహ్మాబ్ధి వైభోగమే
మైనన్ మాటకు మానసంబున కశక్యం బద్భుతం బర్థమే
కానట్లుండె; పసందుగా మనసు మగ్నంబాయె లేశాంశమై;
న్యూనంబౌ వడగల్లు వార్ధివలె; నిండున్ తృప్తి నాకీ యెడన్.

గురువర్యా ! తమ యానతి ప్రకారం ఏకాంత ప్రదేశంలో కూర్చుండి కొంత సేపటికి సమాధిలో పడినాను. ఎంతకాలం అలా ఉండిపోయినానో తెలియదు. బ్రహ్మసాక్షాత్కారం అయింది. అది అపారమైన ఆనందసాగరం. అందులో ప్రత్యగాత్మల ఆనంద రసామృత ప్రవాహాలెన్నో వచ్చి పడుతున్నట్లు తోచింది. ఆత్మానందమనే అమృతం పొంగి పొరలే ఆ బ్రహ్మసాగర వైభవాన్ని మాటలతో వర్ణించటం సాధ్యమేకాదు. మనసు అనుభవించటమూ అశక్యమేనేమో ? ఆయనంతలో లవలేశమైన మనస్సు - సముద్రంలో పడిన వడగల్లువలె కరిగిపోయింది సుమా ! ఇంత తృప్తి — ఇంత హాయి - నా జన్మలో నేనెప్పుడూ అనుభవించి యెఱుగను. ఎంతసేపటికి నేను సమాధి నుంచీ లేచినానో ? తమ సన్నిధానానికి చేరుకున్నాను.

శ్లో. క్వగతం కేనవానీతం - కుత్ర లీన మిదం జగత్
అధునైవ మయా దృష్టం - నాస్తికిం? మహదద్భుతం. ౪౮౪

ఆ. వె. ఎక్కడకును పోయె ? నెవడు దీని హరించె ?
నెచట మాయమాయె నీ జగంబు ?
నేనె యిపుడు చూచి నానింతలోన నే
మాయెనొక్కొ? అదు తాద్భుతంబె!

ఓ గురుదేవా ! ఆ నా సమాధి కాలంలోని ఆనంద దశలో ఈ దృశ్య ప్రపంచమంతా ఎక్కడికి పోయింది? ఎవరు దీన్ని హరించినారు? ఈ విశ్వమంతా ఎందులో లీనమయింది? ఇప్పుడిప్పుడే కదా మళ్ళీ కాన వస్తున్నది? అంతలో ఏమయింది? ఎంత మహాద్భుతం? సమాధిలో రూపాలూ, నామాలూ నశించి కేవల బ్రహ్మమే గోచరించింది. ఈ కంటితో నేను మొదట చూస్తూ ఉండిన ప్రపంచమే అద్భుత మను కుంటే, అది మాయమై పోవటం మరింత అద్భుతం ! ఈ క్రొత్త అనుభవం అద్భుతాద్భుతం సుమా !

శ్లో. కిం హేయం? కిముపాదేయం ?
కిమన్యత్కిం విలక్షణం ?
అఖండానంద పీ యూష -
పూర్ణే బ్రహ్మ మహార్ణవే. ౪౮౬

ఆ. వె. అమృత సమ మఖండమైన యానంద మ
యంబు బ్రహ్మమను మహార్ణవమున;
నేది విడువ దగిన? దేదిగైకొన దగ్గ ?
దేది యితర ? మితరమేది కాదు ?

అఖండానందమనే అమృతంతో నిండిన బ్రహ్మ మహాసాగరంలో ఏది విడిచిపెట్టదగిందో ? ఏది తీసుకోదగిందో ? ఏది అన్యమో ? ఏది విలక్షణమో ? ఏమీ తెలిసిందికాదు.

[ఉండేదే ఒకటే అనంతమైన బ్రహ్మ సముద్రం. అందులో తానూ లీనమై పోయినాడు. అటువంటప్పుడు విడవటానికీ, తీసుకోటా నికీ, ఇదీ-అదీ-అనుకోటానికీ, అవకాశ మేముంటుందీ?

శ్లో. నకించి దత్ర పశ్యామి - న శృణోమి నవే ద్మ్యహం
స్వాత్మనైవ సదానంద - రూపేణాస్మి విలక్షణః. ౪౮౭

క. సకలమునకు ప్రత్యేకం
బొకడ సదానందమూర్తి యుతస్వాత్మగనై
నికరముగ నుండి; యేమియు
నిక చూడను, వినను, తెలియ నించుకయు, గురూ !

గురుదేవా ! నేను పంచకోశ విలక్షణుడనై సచ్చిదానందమయమైన స్వస్వరూపం చూచుకుంటున్నాను. ఇందులో నేనేమీ చూడను, వినను; తెలియను.

ధ్యానంలో ఉపాధు లేవీ లేని స్థితిలో-మనసూ బుద్ధీ పనిచేయక ఉండినప్పుడు, కేవలం ఆత్మగా నేనుండి, సదానందాన్ని అనుభవిస్తూ అంతవంతమైన అభిప్రాయాలు ఏవీలేని ఎఱుకలో - కృతకృత్యుడనై ఉన్నాను.

శ్లో. నమో నమస్తే గురవే మహాత్మనే
విముక్త సంగాయ సదుత్తమాయ
నిత్యాద్వయానంద రస స్వరూపిణే
భూమ్నే సదాఽపార దయాంబు ధామ్నే ! ४८८

తే. గీ. మ్రొక్కెదను పలుమాఱు గురూ ! మహాత్మ !
సంగ ముక్త ! మహోదార జనవరేణ్య !
అద్వయానంద నిత్య రసావతార !
అంతులేని అపార దయాసముద్ర !

ఓ మహాత్మా ! సద్గురూ ! ఏ యపేక్షలూ లేనివాడా ! ఉదార హృదయుల్లో ఉత్తముడా ! శాశ్వతమూ అద్వయమూ ఐన ఆనంద మూర్తీ ! ఎప్పుడూ అంతులేని హద్దులులేని దయాసముద్రుడా! నీ కనేక నమస్కారాలు, స్వామీ !

"భావాద్వైతం సదా కార్యం - క్రియాద్వైతం నకుత్రచిత్
అద్వైతం త్రిషులోకేషు - నాద్వైతం గురుణా సహ."

అనే ప్రమాణాన్ని బట్టి, గురువుకు వినయవిధేయుడై మొక్కులు చెల్లిస్తున్నాడు, శిష్యుడు.

శ్లో. యత్కటాక్ష శశిసాంద్ర చంద్రికా -
పాత ధూత భవతాపజ శ్రమః;
ప్రాప్తవానహ మఖండ వైభవా
నంద మాత్మపద మక్షయం క్షణాత్. ౪౮౬

ఆ. వె. నీ కటాక్షమనెడి నెల వెన్నెలలను సం
సారతాపజ మగు శ్రమ హరించె;
ప్రాప్తమాయె పూర్ణవైభవానందమౌ
నాత్మ పదవి యక్షయముగ త్రుటిని.

పరిపూర్ణ చంద్రకిరణ కాంతి వంటి నీ కటాక్షంచేత, నాకు సంసార తాపాల వల్ల కలిగి శ్రమంతా (నశించింది) చల్లారింది. అఖండ వైభవానందమైన ఆత్మపదవి అక్షయంగా క్షణంలో సంప్రాప్తించింది.

[యత్ - ఎవని, అనటానికి బదులు, నీవు - అనటం తెలుగు సంప్రదాయం.]

శ్లో. ధన్యోఽహం కృత కృత్యోఽహం
విముక్తోఽహం భవ గ్రహాత్
నిత్యానంద స్వరూపోఽహం
పూర్ణోఽహం త్వదనుగ్రహాత్. ౪౮౭

తే. గీ. ధన్యుడను నేను, జన్మసార్థకత జెందె;
నే భవగ్రహ ముక్తుడ, నిత్యమైన
నిర్మలానంద రూపుడ నేను; పూర్ణ
తను వహించితి మీదయా ధర్మమునను.

ఓ మహాస్వామీ! నేను ధన్యుడనైనాను; నా జీవితం సార్థకమయింది. సంసార తాపత్రయమనే గ్రహం నుంచీ తప్పించుకొని

బయట పడినాను. నేనిప్పుడు శాశ్వతానంద స్వరూపుడనై నాను. సర్వ సమృద్ధుడ నై నాను. అంతా తమరి అనుగ్రహం వల్లనే!

శ్లో. అసంగోఽహ మనంగోఽహ - మలింగోఽహ మభంగురః
ప్రశాంతోఽహ మనంతోఽహ-మమలోఽహం చిరంతనః. ४९०

ఆ. వె. లేదపేక్ష నాకు; లేదు దేహము, సూక్ష
దేహమైన లేదు; తీరి పోను;
శాంతియుతుడ, నేననంతుడ నమలుండ
నే చిరంత నుండ నిశ్చయముగ.

నేనిప్పుడు హేయాతి హేయాలైన దేహేంద్రియా ద్యనాత్మ వస్తువుల్తో సంగం (పొత్తు) లేకుండా ఉన్నాను. విషంతో సమాన మైన విషయాల మీది కీడ్పుకోపోయ్యే కర్మేంద్రియ జ్ఞానేంద్రియా లతో సంబంధం తొలగి పోయింది. స్త్రీ పురుష లింగ భేదాలూ, వర్ణా శ్రమాది భేదాలూ, వదలి పోయినాయి. మృత్యుభయ మనేదిప్పుడు లేనేలేదు. స్వస్థచిత్తుడనై నాను. ఆద్యంతాలు లేనివాడనూ, అమలు డనూ, చిరంజీవినీ, కాగలిగినాను.

[నే నాత్మస్వరూపుడను కనుక దేహ మనో బుద్ధులతో నాకు సంబంధం లేదని తెలుసుకున్నాను.]

శ్లో. అకర్తాహ మభోక్తాహ - మవికారోఽహ మక్రియః;
శుద్ధ బోధ స్వరూపోఽహం - కేవలోఽహం సదాశివః. ४९१

తే. గీ. కాను కర్తను; భోక్తను కాను; నే వి
కార రహితుడ, క్రియలకు దూరముందు;
నిర్మల జ్ఞానరూపుడ నేను, కేవ
లుండనై యుందును, సదాశివుండ నేను.

నేను కర్తనూ కాను, భోక్తనూ (అనుభవించే వాడనూ)కాను ఏ మార్పులూ లేనివాడను; క్రియలన్నిటికీ అతీతుడను; నిర్మలమైన జ్ఞాన స్వరూపుడను, పరిపూర్ణుడను, శాశ్వత శుభంకరుడను నేను.

[ఆత్మ- మనసు ద్వారా ఏమైనా చేయిస్తేనే కర్తృత్వం; బుద్ధి ద్వారా స్పష్టపరిస్తేనే భోక్తృత్వం; మనస్సూ - బుద్ధీ-అనేవి రెండూ ఆత్మలో లీనమై పోయినందున, కర్తనూ కాను, భోక్తనూ కాను. కేవలం ఆత్మనై నిత్యానందంలో ఉంటున్నాను. అదే నా స్వరూపం కదా! విషయానంద-లేక, భోగానంద - లేక, ద్వైతానంద మనేదే అసంభవం. అవన్నీ ఈ దేహానికి సంబంధించినవి కాని, నాకు సంబంధించినవి కావు. క్రియలు నాలో ఏమి జరిగినా వాటికి నేనతీతుడను. నేను పరిపూర్ణుడను- ఏ లోపమూ లేని సదాశివుడను.]

శ్లో. ద్రష్టుః శ్రోతు ర్వక్తుః కర్తు ర్భోక్తు ర్విభిన్న ఏవాహం;
నిత్య నిరంతర నిష్క్రియా నిస్సీమా సంగ పూర్ణ బోధాత్మా.
౪౯౨

ఆ. వె. కనెడి, వినెడి వానికిని, చేయువానికి;
ననుభవించువాని కవలి వాడ;
నిత్య నిరతమైన నిష్క్రియా నిస్సీమ
మౌన సంగ పూర్ణ జ్ఞానమేను.

చూచే వాడికీ, వినే వాడికీ, చేసే వాడికీ, అనుభవించే వాడికీ, నేను భిన్నంగా ఉంటాను. నేను శాశ్వతమైన, విఋపులు లేని, అపేక్షలు లేని, అనంతమైన పరిపూర్ణజ్ఞానాన్ని.

[అంతఃకరణలో ప్రతి బింబించిన చైతన్యం - జీవుడనీ, చిదాభాసుడనీ, అని పించు కుంటున్నాడు. ఆ జీవుడే అంతఃకరణ తాదాత్మ్యం చేత కర్తా, భోక్తా అవుతున్నాడు. అదే అంతఃకరణ ద్వారా బాహ్యేంద్రియాలతో తాదాత్మ్యం పొంది ద్రష్టా (చూచేవాడూ) శ్రోతా (వినేవాడూ), వక్తా (మాట్లాడే వాడూ), ఔతున్నాడు. నేను శుద్ధ చైతన్య స్వరూపుడను; ఆచిదాభాసునితో నాకు సంబంధంలేదు]

శ్లో. నాహమిదం నాహమదోఽ
వ్యుభయో రవ భాసకం పరం శుద్ధం;
బాహ్యా భ్యంతర శూన్యం
పూర్ణం బ్రహ్మ ద్వితీయ మేవాహం. ౪౯౩

ఆ. వె. ఇదియు నదియుకాను ఈ రెంటికిని కూడ
వెలుగ జేయు గొప్ప వెలుతురేను;
బ్రహ్మ మద్వితీయ పరిపూర్ణుడను నేను
వెలిని లోన శూన్య మలరునాకు.

నేను ఇదీ కాను; అదీ కాను. ఈ రెండిటినీ ప్రకాశింపజేసే పరముడనూ శుద్ధుడనూ; నిజానికి నేను అద్వితీయ బ్రహ్మాన్ని. నాకు వెలుపలా, లోపలా, ఏమీ లేదు—శూన్యమే!—ఐతే నే ననంతుడను.

ఇదీ—అంటే అవిద్యా పూర్వకంగా నేననుకున్నది. అదీ—అంటే విద్యా పూర్వకంగా గురువుపదేశించినది. నేను అవిద్యనూ కాను; విద్యనూ కాను; ఈ రెండింటికీ వెలుతురిచ్చే సర్వోత్తముడను – ఆత్మను. ఇదీ—అనేది శరీరాన్ని సూచిస్తుంది. శరీరానికి లోపల కర్తృత్వం వహించేవీ, వెలుపల కర్మ పరమైనదీ, వస్తువు లున్నాయి. దేహమే నేను కానప్పుడు అవెక్కడుంటాయి? గాఢనిద్రలో శరీరం కానరానప్పుడు లోపలా–వెలుపలా—అనేవి ఉండవు కదా? అంతా గాఢాంధకారమేనా? కాదుగా? పెంజీకటి కవ్వల వెలిగే ఆత్మను నేను; రెండవ పదార్థమేదీ లేదు.

క. లోకంబులు, లోకేశులు,
లోకస్థులు తెగిన తుది యలోకంబగు పెం
జీకటి కవ్వల నెవ్వం
డే కాకృతి వెలుగు ? నతనినే సేవింతున్.

అంటాడు భాగవతంలో పోతనామాత్యుడు.

ఇదం – ఈ కంటికి కనపడే మాయా ప్రపంచం, అదః – శరీరేం ద్రియ స్థూల సూక్ష్మ ప్రపంచం; ఈ రెండూ నేను కాను. బాహ్య ప్రపంచానికీ, అంతరంగ ప్రపంచానికీ నేను అతీతుడను. ఉభయోరపి – ఈ రెండిటికి (స్థూల సూక్ష్మ దృశ్యాలకు); అవభాసకం–ప్రకాశమిచ్చే పరం–శుద్ధం– విలక్షణ విశుద్ధ పరబ్రహ్మాన్ని. బాహ్యమనీ, అంతరమనీ విచక్షణ లేక, అంతటా వ్యాపించిన పరిపూర్ణ పరబ్రహ్మాన్ని నేను అంటే, "అహం బ్రహ్మాస్మి" – అనే మహావాక్యార్థం బాగా గురువు వల్ల తెలుసు కున్నాడు కదా? "సోఽహం" – అదే నేను. ఆత్మదృష్టి చేత బాహ్యాభ్యంతరా లుండవు: శరీర దృష్టి చేతనే ఉంటాయి.

శ్లో. నిరుపమ మనాది తత్త్వం
త్వ మహ మిదమద ఇతికల్పనా దూరం;
నిత్యా నందైక రసం సత్యం
బ్రహ్మా ద్వితీయ మేవాహం. ౪౯౪

తే. గీ. నిరుపమ, మనాది సత్యము; నీవు–నేను–
ఇది–అది–ఇలాంటి కల్పన కెల్ల దూర;
మే'ను సతతంబు నానందమైన సత్య
మద్వితీయమునైన బ్రహ్మంబు సుమ్ము !

నేను సాటిలేని వాడను. గురుదేవా ! ఆదిలేని సత్యాన్ని. నీవూ–నేనూ–ఇదీ – అదీ – అనే కల్పనలకు అతీతుడను. శాశ్వతమైన ఆనంద సారాన్ని సత్యమూ, అద్వితీయమూ, ఐన బ్రహ్మాన్ని సత్యానికి సాటి ఇంకే ముంటుందీ ? ఆదీ – అంతమూ ఏ ముంటుంది? ఆత్మ–కాలానికీ, దేశానికీ, కారణానికీ, అతీతం. బ్రహ్మం మీదిఅధ్యాసనేకాలమంటారు. అహంకారంవల్ల భావింపబడేదే నేను – స్థూల సూక్ష్మకారణ శరీరాల సమూహాన్ని నేను – అనటం. అదే అహంకారంతో కూడిన భావన నీ శరీరం మీదికి త్రిప్పితే, నీవు – అనటం. ఈ నా శరీరానికి దగ్గఱగా ఉండేది, ఇది, దూరంగా ఉండేది– అది. అన్నీ శరీరానికి సంబంధించిన భావనలేకదా ?

నిరుపమం - ఉపమానోపమేయాల సాదృశ్యం రెండు వస్తువు లుంటేనే పొసగుతుంది. రెండవదిలేని ఆత్మకు సాదృశ్యం ఎక్కడిదీ ? శిష్యుడు జీవత్వాన్ని వదలి, బ్రహ్మత్వాన్ని పొందినాడు కనుక, గురు దేవునితో తన సంగతి మనవి చేసుకుంటున్నాడు.

శ్లో. నారాయణోఽహం నరకాంతకోఽహం
పురాంతకోఽహం పురుషోఽహ మీశః
అఖండ బోధోఽహ మశేష సాక్షీ
నిరీశ్వరోఽహం నిరహంచ నిర్మమః. 494

ఆ. వె. నరక హర్తనేను నారాయణుడ నేను;
పురహరుండ నేను పురుషుడేను;
ఈశుడేను, నిండు తెలుకను, సాక్షిని;
ప్రభు-వహంబు-మమత-పడయ నేను.

అహం నారాయణః -శుద్ధ చైతన్య స్వరూపుడ నైనందువల్ల నారాయణుడను; కేవల చైతన్యమూ జ్ఞానమూ ఐన పరమాత్మను. నరకాంతకః - నరకాసుర సంహారకుడైన శ్రీకృష్ణుడను; అందఱి హృదయ క్షేత్రాల్లోనూ సమస్తపాపాలనూ పోగొట్టి మనసునుహరించే పరమాత్మను. పురాంతకః - త్రిపురాసుర సంహారకుడైన ఈశ్వరుడను; మూడు శరీరాలకూ అవ్వల ఉండే పరబ్రహ్మను-(మూడు శరీరాలనూ భంగ పఱిచినప్పుడే పరమాత్మ సాక్షాత్కారం). పురుషః- పురమనబడే శరీరంలో దేహినై విలక్షణంగా ఉండే వాడను. ఈశః-సమస్త దృశ్యా లకూ అతీతుడనైన ప్రభువును. అహం- జీవత్వ జడత్వ రహితుడనైన నేను; అఖండ బోధః - నిండు తెలుకను. అశేష సాక్షీని. సమస్తానికే సాక్షిని. నిరీశ్వరః -నాకు వేఱే ప్రభువులేడు; నిరహం, నిర్మమః - అహం కార మమకారాలు లేనివాడను.

సకల దేవతలూ ఆత్మ స్వరూపాలే ! యోగారూఢుడైనవాడే ఇలా పలుక గలుగుతాడు. నరనారాయణులు సుప్రసిద్ధులు కదా ?

నరుడే ప్రపంచానికి ప్రతీక. అతడే బ్రహ్మం. నరుడనే బ్రహ్మమందు ఎవడుంటాడో? వాడు నారాయణుడు. లేదా? నారం-నీళ్లు, ఆ నీళ్లు ప్రాణాధారం-అందులో ఎవడుంటాడో, వాడు నారాయణుడు.

మన శరీరం స్థూల - సూక్ష్మ-కారణాలనే మూడు విధాలుగా ఉంది; ఇవి మట్టీ, నీళ్ళూ, నిప్పూ - ప్రధానమై ఉన్నాయి. ఈ మూడింటా ఉండే వాడు, నారాయణుడు.

నరకాంతకోఽహం - నరకాసుర వధ పురాణాల్లో అందఱూ విన్నదే! వాడు భూదేవి కొడుకు! మన స్థూల శరీరాలన్నీ మట్టివే కనుక మనమూ భూదేవి కొడుకులమే! ఈ శరీరంలో అహంకారం కలిగి ఉండటమే నరకమన్నమాట దుఃఖాలన్నీ నరక శిక్షలే! యోగారూఢుడికే దుఃఖాలుండవు కనుక, అతడు నరకాంతకుడు!

పురాంతకోఽహం - త్రిపురాసుర సంహారకుడీశ్వరుడు. ఆపురాణ గాథలోని సత్యాన్ని మనం తెలుసుకోగలిగితే, ఆ త్రిపురాలు మానవులందఱిలోనూ ఉండేవే! జాగ్రదవస్థలో మనదొక లోకం; స్వప్నావస్థలో ఇంకో లోకం; సుషుప్తిలో మఱో లోకం. మనం ఒక లోకంలో ఉండినప్పుడు తక్కిన రెండు లోకాలనూ సంహరిస్తుంటాము. కాని మూడు లోకాలనూ ఒక్కసారిగా సంహరించిన వాడే ఈశ్వరుడు. మనకా పని చేత కావటం లేదు. ఎందువల్ల? మనం నిరంతరం ధ్యాన సమాధిలో ఉండటం లేదు కనుక. ఉన్నాడా? అలాంటి యోగి, "శివోఽహం" - అన గలుగుతాడు.

పురుషోఽహం - ప్రకృతి పురుషుల్లో పురుషుడాత్మ - ప్రకృతి శరీరమున్నూ. ప్రకృతి నిర్మించిన యీ ఉపాధుల్లో ఉండేవాడు-పురిశాయనాత్ పురుషః - అని కూడా వ్యుత్పత్తి.

ఈశః - ప్రభువు - నిగ్రహానుగ్రహ సమర్థుడూ, పరిపాలకుడూ, సక్రమంగా నడిపించేవాడూ, ఆజ్ఞాపించే వాడూ! నేను లేక, ఈ శరీరం

పనిచేయదు. నేను లేనిదే జాగ్రత్-స్వప్న-సుషుప్తు లుండవు. ఏ యను భవాలూ ఉండవు. నేనుంటేనే అన్నీ-కనుక, నేను ఈశ్వరుడను.

నేను అఖండ బోధనూ, అన్నిటికీ సాక్షినీ; నేనే ఈశ్వరుడనైతే నా కింకో ఈశ్వరు డెక్కడ? ఉండనే ఉండడుగా? నేనూ, నాదీ-అనే భావాలులేని ఆత్మనే నేను.

"నారాయణః పరోఽవ్యక్తాత్" - అవ్యక్త మనబడే మాయ కన్న పరుడైన పరమాత్మ-అని శ్రుతి ప్రమాణం.

"యచ్చ కించి జ్జగత్సర్వం - దృశ్యతే శ్రూయతే పి వా
అంతర్బహిశ్చ తత్సర్వం - వ్యాప్య నారాయణ స్థితః."

కొంచెంగానో, గొప్పగానో ఏ జగత్తు చూడబడుతుందో, విన బడుతుందో, దాని లోపలా వెలుపలా అంతటా వ్యాపించి ఉండేవాడు నారాయణుడు.

"నరకాంతకః కృష్ణః" - కృష్ణ శబ్దార్థం కూడా తెలుసుకో దగింది. కృషి - అంటే భూమి; ణ - అంటే ఆనందం; క్షేత్ర మనిపించు కుంటున్న ఈ శరీరంలో ఆనందరూపుడైన ఆత్మ - ఉంటున్నాడు.

మహాభారతం - శాంతిపర్వంలో —

"కృషామి పృథివీం పార్థ! భూత్వా కార్ష్ణాయ సో హలః
కృష్ణో వర్ణశ్చమే యస్మాత్ - తస్మాత్ కృష్ణోఽహ మర్జున!"

అర్జునా! నేను నల్లని నాగలినై భూమిని దున్నుతున్నాను.అందు చేత నాకు శ్యామల వర్ణ మేర్పడింది. నేను కృష్ణ నామంతో భక్తుల హృదయక్షేత్రాల్లో ఉండి, సకలపాపాలనే కల్మషాలను హరిస్తున్నాను. 'కర్షక త్వాత్ కృష్ణః' - అని అందరూ చెప్పుకుంటున్నారు. అంతే కాక, సకల యోగి హృదయాలనూ - 'కర్షతీతి కృష్ణః' - ఆ కర్షించే వాడను కనుక, కృష్ణుడంటున్నారు.

నవద్వార పురమైన ఈ శరీరంలో, అంగుష్ఠమాత్ర పురుషుడై న వాడు, శ్రీకృష్ణుడు. ఇలా చెప్పుకుంటూపోతే, ఎంతైనా కద్దు !

శ్లో. సర్వేషు భూతే ష్వహమేవ సంస్థితో
జ్ఞానాత్మ నాంతర్బహిరాశ్రయస్సన్
భోక్తాచ భోగ్యం స్వయమేవ సర్వం
యద్యత్ పృథక్ దృష్ట మిదం తయా పురా. ౪౯౬

తే. గీ. అన్ని జీవులలో జ్ఞానమగుచు నేనె
వాని కాధారమై యుందు బయటలోన;
"నిది-యనాత్మ"–యటంచు మున్నెంచి నట్టి
వన్నిటను–భోగి భోగ్యంబు లగుదు నేనె.

అన్ని జీవుల్లోనూ జ్ఞానరూపంగా నేనే ఉన్నాను. ఆ జీవుల బాహ్యాభ్యంతరాలకు నేనే ఆధారం, ఇంతకు ముందు–ఇదీ–అనాత్మ–అనుకున్న అన్నిటి యందూ అనుభవించే వాడనూ, అనుభవమూ, అన్నీ నేనే !

శిష్యుడు, తన సర్వాత్మకత్వాన్నీ, అఖండత్వ విజ్ఞానాన్నీ, సొంత అనుభవం ద్వారా గురువుకు విన్నవించుకుంటున్నాడు. సకల భూతాల్లో తననూ, తనలో సకల భూతాలనూ చూచేవాడు స్వారాజ్యమైన మోక్షాన్ని పొందుచున్నాడనే ఉపనిషద్భావ మిక్కడ తెలుపబడు చున్నది. భోక్తా, భోగ్యమూ, కర్తా కార్యమూ – ఇత్యాది భేద భావా లన్నీ జ్ఞానోదయం కాకముందు నానావిధాలుగా అనిపించేవి. ఇప్పుడో! పరమ జ్ఞానియైన గురుదేవుని కృపాకటాక్షంచేత అఖండ స్థితి పొంది నందున–నాకంటే భిన్నమైనదేదీ కానరావటంలేదు. భ్రాంతి తొలగితే అంతా బ్రహ్మమే !

శ్లో. మయ్యఖండ సుఖాం భోధౌ బహుధా విశ్వ వీచయః
ఉత్పద్యంతే విలీయంతే మాయామారుత విభ్రమాత్. ౪౯౭

క. నాయందఖండ సుఖమను
తోయధి విశ్వంపుటలలు తోడ్తో జననం
బై యంతలో నడంగును;
మాయా మారుతపు విభ్రమంబుల చేతన్.

నాలో అఖండ సుఖమనే సముద్రంలో విధీ విరామం లేని విశ్వ తరంగాలు పుట్టి, నశిస్తున్నాయి. ఇదంతా మాయామారుతం విజృంభించి ఆడే ఆటవల్లనే !

సముద్రంలో గాలి వీచటం వల్ల అలలు పుట్టి, కొంతసేపుండి నశిస్తాయి. ఆత్మ అనే సత్యంలో ద్వైత ప్రపంచంలోని నామరూపాలు పుట్టి, సత్యంలోనే ఉండి - సత్యంలోనే నశిస్తాయి ఆ సత్యాన్ని నేనే! మాయ అనేది గాలి వంటిది. వీచినప్పుడే గాలి ఉండటం తెలుస్తుంది. మాయ - సత్యం మీది అధ్యాస - నామరూపాలను పుట్టించి పెంచి నాశనం చేస్తుంది. కాని, ఎవరికీ అర్థంకాదు. త్రాడులో పామెందుకు పుట్టిందో, ఎందుకు త్రాడులోనే ఉండి, త్రాడులోనే నశిస్తుందో? ఎవరికి తెలుస్తుంది? సముద్రం కంటే కెరటాలు వేఱుకావు కదా? అట్లే సమస్త దృశ్యమూ పరబ్రహ్మ కంటే వేఱుకాదు. ఆ పరబ్రహ్మ కేవలానందమయం - అమృతమయం - కనుక, తాను ఆనంద మహాసాగరమన్న మాట! అందులో మాయామారుతం వీస్తున్నంత వఱకూ దృశ్యం తప్పదు. అలలు చెలరేగి, నశిస్తున్నా, సముద్రం చలన రహితంగానే ఉంటుంది. అట్లే సకల దృశ్యాలూ పుట్టి, గిట్టుతున్నా వాటి కధిష్ఠానమైన పరబ్రహ్మ అచలమూ, సనాతనమూ, శాశ్వతమూ! ఈ జ్ఞానం స్థిరమైతే ప్రకృతి నశించి ముక్తావస్థ లభ్యమౌతుంది.

శ్లో. స్థూలాది భావామయి కల్పితా భ్రమాత్
ఆరోపితా నుస్ఫురణేన లోకైః;
కాలే యథా కల్పక వత్సరాయ
నర్త్వాదయో నిష్కల నిర్వికల్పే.

తే. గీ. కాలమె యఖండ; మందులో కల్పకములు
నేండ్లు నయణర్తు వాదు లూహించినట్లె;
జనులు స్థూలాది కల్పనల్ సల్పి భ్రమను
తప్పుటూహలు నాలోన తలచు చుంద్రు.

సర్వవ్యాపకమై అఖండమైన కాలమందు బ్రహ్మాది కల్పాలూ, ప్రభవాది సంవత్సరాలూ, ఉత్తరాయణ దక్షిణాయణాలూ, వసంతాది ఋతువులూ, చైత్రాదిమాసాలూ, శుక్ల కృష్ణ పక్షాలూ, ఆదిత్యాది వారాలూ, గంటలూ, నిమిషాలూ, సెకండ్లూ - ఊహించి, కల్పించి, ఎన్నో విభజనలు చేస్తున్నారుగా? ఆ ప్రకారంగానే, నిష్కళ నిర్వికల్ప పరమాత్మ స్వరూపుడనైన నాయందు భ్రాంతిచేత ఆరోపింపబడిన దృశ్య ప్రపంచ స్ఫురణవల్ల అజ్ఞానులైన జనులచేత స్థూల సూక్ష్మ కారణ శరీరాలనేవి ఆరోపితాలైనాయి.

భ్రాంతీ, అజ్ఞానమూ, మాయా అవిద్యా, మోహమూ, అధ్యాసా, ఆరోపమూ - అనే మాటలన్నీ సమానార్థకాలే! ఈ భ్రాంతి సర్వానర్థాలకూ కారణం. పరబ్రహ్మ మఖండమూ, అద్వితీయమూ, నిరతిశయానందమూ! ఇట్లుండగా ఇన్ని జన్మపరంపరలెలా కలిగినాయి? ఈ సుఖదుఃఖా లెందుకు అనుభవిస్తున్నాము? అజ్ఞాన మెక్కడ నుంచీ వచ్చింది? ఇలాంటి సంశయాలన్నిటికీ భ్రాంతి - అనేదే శాస్త్రమిచ్చే సమాధానం. "కాలః కల యతా మహం" - జ్యోతిష్కుల్లో కాలాన్ని నేను - అనే భగవద్గీతా వచనానుసారంగా కాలం భగవత్స్వరూపం - విభూతి, ఆంగ్లేయులు కూడా "టైం ఈజ్ గాడ్" - అంటున్నారు. కాలము అఖండమూ, అవిభాజ్యమూ! దానిలో సంవత్సరాది విభజనలన్నీ భ్రాంతి మాత్రాలే! ఈ స్థూల ప్రపంచం - సముద్రాలూ, కొండలూ, మృగాలూ, జీవుల శరీరాలూ; సూక్ష్మ ప్రపంచం - అంతరింద్రియ జ్ఞానేంద్రియాలూ; విభజింపరాని పంచభూతాలూ, తన్మాత్రలూ; కారణ ప్రపంచం - మాయా, అవిద్యా మొదలైనవన్నీ

కల్పితాలే! విచారణచేస్తే ఒకే ఆత్మ-ఉపాధులను బట్టి వేఱు వేఱుగా కానవస్తున్నది. భ్రాంతే అంతః కరణమేమో ?

శ్లో. ఆరోపితం నాశ్రయ దూషకం భవేత్
కదాపి మూఢై ర్మతి దోష దూషితైః;
నార్ద్రీ కరో త్యూషర భూమి భాగం
మరీచికా వారి మహా ప్రవాహః. ౪౯౯

తే. గీ. తగని యజ్ఞాను లారోపితమ్మొనర్చి
నంతలో నెప్పు డాశ్రయమంటు పడదు;
గొప్పగా నెండ మావుల గోచరించు
వారి వాహ వెండారి నెబ్బంగి తడుపు ?

ఎప్పటికీ బుద్ధిమాలిన్య దోషంచేత మలినాత్ములైన అవివేకుల చేత ఆరోపితమైన (కల్పింపబడిన) దృశ్యజాలం, అధిష్ఠానంగా (ఆధారంగా) ఉండే ఆత్మకేమైనా అంటుతుందా ? అంటదు. ఆ ప్రకారంగానే గొప్పగా ఎండమావుల్లో గోచరించే జలప్రవాహం ఏనాటికైనా ఎడారిని తడుపగలుగు తుందా ? తడుపలేదు.

స్థూల-సూక్ష్మ - కారణ శరీరాలు నేనుకాదనీ, నేను ఆత్మననీ, గుర్తించిన తరువాత, అవివట్టి భ్రాంతులే అనిపిస్తాయి. అప్పుడుసంచితాగామి ప్రారబ్ధ కర్మలెలా బాధిస్తాయి ?

శ్లో. ఆకాశ వల్లేప విదూరగోఽహం;
ఆదిత్య వద్భాస్య విలక్షణోఽహం;
అహార్య వన్నిత్య వినిశ్చలోఽహం:
అంభోధి వత్పార వివర్జితోఽహం. ౫౦౦

తే. గీ. ఆకసమువోలె లేదు నాకంటు సొంటు;
భాస్యముల కంటె వేఱునే భానునట్లు;
కొండవలె నెప్పుడును నిశ్చలుండ నేను;
పార మెఱుంగను నేనల వార్ధివలెనె.

నేను ఆకాశంవలె అపరిశుద్ధానికి దూరంగా ఉంటాను. భాస్య వస్తువులన్నిటి కంటే సూర్యుడివలె ప్రత్యేకంగా ఉంటాను. కొండవలె యెల్లప్పుడూ కదలకుండా ఉంటాను. సముద్రంవలె నేను అంతులేకుండా ఉంటాను.

శిష్యు డిక్కడ తాను అసంగుడననీ, స్వయంప్రకాశుడననీ, అచలుడననీ, అనంతుడననీ, దృష్టాంత పూర్వకంగా విన్నవిస్తున్నాడు. అహం-అకారం మొదలు హకారం వఱకూ ఏభై అక్షరాలుగా (వశిన్యాది వాగ్దేవతలుగా) మారిన ఓంకార స్వరూపుడనైన నేను, అసంగత్వాది లక్షణాలు కలిగిన (ఆత్మ) పరబ్రహ్మాన్ని అంటున్నాడు. ఆకాశమంతటా వ్యాపించి ఉన్నప్పటికీ, ఏ ఉపాధితోనూ సంబంధం లేనిదై ఉపాధులు నశించినా తాను నశింపక శాశ్వతంగానూ అసంగంగానూ ఉండే విధంగా, నేను అవిద్యా రహితుడనై అంతట వ్యాపించి ఉన్నాను. దృశ్యంతో నాకెంత మాత్రం సంబంధంలేదు. అంటూ సొంటూ లేనివాడను. అంటే, దేహాదులైన ఉపాధులు నశించినా, నాకు నాశనం లేదని అర్థం. సూర్యుడు అన్నిటినీ ప్రకాశింపజేస్తూ తాను విలక్షణుడై ఉన్నాడు. ఆ సూర్యుడే లేకపోతే, ప్రపంచమంతా అంధకార బంధురమే! ఆ ప్రకారంగానే నేను జడములూ దృశ్యములూ ఐన అన్ని పదార్థాలకూ, శరీరేంద్రియాదులకూ విలక్షణుడనై స్వయం ప్రకాశమానుడనై ఉన్నాను. నా చైతన్య ప్రసారం లేకపోతే, దేహేంద్రియాదులన్నీ జడములై చచ్చినట్లుంటాయి. కొండవలె స్వస్వరూపంలో చలనం లేకుండా ఉండే నేను, విక్షేపాలు లేనివాడనై ద్వంద్వాతీతుడనై సమాధి నిష్ఠుడనై ఉంటున్నాను. సముద్ర మెటు చూచినా దరికానరాక జలమయమై ఉంటున్నది. కేవల జ్ఞాన విజ్ఞాన పరిపూర్ణుడనైన నేను అపరిచ్ఛిన్నుడనై అఖండ పరబ్రహ్మనై ఉన్నాను.

ఆత్మ అసంగం కనుకనే సర్వవిలక్షణమై ప్రకాశిస్తున్నది. అసంగమూ స్వయం ప్రకాశమూ కనుకనే విక్షేప శూన్యమూ అచలమూ; అలా అచలమై ఉండబట్టే అనంతమై దేశకాల పరిచ్ఛిన్నం కాకున్నది. ఆత్మ అసంగ మనటానికీ, స్వయంప్రకాశమనటానికీ, అచలమనటానికీ అనంతమనటానికీ, ప్రమాణాలిలా ఉన్నాయి.

(1) "అసక్తం సర్వ భృచ్చైవ"- (గీ. 13-14) అన్నిటికీ (ఇంద్రియాలకు) ధారణ పోషణలిస్తున్నప్పటికీ ఆసక్తి రహితమై ఉన్నది.

(2) "జ్యోతిషామపిత జ్జ్యోతిః తమసః పరముచ్యతే" - (గీ. 13-17) అన్ని జ్యోతుల కంటే ఆ పరబ్రహ్మ జ్యోతి, మాయకు అతీతమని చెప్పబడుచున్నది.

(3) "నిత్య స్సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః" - (గీ. 2-24) నిత్యమూ, సర్వగతమూ, అచలమూ, సనాతనమూ-ఆత్మ.

(4) "అనాద్యనంతం మహతః పరం" - మహత్తు కంటే పరమై ఆద్యంతాలు లేనిది, ఆత్మ. (కఠోపనిషత్తు 3-15)

శ్లో. నమే దేహేన సంబంధో - మేఘే నేవ విహాయసః
అతః కుతోమే తద్ధర్మా - జాగ్రత్స్వప్న సుషుప్తయః. ౫౦౧

తే. గీ. స్నేహమే లేదు నాకును దేహమునకు
నాకసమునకు మేఘాల కట్టువోలె;
నపుడు తద్దేహ ధర్మంబులైన యట్టి
స్వప్న జాగ్రత్ సుషుప్తు లెట్లంగి నంటు?

ఉపాధి రహిత పరమాత్మ స్వరూపుడనైన నాకు, మాయా కల్పిత శరీరంతో-మేఘాలతో డీ? ఆకాశానికి వలె-ఏ సంబంధమూ లేదు. అందుచేత ఆ శరీర ధర్మాలైన జాగ్రత్ స్వప్న సుషుప్తులనే అవస్థలు ఎక్కడివీ? లేవు.

ఆకాశం మూర్తి కలదికాదు. నిర్లేపం - దేనితోనూ స్పర్శ రూపాది సంబంధం లేనిది. అలా అమూర్తమూ (శరీరం లేనిదీ), నిర్లేపమూ ఐన ఆకాశానికి మేఘాలతోనూ, మేఘధర్మమైన వర్షంతోనూ ఏమి సంబంధం! అలాగే అశరీరుడనూ నిర్లేపుడనూ ఐన నాకు, పాంచభౌతికమైన ఈ శరీరంతో సంబంధం లేదు. కాబట్టి, శరీర ధర్మాలైన జాగ్రత్ స్వప్న సుషుప్తులనే అవస్థలతోనూ, జరామరణ వ్యాధి దుఃఖాదులతోనూ ఎంత మాత్రం సంబంధంలేదు - అని శిష్యుడు గురుదేవుని సన్నిధిలో తనకు సిద్ధించిన అఖండ బోధానుభవాన్ని గూర్చి విన్నవించుకుంటున్నాడు.

శ్లో. ఉపాధిరాయాతి స ఏవ గచ్ఛతి
స ఏవ కర్మాణి కరోతి భుంక్తే;
స ఏవ జీవన్మ్రియతే సదాహం
కులాద్రి వన్నిశ్చల ఏవ సంస్థితః. ॥౫౦౨

తే. గీ. వచ్చెడి దుపాధి పోయెడి దచ్చమదియె;
అదియె కర్మలు కావించు, ననుభవించు;
నదియె జీవించు మరణించు, నంతెకాని
నేను కుల పర్వతము వోలె నిశ్చలుడను.

ప్రారబ్ధ కర్మానుసారంగా ఉపాధి (శరీరం) వస్తున్నది; పోతున్నది. ఆ ఉపాధే గమనాగమనాది కర్మలన్నీ చేస్తున్నది వాటి వాటి ఫలాలను అనుభవిస్తున్నది. అదే ప్రాణమున్నంత దాకా జీవిస్తున్నది; ప్రాణం పోగానే అంతరిస్తున్నది. నేనేమో కుల పర్వతంవలె సర్వదా నిశ్చలుడనై ఉన్నాను. ఉపాధి - అంటే, శరీరేంద్రియాదులనీ, అవిద్యోపాధి జీవుడనీ, నిరూపించినారు.

కుల పర్వతం భూమిని చుట్టి ఉంటుందనీ, దాన్ని అవధి పర్వతమనీ, లోకాలోక పర్వతమనీ, చక్రవాళ పర్వతమనీ, అంటారు. అన్ని

ఙూతర పర్వతాలూ ప్రళయకాలంలో కూలి పోతాయి; కాని, ఈ కుల పర్వతం సుస్థిరమై ఉంటుందని పౌరాణిక విశ్వాసం. పరమాత్మనైన నేను, సృష్టి స్థితిలయాల కతీతుడను.

శ్లో. నమే ప్రవృత్తి ర్నచమే నివృత్తిః
నదైక రూపస్య నిరంశ కస్య;
ఏకాత్మనో యోనిబిడో నిరంతరో
వ్యోమేవ పూర్ణః స కథన్ను చేష్టతే? ౫౦౩

తే. గీ. ఒక్కటే ఉనికైనై అంశలుండనట్టి
నాకు లేదు ప్రవృత్తి; ఉండదు నివృత్తి;
ఏకమై వ్యోమమటు నిబిడీ కృతంబు
నెపుడు పూర్ణంబునకు చేష్ట లెట్టులుండు ?

సదా సర్వసమానంగా భాగాలులేక ఒక్కటే ఉనికినైన నాకు ప్రవృత్తీ లేదు; నివృత్తీ లేదు. ఆకాశంవలె నిండి నిబిడీ కృతమై నిరంతరం సంపూర్ణంగా ఉండే ఆత్మకు, చేష్టలెలా ఉండగలుగుతాయి ? నేను నిర్వ్యాపారుడను. నాకంటే ప్రియతర పదార్థంగానీ, భిన్నపదార్థంగానీ, లేనందున నాకు దేనియందూ ప్రవృత్తిలేదు. అట్లే అప్రియమైన పదార్థంగానీ, నాలో రాగద్వేషాదులూ, సుఖదుఃఖాలూ కానీ, లేనందున, నివర్తింపదగినదేదీ లేదు. విచారణచేసి చూస్తే ప్రవృత్తి నివృత్తులు రెండూ బుద్ధి ధర్మాలు. నిర్గుణ నిరాకారుడనైన నాకా గుణాలు లేవుగా ?

శ్లో. పుణ్యాని పాపాని నిరింద్రియస్య
నిశ్చేతసో నిర్వికృతే ర్నిరాకృతేః
కుతో మమాఖండ సుఖాను భూతే
ర్బ్రూతే హ్యన న్వాగత మిత్యపి శ్రుతిః. ౫౦౪

తే. గీ. ఇంద్రియములు మనస్సు రూపెట్టి మార్పు
లే కఖండ సుఖానుభవైక రసపు
టెఱుక నగునాకు పుణ్యమె? ట్లెట్లుపాప
మంటు? శ్రుతియును నంటులేదని వచించు.

ఇంద్రియాలూ లేక, మనసూ లేక, మార్పులూ లేక, ఆకారమూ లేక, అఖండానంద మనుభవించే నాకు. పుణ్యం కానీ, పాపం కానీ, ఎలా ఉంటుంది? శ్రుతి కూడా—అంటబోదు—మొదలైన వాక్యాలతో దీన్ని సమర్థిస్తుంది.

కాయిక, వాచిక, మానసికాలని పుణ్యాపాప కర్మలు మూడు విధాలు—శరీరంతో, వాక్కుతో, మనస్సుతో మంచి పనులు పుణ్యకర్మలు; చెడ్డ పనులన్నీ పాపకర్మలు. ఇవే జీవుడి వెంటా వచ్చేవి. ఇవే సుఖదుఃఖాలకూ ఉత్తమాధమ జన్మలకూ కారణాలు. జ్ఞానోదయమై ఆత్మానుభవం గురుదేవుల అనుగ్రహంవల్ల లభించినందున, నాకీ పుణ్యాపాపాలు రెండూ అంటకుండా పోయినాయి.

బృహదారణ్యకోపనిషత్తు **IV-III-22** ''అనన్వాగతం పుణ్యేన—అనన్వాగతం పాపేన—తీర్ణోహి – తదా సర్వాన్ శోకాన్ హృదయస్య భవతి''—సుషుప్తి (గాఢనిద్ర)లో ఉన్న మనిషి పుణ్యాలనూ అంటక, పాపాలనూ అంటక, మరో వికారాలేవీ లేక ఉంటాడు. ఇలా అవిద్యామూలకమైన సుషుప్తిని – విద్యామూలకమైన ముక్త దశకు పోల్చి చెపుతుంది శ్రుతి; అప్పుడూ దుఃఖాలుండవు – ఇప్పుడూ దుఃఖాలుండవన్న మాట !

శ్లో. ఛాయయా స్పృష్ట ముష్ణంవా – శీతంవా సుష్ఠు దుష్ఠువా
నస్పృశత్యేవ యత్కించిత్ – పురుషం తద్విలక్షణం. ॥౫౦॥

తే. గీ. నీడ కంటిన దైనట్టి వేడియేని ?
శీత మేనియు ? మంచియు చెడ్డయేని ?
దాని కంటె విలక్షణమైన పురుషు
నేరవంతైన బాధించునే ధరిత్రి ?

ఉష్ణమైనా, శీతమైన, మంచిదైనా, చెడ్డదైనా, మానవుడి నీడకు సోకితే, ఆనీడకంటే వేరైన ఆ మానవుడికేమైనా కొంచెమైనా బాధ కలుగుతుందా? లేదుకదా!

పుణ్యాపాపాలు సమస్త దృశ్యాల నుంచీ విలక్షణుడైన - అశరీరిగా ఉండే-ఆత్మ కంటవని ఛాయాదృష్టాంతంతో నిరూపిస్తున్నాడు. మనిషి శరీరం నీడ అగ్ని స్పర్శ నందితే, ఆ మనిషి శరీరానికేమైనా బొబ్బలెక్కుతాయా? ఆనీడ నీళ్ళలో పడితే శరీరానికి చల్లదనం సోకుతుందా? నీడ అపరిశుద్ధం మీద పడితే, శరీరం మైలపడుతుందా? నిర్మల వస్తు సంపర్కం నీడకు కలిగితే, శరీరం నిర్మలమై పోతుందా? అలాగే శరీరంతో సంబంధంలేని ఆత్మ జ్ఞానికి - ఉపాధి రహితునికి - ఇంద్రియ మనోబుద్ధుల వ్యాపారాలవల్ల కలిగే పుణ్యాపాపాలు అంటుతాయా? జ్ఞానియైనవాడు, పుణ్యాపాప కారణాలైన ప్రకృతి సంస్కారాలన్నిటినీ, అఖండ జ్ఞానంతో దహించివేసి ఉంటాడు. కనుక, కర్మ ఫలాలేవీ అతని నంటవు. కర్మలు కూడా అంటవు. అవి శరీరేంద్రియ ధర్మాలే కదా! ఆత్మనెలా అంటుతాయి?

అజ్ఞానదశలో జీవుడికి మనోబుద్ధుల తాదాత్మ్యం ఉండటంవల్ల పుణ్యాపాప సుఖదుఃఖాల సంబంధముండినా, బ్రహ్మానుభవంతో అజ్ఞానం నశించి, మనోబుద్ధుల తాదాత్మ్యం తొలగిపోయింది. జీవాత్మ పరమాత్మగా సాక్షాత్కార మయింది. కనుక, శరీరమే ఒక నీడ వలె తయారయింది.

శ్లో. నసాక్షిణం సాక్ష్య ధర్మాః - సంస్పృశంతి విలక్షణం
అవికార ముదాసీనం - గృహ ధర్మాః ప్రదీపవత్. ౫౦౬

తే. గీ. సాక్షి తానెప్పుడును విలక్షణుడు కనుక;
చూచిన పదార్థముల స్పర్శ చొప్పడంగ
జాల; దవికారి, నిస్పృహు; డాలయమున
నున్నవెల్లను దీపము నొందనట్లు.

చూచిన వస్తుజాలంతో సాక్షికి - విలక్షణుడు కనుక-యే సం బంధమూ ఉండదు. ఆత్మ, శరీరంలో సాక్షి మాత్రంగా ఉన్నందున, ఏ మార్పూ లేక ఉదాసీనుడై ఉంటాడు - ఇంట్లో పదార్థాలన్నిటినీ చూపే దీపానికి, వాటికి సంబంధం లేనట్లుగానే.

ఇంట్లో దీపం వెలుగుతూ ఉంది. ఇంటి ధర్మాలేవీ ఆ దీపాన్ని వెలిగించలేవు. ఇల్లుకానీ, ఇంట్లో పదార్థాలుకానీ, అన్నీ జడములే! ఇల్లు ఇటికలతోనో రాళ్లతోనో కట్టబడింది. దూలాలూ, వాసాలూ, కొయ్యవి, లేదా? ఇనుపవి. ఇంటి వాకిళ్లూ, కిటికీలూ, రంగురంగులుగా ఉన్నాయి. ఇంటి పనులూ మొదలైనవేవీ దీపాన్ని అంటవు. ఆ ప్రకా రంగానే శరీరమనే ఇంటిలో ఆత్మజ్యోతి ప్రకాశిస్తున్నది. అది సర్వదా దేదీప్యమానమై మాయారహితమై చైతన్యవంతమై జడములైన సకలేంద్రియాలనూ శరీరాలనూ ప్రకాశింపజేస్తూ, శరీరేంద్రియాల ధర్మాలైన అన్నత జడ దుఃఖాలను అంటక, చూస్తూ సాక్షిమాత్రమై ఉపద్రష్టగా ఉంటున్నది. తటస్థంగా అసంగంగా అన్నిటినీ చూస్తున్నది. దేహేంద్రియ మనోధర్మాలు, అందుకు విలక్షణమైన ఆత్మ నంటడం లేదు. అట్టి దేహేంద్రియాతీతుడనైన ఆత్మను నేనని శిష్యుడు గురు దేవునితో విన్నవించుకుంటున్నాడు.

శ్లో. రవేర్యథా కర్మణి సాక్షిభావో
వహ్నేర్యథా దాహ నియామకత్వం
రజ్జోర్యథాఽఽరోపిత వస్తు సంగః
తథైవ కూటస్థ చిదాత్మనో మే. ౫౦౭

తే. గీ. కర్మలకు సాక్షియగు దినకరుడు వోలె;
నంతరము లేక కాల్చెడు నగ్నివోలె;
తాక కారోపితములను త్రాడువోలె;
నగుదు కూటస్థుడైన చిదాత్మ నేను.

ప్రపంచంలో జరిగే కర్మలన్నిటికీ సాక్షి మాత్రంగా ఉండే సూర్యుడివలెనూ, అన్నిటినీ ఏ భేదం చూపకుండా నిష్పక్షపాతంగా కాల్చే అగ్నివలెనూ, తనయందు ఆరోపింపబడిన వస్తువులతో ఏలాటి సంబంధమూ లేని త్రాటివలెనూ, నేను కూటస్థుడనై చిదాత్మనై ఉన్నాను.

సూర్యుడికి కర్మసాక్షి అనేపేరు సుప్రసిద్ధం; ప్రాణికోటుల సకల కర్మలనూ చూస్తూ, పుణ్యపాపాల జోలికిపోక, సాక్షిగా వెలుగుతున్నాడు. (పంచ భూతాలూ, సమస్త దేవతలూ, అన్ని కర్మలకూ సాక్షులై ఉంటారని కూడా శాస్త్రాలు చెపుతున్నాయి.) ఆ విధంగానే కూటస్థ బ్రహ్మం హృదయగుహలో ఉండి స్వయం ప్రకాశంగా సూర్యుడివలె తేజరిల్లుతూ, ఇంద్రియాలన్నిటినీ వెలిగించి వాటి వ్యాపారాలను చూస్తూ, తాను విలక్షణమై, దేన్నీ అంటక, సర్వసాక్షిగా ఉంటున్నది. ఆకూటస్థ బ్రహ్మమనే సర్వేశ్వరుడు జగదుపాధికుడై జగత్తులోని వ్యాపారాలన్నిటికీ సాక్షీ భూతుడై ఉన్నాడు. ఆయనకు తెలియకుండా చరాచర ప్రపంచంలో ఏపనీ జరుగదు. ఈ తత్వం తెలుసుకున్న మహానుభావులు అన్ని పనులూ ఈశ్వరార్పణం చేస్తారు. కనుక, పరమాత్మను సూర్యభగవానునితో పోల్చటం జరిగింది.

అగ్ని దేవుడు అన్నిటినీ దహించే స్వభావం కలవాడు. అలాగే పరమాత్మ సమస్త కర్మవాసనలనూ దహించి భస్మం చేస్తాడు. ఏ దోషాలూ అగ్నినంటనట్లే, పరమాత్మను అజ్ఞాన దోషాలేవీ అంటడం లేదు.

చీకటిలో త్రాటిని చూచి పామని భ్రమించటం లోకానుభవంలో అందరికీ తెలిసిందే! అలాగునసే విచక్షణలేని అజ్ఞానులు తమలో నిస్సంగంగా ప్రకాశించే కూటస్థాత్మకు శరీరేంద్రియాదులతో సంబంధమున్నట్లు భావిస్తున్నారు. యథార్థం వేఱుగా ఉన్నది. త్రాడు త్రాడు

గానే ఉన్నదికాని, అందులో పాము లేనేలేదు. భ్రాంతి వదలితే కూట స్థాత్మ సచ్చిదానందమై ప్రకాశిస్తున్నది. సకలేంద్రియాల కాధారంగా ఉన్నందువల్ల కూటస్థుడంటున్నారు. అన్నిటినీ చైతన్యవంతాలు చేస్తూ, కర్మవాసనలను దహిస్తూ, అసంగుడనై ఉన్నానని శిష్యుడు విన్నవించుకుంటున్నాడు.

శ్లో. కర్తాపి వాకారయితాపి నాహం;
భోక్తాపివా భోజయితాపి నాహం;
ద్రష్టాపివా దర్శయితాపి నాహం;
సో౽హం స్వయంజ్యోతి రనీదృగాత్మా. ॥౫౦౫॥

తే. గీ. చేయునేదియు చేయించ నేయదియును;
అనుభవింపను; చేయింప ననుభవింప;
చూడ చూపింపనేది; యీజాడనుండు
వల స్వయంజ్యోతి, ననీదృగాత్మ నేను.

మనస్సుకు అతీతుడనై ఉండే నేను ఏపనీ చేసేవాడనుకాను; చేయించేవాడనూ (ప్రేరకుడనూ) కాను. బుద్ధికి అతీతంగా ఉండేనేను. దేన్నీ అనుభవించేవాడనుకాను; ఎవరినీ దేన్నీ అనుభవింపజేసేవాడనూ కాను. దృశ్యానికి అతీతుడనైన నేను, దేన్నీ చూచేవాడనుకాను; చూపించేవాడనూ కాను. కర్తృత్వ, భోక్తృత్వ, ద్రష్టత్వ, తత్ప్రేరకత్వ రహితుడనై, కేవల పరమాత్మ చైతన్యంగా ఉండేనేను, ఇలా అలా ఉంటుందని పోల్చి చెప్పటానికైనా వీలులేని-అవాఙ్మానస గోచర మైన - స్వయం జ్యోతిని, ఆత్మను.

త్రిపుటి లేనిదైన పరమాత్మ కర్తృత్వాది సర్వధర్మ రహితమై ఉంటున్నది. (1) అధిష్ఠానమైన దేహమూ, (2) జీవుడూ (కర్త) (3) ఇంద్రియాలూ, (4) పనులూ (5) అదృష్ట పుణ్యపాపాలూ - ఈ ఐదూ అన్ని కర్మలసిద్ధికీ సాధనాలు; మంచి చెడ్డలన్నీ ఇందువల్లనే

కలుగుతున్నాయి. ఈ పంచావయవ రహితమైన పరమాత్మ అన్నిటికీ విలక్షణమైన స్వయంజ్యోతి. ఆజ్యోతినే నేను అని శిష్యుడు విన్నవించు కుంటున్నాడు.

"అధిష్ఠానం తథాకర్తా కరణం చ పృథగ్విధం
వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పంచమం."(గీ.8-14)

శ్లో. చల త్యుపాధౌ ప్రతిబింబలౌల్య
మౌపాదికం మూఢ ధియో నయంతి;
స్వబింబ భూతం రవి వద్వినిష్క్రియం
కర్తాఽస్మి భోక్తాఽస్మి హతోఽస్మి హేతి. ౫౦౯

తే. గీ. చలమగు నుపాధి - ప్రతిబింబ చలన మనక
మూఢు లౌపాధికమునకే రూఢి పఱచి
కారణుడు నిష్క్రియుడు దినకరుడువోలె
నగుదు కర్తను, భోక్తనే హతుడే నంద్రు.

ఉపాధి కదలుతున్నప్పుడు, మూఢులైన వాళ్ళు ప్రతిబింబ చలనాన్ని ప్రతిబింబకారణానికే అంటగడుతున్నారు. నీళ్లలో ప్రతిబింబం కదలు చుండగా ఆకాశంలోని సూర్యుడే కదలుతున్నట్లు భ్రమపడు తున్నారు. మన మనోబుద్ధి ప్రాణాలూ - నీటి వంటి ఉపాధులే ! ఆ ఉపాధుల్లో ప్రతిఫలించిన చిదాభాసుడే జీవుడు. ఆకాశంలో నిష్క్రియుడైన సూర్యుడికి ప్రతిబింబ చలనాన్ని భ్రాంతితో అంటగట్టినట్లే, అంతఃకరణ ధర్మాలను జీవుడి కంటగడుతున్నారు. నేను కర్తను, నేను భోక్తను, నేను చచ్చిపోతున్నాను, అయ్యో ! -అంటున్నాడు. ఉపాధులనే తాముగా మూఢులు భావిస్తున్నారు కనుక, దుఃఖాల పాలౌ తున్నారు. ఎంతటి అవివేకమో ?

శ్లో. జలేవాపి స్థలేవాపి - లుఠత్వేష జడాత్మకః
నాహం విలిప్యే తద్ధర్మైః - ఘటధర్మై ర్నభో యథా. ౫౧౦

ఆ. వె. నీళ్లలోన నైన నేలపైనైన నీ
జడ శరీర మట్టిపడును గాక !
దాని ధర్మములను నేను సోకను కదా ?
ఘటము ధర్మములను గగన మట్లు.

ఆకాశం సర్వవ్యాపి; ఘటంలోని ఆకాశాన్ని ఘటాకాశ మంటారు. అంత మాత్రాన ఆకాశానికీ ఘటమతాదుల ధర్మాలంటవు. అదే ప్రకారంగా ఆత్మకూడా సర్వవ్యాపి; జడపదార్థాలైన దేహాదుల్లో జీవచైతన్యమై ఉంది. ఈ జడశరీరం నీళ్ళలోపడి ఈదులాడనీ ! లేదా, నేలమీదపడి పొర్లాడనీ ! ఆ దేహధర్మాలైన తడిసి చల్లబడటమూ, ధూళి ధూసరితం కావటమూ, మొదలైన గుణాలతో నాకు సంబంధం లేదు. అవి నన్నంటవు.

శ్లో. కర్తృత్వ భోక్తృత్వ ఖలత్వ మత్తతా
జడత్వ బద్ధత్వ విముక్త తా దయః
బుద్ధే ర్వికల్పా నతుసంతి వస్తుతః
స్వస్మిన్పరే బ్రహ్మణి కేవలేఽద్వయే. ౫౧౧

తే. గీ. బుద్ధి కల్పిత కర్తృత్వ భోక్తృతలు; ఖ
లత్వ మత్త జడత్వ బద్ధత్వ ముక్తు
లాదిగా నేవియును నుండ వాత్మయందు
పరము నద్వయ మొక్కటే బ్రహ్మ మగుట.

చేసేదీ, అనుభవించేదీ, కపటంగా ఉండేదీ, త్రాగుబోతుతనమూ, బంధమూ, ముక్తీ-మొదలైన బుద్ధికల్పితాలైన మార్పులేవీ, నిజానికి ఆత్మలో ఉండవు. అదే పరబ్రహ్మం; రెండవ పదార్థం లేనిది; పరిపూర్ణం.

జడమైన బుద్ధి ఆత్మకు ప్రతిబింబమే ! ఆత్మ పరిపూర్ణ జ్ఞానం బుద్ధీ మొదలైన ఉపాధులను వెలిగిస్తుంది. నేను ఎఱుకలో ఉండబట్టే ఆ బుద్ధి కల్పించే మార్పులేవీ నాలో ఉండవు - వాటితో నాకు సంబంధంలేదు.

బుద్ధికే మహత్తనీ, అవ్యక్తమనీ పేర్లు. "బుద్ధే రాత్మా మహాన్పరః"–బుద్ధి కంటే ఆత్మ శ్రేష్ఠం–అని కఠోపనిషత్తు. (1-3-10)

"యో బుద్ధేః పరతస్తు సః" – బుద్ధి కంటే పరమైనదేదో అదే ఆత్మ అని భగవద్గీత (3-42) ప్రతిపాదిస్తున్నది.

బుద్ధ్యతీతమై నిరుపాధికమై పరబ్రహ్మమున్నదని తేలింది. అందులో బుద్ధి ధర్మాలేవీ ఉండవని తెలుస్తున్నది.

"ననిరోధో నచోత్పత్తిః నబద్ధో నచ సాధకః
నముముక్షు ర్నవై ముక్త ఇత్యేషా పరమార్థతా".

జనన మరణాలూ, బంధ మోక్షాలూ, ముముక్షువులూ, సాధకులూ, ముక్తులూ, ఆరూఢులూ–మొదలైన భావాలు పరబ్రహ్మంలో లేవు. అది కేవలమూ, నిర్వికారమూ, అద్వయమూ, పరిపూర్ణమూ.

శ్లో. సంతు వికారాః ప్రకృతేః – దశధా శతధా సహస్రధా వాపి;
కింమేఽసంగ చితస్తైర్న – ఘనః క్వచిదంబరం స్పృశతి. 510

తే. గీ. ప్రకృతిలో మార్పులుండనీ, పదులు, నూర్లు,
వేలు ! నాకేమి వానితో ? ప్రీతిలేని
జ్ఞాన పూర్ణాత్మ నేను; మేఘముల వెన్ని
యైన నెపుడైన నాకాశమంటుపడునె ?

ఈ దృశ్య ప్రపంచం మూల ప్రకృతి (మాయ) వల్ల ఏర్పడింది. అందులో పదులూ, నూర్లూ, వేలూ, లక్షలూ, కోట్లూ వికారాలుండవచ్చు ! ఆయా వికారాలన్నిటితో అసంగుడనూ, చిద్రూపుడనూ ఐన నాకయ్యేదేమి ? ఏమి సంబంధం ? లెక్కలేనన్ని మబ్బులు ఆకాశంలోకి రానీ, గర్జించనీ, వర్షించనీ ! వాటితో ఆకాశానికేమి సంబంధం ?

[వాసనలూ, వృత్తులూ, గుణాలూ – ప్రకృతివల్ల భౌతికంగానూ మానసికంగానూ బుద్ధిలోనూ ఎన్నైనా మార్పులుంటాయి. నేను వాటికాశ్రయాన్ని కనుక, నన్నేమీ అంటవు.]

శ్లో. అవ్యక్తాది స్థూల పర్యంత మేతత్
విశ్వం యత్రాభాస మాత్రం ప్రతీతం
వ్యోమప్రఖ్యం సూక్ష్మమాద్యంత హీనం
బ్రహ్మా ద్వైతం యత్త దేవాహ మస్మి. ॥ 513

తే. గీ. ఆకసమువోలె సూక్ష్మ మాద్యంత రహిత
మైన యెద్దాని యందు నవ్యక్త మాది
స్థూల పర్యంత విశ్వంబు చూడనగునొ ?
ఛాయవలె; నట్టి యద్వైత సత్యమేను.

ఆకాశంవలె సూక్ష్మమై, ఆద్యంతాలు లేక ఉండే దేనియందీ విశ్వమంతా - అవ్యక్తం మొదలుకొని స్థూల శరీరందాకా - ఆభాస మాత్రంగా కనపడుతుందో ? -ఆ రెండవ పదార్థంలేని బ్రహ్మన్నే నేను.

"అహం బ్రహ్మాస్మి" - అనే మహావాక్యార్థం ఇక్కడ విశదీకరింప బడుతున్నది. స్వామీ ! గురుదేవా ! "అవ్యక్తా న్మహతః మహతోఽహంకారః" - అనే శ్రుతి వాక్యాన్ననుసరించి అవ్యక్తం నుంచీ మహత్తూ మహత్తు నుంచీ అహంకారమూ - ఈ ప్రకారంగా ఉత్పన్నమై, అపంచీకృతాలైన భూతాల సూక్ష్మరూపమై, పంచీకృత మహాభూతాల స్థూల రూపమై - అనగా, పరమాణువు కంటే సూక్ష్మమైన అవ్యక్తం నుంచీ స్థూలమైన మహాపర్వతాదులగానూ మహా పరిమాణమైన ఆకాశ రూపంగా ఉన్నదో? - అలా సూక్ష్మాత్మక స్థూలాత్మక కారణాత్మకమై ప్రత్యక్షంగా ఉండే సకల దృశ్యాత్మక ప్రపంచమంతా, అఖండ పరిపూర్ణ సర్వవ్యాపక పరబ్రహ్మమందున్నట్టుగా భాసమాన మౌతున్నది. ఐతే, ఇది మిథ్య - ఈ విశ్వమంతా కల్పనా మాత్రమే ! మాయా నిర్మితం !

విజ్ఞాన సూర్యోదయంతో మాయా తమస్సు పటాపంచలై, కేవలాఖండ పరబ్రహ్మమే అప్రమేయమై, అపరిచ్ఛిన్నమై, సచ్చిదానందమై, ఉంటున్నది. ఆ బ్రహ్మమే నేను.

శ్లో. సర్వాధారం సర్వవస్తు ప్రకాశం
సర్వాకారం సర్వగం సర్వశూన్యం
నిత్యం శుద్ధం నిశ్చలం నిర్వికల్పం
బ్రహ్మా ద్వైతం యత్తదేవాహ మస్మి. ॥ 516 ॥

తే. గీ. ఆశ్రయం బన్నిటికి; వెలుగన్ని వస్తు
వులకు; సర్వాకృతి; సమస్తమందు నుండు;
సర్వశూన్యము నిత్యనిశ్చల విశుద్ధ;
మద్వయము, నిర్వికల్ప బ్రహ్మమను నేను.

అన్నిటికీ ఆధారమూ, అన్ని వస్తువులనూ ప్రకాశింప జేసేదీ, అన్ని ఆకారాలూ తానే ఐనదీ, ఎక్కడచూస్తే అక్కడ ఉండేదీ, అనేకం కానిదీ, శాశ్వతమూ, పరిశుద్ధమూ, కదలిక లేనిదీ, పరిపూర్ణమైనదీ, ఐన అద్వయ బ్రహ్మాన్నే నేను.

సర్వాధారం-అంటే, ఏదిలేక పోతే ఈ దృశ్య ప్రపంచంలో ఏదీ ఉండదో, అదీ! అధిష్ఠానమన్న మాట! ఆభరణాలన్నిటికీ బంగారే ఆధారం; ఆ బంగారే లేకపోతే ఆభరణాలుండవుగా? అలా విశ్వమంతటికీ బ్రహ్మం ఆధారం.

సర్వవస్తు ప్రకాశం - ఆత్మ కాంతి ప్రసరిస్తేనే మనకండ్లు చూస్తాయి; చెవులు వింటాయి; ముక్కు వాసన చూస్తుంది. నాలుక రుచులు గుర్తిస్తుంది; చర్మం స్పర్శ సుఖాన్ని పొందుతుంది. మనసు కోరికలు కోరుతుంది. బుద్ధి భావిస్తుంది.

సర్వాకారం - రాళ్లూ రప్పలూ, చెట్లూ చేమలూ, పశువులూ పక్షులూ, మనుష్యులూ, రాక్షసులూ, దేవతలూ, ధాన్యాలూ, పాములూ - మొదలైనవన్నీ ఆత్మరూపాలే!

సర్వగం -అంతటా వ్యాపించేది; అన్నీ దానిలోనే జరుగుతాయి.

సర్వ శూన్యం – సకల ప్రకృతి రహితం; అధికం కానిదీ, లేక, అనేకం కానిదీ.

నిత్యం – శాశ్వతం; కాలంచేత కట్టుపడనిది.

శుద్ధం – త్రిగుణాత్మకమైన మాయా సంసర్గం లేనిది; శరీరం చేతా, మనసుచేతా, బుద్ధిచేతా, వాని ధర్మాలచేతా, కల్మషంకాక, నిర్మలమైనది.

నిశ్చలం – అది కదలదు; అన్నీ దానిలో కదులుతాయి.

నిర్వికల్పం–సంకల్ప వికల్ప సంశయాలు లేనివి; నిశ్చయాత్మకం.

శ్లో. యత్ర ప్రత్యస్తా శేషమాయా విశేషం
ప్రత్య గ్రూపం ప్రత్యయా గమ్యమానం;
సత్య జ్ఞానానంత మానందరూపం
బ్రహ్మా ద్వైతం యత్త దేవాహ మస్మి. ౫౧౫

తే. గీ. అఖిల మాయా విశేషాల కందరాక;
ప్రత్యగాకారమై మించి ప్రజ్ఞ పరిధి;
సత్యమును జ్ఞానము ననంత సౌఖ్యమైన
యద్వయ బ్రహ్మమేను స్వయంబుగాను.

అంతులేని మాయావికారాలన్నిటికీ అతీతమై, అందరిలోనూ కూటస్థాంతరాత్మగా ఉంటూ, ప్రజ్ఞ (ఇంద్రియ జ్ఞానం) యొక్క పరిధిని దాటినదై, సత్యమూ (ఉనికీ); జ్ఞానమూ, అనంతమూ, ఆనంద సర్వస్వమూ ఐన అద్వయ బ్రహ్మమే, నేను.

శ్లో. నిష్క్రియోఽ స్మ్యవికారోఽస్మి – నిష్కలోఽస్మి నిరాకృతిః
నిర్వికల్పోఽస్మి నిత్యోఽస్మి –నిరాలంబోఽస్మి నిర్ద్వయః. ౫౧౬

తే. గీ. నిష్క్రియుడ, నిర్వికారుడ, నేను; నాకు
నవయవంబులు లేవు; లేవాకృతులును;
నిర్వికల్పుడ, నిత్యుడ నేను; నాకు
నాశ్రయం బొండులేదు; నేనద్వయుండ.

నాకు కర్మలు లేవు; మార్పులు లేవు; అవయవాలు లేవు; ఆకారాలు లేవు; నిండి ఉంటాను; శాశ్వతంగా ఉన్నాను; వేఱే ఆధారం ఇంకేదీలేదు; నేను తప్ప రెండవ పదార్థమే ఏదీలేదు.

[నేనే బ్రహ్మాన్ని-అని దృఢంగా తెలుసుకున్న వెంటనే, అన్నిటితోనూ సంబంధం తెగిపోయింది.]

శ్లో. సర్వాత్మకోఽహం సర్వోఽహం; - సర్వాతీతోఽహ మద్వయః;
కేవలాఖండ బోధోఽహ - మానందోఽహం నిరంతరః. ౫౧౭

తే. గీ. అఖిలమును నేనె, అన్నిట నన్నినేను;
అన్నిటి కతీతుడను నేనె; అద్వయంబు;
కేవలాఖండ జ్ఞానమునై వెలుంగు
శాశ్వతానంద మేనె విశ్వంబులోన.

నేను విశ్వాత్మకుడను; అన్నిటిలో అన్నీ నేనే; అన్నిటికీ అతీతుడను నేనే! రెండవదేదీ లేని వాడను నేను; సంపూర్ణుడనూ, విఱుగుడు లేని జ్ఞానాన్నీ, నిరంతరానందాన్నీ, నేను.

శ్లో. స్వారాజ్య సామ్రాజ్య విభూతిరేషా
భవ త్కృపా శ్రీమహిమా ప్రసాదాత్;
ప్రాప్తామయా శ్రీగురవే, మహాత్మనే!
నమో నమస్తేఽస్తు పునర్నమోస్తు. ౫౧౮

తే. గీ. ఈస్వారాజ్య సామ్రాజ్య మహియ భాగ్య
మలవడియె నాకు తమరి దయాప్రసాద
మహిమచేత మహాత్మ! నమస్సు లివిగొ!
గురువరా! మీకు మిగుల మ్రొక్కుదును నేను.

గురుదేవా! అవ్యాజమైన స్వభావమధురమైన తమరి అపార కృపాకటాక్ష మహిమానుగ్రహంచేత ఈ యనుభవసిద్ధమైన అప్రాకృతమైన స్వారాజ్య సామ్రాజ్య విభూతి లభించింది. ముక్తి సామ్రాజ్య

పట్టాభిషిక్తుడనైనాను. అనాది సంసార బంధం పటాపంచలయింది. మహాత్మా! మూర్తీభవించిన పరబ్రహ్మమా! నీ కనేక సాష్టాంగ దండ ప్రణామాలు! అంటూ శిష్యుడు పలుమారులు మ్రొక్కులు చెల్లిస్తున్నాడు.

శ్లో. మహాస్వప్నే మాయాకృత జని జరా మృత్యుగహనే
భ్రమంతం క్లిశ్యంతం బహుళతరతాపై రనుదినం;
అహంకార వ్యాఘ్రవ్యథిత మిమ మత్యంత కృపయా
ప్రబోధ్య ప్రస్వాపాత్పర మవితవా న్మామసి గురో! ౫౧౯

శా. మాయాకల్పితమైన పెద్దకల! జన్మంబున్ జరామృత్యువుల్
మేయం జూచు నరణ్య మధ్య మది నుమ్మీ! అందహంకారమే
డాయం జొచ్చెను వ్యాఘ్రమై; పడిన తంటాలెన్ని నానాట? నా
శ్రేయంబారసి నిద్రలేపితిరి; మీచే ధన్యుడన్ సద్గురూ!

ఓ గురువరేణ్యా! మీరెంతో దయతో నన్ను నిద్రమేల్కొలిపి, చక్కగా కాపాడినారు. నేనింత వరకూ ఒకానొక దీర్ఘస్వప్నంలో మిడుకుతూ ఉంటిని. ఆకలలో, మాయాకల్పితాలైన జన్మవృద్ధ వ్యాధి మరణాలనే క్రూరమృగాలతో కూడిన ఘోరారణ్యంలో, దారీ తెన్నూ కానక, ఎన్నో కష్టాలు పడుతూ తిరుగు తుంటిని. అహంకారమనే పెద్ద పులి తరుముతూ ఉండెను. భయమూ బాధా చెప్పశక్యం కాకుండా ఉండెను. అలాంటి సంకటంలో ఏమీతోచక అవస్థపడుతున్న నన్ను నిద్రలేపి ఆపద నుంచీ కాపాడి మీరు పుణ్యం కట్టుకున్నారు.

[నిద్ర- అవిద్యా పూర్వకం కనుక కలలు తెప్పిస్తుంది. అరణ్యం తప్పించు కోటానికి వీలులేని ప్రదేశం. అనుదినం – స్వప్నావస్థ ఎంతో కాలం ఉన్నట్లుగా భ్రాంతి గొలుపుతుంది. జీవితం కూడా ఒక మహా స్వప్నం వంటిదేనని భావం.]

శ్లో. నమస్తస్మై సదేకస్మై – కస్మై చిన్మహసే నమః;
యదే తద్విశ్వరూపేణ – రాజతే గురురాజ తే. ౫౨౦

తే. గీ. చెప్పరానంత మిక్కిలి గొప్పతనము
మీది గురురాజ ! మ్రొక్కులు మీకు ! తాము
విశ్వరూపకులై యొకే విధిగ నుంద్రు;
కేలు మోడ్చెద; నివె నమస్కృతులు మీకు !

ఏ బ్రహ్మ వస్తువు ఈ దృశ్యమాన ప్రపంచ రూపంతో విరాజిల్లు తున్నదో ! ఆపరబ్రహ్మ స్వరూపుడవైన, సదా కేవలాత్ముడవైన, అనిర్వాచ్య మహా తేజస్స్వరూపుడవైన, తమకు, ఓ గురురాజా ! నమస్కారం, నమస్కారం! అనంత బ్రహ్మమే – అంతటా సర్వసమానమై ఈ గురుదేవుని రూపంతో దిగివచ్చిందనుకుంటాను. నమస్కారం !

కట్టకడపట శిష్యుడు, గురుదేవుని ఒకానొక దివ్య తేజస్సుగా వర్ణించి, స్వానుభవ జ్ఞానసిద్ధిని నమస్కార పూర్వకంగా ఉపసంహరించు కుంటున్నాడు. స్వామీ ! మహానుభావా ! ఏకరూపుడవూ, కాలత్రయా తీతుడవూ, విశ్వరూపుడవూ, సచ్చిదానందమూర్తివీ, ఐన తమకు నమస్కారం. ఇంతకంటే నేను మీకేమి ప్రతిక్రియ చెల్లించేది ?

## 521-575 కడపటి సలహాలు

శ్లో. ఇతి నతమవలోక్య శిష్యవర్యం
సమధిగ తాత్మ సుఖం ప్రబుద్ధ తత్త్వం
ప్రముదిత హృదయ స్సదేశికేంద్రః
పునరిద మాహ వచః పరం మహాత్మా. ౫౨౧

తే. గీ. శిష్యవరుడు సమాధిలో సిద్ధమైన
సుఖ మనుభవించి. సత్యంబు చూచి; తనకు
సాగిలి నమస్కరింపగా; సంతసించి
దేశికేంద్రుడు బుద్ధులు తెలిపె నిట్లు.

శిష్యశ్రేష్ఠుడు సమాధిగతుడై ఆత్మ సుఖాన్ని తేనెగా అనుభవించి, సత్యాన్ని చక్కగా గుర్తించి, వెలిగిపోతూ, నమ్రతతో

సాగిలపడి మ్రొక్కినందుకు, దేశికోత్తముడు మురిసిపోతూ కొన్ని మంచి సలహాలు ఈ విధంగా ఇచ్చినాడు.

ఎంత గొప్పజ్ఞానియైననూ, తన జ్ఞానం దృఢంగా స్థిరపడిందా, లేదా, అని తన్నుతానే పరీక్షించుకుంటూ ఉండక తప్పదు. ఇలా పరీక్షించుకోవటానికై శిష్యుడెప్పుడూ అచలస్థితిలో ఉండటానికై మళ్ళీ ఉపదేశిస్తున్నాడు, గురుదేవుడు, దీన్నే స్థూణాఖనన న్యాయమంటారు. ఒక గుంజనునాటి మళ్ళీ కదిలించి చూడటమన్నమాట! ఏ మాత్రం కదిలినా తాళ్ళు మొదలైనవి వేసి దిమ్మిస చేస్తారు. ఆ ప్రకారంగా శిష్యుడి పరిపూర్ణ జ్ఞానాన్ని దృఢీకరించటానికై తగిన సలహాలు గురుస్వామి అనుగ్రహిస్తున్నాడు. ఇది భారతీయ గురుశిష్య సంప్రదాయమన్నమాట!

శ్లో. బ్రహ్మ ప్రత్యయ సంతతి ర్జగదతో బ్రహ్మైవ తత్సర్వతః
పశ్యాధ్యాత్మ దృశా ప్రశాంత మనసా సర్వాస్వవస్థాస్వపి;
రూపా దన్యదవేక్షితం కి మభిత శ్చక్షుష్మతాం దృశ్యతే;
తద్వద్బ్రహ్మ విదః సతః కిమ పరం బుద్ధేర్విహారాస్పదం?

మ. అల బ్రహ్మ ప్రతిబింబ సంతతి జగం; బట్లౌట బ్రహ్మంబె కా
కిల నేమున్నది? అన్ని రీతులను నీవీక్షింపు మధ్యాత్మ దృ
క్కులతో. శాంత మనస్సుతో; నెవడు కన్గొగల్గె కండ్లున్న వా
డల రూపంబులు తప్ప నన్యమును? బ్రహ్మజ్ఞానికిన్ సైత మ
ట్టులె బ్రహ్మంబును వీడి బుద్ధి కెదిపట్టున్ వేఱ చింతింపగన్?

విశ్వమంటే, భంగంకాని బ్రహ్మదృశ్యాల వరుసలే నన్నమాట! కాబట్టి, అన్ని విధాలా అది బ్రహ్మమే తప్ప, ఇంకొకటి కాదు. దీన్ని అన్ని స్థితులందూ అధ్యాత్మిక దృష్టితోనూ, శాంతమైనమనసుతోనూ చూడు! కండ్లున్న వాడెవడైనా యెప్పుడైనా తన చుట్టూ రూపాలు

తప్ప ఇంకేమైనా చూడగలిగినాడా? అదే ప్రకారంగానే బ్రహ్మజ్ఞానికైనా తన బుద్ధిని విహరింపజేయటానికి బ్రహ్మం తప్ప ఇంకేమైనా ఉందా?

మనమే వస్తువును చూచినా ఆ దృశ్యంలో విమర్శించే కొద్దీ ఉనికీ, జ్ఞానమూ, ఆనందమే గోచరిస్తాయి. అవి బ్రహ్మంలోని సారం. ఇంకో విధంగా చూస్తే విశ్వమంతా నామరూపాల ముసుగులో ఉండే బ్రహ్మమే ననిపిస్తుంది.

"అస్తి భాతి ప్రియం రూపం – నామ చేత్యంశ పంచకం
ఆద్య త్రయం బ్రహ్మ రూపం – జగద్రూపం తతో ద్వయం"

అనే సూక్తి ననుసరించి సద్రూప, చిద్రూప, ఆనంద రూపాలు బ్రహ్మమనీ, నామరూపాలు రెండూ విశ్వమనీ, శాస్త్రనిర్ణయం. సత్తా, స్ఫూర్తీ, ఆనందమూ – త్రికాలాల్లోనూ ఉండేవి; నామరూపాలు వ్యవహారకాలంలో మాత్రమే ఉండేవి – అంటే, మిథ్యలన్నమాట! ఇదంతా మనసు కల్పించే మహానాటకమే! దాన్నే జగత్తంటున్నాము.

మనవంటి సామాన్య జనానికీ, బ్రహ్మజ్ఞానికీ, దృష్టిభేదం కద్దు! అతడీ దృశ్యప్రపంచాన్ని ఎన్నో రూపాలుగా చూస్తాడు. రూపమనే దాని కొకరంగూ, కాంతీ ఉంటుంది. కండ్లున్నవాడు రూపాన్ని మాత్రమే చూచినట్టుగా, బ్రహ్మజ్ఞాని–నామరూపాలు వదలి, సద్రూప బ్రహ్మాన్ని మాత్రమే చూస్తాడు.

శ్లో. కస్తాం పరానందరసాను భూతి
ముత్సృజ్య శూన్యేషు రమేత విద్వాన్ ?
చంద్రే మహాహ్లాదిని దీప్యమానే
చిత్రేందు మాలోక యితుం క ఇచ్ఛేత్ ?

తే. గీ. పరమ సుఖ వైభవమును విద్వాంసుడెవడు
తుచ్ఛ సుఖమున కాశించి తొలగిపోవు ?

సాంద్ర దీప్తిని వెదజల్లు చంద్రుమాని;
యెవడు చంద్రుని బొమ్మపై నిష్టపడును ?

పరమానంద రసానుభవాన్ని విడిచిపెట్టి, విద్వాంసుడైనవాడెవడైనా, పనికి మాలిన వస్తువుల కోసం ప్రాకులాడుతాడా! ఎండమావుల వంటి విషయసుఖాలను కోరుతాడా! దివ్యదీప్తులు విరజిమ్ముతూ వెన్నెలలు కాసే ఆహ్లాదకరమైన చంద్రుని కాదని, ఎవడైనా చంద్రుడి చిత్తరుబొమ్మను చూడగోరుతాడా ?

నిజంగా అపరోక్షానుభూతి నొందిన మహాపురుషు లెప్పటికీ దృశ్యంలోకీ, విషయసుఖాల్లోకీ, జారిపడబోరు. కొందరు దొంగ సాధువులు పైకి శ్రీరంగనీతులు వల్లిస్తూ, చాటుమాటున దొమ్మరిగుడిసెల్లో దూరుతారు. మాటలతో వేదాంతమూ, మనసుతో విషయలంపటత్వమూ – ఇలాంటి మూర్ఖులు సాధుసన్యాసులా! వట్టి మోసగాండ్రని తెలిసేది. విషయ సుఖాలను తుచ్ఛంగా నిరసించి, స్వస్వరూపోన్ముఖుడైనవాడే విద్వాంసుడు; వాడే జ్ఞాని–అని గురుదేవుడు బోధిస్తున్నాడు, పరిపూర్ణచంద్ర దృష్టాంతంతో, నాయనా ! విషయసుఖాల జోలికి పోవద్దు ! చెడిపోతావు సుమా ! – అంటున్నాడు.

శ్లో. అసత్పదార్థానుభవేన కించి
న్న హ్యస్తి తృప్తి ర్నచ దుఃఖ హానిః;
తద ద్వయానంద రసానుభూత్యా
తృప్తః సుఖం తిష్ఠ సదాత్మ నిష్ఠయా. 523

తే. గీ. అల్పమైన యసత్పదార్థానుభవము
తృప్తి నిడబోదు, దుఃఖాలు తీరిపోవు;
కనుక. నద్వయ సుఖరసం బనుభవించి
యాత్మనిష్ఠను సంతృప్తి నందు మనఘ !

అసత్పదార్థాలను అనుభవించటంవల్ల కొంచెమైనా తృప్తి కలుగదు; దుఃఖాలు నశించవు. అందువల్ల అద్వయమైన ఆనందరసాన్ని

అనుభవిస్తూ సదా ఆత్మనిష్ఠలో ఉండి, అపారసుఖాన్నీ, తృప్తినీ అందుకో, నాయనా!

మిథ్యాభూత ప్రాపంచిక విషయభోగాలూ, స్రక్చందనవేష భూషణాదుల అనుభవాలూ, కొంచెమైనా సంతృప్తిని కలిగించేవికావు. అఖండ బ్రహ్మానంద సుధాపానంచేతనే సంతృప్తి లభిస్తుంది. సంసార తాప శాంతి దొరుకుతుంది. అనాత్మ విషయాలవల్ల ఏలాంటి ప్రయోజనమూ ఉండదు. వాటిమీది భోగేచ్ఛ, ద్విగుణీకృత దుఃఖాలనుకొని తెచ్చుకోవటానికే ఉపకరిస్తుంది. అనుభవించే కొద్దీ ఆశలు పెరుగుతాయేకాని, చల్లారవు. కట్టెలు వేసేకొద్దీ, మంటలు చెలరేగుతాయే కాని, తగ్గుతాయా? విషయభోగాలవల్ల దుఃఖాలు నశించవు. మఱింత ఎక్కువౌతాయి. ఎండమావులను నీళ్ళని భ్రమించి సమీపిస్తే దాహం తీరుతుందా? సంసార దుఃఖ నివృత్తి బ్రహ్మానందానుభవం వల్లనే లభిస్తుంది. ఇంకో విధంగా లభించదు.

శ్లో. స్వమేవ సర్వథా పశ్యన్ - మన్య మానః స్వమద్వయం;
స్వానంద మను భుంజానః - కాలం నయ మహామతే! ॥ 539 ॥

తే. గీ. ఆత్మనే సర్వథా చూచి; అద్వయాత్మ
గూర్చి చింతన కావించి; కొల్లలాడి
ఆత్మ సుఖమును చక్కగా ననుభవించి;
కాలమును బుద్ధి మంతుడా! గడపవోయి!

మహాశయా! నీ వెప్పుడూ ఎక్కడైనా ఎన్ని విధాలనైనా ఎల్ల భావనలందూ ఆత్మనే చూచుకుంటూ ఉండు! అద్వయమైన ఆత్మను గూర్చి మననం చేస్తూ ఉండు! ఆత్మానందాన్ని బాగా అనుభవిస్తూ, కాలం గడుపు!

సర్వథా - అనే మాటకు, సర్వథా, సర్వభావేన, సర్వప్రకారేణ- అనే అర్థాలున్నాయి. అన్ని కాలాల్లో, అన్ని స్థితుల్లో, అన్ని ప్రదే

శాల్లో-అదే పనిగా ఆత్మనిష్ఠలోనే ఉండు! అది నీ నిజమైన స్వభావం కదా? నీవు బహిర్గతుడవైతే, ప్రపంచంలోని ఆత్మ నాటకాన్ని చూడు! అంతర్గతుడవైతేనో? శాంత మనస్కుడవై లోపలి ప్రపంచాన్ని కూడా ఆత్మగానే భావించు! లోపలా, వెలుపలా బ్రహ్మమే తప్ప, మరేమీ లేదనుకో! హాయిగా బ్రహ్మానందాన్ని అనుభవిస్తూ కాలం గడుపు! నీవు బుద్ధిశాలివి. ఎక్కువగా చెప్పుట మెందుకూ?

శ్లో. అఖండ బోధాత్మని నిర్వికల్పే
వికల్పనం వ్యోమ్ని పుర ప్రకల్పనం
తద ద్వయానంద మయాత్మనా సదా
శాంతిం పరామేత్య భజస్వ మౌనం. ౫౨౮

తే. గీ. ద్వైత భావన లాత్మలోపల, నఖండ
జ్ఞానమున; పరిపూర్ణములోన, గగన
వగరములె! కాన, నద్వయానంద మందె
మౌనముగ నుండి శాంతితో మనగదోయి!

అఖండమూ నిర్వికల్పమూ జ్ఞానస్వరూపమూ ఐన ఆత్మలో - ద్వైత భావనలు - ఆకాశంలో గాలిగోపురాలు నిర్మించటం వంటిదే! కాబట్టి పరమశాంతితో, మౌనంగా ఉండి, అద్వయానందమయమైన ఆత్మలో లీనమై పోదువుగాక! అఖండత్వమంటే, త్రివిధ పరిచ్ఛేద శూన్యత్వం - దేశకాల వస్తు పరిచ్ఛేద రహితం.

మౌనమంటే, "యస్మా ద్వాచో నివర్తంతే - అప్రాప్య మనసా సహ-యన్మౌనం యోగి భిర్గమ్యం - తద్భజేత్ సర్వదా బుధః". దేని చేత మనసుతో కూడా వాక్కును నివర్తిస్తున్నదో, ఏది మనో వాచా మగోచరమై ఉన్నదో యోగులకేది సదాగమ్యమై ఉన్నదో, అటు వంటి సకలేంద్రియ నివృత్తిరూప పరబ్రహ్మమైన మౌనాన్ని సదా భజించు! - అన్నారు కనుక, బ్రహ్మానుభవమే మౌనం! అంతేకాని, ఊరక మాట్లాడకుండా ఉండటం మౌనం కాదన్నమాట!

శ్లో. తూష్ణీ మవస్థా పరమోపశాంతిః
బుద్ధే రసత్కల్ప వికల్ప హేతోః;
బ్రహ్మాత్మనా బ్రహ్మవిదో మహాత్మనో
యత్రా ద్వయానంద సుఖం నిరంతరం. ౫౨౭

తే. గీ. కరము సంకల్పములకు వికల్పములకు
హేతువగు బుద్ధి, బ్రహ్మాత్ముడై తరించి;
బ్రహ్మ విదుడైన యోగికి పరమశాంత
మద్వయానంద సుఖమె నిరంతరంబు.

అన్ని సంకల్పాలకూ వికల్పాలకూ కారణమైన మనస్సు, బ్రహ్మాత్ముడై బ్రహ్మ సాక్షాత్కారం పొందిన యోగికి, లయించి పరమశాంతమై ఉంటుంది. ఆ యోగి, ప్రకృతినిదాటి పరబ్రహ్మమై ఉంటాడు. సకలవృత్తి రాహిత్యమైన ఉదాసీన భావం, స్వస్వరూప స్థితిలో ! దాన్నే మౌన మంటారు కూడా.

ఆత్మను బ్రహ్మంతో ఐక్యం చేసినవాడు, బ్రహ్మాత్ముడు. బ్రహ్మాన్ని అనుభవంతో తెలుసుకున్నవాడు బ్రహ్మవిదుడు. ఒక్కొక్కరిలో ఉండేది ఆత్మ; అంతటా అందరిలోనూ ఉండేది బ్రహ్మం. తనలో ఉండే దైవీ శక్తిని అందరిలోనూ గుర్తించేవాడు, మహాత్ముడు.

లేనిపోని ఊహాలే సంకల్పాలు; వాటివల్ల కలిగే ఉద్రేకాలు వికల్పాలు; ఈ రెండిటికీ కారణం మనస్సే ! ఆ మనసు నిటూ అటూ పోకుండా నిలిపితే, ఏకాగ్రంచేసి ఆత్మలో లయిస్తే, పరమశాంతి చేకూరుతుంది. ఈ శాంతిని ప్రతివాడూ, ప్రతిరాత్రీ, గాఢనిద్రలో అనుభవిస్తూనే ఉన్నాడు. ఐతే, అదంత అజ్ఞాన పూర్వకం. అదే అను భవం జ్ఞానపూర్వకంగా నిర్వికల్ప సమాధిలో లభిస్తుంది.

శ్లో. నాస్తి నిర్వాసనా న్మౌనాత్ - పరం సుఖ కృదు త్తమం;
విజ్ఞానాత్మ స్వరూపస్య - స్వానంద రసపాయినః. ౫౨౮

తే. గీ. ఆత్మ తత్వంబు చక్కగా నాకళించి;
యాత్మ నానంద రసపాన మాచరించు
వానికే కోరికలులేని మౌనమునకు
మించినది లేదు సుఖము కల్గించుటకును.

విజ్ఞాన రూపమైన (తన స్వభావాన్ని తాను తెలుసుకున్న) ఆత్మ స్వరూపం కలిగినవాడు కనుకనే, ఆత్మానంద రసాన్ని పానం చేస్తున్న ఆత్మ జ్ఞానికి, సకలమైన సంస్కారాలూ (వాసనలు) నాశ మొందిన మౌనం కంటే, ఇతర సుఖం ఇంకేదీ లేదు.

నిర్వాసనత్వమే మౌనంకాని, ఊరక మాట్లాడకుండా ఉండటం కాదని నిరూపిస్తున్నాడు. అంతఃకరణ శుద్ధి ముఖ్యం; అందులో సంకల్పాలేవీ ఉండరాదు. అన్ని సంస్కారాలూ జ్ఞానాగ్నిలో దగ్ధం చేసి, సమస్తమూ తేజోమయంగానూ చైతన్యమయంగానూ చేసుకొని దృశ్యాలన్నిటినీ, ఉదాసీనంగా చూడటమే మౌనం. ఇది కలిగినవాళ్లే మౌనులు, లేక, మునులు - పరబ్రహ్మ సాక్షాత్కారాన్ని పొందిన మహానుభావులు. కాబట్టి, శిష్యోత్తమా! నీవూ మౌనివై, సంస్కార రహితుడవై, సదా ఆత్మానందామృతం గ్రోలుతూ ఉండు! అని గురు దేవుడు బోధిస్తున్నాడు.

శ్లో. గచ్ఛంస్తిష్ఠన్నుపవిశన్ - శయానోవాఽన్యథాపివా;
యథేచ్ఛయా వసే ద్విద్వా - నాత్మ రామః సదామునిః. ౫౨౯

తే. గీ. చనిన, నిల్చిన, కూర్చుండినను, పరుండి
నను, మఱేస్థితిలో నుండినను, యథేచ్ఛ
గావసించును జ్ఞాన యోగమున జేసి;
ఆత్మయందె సదానంద మందు మౌని.

యోగారూఢుడైన మౌని, నడచినా, నిలుచుండినా, కూర్చుండినా, పండుకున్నా, ఇంకే దశలో ఉండినా, యెప్పుడూ స్వేచ్ఛగానే ఉండి, పరబ్రహ్మమందే క్రీడిస్తూ ఆనందాన్ని అనుభవిస్తూ ఉంటాడు. శిష్యోత్తమా! శరీరంతో చేయదగిన పనులన్నీ చేస్తూ ఉండినప్పటికీ, స్వస్వరూప స్థితి నుంచీ జారవద్దు! ఇదే అచల స్థితి సుమా! అని గురువు హెచ్చరిస్తున్నాడు.

శ్లో. నదేశ కాలాసన దిగ్యమాది
లక్ష్యా ద్యపేక్షాఽప్రతిబద్ధ వృత్తేః
సంసిద్ధ తత్వస్య మహాత్మనోఽస్తి
స్వవేదనే కా నియమాద్యవస్థా ? 530

తే. గీ. సిద్ధ తత్వజ్ఞు డప్రతిబద్ధ వృత్తు
డగు మహాత్ముడు దేశకాలాసనముల
దిగ్యమాది లక్ష్యాల కధీనపడడు;
స్వాత్మ నెఱుగంగ నియమాద్యవస్థలేల ?

పరిపూర్ణ సత్యాన్ని తెలుసుకున్నవాడూ, మనోవృత్తికే ప్రతిబంధాలూ లేనివాడూ, ఐన మహాత్ముడు, దేశమనీ, కాలమనీ, ఆసనమనీ, దిక్కులనీ, యమనియమాదులనీ, ధ్యానలక్ష్యాలనీ - ఈ మొదలైన వాటిమీద ఆధారపడడు. తన ఆత్మను తాను గుర్తించి, ఓలలాడడానికి సూత్రాలన్నీ యెందుకూ?

సాధన కారంభ దశలో ప్రతిసాధకుడూ కొన్ని నియమాలు పాటింపవలసి ఉంటుంది. కాని, అవే పరమార్థంగా జీవితాంతం వదలని వాళ్లు పలువురున్నారు.

సంధ్యావందనానికిసూర్యోపాసనా, గాయత్రీ జపమూ-ముఖ్యం. అవి అవతలపెట్టి ఎన్ని స్నానాలుచేసినా, ఎన్ని సంకల్పాలు చెప్పినా, ఎంత విభూతి పూసినా, ఏమి లాభం?

తే. గీ. ఇది ఘటంబని తెలియుట కెవరికైన
నేమి నియమాలు కావలెనేమి ? యొక్క
లోప రహితంబుగా నుండు చూపె చాలు !
సకల మరయుట కదెజ్ఞాన సాధనంబు.

ఇది కుండ అని తెలుసుకోటానికే నియమాలు అవసరం?దోషం లేని కంటి చూపే చాలు ! యథార్థ జ్ఞానానికదె సాధనం. అదొక్క టుంటే అన్ని వస్తువులనూ గుర్తింపవచ్చు. దానికి స్నాన సంధ్యాది నియమాలెందుకూ ?

ఆత్మానుభవాని కింకో ప్రమాణ మెందుకూ ? స్వయంగా అను భవించే దాంట్లో సందేహాలెక్కడుంటాయి ? అనుభవం కంటే వేఱొక బలవత్తరమైన ప్రమాణం అక్కఱలేదని భావం.

శ్లో. అయమాత్మా నిత్యసిద్ధః – ప్రమాణేసతి భాసతే
నదేశం నాపివా కాలం – న శుద్ధిం వా వ్యపేక్షతే. ౫౩౨

తే. గీ. ఆత్మసైత మట్లనంత సత్యంబౌట
జ్ఞాన సాధనమున కానవచ్చు;
దేశకాలముల విధింపుతో పనిలేదు;
బాహ్య శుద్ధి వలన ఫలములేదు.

ఆత్మ కూడా అదే విధంగా అనంతసత్యం కాబట్టి, జ్ఞానసాధనం (అపరోక్షానుభూతి)వల్ల కనపడుతుంది. దానికి దేశంతోనూ కాలం తోనూ బాహ్యశుద్ధితోనూ అక్కఱలేదు.

శ్లో. దేవదత్తోఽహమిత్యేత – ద్విజ్ఞానం నిరపేక్షకం
తద్వద్బ్రహ్మ విదోఽప్యస్య – బ్రహ్మాహ మితి వేదనం. ౫౩౩

ఆ. వె. ఏను దేవదత్తు డేనని తెలియుట
కనవసరములే నియామకంబు;
లాప్రకారముగనె యగు బ్రహ్మవిదునకు
తాను బ్రహ్మమనుచు తలచుటయును.

నేను దేవదత్తుడను - అనే తెలివి కలుగటానికి నియమాలేవీ అక్కఱలేదు కదా ? ఆ ప్రకారంగానే బ్రహ్మవేత్తకు కూడా - నేను బ్రహ్మాన్ని-అని తెలుసుకోటానికే నియమాలూ అవసరంకాదు.

శ్లో. భానునేవ జగత్సర్వం - భాసతే యస్య తేజసా
అనాత్మక మసత్తుచ్ఛం - కిం ను తస్యావభాసకం ? ౫౩౮

ఆ. వె. ఏది సూర్యునట్టు లీవిశ్వమెల్ల, న
నాత్మకం, బసత్తు, నల్పమనక
భాసిలంగ జేయు స్వప్రకాశముచేత;
తనను వెలుగ జెయదగినదేది ?

అనాత్మకమూ(నిస్సారమూ), అసత్తూ (నిజంకానిదీ),తుచ్ఛమూ (అల్పమూ), ఐన పదార్థాలతో కూడిన సకల ప్రపంచాన్నీ సూర్యుడు వెలిగించినట్టుగా, తన ప్రకాశంతో తానే అధిష్ఠానమై ఏది వెలిగిస్తూ ఉన్నదో! ఆ బ్రహ్మాన్ని వెలిగించే దింకే ముంటుంది ?

ఈ దేహమూ, మనసూ, బుద్ధీ, ఆత్మప్రకాశంలేక పనిచేయవు. కాని, ఆత్మను ప్రకాశింపజేసే దింకే ముంటుంది !

సూర్య - చంద్రాగ్నులను ప్రకాశింపజేసేది కూడా ఆత్మయే ! అది స్వతఃప్రకాశం.

శ్లో. వేదశాస్త్ర పురాణాది - భూతాని సకలాన్యపి
యేనార్థ వంతి తం కిన్ను - విజ్ఞాతారం ప్రకాశయేత్ ? ౫౩౯

తే. గీ. నాల్గు వేదములును, పురాణములు, నాఱు
శాస్త్రములు, సర్వభూత సంచయము, దేన
నర్థ వంతము లాయెనో ? అట్టి శాశ్వ
తంపు జ్ఞాత నికేది వెల్గింపజేయు ?

అన్ని వేదాలూ, పద్ధెనిమిది పురాణాలూ, ఆఱుశాస్త్రాలూ, సకల భూతాలూ, దేనివల్ల అర్థవంతాలైనాయో ? అటువంటి శాశ్వత

మైన జ్ఞాతను వెలిగించేదెంతో ఉంటుంది? దానికేదీ లేదు. అన్నిటికీ అదే చైతన్యం!

వేదాలు నాలుగు :— 1) ఋగ్వేదమూ, 2) యజుర్వేదమూ, 3) సామవేదమూ, 4) అథర్వణ వేదమూ.

శాస్త్రాలు ఆరూ :— 1) శిక్షా, 2) వ్యాకరణమూ, 3) ఛందస్సూ, 4) నిరుక్తమూ, 5) జ్యోతిష్యమూ, 6) కల్పమూ.

దర్శనాలు ఆరూ :— 1) పూర్వమీమాంసా, 2) ఉత్తర మీమాంసా, 3) న్యాయమూ, 4) వైశేషికమూ, 5) సాంఖ్యమూ, 6) యోగమూ.

పురాణాలు 18 :—

శ్లో. బ్రాహ్మం పాద్మం వైష్ణవంచ శైవం భాగవతం తథా
తథాన్యం నారదీయంచ మార్కండేయంచ సప్తమం
ఆగ్నేయ మష్టమం చైవ భవిష్య న్నవమం స్మృతం
దశమం బ్రహ్మకైవర్తం లైంగ మేకాదశం స్మృతం
వారాహం ద్వాదశం చైవ స్కాందం చాత్ర త్రయోదశం
చతుర్దశం వామనంచ కౌర్మం పంచదశం తథా
మాత్స్యంచ గారుడం చైవ బ్రహ్మాండంచ తతః పరం.

పృథివ్యాది పంచభూతాలూ, సకల చరాచర ప్రాణికోటులూ, ఆ పరబ్రహ్మంచేతనే చైతన్యవంతా లౌతున్నాయి. వేదశాస్త్రపురాణాలన్నీ ఆ పరమాత్మను ప్రతిపాదించటానికే పుట్టినాయి. కానీ, యథార్థ తత్వాన్ని సమగ్రంగా వెల్లడింపలేక పోతున్నాయి. భగవంతు డన్నిటికీ అతీతుడు. ఆయన వల్లనే ఇవన్నీ అర్థవంతా లౌతున్నాయి.

శ్లో. ఏషస్స్వయంజ్యోతిరనన్తశక్తిః
ఆత్మాఽప్రమేయః సకలానుభూతిః

అంతులేని ఆనందామృత రసంతో తృప్తిపడి, ఆత్మయందే ఆడుతూ పాడుతూ ఆనందిస్తాడు బ్రహ్మవేత్త. బాహ్యస్ఫురణే ఉండదు. ఆధ్యాత్మికాది తాపత్రయంచేత దుఃఖాన్నీ పొందడు; వనితా ప్రక్చందనాదులచేత సంతోషాన్నీ పొందడు. పుత్రమిత్ర కళత్రాదులందు అపేక్షనూ చూపడు; అప్రియంగానూ ఉండడు. హేయ వస్తువులను చూచి కూడా ఏవగించుకోడు. ప్రియాప్రియ వర్జితుడై నిర్వికారుడై ఉదాసీనుడై ఉంటాడు.

శ్లో. క్షుధాం దేహవ్యథాం త్యక్త్వా - బాలః క్రీడతి వస్తుని;
తథైవ విద్వాన్ రమతే - నిర్మమో నిరహం సుఖీ. ॥538

తే. గీ. ఆకలిని ఒళ్లునొప్పుల నన్నిమఱచి
ఆటబొమ్మల పసిబిడ్డ డాడుకొనును;
జ్ఞానియును నాప్రకారమే-నేను-నాది-
మఱచి సుఖముగ నాత్మలో మగ్నుడగును.

పసిపిల్లవాడు ఆటబొమ్మలతో ఆడుకుంటూ ఆకలి మఱచి పోతాడు. దేహంలోని నొప్పులనూ శ్రమనూ మఱచి పోతాడు. ఆ విధంగానే జ్ఞాని కూడా, నేనూ-నాదీ-అనేది మఱచి ఆత్మానందంలో మునిగి తేలుతూ ఉంటాడు. తన్నుతాను తెలుసుకొని తనలోనే విచారించ గలుగుతాడన్నమాట!

యోగి, "బాలోన్మత్త పిశాచవత్" - బాలునివలెనూ, పిచ్చివానివలెనూ, పిశాచం వలెనూ సంచరిస్తాడంటారు. అతడీ ప్రపంచాన్నే మఱచిపోయి, తన ధోరణిలోనే తానుంటాడు. జీవన్ముక్త దశ, అలాంటిది.

శ్లో. చింతాశూన్య మదైన్య భైక్ష మశనం; పానం సరిద్వారిషు;
స్వాతంత్ర్యేణ నిరంకుశా స్థితి; రభీర్నిద్రా శ్మశానే, వనే;
వస్త్రం క్షాళన శోషణాది రహితం; దిగ్వాస్తు శయ్యామహీ;
సంచారో నిగమాంతవీధిషు; విదాంక్రీడాపరే బ్రహ్మణి. ॥539

సీ॰ ఎట్లనా? అనుచింత యేమియు లేకుండ
దీనుడై భిక్షకు తిరుగకుండ;
ఆహారమేది లభ్యంబౌనొ? భుజియించి;
నదుల నీరంబుపానం బొనర్చి;
స్వాతంత్ర్యమున నంకుశములేక విహరించి;
భయమించుకైన నేర్పడక యుండ
కాటిలోనో, వనవాటిలోనో, నిద్ర
కావించి; మఱి ఉతుకంగ, నెండ

కారవైవంగ పనిలేని యట్టి వస్త్ర
మును ధరించుచు, భూమిశయ్యను పరుండి;
వేత్తలగు వారు వేదాంత వీధులందు
నడచి క్రీడింత్రు బ్రహ్మంబు కడనె యెపుడు.

బ్రహ్మవేత్తలైనవారు ఏ చింతా లేకుండా, దీనంగా భిక్షకు తిరుగకుండా, ఆవేళ కేమిదొరికితే అది భుజిస్తారు. నదీజలాన్ని త్రాగుతారు. స్వతంత్రులై నిరంకుశంగా తిరుగుతారు. నిర్భయంగా శ్మశానంలోనో అడవిలోనో నిద్రిస్తారు. ఉతికి ఆరవేయవలసిన అవసరంలేని వస్త్రం—ఏ చెట్టు బెరడో కట్టుకుంటారు—లేదా, దిగంబరులై ఉంటారు. కటిక నేల మీదనే పండుకుంటారు. వేదాంత వీధుల్లో విహరిస్తారు. పరబ్రహ్మమందే క్రీడిస్తారు.

అవధూతలైనవాళ్ల జీవితాలిలాఉంటాయి. వేళకెవరైనా తెచ్చిపెడితే తింటారు; లేకుంటే లేదు. అందుకోసం ఏమీ చింతించరు. నదులెవరిసొమ్మూకావు కనుక, ఆనీళ్లు త్రాగుతారు. వాళ్ళకు భయమనేదే ఉండదు. వల్లకాటిలోనైనా; అడవిలోనైనా, సొంత యింటికంటే భద్రంగానే నిద్రిస్తారు. వస్త్రమంటే చెట్టు బెరడని కూడా అర్థముంది. ఏబట్ట దొరకినా, లేక, గోనెపట్టే చిక్కినా, హాయిగా ధరిస్తారు. ఉతికే పనీ, ఆరవేసే పనీ ఉండదు, లేదా. దిగంబరులై తిరుగుతారు. తిండీ.

పిచ్చివాడట్లుగా, పసిబిడ్డ వలెను;
సంచరించు నొకప్డు పిశాచివలెను.

పరిపూర్ణ జ్ఞానంతో తొణికిసలాడుతూ ఉండే ఆత్మవేత్త ఒకసారి ఉత్తబిత్తలై ఉంటాడు. ఒకసారి వస్త్రం ధరిస్తాడు. ఒకసారి ఏదైనా చర్మం కట్టుకుంటాడు. పిచ్చివాడి వలెనూ, పసిపిల్లవాడివలెనూ, పిశాచివలెనూ, ప్రపంచంలో తిరుగుతుంటాడు. కనుక అలాంటి మహాత్ములను గుర్తించటం అసాధ్యం. ఒకరి లక్షణాలు చూచి, అందరూ అలాగే ఉంటారని అనుకోరాదు. యతి పంచకం ద్వారా జీవన్ముక్తుని లక్షణాలను శ్రీ శంకరాచార్యుల వారిలా వర్ణించినారు :-

(1) శ్లో. వేదాంత వాక్యేషు సదారమంతః
భిక్షాన్న మాత్రేణ చ తుష్టిమంతః
అశోకవంతః కరుణైక వంతః
కౌపీన వంతః ఖలు భాగ్యవంతః.

వేదాంత వాక్యాలందే రమిస్తారు యెల్లప్పుడూ; భిక్షాన్నంతోనే తృప్తి పడతారు; దుఃఖరహితులై దయావంతులై ఉంటారు. గోచి పెట్టుకొని వీతరాగులై స్వస్వరూపానందం అనుభవించే భాగ్యవంతులు.

(2) మూలం తరోః కేవలమాశ్రయంతః
పాణి ద్వయే భోక్తు మమంత్రయంతః
కంథామపి స్త్రీమివ కుత్సయంతః
కౌపీన వంతః ఖలు భాగ్యవంతః

కేవలం ఏ చెట్టు మొదటనో ఆశ్రయించుకొని ఉంటారు. రెండు చేతులతో భిక్షాన్నం తినటానికి సందేహించకుండా పెట్టుకొంటారు. బొంతను కూడా స్త్రీనివలె నిరసిస్తాడు. గోచిపెట్టుకొని, సర్వసంగ పరిత్యాగియైనవాడే మహాభాగ్యవంతుడు.

(3) దేహాభిమానం పరిహృత్య దూరాత్
అత్మాన మాత్మన్యవలోక యంతః
అహర్నిశం బ్రహ్మణి యేరమంతః
కౌపీన వంతః ఖలు భాగ్యవంతః.

దేహాభిమానాన్ని దూరంగానెట్టి, తనలో ఆత్మను చూచు కుంటూ, రాత్రింబగళ్లు పరబ్రహ్మంలోనే రమిస్తూ, గోచి ధరించిన గొప్ప యోగియే మహాభాగ్యవంతుడు.

(4) స్వానందభావే పరితుష్టిమంతః
సంశాంత సర్వేంద్రియ వృత్తి మంతః
నాంతం న మధ్యం న బహిస్మరంతం
కౌపీన వంతః ఖలు భాగ్యవంతః.

ఎల్లకాలమూ ఆనంద భావంతో తృప్తి పడినవాడై, అన్ని ఇంద్రియాల వృత్తులూ నశించినవాడై, ఆదిమధ్యాంతాలు తెలియని వాడై, గోచిపాతరాయుడైన మహాత్ముడే, మహాభాగ్యవంతుడు.

(5) పంచాక్షరం పావన ముచ్చరంతః
పతిం పశూనాం హృది భావయంతః
భిక్షాశనో దిక్షు పరిభ్రమంతః
కౌపీన వంతః ఖలు భాగ్యవంతః.

ఎప్పుడూ పంచాక్షరీ మహామంత్రాన్నే పవిత్రంగా జపిస్తూ, హృదయంలో పశుపతినే భావిస్తూ, భిక్షాన్నం తిని దిక్కుల సంచరిస్తూ ఉండే గోచిపాతరాయుడే మహాభాగ్యవంతుడు.

శ్లో. కామా న్నిష్కామ రూపీసం - శ్చరత్యేక చరో మునిః
స్వాత్మనైవ సదాతుష్టః - స్వయం సర్వాత్మనా స్థితః. ౫౪౨

తే. గీ. తాను నిష్క్రియుడై కామితముల మెలగు
కాని, ఒంటరిగా నుండు జ్ఞాని యెపుడు;
తృప్తిపడి సొంతమాత్మలో తిరుగులేక
అంతటను నన్నిటను తానె యగుచు నుండు.

నిష్క్రియత్వమే ఆకారం ధరించినట్టుండి యోగారూఢుడై ఉండే ముని, యెల్లప్పుడూ స్వాత్మారాముడై సంతృప్తి వహించి, కేవలుడై ఉంటాడు. తానేమీ కోరక, ఇతరుల కోరికమీద అన్నం తింటాడు, నీళ్లు త్రాగుతాడు, దుస్తులు ధరిస్తాడు. అన్నిటా అంతటా తానే ననుకుంటాడు.

జీవన్ముక్తుడైన విద్వాంసుడు, మనసుకతీతుడై నిరవధికా నందంలో మునిగి తేలుతూ, అంతకంటే పొందవలసినదీ, తెలియవలసిందీ వినవలసిందీ, మననం చేయవలసిందీ, సాక్షాత్కరించుకోవలసిందీ, ఇంకొకటిలేనందున, కృతార్థుడై స్వస్వరూపంలో సంతుష్టి చెంది ఉంటాడు. కోరికలూ, సంకల్పాలూ, వృత్తులూ నశించినవాడై ఉంటాడు. తానే అంతటా అన్నిటా ఉన్నట్టు భావిస్తాడు.

శ్లో. క్వచిన్మూఢో విద్వాన్ క్వచిదపి మహారాజ విభవః;
క్వచిద్ భ్రాంతః సౌమ్యః క్వచిదజ గరాచార కలితః;
క్వచి త్పాత్రీ భూతః క్వచి దవ మతః క్వాప్య విదితః;
చరత్యేవం ప్రాజ్ఞః సతత పరమానంద సుఖితః. 543

మ. అరయన్ మూఢుడొకప్పు; డొక్కపుడు విద్యాపారగుం; డొక్కచో
నరపాలోత్తమ వైభవుం; డొకట నానాదేశ సంచారి; య
జ్ఞర నిష్ఠుండును; పాత్రుడున్, నుతుడు, నింకన్ నింద్యు,
దవ్యక్తుడై
పరమానంద సుఖాత్మకుండయిన యాప్రాజ్ఞుండు కన్పట్టెడిన్.

పరమానంద సుఖాన్నే ఎప్పుడూ అనుభవించే ప్రజ్ఞాశాలి. ఒక ప్పుడు, పలువురు చుట్టు ముట్టినప్పుడు, ఏమీ తెలియని మూఢునివలె ఉంటాడు. ఆశ్రితులడిగిన ప్రశ్నలన్నిటికీ జవాబులిస్తూఒకప్పుడు మహా విద్వాంసునివలె కనపడతాడు. ఇంకోచోట మహారాజ వైభవా లంది నట్టుంటాడు. ఒకానొకప్పుడు పిచ్చివాడివలె తిరుగుతాడు. ఇంకొకప్పుడు మహాసాధువుగా ఉంటాడు. ఒకానొకచోట అజగరం (కొండ చిలువ) వలె మట్టిలోనే పొర్లాడుతూ దగ్గఱకు వచ్చిన ఆహారాన్ని భుజిస్తూ వ్రతస్థుడై గోచరిస్తాడు. ఒక సమయాన ప్రసన్నుడై నానావిధ మర్యాద లకు పాత్రుడై ఉంటాడు. బ్రహ్మరథం పట్టించుకు టాడు. ఇంకో సమ యాన అందఱిచేతా తిట్లూ కొట్లూపడి నిందితుడివలె కానవస్తాడు. ఒక సమయాన అన్ని చేష్టలూ ఉడిగి ఎక్కడో ఎవ్వరికీ తెలియరాక ఉంటాడు. వసుధైవ కుటుంబిగా తిరుగుతాడు. కేవలం పరబ్రహ్మమై ఆనందిస్తాడు.

శ్లో. నిర్ధనోఽపి సదా తుష్టోఽ - ప్యసహాయో మహాబలః;
నిత్య తృప్తోఽప్య భుంజానోఽ-ప్యసమః సమదర్శినః. ౫౪౪

తే. గీ. నిత్యసంతుష్టుడతడయ్యు నిర్ధనుండు;
నమిత బలవంతు డత డసహాయు డయ్యు;
భోగములు లేకయే పరిపూర్ణ తృప్తు
డత డసముడయ్యు సమదర్శి యన్నికడల.

జీవన్ముక్తుడైన యోగి, ఏ కొంచెమైనా ధనం లేకపోయినప్ప టికీ, అపేక్షించడు కనుక, సదాసంతోషిగానే ఉంటాడు. ఏసహాయమూ లేని ఏకాకియైనప్పటికీ, సర్వాత్మకుడు కావటంవల్ల, మహాబలవంతుడై ఉంటాడు. అన్నపానాది భోగాలు లేకపోయినప్పటికీ, అమృత వర్షం లోలోపల కురుస్తూనే ఉంటుంది కనుక, నిత్యతృప్తుడై ఉంటాడు. తనతో సమానులెవ్వరూ లేకపోయినప్పటికీ, సర్వమూ బ్రహ్మ

మయంగా చూస్తాడు కనుక, సమదర్శియై ఉంటాడు. లోకంలో సాధారణ మానవుడికెంత ధనముండినా, ఇంకా కావలెనని ఆరాటపడతాడే కాని, తృప్తిపడడు. ధనం లేకపోతే ఏడుస్తాడు; నానాగడ్డీ కరుస్తాడు. ఎంతకైనా తెగిస్తాడు. తుదకు దొంగతనానికైనా తయారౌతాడు. ఇలా కాక, ఈ మహాజ్ఞాని చిల్లిగవ్వ తనదగ్గఱ లేకపోయినా, సంతోషంగా తృప్తిగా ఉంటాడు.

ఎంత వీరుడైనా ఏ సహాయమూ లేకపోతే, (ధనమూ, సైన్యమూ, ఆయుధసామగ్రీ లేకపోతే), బలవంతులు కాలేడు. కాని, యీ మహాత్ముడు ఆత్మబలంతో అందఱినీ జయించ గలుగుతున్నాడు. అమోఘ సంకల్పసిద్ధుడై ఏమైనా చేయగలుగుతున్నాడు, పరోపకారార్థం. అన్నమూ నీళ్లూ దొరకకపోతే, మనం అల్లాడిపోతున్నాము. అనేక దుఃఖాలనుభవిస్తున్నాము. ఎన్ని భోగాలున్నా ఏడుస్తూనే కాలం గడుపుతున్నాము. కాని, యోగీశ్వరుడైనవాడు, అనంతసుఖంలో ఓలలాడుతూ ఆకలి దప్పులను మఱచి పోతున్నాడు.

మనకా! కొందఱు మిత్రులూ, మఱికొందఱూ శత్రువులూ! కొన్ని యిష్టమూ, మఱికొన్ని అనిష్టమూ! ఒకటి ఒకరికి నచ్చితే, ఇంకొకరికి నచ్చదు. ఇలాంటి ప్రపంచంలో యీ మహాజ్ఞాని, సర్వసముడై సమానదృష్టితో అంతా బ్రహ్మమయ్యంగానే చూస్తున్నాడు. భగవద్గీత ఏమంటుంది!

శ్లో. విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే గవిహస్తిని
శుని చైవ శ్వపాకేచ పండితా స్సమదర్శినః.

విద్యా వినయ సంపన్నుడైన బ్రాహ్మణునియందూ, ఆవునందూ ఏనుగునందూ, కుక్కయందూ, చండాలునియందూ సమదర్శియైనవాడే పండితుడు.

శ్లో. అపి కుర్వన్న కుర్వాణ - శ్చాభోక్తా ఫలభోగ్యపి
శరీర్యప్యశరీర్యేష - పరిచ్ఛిన్నోఽపి సర్వగః. ౫౪౫

తే. గీ. పనులు చేసియు చేయనివాడె యతడు;
ఫలము భోగించియును నంటుపడ డతండు;
నిరభిమానుండు కాయముండియు నతండు;
వ్యక్తి గతుడయ్యు విశ్వైక వ్యాప్తుడతడు.

జ్ఞానియైన మహానుభావుడు వ్యావహారిక దృష్టితో స్నానపాన భోజనాదులు చేస్తూ ఉండినట్టు కనపడినప్పటికీ, పరోపకారార్థమైన కర్మలు జరిపినప్పటికీ, తాదాత్మ్యాభిమానం లేనందువల్ల ఏమీ చేయని వాడే అవుతున్నాడు. పూర్వకర్మ ఫలాలుగా సుఖదుఃఖాలు అనుభవిస్తున్నట్టు కనపడినప్పటికీ, ఏమీ అనుభవించనివాడే అవుతున్నాడు. శరీరంలో ఉండికూడా, నేనూ, నాదీ, అనేది లేదు కనుక, శరీరం లేని వాడే అవుతున్నాడు. దేహదృష్టితో పరిచ్ఛిన్నుడై కూడా, ఆత్మ దృష్టితో అంతటా వ్యాపించినవాడే అవుతున్నాడు.

జ్ఞాని, సర్వకర్మ వర్జితుడూ, సర్వభోగరహితుడూ, నిరుపాధికుడూ సర్వవ్యాపీ - అని నిరూపిస్తున్నాడు. ఆత్మ సాక్షిమాత్రంగా ఉండేది; అకర్త. అన్ని కర్మలూ జ్ఞానాగ్నిలో దగ్ధమైనాయి. నిర్వికారుడు; కర్తృత్వ భోక్తృత్వ బుద్ధులను సంహరించినాడు. ప్రకృతి వశమైన దేహంలో ఉండినా. లేనివాడే! కలలో ఎన్నో అనుభవాలున్నా జాగ్రదవస్థలో అన్నీ మిథ్యలే!

శ్లో. అశరీరం సదాసంత - మిమం బ్రహ్మవిదం క్వచిత్
ప్రియాప్రియే నస్పృశత - స్తథైవచ శుభాశుభే. ౫౪౬

తే. గీ. బ్రహ్మవిదుడు సదా శరీరంబు కాక
తాను ప్రత్యేకముగ నుండుగాన, నతని
నంటవు సుఖాలు కష్టాలు; నట్లుగానె
శుభము లశుభాలు కూడను సోకవెపుడు.

దేహేంద్రియాదులందు తాదాత్మ్యమూ అభిమానమూ యెప్పుడూ లేక సచ్చిదానందరూపంలో ఉండే బ్రహ్మజ్ఞానికి, ప్రియా ప్రియాలు (రాగద్వేషాలు) సోకవు. కష్టసుఖాలూ, శుభాశుభాలూ, అంటవు. పుణ్యపాపాలతోనూ వాటి ఫలాలతోనూ ఏలాటిసంబంధమూ ఉండదు. ద్వంద్వాలకతడతీతుడు.

తానాత్మకంటే వేఱుకాడు. కాబట్టి శరీరేంద్రియాలనే ఉపాధు లుండవు. శరీరం ఎందాకా ఉంటుందో అందాకా కొంత మట్టుకు సుఖ దుఃఖాలున్నట్లు ఇతరులకు తోచవచ్చు. ఉపాధి కారణమైన అవిద్య బొత్తుగా లేనప్పుడు, దాని ధర్మాలైన మేలుకీళ్ళూ, ప్రియాప్రియాలూ ఎక్కడుంటాయి ?

శ్లో. స్థూలాది సంబంధవతోఽభి మానినః
సుఖంచ దుఃఖంచ శుభాశుభేచ
విధ్వస్త బంధస్య సదాత్మనోమునేః
కుతః శుభంవాఽప్య శుభం ఫలం వా ? ౫౪౭

తే. గీ. స్థూల దేహాభిమానికే సుఖము దుఃఖ
మనుభవంబౌట; యట్లె శుభాశుభాలు;
బంధ నిర్ముక్తుడై పరబ్రహ్మమైన
వానికెటు మంచి చెడ్డలు ఫలితమిచ్చు ?

స్థూల సూక్ష్మకారణ శరీరాల సంబంధం కలిగి, నేనూ, నాదీ - అని అభిమానించే వాడికే సుఖమూ, దుఃఖమూ, మంచీ, చెడ్డా, అను భవానికి వస్తాయి. అన్ని అనర్థాలకూ కారణమైన హృదయ గ్రంథిని - అవిద్యాబంధాన్ని - పటాపంచలుచేసి, శరీరత్రయ - గుణత్రయ - అవస్థాత్రయాలకు అతీతుడైన ఆత్మ స్వరూపుడిని, ఆ మంచి చెడ్డలూ, వాటి ఫలితాలూ, ఏమి చేస్తాయి ?

[శరీరమూ, ఇంద్రియాలూ - నేనూ, నావీ - అనటం స్థూల దృశ్యాభిమానం; నేనూ, నాదీ- అనటం అంతఃకరణధర్మమైన సూక్ష్మ దృశ్యాభిమానం; సంతోషమూ, ప్రియమూ చూపటం కారణ దృశ్యాభిమానం.]

శ్లో. తమసా గ్రస్తవద్భానా - దగ్రస్తోఽపి రవిర్జనైః
గ్రస్త ఇత్యుచ్యతే భ్రాంత్యా - హ్యజ్ఞాత్వా వస్తులక్షణం. ౫౬౮

తే. గీ. రవిని రాహువు మ్రింగిన రవళిదోచు
నంతియే కాని; దాన సత్యంబులేదు;
వస్తులక్షణ మెఱుగని ప్రజలు, భ్రాంతి
వలన, రవి మ్రింగబడె నంచు పలుకుచుంద్రు.

రాహువుచేత రవి మ్రింగబడినట్లు ఈ శ్లోకంలో ఉంది. కాని, రాహువు చంద్రుని కబళిస్తాడనీ, కేతువు సూర్యుని కబళిస్తాడనీ అందు వల్ల రెండుగ్రహణాలూ ఏర్పడుతున్నాయనీ శాస్త్రజ్ఞులంటారు. రాహు కేతువులు రెండూ ఛాయాగ్రహాలే కనుక, రెండూ ఒకటే నేమో ?

ఇంతకూ రాహు మండలం సూర్య మండలానికి చాలా క్రింద ఉంటున్నది. సూర్య మండలానికి రాహు మండలం అడ్డంగా వచ్చే సరికి, సూర్యుడు కానరాక పోతాడు. కనుక, మ్రింగటం అబద్ధం. మ్రింగినట్లు మనకుతోస్తుంది. ఈ వాస్తవిక స్థితి తెలియని జనులు, భ్రాంతిచేత రవి రాహువుచేత గ్రసింపబడినాడని చెప్పుకుంటారు. నిజా నికి సూర్యుడు విలక్షణంగా ఆకాశంలో వెలుగుతూనే ఉంటాడు. అంధ కారం ఆవరించటం వల్ల ఈ భ్రాంతి కలుగుతున్నది.

శ్లో. తద్వ ద్దేహాది బంధేభ్యో - విముక్తం బ్రహ్మవిత్తమం;
పశ్యంతి దేహి వన్మూఢాః - శరీరా భాసదర్శనాత్. ౫౬౯

తే. గీ. ఆ ప్రకారముగానె దేహాది బంధ
ముక్తుడగు బ్రహ్మవిత్తము మూఢజనులు;
దేహవంతుని తీరుగా నూహసలిపి
కాంతు; రాభాసగా నుంట కండ్లయెదుట.

అదే ప్రకారంగానే దేహాది బంధాలన్నీ త్రెంచుకొని, పరిపూర్ణంగా బ్రహ్మాన్ని తెలుసుకున్న యోగిని, మూఢులైన జనులు దేహవంతుడి తీరుగానే చూస్తారు - ఆభాసప్రాయంగా దేహం కంటికి కానవస్తుంటుంది కనుక.

[సూర్యుడి కేలాటి బంధాలూ లేనట్లే, జ్ఞానికి కూడా బాధాలు లేవు. ఆత్మ బంధరహితమై ప్రకాశిస్తున్నది. సూర్యుడిని రాహుగ్రస్తునిగా తలంచునట్లే, దేహాతీతస్థితిలో ఉండే జ్ఞానిని, దేహిగా మూఢులనుకుంటున్నారు. అందుకు అజ్ఞాన దృష్టే కారణం. విచక్షణతో యథార్థం తెలుస్తుంది.]

శ్లో. అహి నిర్ల్వయ నీవాయం - ము క్త దేహస్తు తిష్ఠతి;
ఇత స్తతశ్చాల్యమానో - యత్కించి త్ప్రాణవాయునా. ౫౪౦

తే. గీ. బ్రహ్మవేత్త శరీరంబు పాముకుబుస
మెట్టులుండునొ ? అటులుండు; నిక్కడకును
నక్కడకును చరించు నిష్ఠానుసార
ముగను; ప్రాణ సమీర విస్ఫూర్తిచేత.

ఈ జీవన్ముక్తుడైన బ్రహ్మవేత్త (అపరోక్షాను భూతికలవాడు), పాము కుబుసంవలె - ప్రాణవాయువు కొంచెంగా ఇటూ అటూ చలింపజేసే దేహాన్ని - విడిచిపెట్టి, తాను మాత్రం అవికారుడై, అచలుడై, కేవల పరబ్రహ్మమై ఉంటాడు. ప్రాణం పోవు నంతవఱకూ జ్ఞానిదేహం పాము కుబుసంవలె ఉంటుందన్నమాట ! అతనికి దానిమీద అభిమానం ఉండదు.

పాము తన కుబుసాన్ని వదలేటప్పుడు, ఏలాటి బాధనూ అనుభ వించనట్లుగానే, జ్ఞాని తన శరీరాన్ని వదలేటప్పుడు ఏలాటి బాధా అను భవించడు. సంతోషంగా దేహత్యాగం చేస్తాడని భావం.

శ్లో. స్రోతసా నీయతేదారు - యథా నిమ్నోన్నత స్థలం;
దైవేన నీయతే దేహో - తథాకాలోప భుక్తిషు. ౫౫౧

తే. గీ. దూలము నదీప్రవాహాన తేలి వెడలి
నేలమీదికి క్రిందికి వ్రాలినట్లు;
వాని దేహము తనపూర్వ వాసనల ఫ
లంబు లొందును తగిన కాలముల యందు.

నదీ ప్రవాహాన కొట్టుకొని వచ్చే దూలం- దాని యిష్టం లేకుం డానే - నేలమీద మెఱక పల్లాలకు నెట్టబడుతున్నది. అదే విధంగా ప్రారబ్ధ కర్మమనేది యీ దేహాన్ని ఏ దేశంలో ఏ కాలంలో ఏ నిమిత్తంగా కర్మఫలాలనుభవించ వలసి ఉంటుందో, ఆ దేశానికి, ఆకాలానికి, ఆనిమిత్తం దగ్గఱకు ఆకర్మఫలాల అనుభవం కోసం నెట్టబడుతుంది.

జీవిత ప్రవాహంలో తేలివచ్చే యీ దేహం, దైవమిచ్చిన ఉపాధులతో పూర్వకర్మ ఫలాలచేత నెట్టబడుతూ ఉంటుంది. ప్రారబ్ధ కర్మయే శరీర సృష్టికి మూలం - అదే దైవమై ఏకాలంలో ఏదేశంలో ఏమి జరుగవలసి ఉందో, అక్కడికి, తనయిష్టం లేకుండానే జరుపబడు తుంది. నానావిధ సుఖదుఃఖాలను మిట్టపల్లాలుగా పోల్చవచ్చు. ఈ దేహాన్ని సంసార ప్రవాహంలో పడనీయక, జ్ఞాన సాధనంగా ఉపయో గించుకుంటే, ఉత్తమ ఫలితాలను పొందవచ్చు. జ్ఞానికీ సంగతి తెలుసు కనుక, నిస్సంగుడై ఉంటాడు.

శ్లో. ప్రారబ్ధ కర్మపరికల్పిత వాసనాభిః
సంసారి వచ్చరతి భుక్తిషు ముక్తదేహః

సిద్ధః స్వయం వసతి సాక్షి వదత్ర తూష్ణీం
చక్రస్య మూలమివ కల్ప వికల్ప శూన్యః॥ ౫౪౨

తే. గీ. ముక్త దేహియు ప్రారబ్ధ మూలమైన
వాసనల మధ్య సంసారివలె చరించు;
తా నుదాసీనుడగు సాక్షిగానె యుండు;
నేమి మారక, చక్రంపు టిరుసు వోలె.

ఈ లోకంలో దేహం కలిగి కూడా దేహం లేనట్లే నిరభిమానంగా ఉండే జీవన్ముక్తుడు, ప్రారబ్ధ కర్మచేత కల్పింపబడిన సంస్కారాలవల్ల కలిగే కర్మఫలాలనే సుఖదుఃఖాలను, సంసారివలెనే పొల్గొంటున్నాడు. బండిచక్రంలోని ఇరుసువలె సంకల్ప వికల్ప రహితుడై సాక్షిగా ప్రవర్తిస్తున్నాడు పొందవలసిన పరబ్రహ్మాన్ని పొంద గలిగినందువల్ల, జ్ఞాన సిద్ధి లభించింది కనుక, నిర్లిప్తుడై అచలుడై స్వతంత్రంగా ఉంటున్నాడు.

చక్రం తిరుగుతుందే కాని, ఇరుసు తిరగటం లేదు. సాక్షిగా ఉంటున్నది. సాక్షి లేక ఏకార్యమూ జరుగదు; ఇరుసు లేక చక్రం తిరుగదు. సమస్త దేహానికీ ఆధారమైన పరమాత్మ తానుమాత్రమచలుడై సారథిగా ఉంటున్నాడు. పురాకృత కర్మశేషం చేత ఉపాధిగానున శరీరం నిలిచి ఉన్నందున, ఆయా కార్యాలు జరిగేటప్పుడు జ్ఞానికూడా సంసారివలె కనపడుతున్నాడు. కాని, యథార్థ స్థితిలో ఇరుసువలె అచలుడూ, నిస్సంగుడూ ఐ ఉంటున్నాడు.

[ప్రపంచంలో అందఱూ చూడటానికి జ్ఞానికూడా మామూలు మనిషిగానే కనపడతాడు. దాన్ని ప్రారబ్ధ కర్మమని మామూలు మనుష్యులు భావిస్తారు. అంతేకాని, ప్రారబ్ధంకూడా జ్ఞానినేమీ అంటదు. కుండలు చేసే కుమ్మరి సారెకున్న చక్రానికుండే ఇరుసు కేమైనా సంబంధమా? అట్లే జ్ఞాని శరీరంలో ఉంటున్నాడు ]

శ్లో. నైవేంద్రియాణి విషయేషు నియుంక్త ఏష
నైవాప యుంక్త ఉపదర్శన లక్షణ స్థః
నైవక్రియా ఫల మపీష దపేక్షతే న
స్వానంద సాంద్ర రసపాన సుమత్త చిత్తః. ౫౫౩

తే. గీ. విషయముల కంద్రియముల కవ్వింపబోడు;
మాన డొకసాక్షివలె నుదాసీనుడగుచు;
నాత్మ నానంద రసపాయియై మదించు
కతన, నిర్లక్ష్యముగ జూచు కర్మఫలము.

ఉపద్రష్ట (ఊరక చూచేవాడు)గా ఉండే ఈ బ్రహ్మజ్ఞాని, తన ఇంద్రియాలను శబ్దాది విషయాల్లోకి ప్రేరేపించడు; ఆ యింద్రియాలు చేసే ఆయా పనుల నుండి ఉపసంహరించటమూ లేదు. ఆనందమయమైన ఆత్మావలోకనంలో మత్తుడై ఉండటంవల్ల, కర్మ ఫలాలను కొంచెమైనా లక్ష్యపెట్టడు.

అంటే, ప్రారబ్ధకర్మ నెంత మాత్రం లెక్కపెట్టని ఆత్మజ్ఞానిని, ప్రారబ్ధకర్మ కూడా ఏమీ బాధించటం లేదన్నమాట! భోగాలూ, దుఃఖాలూ తమంతట తాము వచ్చిపడినా, ఎంత మాత్రం చలింపడు, ప్రవృత్తి నివృత్తిరహితుడై సుఖదుఃఖాతీతుడై ఉదాసీనుడై ఉంటాడు.

శ్లో. లక్ష్యా లక్ష్యగతిం త్యక్త్వా - యస్తిష్ఠేత్కేవలాత్మనా
శివఏవ స్వయం సాక్షా - దయం బ్రహ్మవిదుత్తమః. ౫౫౪

తే. గీ. లక్ష్య నిర్లక్ష్యగతుల నెల్లను త్యజించి;
కేవలాత్మస్థుడై పంతగించి యుండు
నతడె సాక్షాత్ శివుండన నగు; నతండె
యుత్త మోత్తముడగు బ్రహ్మవేత్త సుమ్ము!

ఇది నాలక్ష్యాన్ని సాధించే మార్గం-ఇది కాదు- ఇది పరబ్రహ్మ స్థానం - ఇదికాదు - ఇది భ్రూమధ్యం! ఇది బాహ్యం! ఇది అంతరం! -

అనుకునే పద్ధతులన్నీ విడిచిపెట్టి, కేవలం ఆత్మయందే ఎవడానంది స్తుంటాడో ? - అతడే బ్రహ్మవేత్తలలో ఉత్తముడు. అతడే సాక్షాత్తుగా శివుడు !

శ్లో. జీవన్నేవ సదా ముక్తః - కృతార్థో బ్రహ్మవిత్తమః;
ఉపాధి నాశాద్బ్రహ్మైవ - సన్ బ్రహ్మాప్యేతి నిర్ద్వయం. ౫౫౩

తే. గీ. బ్రదికి యున్నప్పుడే సదా బ్రహ్మవేత్త
ముక్తుడు కృతార్థుడై యుండు; పొలియగా ను
పాధి; ఇందాక నుండిన పద్ధతిగనె
నిర్ద్వయ బ్రహ్మమై తాను నిల్చిపోవు.

సంపూర్ణ బ్రహ్మజ్ఞాని యీజీవితంలోనే ముక్తుడై, సార్థకజన్ముడౌతాడు. ఉపాధి పతనం కాగానే - ఇంతకాలం తానుండినట్లే - అద్వయ బ్రహ్మంలో కలిసిపోతాడు.

శ్లో. శైలూషో వేష సద్భావా - భావయోశ్చ యథా పుమాన్;
తథైవ బ్రహ్మవిచ్ఛ్రేష్ఠః - సదా బ్రహ్మైవ నా పరః. ౫౫౪

తే. గీ. నటుడు వేషము ధరియించినను, ధరింప
కుండినను, నెట్లు పురుషుడై యుండు ? నట్లె
ఉత్తమోత్తముడగు బ్రహ్మవేత్త కూడ
బ్రహ్మమై యుండు నెప్పుడు; పరుడు కాడు.

నటుడైనవాడు నాటకాల్లో రకరకాల వేషాలు ధరిస్తుంటాడు. స్త్రీ వేషం వేసినా, నపుంసక వేషం వేసినా, రాక్షస వేషం వేసినా, నరసింహామూర్తి వేషం వేసినా, చిత్రవిచిత్రంగా కనిపించి ప్రజల నానందింప జేస్తాడు. ఆ వేషాలు తీసివేయగానే మామూలు పురుషుడౌతున్నాడు. ఆ ప్రకారంగానే బ్రహ్మవేత్త కూడా బాలుడివలెనూ, [illegible] పిచ్చివాని వలెనూ, పిశాచం వలెనూ వ్యవహరిస్తుంటాడు. ఐనా, అతడెప్పటికీ బ్రహ్మ స్వరూపుడే ! అజ్ఞానులకు మాత్రం దేహధారిగా కనపడుతున్నాడు.

శ్లో. యత్రక్వాపి విశీర్ణం సత్ - పర్ణమివ తరోః వపుః పతతాత్;
బ్రహ్మీ భూతస్య యతేః - ప్రాగేవ తచ్చిదగ్నినా దగ్ధం. ౫౫౩

ఆ. వె. బ్రహ్మవేత్త యైన వాని శరీర మెం
తైన చెట్టు నెండుటాకువోలె
రాలుగాక! దాని జోలికేగడు; మున్నె
దగ్ధ మగుట నది చి దగ్నిచేత.

విదేహ ముక్తుని శరీరం, ఎండుటాకు వంటిది. ఎండితేకాని ఆకు చెట్టు నుంచీ రాలదు. జ్ఞాని శరీరం కూడా ప్రారబ్ధ మంతా నిశ్శేషంగా అనుభవమైన తర్వాతకాని, పతనంకాదు. అజ్ఞానులైన వాళ్లకిదేమీ తెలియక అయ్యో! - అనుకుంటారు. పండుటాకు యెండిపోయి చెట్టు నుంచీ రాలి యేపుణ్యతీర్థంలోనో, బావిలోనో, గుడిగోపురం మీదనో, ఇంటి ముందఱనో పడిపోతుంది. అందువల్ల చెట్టుకుగానీ, ఆకుకుగానీ, లాభనష్టాలు లేవు. దుఃఖ సంతోషాలు లేవు. ఆలాగుననే జ్ఞాని శరీరం కూడా ప్రారబ్ధానంతరం ఏ క్షేత్రంలోనో, నదీప్రవాహంలోనో, ఇంట్లో నో, ఊళ్లోనో, మార్గమధ్యంలోనో, ఉత్తరాయణంలోనో, దక్షిణాయనం లోనో, మంచి తిథిలోనో, చెడ్డ తిథిలోనో, ఏ వారంనాడో, ఎక్కడో పడిపోవచ్చుగాక! అందువల్ల విదేహముక్తునికి, లాభంగానీ, నష్టం గానీ, పుణ్యంకానీ, పాపంకానీ, రావటంలేదు. ఎందుకంటే, ఆ శరీరం, అజ్ఞానికి, బ్రదికి ఉండగానే జ్ఞానాగ్ని చేత దహింపబడింది. ఇంకశరీరంతో ఆ ముక్తునికేమీ ఉపయోగంలేదుగా?

శ్లో. సదాత్మని బ్రహ్మణి తిష్ఠతో మునేః
పూర్ణ ద్వయానంద మయాత్మనా సదా;
నదేశకాలా ద్యుచిత ప్రతీక్షా
త్వ ఙ్మాంస విట్పిండ విసర్జనాయ. ౫౫౪

తే. గీ. పూర్ణ మద్వయ మానంద పూరమైన
యాత్మలో - బ్రహ్మమం దెప్పుడలరు యోగి;
చర్మ మాంసపు ముఱికి సంచయము విడువ
దేశ కాలోచితముల ప్రతీక్ష గొనడు.

సచ్చిదానందమైన స్వస్వరూప పరబ్రహ్మమందు నిరంతరం అద్వితీయానంద స్థితిలో స్థిరంగా ఉండే ముక్త పురుషుడు, చర్మ మాంస అమేధ్యాముద్దగా ఉండే శరీరం విడిచి పెట్టడానికై, దేశకాలోచితాలైన ఆచారాలను పాటించే అవసరం ఏమీ లేదు. జ్ఞానికి మళ్ళీ జన్మలేదుగా ! అజ్ఞానులైన వాళ్లు మాత్రం, దేశకాల తిథివారాలు చూచుకోవలసి ఉంటుందని శాస్త్రాలు చెపుతున్నాయి వాళ్ళకు పునర్జన్మ తప్పదుగా !

శ్లో. దేహస్య మోక్షో నోమోక్షః - నదండస్య కమండలోః
అవిద్యా హృదయ గ్రంథి - మోక్షో మోక్షో యత స్తతః. ౫౫౯

తే. గీ. మోక్ష మనగా శరీర విమోచనంబె
కాదు; దండకమండలాల్ కడకుద్రోయు
టదియు మోక్షంబుకా; దవిద్యాత్మకములు
హృదయపుం గ్రంథులూడుటయే విముక్తి.

దేహ త్యాగం చేయగానే మోక్షంరాదు; సన్యాసి, పరివ్రాజకుడు కావటానికై దండ కమండలాలు విసర్జిస్తాడు. ఒకచోట నిలువక ఊరూరూ తిరుగుతాడు. దండ కమండలాల వంటి బాహ్య చిహ్నాలను విడిచినంత మాత్రాన మోక్షం లభిస్తుందా ! దేహం వదలగానే ఆధ్యాత్మిక జ్ఞానం కలుగుతుందా ? నిజమైన మోక్షం హృదయ గ్రంథులు భేదించటమే ! అజ్ఞానమూ, కామమూ, కర్మ - అనేవి హృదయ గ్రంథులని యింతకు ముందే విశదీకరించ బడింది.

శ్లో. కుల్యాయా మథ నద్యాంవా - శివక్షేత్రేపి చ త్వరే
పర్ణం పతతిచేత్తేన - తరోః కిం ను శుభాశుభం ? ౫౬౦

ఆత్మ స్వరూపుడైన విదేహాముక్తుడు కూడా పరమాత్మ కంటే వేఱుకాడని బోధించటానికే ఈ శ్రుతి ప్రమాణం. విదేహాముక్తుడంటే, ప్రపంచ ప్రతీతి యెంత మాత్రం లేకుండా, బ్రహ్మ స్వరూపుడై ఉండటం. ప్రారబ్ధకర్మానుభవం తీరుతూనే స్థూలసూక్ష్మ శరీరరూపంగా పరిణమించిన అజ్ఞానం చేతనంలో విలయం కావటం—ఈ స్థితినే విదేహాముక్తి అంటారు.

జీవన్ముక్తుడికో? అంతో ఇంతో ప్రపంచ ప్రతీతి ఉండనే ఉంటుంది. ఆవరణశక్తి జ్ఞానంతో నశించి పోయినందున అజ్ఞానికింక మళ్ళీ జన్మలేదు. కాని, దగ్ధ బీజన్యాయంగా విక్షేపశక్తి ప్రారబ్ధబలంతో నిలిచే ఉంటుంది. కనుక ప్రపంచ ప్రతీతి తప్పదన్నమాట !

శ్లో. పాషాణ వృక్ష తృణధాన్య కడంగరాద్యా
దగ్ధా భవంతి హి మృదేవ యథా తథైవ
దేహేంద్రియాణి మన ఆది సమస్త దృశ్యం
జ్ఞానాగ్ని దగ్ధ ముపయాతి పరాత్మభావం. ౫౬౮

తే. గీ. శిలలు చెట్లును తృణ ధాన్యములును పొట్టు
మున్నగున వగ్ని దగ్ధమై మన్నుగలియు,
మాద్రి; దేహేంద్రియ ప్రాణ మనము లెసగు
నఖిల జగమాత్మ గలియు జ్ఞానాగ్నికాలి.

. రాళ్ళూ, చెట్లూ, గడ్డీ, ధాన్యమూ, పొట్టూ – మొదలైనవన్ని వస్తువులూ మట్టిలో పుట్టిన పరిణామ కార్యాలు; అవి అగ్నిలో కాలి మళ్ళీ మట్టిలోనే కలిసిపోయి, కారణరూపాన్ని పొందుతున్నాయి. అదే ప్రకారంగా దేహమూ, ఇంద్రియాలూ, ప్రాణాలూ, మనస్సూ – మొదలైన స్థూల సూక్ష్మ దృశ్య ప్రపంచమంతా ఆత్మ కార్యమే కనుక, జ్ఞానాగ్నిలో దగ్ధమై మళ్ళీ స్వకారణమైన పరమాత్మలో చేరుతున్నాయి. (ఇదే విదేహా కైవల్యం !)

[కడంగ రాద్యాః - అనే దానికి, కటాంబరాద్యాః - అనే పాఠాంతరం కద్దు! కటమంటే చాప; అంబరమంటే బట్ట.]

శ్లో. విలక్షణం యథా ధ్వాంతం - లీయతే భానుతేజసి;
తథైవ సకలం దృశ్యం - బ్రహ్మణి ప్రవిలీయతే. ౫౬౫

ఆ. వె. భాను కాంతి కంటె ప్రత్యేకముగ నుండు
నంధకారమెల్ల నా యినోద
యమున నణగినట్లె; యణగు బ్రహ్మమునందు
నీ ప్రపంచ దృశ్యమెల్ల సమసి.

సూర్యకాంతీ, చీకటీ - రెండూ పరస్పర విరుద్ధాలు; ఐనప్పటికీ, చీకటి సూర్యకాంతిలో లీనమై పోతున్నది. అదే ప్రకారంగా దృక్కు-బ్రహ్మమూ, దృశ్యం జగత్తూ; రెండూ పరస్పర విరుద్ధ ధర్మాలు కలవి. బ్రహ్మం త్రికాలాబాధ్యమూ, చేతనమూ, ఆనందమయమూ; అపరిచ్ఛిన్నమూ; దృశ్య జగత్తు కనపడి నశించేదీ, అచేతనమూ (జడమూ), దుఃఖమయమూ, పరిచ్ఛిన్నమూ; ఐనప్పటికీ దృశ్యప్రపంచమంతా దృగ్రూపమైన బ్రహ్మంలో లీనమైపోతున్నది. విదేహముక్తుడు సమస్త దృశ్య రహితుడై ఉన్నాడని భావం.

దీపంవెంటా నీడ కూడా కనపడుతుంది. దీపం పోతే, నీడ ఉండదు. కాబట్టి, దీపం కంటే నీడ వేఱుకాదు. దీపం బాగా అంతటా ప్రకాశిస్తే, నీడ అందులోనే లయమై పోతున్నది కదా!

శ్లో. ఘటం నష్టే యథా వ్యోమ - వ్యోమైవ భవతి స్ఫుటః;
తథైవోపాధి విలయే - బ్రహ్మైవ బ్రహ్మవిత్ స్వయః. ౫౬౬

ఆ. వె. కుండ పగిలినపుడు కుండ లోపలి బయ
లంతులేని బయలె యగును కాదె?
అటు లుపాధి విలయమై పోయినంతనే
బ్రహ్మవిదుడు కూడ బ్రహ్మమగును.

ఆ. వె. కాల్వలోనొ? నదినొ? కాక శివక్షేత్ర
మందొ? లేక, మార్గమందొ? పడును
గాక! చెట్టు నుండి ఆకుతానొక్కటి;
మంచి చెడ్డలగునె క్ష్మాజమునకు?

చెట్టు నుంచీ ఆకొకటి రాలి ఏ కాల్వలోనో, నదిలోనో, శివక్షేత్రంలోనో, నలుగురూ నడిచే దారిలోనో పడుతుందిగాక! దానివల్ల ఆచెట్టుకేమైనా మంచి చెడ్డలు లభిస్తాయా? లేదుకదా?

శ్లో. పత్రస్య పుష్పస్య ఫలస్య నాశవత్
దేహేంద్రియ ప్రాణధియాం వినాశః
నైవాత్మనః స్వస్య సదాత్మక స్యా
నందాకృతే ర్వృక్ష వ దస్తి చైషః. ౫౬౧

ఆ. వె. ఆకు, పువ్వు, పండు, నవని జుంబునరాలు
నట్లె దేహమింద్రియములు ప్రాణ
బుద్ధులవి నశించు; పూర్ణమౌనానంద
మాత్మ చెట్టువోలె నట్లె యుండు.

ఆకులూ, పూలూ, పండ్లూ చెట్టునుంచీ రాలి నశించిపోయినా, చెట్టు మాత్రం చెక్కుచెదరక అట్లనే నిల్చి ఉంటుంది. అట్లే, దేహమూ ఇంద్రియాలూ, ప్రాణమూ, బుద్ధీ నశించినప్పటికీ, ఆత్మ సుస్థిరంగా ఉంటుంది. అది శాశ్వత సత్యమూ, నిరంతరానందమయమూ, స్వస్వరూపమూ కదా?

శ్లో. ప్రజ్ఞాన ఘన ఇత్యాత్మ - లక్షణం సత్యసూచకం
అనూద్యోపాధికస్యైవ - కథయంతి వినాశనం. ౫౬౨

తే. గీ. ఆత్మ లక్షణమును మాటలందు దెలుప
శ్రుతులు ప్రజ్ఞాన ఘన మనుచును వచించు;
సత్య సూచక మది; వినాశము వహించు
నవి యుపాధులె యని తెలియంగ బల్కు.

ఆత్మ లక్షణాన్ని మాటిమాటికీ శ్రుతులు, "ప్రజ్ఞాన ఘనః" - ప్రజ్ఞానపు ముద్ద (జ్ఞాన స్వరూపం) - అని పలుకుతాయి. అందువల్ల ఆత్మ త్రికాల సత్యమనీ, నశించేవి ఉపాధులు మాత్రమేననీ గట్టిగా తెలుస్తుంది.

ప్రజ్ఞానం బ్రహ్మ, సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ, విజ్ఞాన మానందం బ్రహ్మ, ఏకమేవాద్వితీయం బ్రహ్మ - ఇత్యాది శ్రుతి వాక్యాలన్నీ ఆత్మ లక్షణాన్ని, సచ్చిదానందమూ, శాశ్వతమూ, పరిపూర్ణమూ, ఏకమూ అని చాటుతున్నాయి. ఆత్మ-ఇతర దృశ్యాలేవీ లేక జ్ఞప్తిరూపంగా ఉంది. తద్వ్యతిరేకమైన అనాత్మలు (శరీరేంద్రియాదులు) మాయోపాధివల్ల పుట్టినవి కనుక, అశాశ్వతాలు. అంటే, మాయా, దానికార్యాలూ మిథ్యాభూతాలని చెప్పినట్టయింది.

శ్లో. అవినాశీ వా అరేఽయ - మాత్మేతి శ్రుతి రాత్మనః
ప్రబ్రవీ త్యవినాశిత్వం - వినశ్యత్సు వికారిషు. ౫౬౩

తే. గీ: "ఓసి ప్రియురాల ! ఈ యాత్మ మాసిపోని"-
దనెడి శ్రుతివాక్యమున నర్థమగునదింతె;
మార్పు లొందుచు క్రమముగా మాసిపోవు
వస్తువుల మధ్యనాత్మ శాశ్వతము సుమ్ము !

"అవినాశీ వా అరేఽయ మాత్మా" - ఈ యాత్మకుచావులేదు. ప్రియురాలా ! - అనే శ్రుతి వాక్యం బోధించేదేమిటంటే, జన్మమృత్యు జరా దుఃఖాదులనే వికారాలుండే దేహాదులు నశించినా, ఆత్మనశించేది కాదని [శ్రుతి-బృహదారణ్యకమే !]

ఆకాశం అంతటా వ్యాపించి ఉంది; దీన్ని మహాకాశమంటారు. ఇదే ఒక కుండలో ఉంటే, దాన్ని ఘటాకాశమంటారు. కుండ పగిలి పోతే, ఘటాకాశం కాస్తా మహాకాశంలో కలిసి పోతున్నది. నిజానికి ఆకాశమంతా ఒక్కటే! ఉపాధుల వల్ల వేఱవేఱే పేర్లతో వ్యవహ రింపబడుతుంది. ఉపాధులు నశిస్తే ఆకాశం ఏకమౌతుంది. అదేవిధంగా బ్రహ్మచైతన్యం ఒక్కటే! మాయోపాధిలో బింబించి ఈశ్వరుడనీ, అవిద్యోపాధిలో బింబించి జీవుడనీ, వేఱువేఱుగా వ్యవహరింపబడు తున్నది. యథార్థ జ్ఞానం కలిగిన యోగి, మాయోపాధి అవిద్యో పాధులనూ వాటి కార్యాలనూ మిథ్యా భూతాలుగా గ్రహించి,ఏకైక బ్రహ్మ సాక్షాత్కారాన్ని పొందుతాడు. తాను నిరుపాధిక పర బ్రహ్మంగా ఉంటున్నాడు.

అంతఃకరణలో పడిన చైతన్య ప్రతిబింబమూ, అంతఃకర ణమూ – ఈ రెండిటికీ అధిష్ఠానమైన కూటస్థాత్మ కలిసి,జీవుడైనాడు. మాయా, అందులో పడిన చైతన్య ప్రతిబింబమూ – ఈ రెండిటికీ అధిష్ఠానమైన బ్రహ్మమూ, కలిసి, ఈశ్వరుడైనాడు.

(1) జీవుడి ఉపాధి, అవిద్య (వ్యష్టిలో), స్థూల సూక్ష్మకారణా లనే మూడూ అతడి శరీరాలు. విశ్వ తైజస ప్రాజ్ఞులు ఆయా దేహాభి మానులు. జాగ్రత్ స్వప్న సుషుప్తులు – అతడి అవస్థలు ఈ తొమ్మిది కార్యాలూ, ఇన్నిటికీ కారణమైన అవిద్యా, దాని అధిష్ఠానమైన కూటస్థ చైతన్యమూ –ఈ పదకొండూ కలిసి జీవశబ్దానికి వాచ్యార్థం; అవిద్యనూ దాని కార్యాలనూ బాధింపగా మిగిలే అసంగ కూటస్థ సచ్చిదానంద సాక్షి రూపం, జీవశబ్దానికి లక్ష్యార్థం.

(2) ఈశ్వరుడి ఉపాధి మాయ (సమష్టి); విరాట్. హిరణ్యగర్భ అవ్యాకృతులు ఈశ్వరుడికి మూడు దేహాలు. వైశ్వానరుడూ సూత్రాత్మా ఈశ్వరుడూ, ఆయా దేహాల అభిమానులు. సృష్టి స్థితి లయాలు అతడి అవస్థలు. ఈ తొమ్మిది కార్యాలూ, ఇన్నిటికీ కారణమైన మాయా, దాని అధిష్టానమైన పరబ్రహ్మమూ - ఈ పదకొండు తత్వాలూ కలిసి ఈశ్వర శబ్దానికి వాచ్యార్థం; మాయనూ దాని కార్యాలు పదకొండింటినీ బాధింపగా మిగిలే ఏకైక పరిపూర్ణ పరబ్రహ్మాన్ని తెలుసుకోటం, ఈశ్వర శబ్దానికి లక్ష్యార్థం.

ఇలా జీవేశ్వరులను విచారణ చేయగా, సారమైన లక్ష్య భాగాలు రెండూ - కూటస్థుడూ పరబ్రహ్మమూ ఒకటేనని జ్ఞానులు కనుగొన్నారు.

శ్లో. క్షీరం క్షీరే యథాక్షిప్తం - తైలం తైలే జలం జలే;
సంయుక్త మేకతాం యాతి - తథాత్మ న్యాత్మ విన్మునిః. ౫౬౭

తే. గీ. పాలబోసిన పాలును; తైలమందు
తైలమును; నీళ్ళలో నీళ్లు మేళగించి
ఒకటిగా నుండునట్లుగా నుండునాత్మ
యగుచు నాత్మను తెలిసికొన్నట్టి మునియు.

పాలల్లో పాలూ, తైలంలో తైలమూ, నీళ్ళలో నీళ్ళూ పోసి చూస్తే ఒకే రకంగా, ఒకే పదార్థంగా, అభేదంగా ఉంటాయి. అదే ప్రకారంగా ఆత్మ సాక్షాత్కారాన్ని పొందిన ముని కూడా, దేహత్యాగానంతరం బ్రహ్మ చైతన్యంలో (నిరుపాధికుడై) ఐక్యం పొందుతాడు.

శ్లో. ఏవం విదేహ కైవల్యం - సన్మాత్రత్వ మఖండితం;
బ్రహ్మ భావం ప్రపద్యైష - యతి ర్నావర్తతే పునః. ౫౬౮

ఆవరణ శక్తి అనే అజ్ఞానపు ముసుగుండుటమే బంధమూ, అది లేకపోవటమే మోక్షమూ - అని చెప్పుకోవచ్చు. బ్రహ్మ మెప్పుడూ నిరావరణ నిరుపాధికం కనుక, ఒకానొక ముసుగు (ఆవరణం) ఉండట మనేదే అసంభవం. ఆవరణ మనేదే ఉంటే, అద్వైతానికే భంగం కలుగుతుంది. బ్రహ్మం కంటే ఇంకో పదార్థం ఉండటాన్ని (అద్వైత హాని) - శ్రుతులు సహించటం లేదు. అద్వైతం తథ్యమని అన్ని శ్రుతులూ ఎలుగెత్తి చాటుతున్నాయి. "ఏకమేవా ద్వితీయం బ్రహ్మ" అఖండమూ, ఏకరసమూ, బ్రహ్మం.

శ్లో. బంధంచ మోక్షంచ మృషైవ మూఢాః
బుద్ధే ర్గుణం వస్తుని కల్పయంతి;
దృగా వృతిం మేఘకృతాం యథారవౌ
యతోఽద్వయాఽసంగ చిదేత దక్షరం. ౫౭౨

తే. గీ. బుద్ధి గుణములె యగు బంధ మోక్షములను
అజ్ఞు లారోపణ మొనర్తు రాత్మయందె;
కంటితెర మేఘకృత మిను నంటినట్లు;
లద్వయ మసంగ మీజ్ఞాన, మక్షరంబు.

బంధ మోక్షాలు రెండూ వ్యర్థంగా మూఢులు కల్పిస్తున్నారు. ఇవి బుద్ధి ధర్మాలు. బుద్ధిలో ప్రతి ఫలించి దానిమీద తాదాత్మ్యాభి మానం పెట్టుకున్న చిదాభాసుని (జీవుని) ధర్మాలు. నిర్గుణ పరబ్రహ్మ నికి లేవని సూర్య మేఘావరణ దృష్టాంతంతో నిరూపిస్తున్నారు. మేఘాలు ఆవరించినప్పుడు కన్ను సూర్యబింబాన్ని చూడలేకపోతున్నది. ఆవరణ తొలగినప్పుడు చూడగలుగుతున్నది. మేఘాలెక్కడనో క్రిందా- సూర్యుడెంతో పైనా- ఐనా సూర్యుడిని మేఘావృతుడుగా మూఢులు

తలచుచున్నారు. అది మనకంటి తప్పే కాని, సూర్యుడి తప్పుకాదు కదా! సూర్యుడెప్పుడూ నిరాటంకంగా ప్రకాశిస్తూనే ఉన్నాడు. అదే ప్రకారంగా ఆత్మ, అద్వయమై అసంగమై చైతన్యమై - శాశ్వతమై వెలుగుతూనే ఉన్నది. యధార్థం తెలియక స్వయంప్రకాశ బ్రహ్మాన్ని గురించి మూఢులు మిథ్యావాదాలు చేస్తున్నారు. జ్ఞానులు సత్యం గ్రహించి ఆనందిస్తున్నారు.

శ్లో. అస్తీతి ప్రత్యయో యశ్చ - యశ్చ నాస్తీతి వస్తుని
బుద్ధేరేవ గుణావేతౌ - నతు నిత్యస్య వస్తునః. 523

తే. గీ. ఆత్మను గురించి బంధమున్నట్లుకాని
ఉండ దన్నట్లుకాని; యీ యూహలెపుడు
బుద్ధి యారోపణలె కాని; పొందబోవు
బ్రహ్మమును; నిత్య సత్యమై వరలు కతన.

వ్యవహార మంతా బుద్ధి ధర్మం; వ్యవహారాతీతమయింది పర బ్రహ్మం. అదే అద్వైతం. ఈ విధంగా చెప్పుకుంటే ద్వైతం ప్రసక్త మౌతుంది. చూడండి! బ్రహ్మం ఉన్నది - స్వయం ప్రకాశమానం, ఆనందం, జ్ఞానం- ఈ ప్రకారంగా అనుకోటమూ; అదిలేదు-కనపడదు- శూన్యం-అని అనుకోటమూ; రెండూ బుద్ధి ధర్మాలే! నేను బ్రహ్మాన్ని మాయ అబద్ధం - అని అనుకోటమూ, ఈ ప్రపంచమే నిజం - నేను బ్రహ్మాన్నికాను - అనుకోటమూ - బుద్ధి-లేక, మనోధర్మాలే! ఏది భావించినా, ఏదిధ్యానించినా, ఏది తెలిసినా, ఏది విచారించినా-అన్నీ బుద్ధి ధర్మాలే కదా! బుద్ధే అందుకు సాధనం. సర్వసాధనా రహితమైన ఆత్మకా ధర్మాలులేవు; గుణాలులేవు; అవి ఆత్మ కన్వయించవు.

శ్లో. అతస్తౌ మాయయాక్లృప్తౌ - బంధ మోక్షౌ న చాత్మని;
నిష్కలే నిష్క్రియే శాంతే - నిరవద్యే నిరంజనే;
అద్వితీయే పరే తత్త్వే - వ్యోమవత్ కల్పనా కుతః ? ౫౭౮

మ. కనుకన్ మాయ యొనర్చుగారడియె కాకన్. బంధ మోక్షంబు లా
త్మనులే; వెట్టులు నద్వయంబు నిరవద్యంబై, కళాకర్మ రం
జనహీనంబును శాంతమై పరమునై సత్యంబునై యాకసం
బును బోలెన్ వెలుగొందు తత్త్వమున నొప్పున్ కల్పనల్? సాధ్యమే?

బంధ మోక్షాలనేవి బ్రహ్మం గుణాలు కానందువల్లనూ, బుద్ధి ధర్మాలే ఐనందువల్లనూ, బుద్ధికూడా మాయాకల్పితమే కాబట్టి, బుద్ధి ధర్మాలు సైతం మాయా కల్పనలే! ఆత్మకు బంధమోక్షాలు లేవు. అనంతాకాశంవలె నిష్కలమూ (అవయవరహితమూ), నిష్క్రియమూ (క్రియారహితమూ), శాంతమూ, నిరవద్యమూ (ఆరోపణలు లేనిదీ), నిరంజనమూ (దేన్నీ అంటనిదీ), అద్వితీయమూ (రెండవది లేనిదీ), ఐన పరమాత్మలో కల్పనలెలా ఉండగలుగుతాయి?

శ్లో. ననిరోధో నచోత్పత్తిః - నబద్ధో నచసాధకః
నముముక్షు ర్నవై ముక్త - ఇత్యేషా పరమార్థతా. ౫౭౯

తే. గీ. లేదు చావింక, పుట్టుక లేదు; లేదు
బంధ మనునది; సాధించువాడు లేడు;
మోక్షకాముకుడును లేడు; ముక్తుడైన
యతడులే; డిదియే పరమార్థ మింక.

సచ్చిదానంద ఘనమైన ఆత్మకు ఉత్పత్తి లేదు. ప్రళయమూ లేదు. "జాతస్యహి ధ్రువో మృత్యుః"-పుట్టినదానికిచావుతప్పదన్నారు. కాని, పుట్టుకే లేకపోతే, చావెక్కడిదీ? ఉత్పన్నం కాని దానికి బంధ

మొక్కడిదీ? బంధమే లేకపోతే, దాని విముక్తికై శ్రమపడేవాడూ, ఉండడుకదా! మోక్షం కోరేవాడే లేనప్పుడు, మోక్షమూ, ముక్తుడూ ఎక్కడ? ఈ బంధ మోక్షాలు మొదలైనవన్నీ వ్యవహార దృష్టిలో బుద్ధి కల్పితాలే కాని, వాస్తవంగా ఉండేవి కావన్నమాట! ఆత్మ ఒక్కటే పారమార్థిక సత్యం. తత్-త్వం-నీవే అబ్రహ్మం. ఇప్పుడు క్రొత్తగా కలిగిన లాభమేముందీ? ఉన్న స్వస్వరూపాన్ని తెలుసు కున్నందున? - అయ్యో! నేనెంత మూర్ఖుడను? నాసంగతే నేను తెలుసుకోలేక పోతినే? - అనుకోటం జరుగుతుందేమో? ఇంతకంటే ఏముంటుంది, నాయనా! ఇదే పరమార్థం-అని గురువు బోధించినాడు. ఇక్కడికీ బోధ సమాప్తమయింది

ఈ శ్లోకం వేదాంత పంచదశిలోనూ మాండూక్యోపనిషత్తూ మొదలైన మరికొన్ని ఉపనిషత్తుల్లోనూ కనపడుతున్నది. ఈ బంధ మోక్షాలూ, ధర్మాధర్మాలూ, మొదలైన ద్వంద్వాలన్నీ ద్వైత మున్నప్పుడే ఉంటాయి. అనుభవంలో ఉన్నదీ, చెప్ప సాధ్యం కానిదీ, అంతా బ్రహ్మమే! అదే పరమార్థం.

## 576-578 కృతార్థుడైన శిష్యుడు

శ్లో. సకల నిగమచూడా స్వాంత సిద్ధాంత రూపం
పర మిద మతి గుహ్యం దర్శితం తే మయాద్య;
అపగత కలి దోషం కామ నిర్ముక్త బుద్ధిః
స్వసుత వదస కృత్వాం భావయిత్వా ముముక్షుం. ౫౭౬

ఉ. ఈ కలికాల దోషముల నిట్టి మునింగియు మోక్ష కాంక్షివౌ
నీకు, మనస్సు కోరికల నింపని వానికి, సర్వనైగ మాం
తైక రహస్యమైన పరమార్థము, వేద సమస్త సారమున్
నాకొడుకట్లె సారెకును నర్మములే కిటు నేడు పల్కితిన్.

నాయనా! నాకు మంచి శిష్యుడవే దొరకినావు. ఇది పరమ గుహ్యమైన సకల వేదాంత సిద్ధాంతరహస్యం. కన్నకొడుకుకు చెప్పినట్లుగా నీకు వివరించి తేల్చి చెప్పినాను. నీవు కలికాల దోషాలేవీ లేనివాడవు. మోక్షాపేక్ష కలవాడవు. అంతశ్శత్రువులను జయించినవాడవు. నిర్మలమైన మనస్సున్నవాడవు. ఉపనిషత్తుల సారాన్ని సంపూర్ణంగా నీకు బోధించినాను. పదే పదే మననంచేసి, కృతార్థుడవు కమ్ము!

ఈ శ్లోకంతో గురుబోధ సంపూర్ణమయింది. మొదట మొదట శిష్యుడు శోకమోహాలతో ఆర్తుడై దరికానక గురుదేవు నాశ్రయించినాడు. ఈ గ్రంథంలోనే తొలుత చెప్పిన రీతిగా ప్రార్థించినాడు. దయామయుడైన దేశికేంద్రుడు తన కరుణాకటాక్షాలను వెదజల్లి మూలా జ్ఞానాన్ని నశింపజేసినాడు. స్వానుభవ రహస్యాలతో కూడిన ఉపదేశ భాగాన్ని ఆరంభించి ఆర్తుని తాపం హరింపజేసినాడు. నడుమ నడుమ శిష్యుడు తన సంశయాలను అడిగి, భక్తి శ్రద్ధలతో సమాధానాలు విని, అఖండ జ్ఞానవంతుడు కాగలిగినాడు. కట్ట కడపట గురుదేవుడు—''ననిరోధో నచోత్పత్తిః''—అనే శ్లోకం దాకా, ఉపదేశింపవలసిన దంతా అనాయాసంగా ఉపన్యసించి, ఉపసంహరించినాడు. శిష్యుని వినయవిధేయతలనూ, భక్తి శ్రద్ధలనూ, యోగ్యతనూ చూచి, గురువు మిక్కిలి సంతోషించి, మెచ్చుకుంటున్నాడు.

శ్లో. ఇతి శ్రుత్వా గురోర్వాక్యం - ప్రశ్రయేణ కృతానతిః
స తేన సమను జ్ఞాతః - యయౌనిర్ముక్త బంధనః. 522

క. గురువాక్యంబులు వినుకొని
పరమానందమున మ్రొక్కి పాదంబులకున్
గురు ననుమతితో శిష్యుడు
తిరిగెను బంధము లవెల్ల తీరినవాడై.

గురుదేవుల మాటలన్నీ విన్న శిష్యోత్తముడు సగౌరవంగా సాగిల పడి నమస్కరించినాడు. ఆయన అనుజ్ఞను పొంది బంధాలు తీరినవాడై తన దారిని తాను వెళ్ళినాడు.

శ్లో. గురురేష సదానంద - సింధౌ నిర్మగ్న మానసః
పావయన్ వసుధాం సర్వాం - విచచార నిరంతరః. ౫౭౮

తే. గీ. గురువు కూడ సదానంద శరధిలోన
మునిగి తేల్చుచు నుండెడు మనసుతోడ;
వసుధ నెల్లను మిగుల పావన మొనర్చి
తిరుగసాగెను తానిరంతరము నంత.

గురువు కూడా సదానంద సాగరంలో మునిగి తేలుతున్న మనస్సు కలవాడై, పరమహంస కనుక ఒకచోట నిలువక, పోయిన చోటనంతా ప్రపంచాన్ని పరమపావనం చేస్తూ, తిరుగసాగినాడు.

## 579-581 గ్రంథ ప్రాశస్త్యము

శ్లో. ఇత్యాచార్యస్య శిష్యస్య - సంవాదేనాత్మ లక్షణం
నిరూపితం ముముక్షూణాం - సుఖ బోధోపపత్తయే. ౫౭౯

తే. గీ ఇట్టు లాచార్య శిష్యుల కిద్దఱకును
జరుగు సంవాద రూపమైసాగె, నాత్మ
లక్షణము తేటపడగ; ముముక్షువులకు
సులభముగ నింత గ్రంథము సలుప బడియె.

ఈ విధంగా ఆచార్య శిష్యులకు జరిగినసంవాద రూపంలో, ఆత్మ లక్షణం నిరూపించబడింది-మోక్షాపేక్ష కలవారికిసులభంగా అర్థంకావలె

ననే ఉద్దేశంతో ఈ వివేకచూడామణి ముముక్షువులకు మేలుచేయటానికై రచింపబడింది; సులభంగా అర్థం కావటానికై గురుశిష్య సంవాద రూపంలో చెప్పబడింది. ఆచార్య శంకరుడెంత దయతో పిల్లలకు చెప్పి నట్లే వేదాంత రహస్యాలన్నీ చెప్పినాడో! నిస్స్వార్థమూ, లోకోప కారమే కదా మహాత్ముల స్వభావం! మామూలుగా వేదాంత గ్రంథా లన్నీ ప్రశ్నోత్తరాల రూపంలోనే ఉంటున్నాయి. భగవద్గీత కృష్ణార్జున సంవాదరూపంలో ఉండటం అందరికీ తెలిసిందే! గురు శిష్య సంవాద రూపంలో యోగ వాసిష్ఠం సుప్రసిద్ధం. వసిష్ఠులవారు శ్రీరామచంద్రునికి బోధిస్తారు.

శ్లో. హిత మిద ముపదేశ మాద్రియంతాం
విహిత నిరస్త సమస్త చిత్త దోషాః
భవ సుఖ విరతాః ప్రశాంత చిత్తాః
శ్రుతి రసికా యతయో ముముక్షవోయే. ౫౮౦

చ. యతులును మోక్షసాధకులునై, యిక చిత్త సమస్త దోష వి
చ్యుతి కయి మార్గముల్ వెదకు చుండెడివారు; ప్రశాంతచిత్తులై
శ్రుతులు పఠించువారు; భవ శోభనసౌఖ్య విరక్తులైన వా;
రతులిత బోధ మెచ్చుకొని యాదరముం బ్రకటింత్రుగావుతన్.

ఎవరెల్లప్పుడూ మోక్షసాధనకై ప్రయత్నిస్తారో, ఎవరు మనసు కంటిన దోషాలన్నిటినీ పోగొట్టుకోటానికై వెల్లడించిన మార్గాల ననుసరిస్తారో, ఎవరీ ప్రపంచ సుఖభోగాలమీద విరక్తులై ఉంటారో ఎవరు ప్రశాంత చిత్తంతో ఉంటారో, ఎవరు ఉపనిషత్తులను వినీ, పఠించీ, రహస్యాల నర్థం చేసుకోగలుగుతారో, అలాంటి యోగి జనులీ విహితమైన ఉత్తమోపదేశాన్ని మెచ్చుకొని, ఆదరింతురుగాక !

యతులనే మాట, కేవలం సన్యాసులకే కాక, ఎటుక కోసం ప్రయత్నించే వాళ్ళందఱికీ వర్తిస్తుంది. వెల్లడించిన మార్గాలంటే, ఇంద్రియ నిగ్రహ మనోనిగ్రహాలకై – శమమూ, దమమూ, ఉపరతీ, తితిక్షా, శ్రద్ధా, సమాధానమూ !

శ్లో. సంసారాధ్వని తాపభాను కిరణ ప్రోద్భూత దాహ వ్యథా
ఖిన్నానాం జలకాంక్షయా మరుభువి భ్రాంత్యా పరిభ్రామ్యతాం;
అత్యాసన్న సుధాంబుధిం సుఖకరం బ్రహ్మాద్వయం దర్శయం
త్యేషా శంకరభారతీ విజయతే నిర్వాణ సంధాయినీ. ౫౮౧

శా. ఈ సంసారపథాన తాపరవి వహ్నిన్ పొక్కి వారెప్పుడ
ధ్యాసం జుట్టి యెడారి నీరమునకై యల్లాడువా; ర్వీరియా
యాసం బార్ప సుధాబ్ధి, నద్వయపు బ్రహ్మం, బారయన్ వీలుగా
జేసే శంకర దివ్యబోధ యిది; వాసిం గూర్చు నిర్వాణమున్.

ఈ సంసార మార్గంలో ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతిక తాపత్రయమనే సూర్యకిరణాల తాకిడికి మ్రగ్గి ఖిన్నులైనవాళ్ళూ, అధ్యాసతో ఎడారిచుట్టూ తిరుగుతూ జలాన్ని వెదకేవాళ్ళూ– వీళ్ళ కోసం అతి సమీపంలో ఉండే అమృత సాగరాన్ని–అద్వయబ్రహ్మన్ని చూపించే దివ్యమైన శంకర సందేశమిదిగో ! ఇది వాళ్లను నిర్వాణాని నడిపిస్తుంది. ఓ శంకరభారతీ ! నీకు జయమగు గాక !

ఆధ్యాత్మిక తాపాలు – ఆధులూ వ్యాధులూ మొదలైనవి.

ఆధి దైవికాలు – అతివృష్టీ, అనావృష్టీ, భూకంపమూ, దుర్భిక్షమూ, మొదలైనవి.

ఆధి భౌతికాలు - శత్రువులూ, క్రూరమృగాలూ, బంధువులూ పై అధికారులూ, మున్నగునవి.

ఇది శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య జగద్గురు
శ్రీ మచ్ఛంకర భగవత్పూజ్యపాదుల ప్రకరణ
చూడామణి యనదగిన వివేక చూడా
మణికి, ఆంధ్ర పద్య - వ్యాఖ్యాన
భా వా వి ష్క ర ణ ము
స మా ప్త ము.



---

ము ద్ర ణ :-
విజయ ఆర్టు ప్రెస్, తెనాలి.









జననం : 8-8-1905 నెల్లూరుజిల్లా (ఇప్పుడు ప్రకాశంజిల్లా) కనిగిరి తాలూకా చింతపూడు గ్రామంలో

తల్లి దండ్రులు : సీతారామయ్య, భ్రమరాంబగార్లు

చదువు : వంద్యాల యస్. పి. జి. హైస్కూల్లోనూ
నెల్లూరు వెంకటగిరిరాజా హైస్కూల్లోనూ
రాజమండ్రి-ఆర్యాపురం సంస్కృతపాఠశాలలోనూ

రచనలు : తారాశశాంక విజయమూ, సత్యనారాయణ మాహాత్మ్యమూ,
అంబాదేవీ - సమాజఘోషా. (నాటకాలు)
స్వీయసుఖమూ, చింతాదేవీ, నవోఢా. (కావ్యాలు)
భజగోవిందమూ, భారతోపన్యాసాలూ - (వ్యాఖ్యానాలు)
బాలసాహిత్యం - (శతాధికం) తెలుగు రాణి (నవల)
కాశీ, గయా, ప్రయాగా, మహాత్మ్యాలు — (వచనం)

సన్మానాలు : గద్వాలా, వనపర్తీ, దైవందిన్నే, అల్లాదుర్గమూ
మొదలైన సంస్థానాల్లో - (అవధానాలూ, కవిత్వమూ)

ప్రచురణలు : ఆంధ్రపత్రికా, భారతీ, ఆంధ్రప్రభ — మొదలైన పత్రికల్లో
కథలూ, వ్యాసాలూ ఎన్నో ?

నివాసం : 28/17 ఎ, పేట, అనంతసాంబయ్యగేటు, కర్నూలు.

అభిమానం : మంత్రశాస్త్రమూ, వేదాంతమూ.

